Venkatacharya Pandit, Tenmatam

మానవధర్మచంద్రిక

Madras, 1923

Record no. 420

## Bibliographic Record Target

Venkatacharya Pandit, Tenmatam.
మానవధర్మచంద్రిక : ఆయుర్వేద చికిత్సా సంగ్రహసహితము / Tenmatam Venkatacharya Pandit.- 3. కూర్పు.- Madras : తెన్నఠం శ్రీరంగాచార్యులు, 1923.
12, 296 p. ;22 cm.
Record no. 420

Venkatacharya Pandit, Tenmatam.
Mānavadharmacandrika : āyurvēda cikitsā saṅgrahasahitamu / Tenmatam Venkatacharya Pandit.- 3. kūrpu.- Madras : Tennaṭhaṃ Śrīraṅgācāryulu, 1923.
12, 296 p. ;22 cm.
Record no. 420

# MANAVA DHARMA CHANDRIKA

BY

TENMATAM VENKATACHARYA PANDIT.

శ్రీరస్తు. 10321

# మానవధర్మచంద్రిక.

(ఆయుర్వేదచికిత్సాసంగ్రహసహితము.)



ఇది

ఆంధ్రతాత్పర్యముతోడ

తెన్మఠం-శ్రీరంగాచార్యులచే

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

మూడవకూర్పు.

Printed At the HADDON & Co. Bremner Press

MADRAS.

1923.



వెల. రూ. 2-8-0. పోస్టుఖర్చు అ. 8.

# ప్రకటన.

ఇందువలన సకలసుజనులకుఁ దెలియఁజేయుట యేమనఁగా:—

ఈ గ్రంథంబును, ఇతర సంస్కృతాంధ్ర గ్రంథములును వల యువారు, ఈదిగువ కనుపరచియుండు విలాసమునకు జాబులువ్రాసి వి. పి. మూలముగా తెప్పించుకొనవచ్చును.

తె. శ్రీరంగాచార్యులు,
7. పల్లియప్పన్ వీధి, సావుకార్‌పేట, మద్రాస్.

శ్రీరస్తు.

# విషయసూచిక.

## ప్రథమాధ్యాయము.



## ద్వితీయాధ్యాయము.

### (దినచర్య.)

వాతాదిజ్వరలక్షణములు చికిత్సలు







అతిసారరోగలక్షణము చికిత్స.



గ్రహణీరోగలక్షణము.



అర్శోరోగ (మూలల) లక్షణము.



అజీర్ణరోగలక్షణము చికిత్సలు.



విషూచీలక్షణము చికిత్సలు.



క్రిమిరోగలక్షణము చికిత్సలు.



పాండురోగలక్షణము చికిత్సలు.



శోభలక్షణము.



కామలారోగలక్షణము చికిత్స.



రక్తపిత్తరోగలక్షణము చికిత్సలు.



అమ్లపిత్తలక్షణము చికిత్సలు.



శీతపిత్తలక్షణము.



అసృగ్దరలక్షణము చికిత్సలు.

విషయసూచిక ముగిసెను.

---

ఓం శ్రీర్విజయతే.

# మానవధర్మచంద్రిక.

## ప్రథమాధ్యాయము.

### —: శ్రీకృష్ణప్రార్థన. :—

శ్లో. ప్రాదాద్యః పరమాం శ్రియం ప్రముదిత స్సఖ్యుః కుచేలస్య య
స్సంతుష్ట స్తపసా ధ్రువస్య చ తథా రాజ్యం చ తస్యేప్సితం ।
యో రక్షద్ద్రౌపదీ మంబరాణి వితర స్సంప్రార్థితః కృష్ణయా
సోవ్యా న్నః కృపయా దద త్స్వభిమతం కృష్ణః కృపాంభోనిధిః ॥

తా. ఎవ్వాఁడు బాల్యసఖుం డగు కుచేలునికిఁ బ్రీతితో సకలైశ్వర్యంబులొసంగెనో, ఏవాఁడు ధ్రువుని తపంబునకు మెచ్చి యఖండరాజ్యంబును, మండలాధిపత్యంబు నొసంగెనో, ఎవ్వఁడు ద్రౌపది మొఱ నాలకించి యక్షయంబుగ వలువల నొసంగి రక్షించెనో, అట్టి కృపాసముద్రుం డగు శ్రీకృష్ణుండు దయచే నభీష్టార్థంబుల నొసంగి మమ్ముఁ బ్రోచుఁగాత.

### —: లక్ష్మీప్రార్థన. :—

శ్లో. దంతైః కోరకితా స్మితై ర్వికసితా భ్రూవిభ్రమైః పత్రితా
దోర్భ్యాం పల్లవితా నఖైః కుసుమితా లీలాభి రుద్వేలితా ।
ఉత్తుంగ స్తనమండలేన ఫలితా భక్తాభిలాషే హితా
కాచి త్కల్పలతా సురాసురనుతా పాయా త్సుధాబ్ధే స్సుతా ॥

తా. దంతములనెడి మొగ్గలుగలదియు, చిఱునవ్వులనెడి వికాసముగలదియు, కనుబొమలనెడి యాకులుగలదియు, కరములనెడి చిగురుటాకులుగలదియు, గోళ్లనెడి పుష్పములుగలదియు, విలాసములచే వృద్ధిబొందినదియు, స్తనమండలములనెడి ఫలములుగలదియు, భక్తులకోర్కెల నీడేర్చునదియు, సురాసురులచే స్తోత్రము చేయఁబడినదియు, క్షీరసముద్రుని కూఁతురు నగు లక్ష్మీదేవియనెడి కల్పలత మమ్ముఁ బ్రోచుఁగాత.

శ్లో. భజేఽహం బాలగోపాలం సేనాన్యం విఘ్నశాంతయే ।
గౌతమాన్వయవార్ధిందు ర్వేంకటాచార్యకోవిదః ॥

తా. గౌతమవంశంబునబుట్టిన, వేంకటాచార్య నామధేయుండ నగు నేను శ్రీరాజగోపాలదేవుని భజించి నాచేఁ జేయంబడు గ్రంథము నిర్విఘ్నంబుగఁ బరిసమాప్తి నొందుటకు, విష్వక్సేనులను ధ్యానించెదను.

శ్లో. మను పరాశర గౌతమ కశ్యపప్రముఖ యోగిముతాని విలోక్య వై ।
పురుషధర్మకదంబకసంగ్రహ స్సకలలోకహితాయ మయోచ్యతే ॥

తా. మనువు, పరాశరుఁడు, గౌతముఁడు, కశ్యపుఁడు మొదలగు మహర్షులచేఁ జెప్పఁబడిన పురుషవిధాయక ధర్మములలో ముఖ్యములగువానిని సకలలోకహితార్థము సంగ్రహముగఁ జెప్పుచున్నాను.

## ధర్మనిరూపణము.

తత్రాదౌ ధర్మో నిరూప్యతే—

వ్యాసః.—సత్యం దమ స్తప శ్శౌచం సంతోషో హ్రీః క్షమార్జవం ।
జ్ఞానం శమో దయా ధ్యాన మేష ధర్మ స్సనాతనః ॥

తా. సత్యము, ఇంద్రియనిగ్రహము, తపము, ఆచారము, సంతోషము, సిగ్గు, ఓర్పు, ఋజుత్వము, (వక్రస్వభావముగాక శిష్టాచారము ననుసరించుట) బ్రహ్మవిషయకజ్ఞానము,మనశ్శాంతి,దయ,ధ్యానము, ఇవి కలిగియుండుటయే సనాతనధర్మము.

## ఆచారప్రశంస.

పరాశరః.—చతుర్ణా మపి వర్ణానా మాచారో ధర్మపాలకః ।
ఆచారభ్రష్టదేహానాం భవే ద్ధర్మః పరాఙ్ముఖః ॥

వసిష్ఠః.—ఆచారహీనం న పునంతివేదా యద్యప్యధీతా స్సహ షడ్భి రంగైః ।
ఛందాం స్యేనం మృత్యుకాలే త్యజంతి నీడం శకుంతా ఇవ జాతపక్షాః ॥

భారతే.—అనుశాసనికే. ఆచారా ల్లభతే హ్యాయు రాచారా ల్లభతే శ్రియం ।
ఆచారా ల్లభతే కీర్తిం పురుషః ప్రేత్యచేహ చ ॥

పారిజాతే.—సదాచారేణ దేవత్వ మృషిత్వం చ తథైవ చ ।
ప్రాప్నువంతి కుయోనిత్వం మనుష్యా స్తద్విపర్యయాత్ ॥

బృహస్పతిః.—శౌర్యవీర్యార్థరహిత స్తపో జ్ఞానవివర్జితః ।
ఆచారహీనః పుత్ర స్తు మాతురుచ్చారసమః స్మృతః ॥



తా. నాలుగువర్ణములవారికిని ధర్మమును కాపాడునట్టిది ఆచారము; అట్టి యాచారము లేనివారలకు ధర్మము మరలిపోవును. షడంగములతోడ వేదమును అధ్యయనముచేసినను, ఆచారములేనియెడ పరిశుద్ధులు కానేరరు. " రెక్కలువచ్చిన పెను కపక్షులు గూళ్ళను విడుచునట్లు, ఆచారహీనుఁడగు పురుషుఁడు మరణించినపుడు వేదములు వానిని విడిచిపోవుచున్నవి. ఆచారమువలన నాయువును, సంపదను, కీర్తిని ఉభయలోకములయందును పొందుచున్నాఁడు. సదాచారమువలన జన్మాంతరంబున దేవత్వమును ఋషిత్వమును, దురాచారమువలన హీనజన్మములను పొందును. పరాక్రమము, బలము,పురుషార్థచతుష్టయము,తపస్సు, జ్ఞానము, ఇవి లేనివాఁడును, ఆచారహీనుఁడు నగుపురుషుఁడు వానితల్లికి పుత్రుండనఁబడక మూత్రసమానుం డనఁబడును.

## సదాచారలక్షణము.

సంస్కారమంజర్యాం.—యస్మిన్ దేశే య ఆచారః పారంపర్యక్రమాగతః ।
శ్రుతిస్మృత్యవిరోధేన సదాచార స్స ఉచ్యతే ॥

మనుః.—ధర్మవ్యతిక్రమో దృష్టో మహతాం సాహసం తథా ।
త దన్వీక్ష్య ప్రయుంజాన స్సంసీద త్యవరోఽబలః ॥
తేజోమయాని పూర్వేషాం శరీరా ణీంద్రియాణి చ ।
దోషై స్తై ర్నోపలిప్యంతే పద్మపత్రమివాంభసా ॥

తా. ఏదేశమునం దేయాచారము శ్రుతిస్మృతుల ననుసరించి శిష్టానుచరణంబుగ వచ్చుచున్నదో అదియె సదాచారమనంబడును. స్మృత్యుక్తములగు ధర్మములకు విరుద్ధముగ మహర్షులాచరించినట్టు గనఁబడినయెడల వానినిజూచి జ్ఞానతేజోమహిమలచే కొరవడిన యబలుం డగు మనుష్యుం డట్టి యాచారముల నాచరించిన క్లేశము నొంది చెడిపోవును.పూర్వులశరీరంబులు ఇంద్రియములును, తేజస్స్వరూపంబులగుటం జేసి " ఉదకములు, తామరాకునువలె'' దోషములు వారినంటవు.

బోధాయనః.—అనుష్ఠితం తు యద్దేవై ర్మునిభి ర్యదనుష్ఠితం ।
నానుష్ఠేయం మనుష్యై స్త దుక్తం కర్మ సమాచరేత్ ॥

తా. దేవతలు ఋషులును అనుష్ఠించిన ధర్మములను మనుష్యులాచరింపక వారుచెప్పిన ధర్మముల నాచరింపవలయును.

## ధర్మశాస్త్రప్రశంస.

పరాశరః.—కల్పేకల్పే క్షయోత్పత్త్యా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః

శ్రుతిస్మృతి సమాచార నిర్ణేతారశ్చ సర్వదా॥

సంగ్రహే.—ఏతైర్యాని ప్రణీతాని ధర్మశాస్త్రాణి వై పురా।
తాన్యేతాని ప్రమాణాని నహంతవ్యాని హేతుభిః॥
యస్తాని హేతుభిర్హన్యాత్సో౽ంధేతమసి మజ్జతి॥

తా. బ్రహ్మవిష్ణుమహేశ్వరులవలెనే శ్రుతిస్మృతి సమాచారనిర్ణేతలగు మన్వాదిమహర్షులును, ఉత్పత్తిక్షయముల నొంది ధర్మసంస్థాపనార్థము శ్రుతులననుసరించి ధర్మశాస్త్రములను జేయుచున్నారు. కావున నట్టివారేర్పఱచిన శాస్త్రములను హేతువాదములచేతను కుయుక్తులచేతను కొట్టివేయగూడదు. అట్లొనర్చినవాఁడు అంధతమస్సను నరకమునఁ బడును.

## ధర్మానుష్ఠానఫలము.

మనుః.—ధర్మంశనైస్సంచినుయాద్వల్మీకమివ వర్తికా।
పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్॥
నాముత్రహిసహాయార్థం పితా మాతా నతిష్ఠతః।
నపుత్రదారా నజ్ఞాతిర్ధర్మస్తిష్ఠతి కేవలః॥
ఏకః ప్రసూయతే జంతు రేక ఏవ ప్రమీయతే।
ఏకోనుభుంక్తే సుకృత మేకఏవ చ దుష్కృతం॥
మృతం శరీర ముత్సృజ్య కాష్ఠలోష్టసమం క్షితౌ॥
విముఖాబాంధవా యాంతి ధర్మస్తమనుగచ్ఛతి॥
తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః॥
ధర్మేణహిసహాయేన తమస్తరతి దుష్కృతం॥

ఆపస్తంబః.—సర్వవర్ణానాం స్వధర్మానుష్ఠానే పరమపరిమితం సుఖం తతః
పరివృత్తౌ కర్మఫలశేషేణ జాతిం రూపం వర్ణం బలం మేధాం ప్రజ్ఞాం
ద్రవ్యాణి ధర్మానుష్ఠానమితి ప్రతిపద్యతే।తచ్చక్రవదుభయోర్లోకయో
స్సుఖ ఏవ వర్తతే॥

తా॥ మనుష్యుం డెట్టి జంతువులకును బాధనుగలుగంజేయక పరలోకసహాయమునిమిత్తము "చెదలుపురుగు పుట్టనువలె" మెల్లమెల్లగ ధర్మమును సంగ్రహింపవలయును. తల్లిదండ్రులు, పుత్రులు, భార్య, జ్ఞాతులు మొదలగువారెవ్వరును



పరలోకసహాయార్థము కూడ రాఁజాలరు. ధర్మమొక్కటియే కూడవచ్చును. మనుష్యుఁడు పుట్టునపుడు తానొక్కఁడే పుట్టుచున్నాడు. మరణించునపుడు తానొక్కఁడే మృతిబొందుచున్నాఁడు. తానుచేసిన పుణ్యపాపములఁ దానొక్కఁడే యనుభవించుచున్నాడు. మృతశరీరమును కొయ్యనువలెను, మట్టిపెళ్ళనువలెను, నేలపైఁబారవైచి దేహబంధువులు వెనుకకుదిరిగిపోవుచున్నారు. కావున మనుజుఁడు పాపసమూహమును దొలఁగించుకొని పరలోకసుఖానుభవము జెందుటకై, అతిప్రయత్నముచే ధర్మమునార్జింపవలయు. సకలవర్ణములవారికిని స్వధర్మానుష్ఠానము సలిపినమాత్రముననె పరలోకమునం దపరిమిత సౌఖ్యముగలుగును. అట్టిసుఖానుభవము జెందినపిదప తిరిగి భూలోకమునజనించి శేషించిన కర్మఫలముచేత ఉత్తమజాతిని సౌందర్యాదులను, శరీరవర్ణమును, బలమును, ధారణాశక్తిని, బుద్ధిని, ధనాదివస్తువులను, ధర్మానుష్ఠానమును పొందుచున్నారు కావున నుభయలోకములయందును సుఖమే మనుజుని జెంది చక్రమువలె తిరుగుచుండును.

## సృష్టిక్రమము.

హారీతః—నారాయణః పురాదేవోజలం సృష్ట్వా జలోపరి।
సుష్వాప భోగిపర్యంకే శయనేతుశ్రియాసహ।
తస్యసుప్తస్యనాభౌతు మహత్పద్మ మభూత్కిల।
పద్మమధ్యేభవద్బ్రహ్మ వేదవేదాంగభూషణః।
సచోక్తస్తేనదేవేన జగత్సృష్టౌ పునఃపునః।
సోపిసృష్ట్వాజగత్సర్వం సదేవాసురమానుషం।
యజ్ఞసిద్ధ్యర్థమనఘాన్ బ్రాహ్మణాన్ముఖతో౽సృజత్।
అసృజత్క్షత్రియాన్ బాహ్వోర్వైశ్యానప్యూరుదేశతః।
శూద్రాంశ్చ పాదయోస్సృష్ట్వా తేషాంచైవానుపూర్వశః।
యథాప్రోవాచ భగవాన్ బ్రహ్మయోనిః పితామహః॥

తా. శ్రీమన్నారాయణుఁడు తొలుత జలములను సృజించి ఆజలముపైని శేషశయనమునందు లక్ష్మితోఁగూడి నిద్రించుచుండునపుడు నాభియందు మహాపద్మమొకటి యుత్పన్నంబై ఆభగవత్సంకల్పంబునంజేసి యాపద్మమధ్యంబున జతురాననుండుద్భవిల్లి వేదవేదాంగములఁ బ్రవర్తింపఁజేసి భగవదాజ్ఞచే దేవాసుర మనుష్యులతోఁగూడిన ప్రపంచమును సృజించుచు యజ్ఞసిద్ధికొఱకు, పాపరహితులగు బ్రాహ్మణులను ముఖము

నుండి సృజించెను. బాహువులనుండి క్షత్రియులను, తొడలనుండి వైశ్యులను, పాదములనుండి శూద్రులను సృజించి వారలకుఁ గ్రమముగ ధర్మముల నుపదేశించె.

## వర్ణవివరణము.

దేవలః.—బ్రాహ్మణ్యాం బ్రాహ్మణాజ్జాత స్సంస్కృతో బ్రాహ్మణోభవేత్।
ఏవం క్షత్రియ విట్ఛూద్రా జ్ఞేయా స్స్వేభ్య స్స్వయోనిజాః॥

తా. బ్రాహ్మణస్త్రీయందు బ్రాహ్మణునివలన జనించి ఉపనయనాదులచే సంస్కరింపఁబడినవాఁడు బ్రాహ్మణుండగును. ఇటుల క్షత్రియ వైశ్య శూద్రులలో సజాతిస్త్రీపురుషులకు జనించి తత్తద్వర్ణోచిత కర్మసంస్కృతులైనవారు క్షత్రియ వైశ్య శూద్రు లగుదురు.

## బ్రాహ్మణలక్షణము.

శాతాతపః.—తపో దమో దయా దానం సత్యం ధర్మం శ్రుతం ఘృణా।
విద్యా విజ్ఞాన మాస్తిక్య మేత ద్బ్రాహ్మణలక్షణమ్॥

తా. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతానుష్ఠానము, ఇంద్రియనిగ్రహము, భూతదయ, త్యాగము, నిజముచెప్పుట, స్నానసంధ్యాద్యనుష్ఠానము, వేదశాస్త్రాధ్యయనము, కరుణ, బ్రహ్మవిద్య, శాస్త్రజన్యజ్ఞానము, ఆస్తిక్యబుద్ధి-ఇవి బ్రాహ్మణలక్షణములు.

## బ్రాహ్మణధర్మములు, వృత్తులు.

పరాశరః.—సంధ్యా స్నానం జపో హోమో దేవతానాంచపూజనం।
ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణిదినేదినే॥

మనుః.—అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా।
దానంప్రతిగ్రహశ్చైతి షట్కర్మాణ్యగ్ర జన్మనః॥
షణ్ణాంతుకర్మణా మస్య త్రీణి కర్మాణి జీవికా।
యాజనాధ్యాపనే చైవ విశుద్ధాచ్చ ప్రతిగ్రహః॥
షట్కర్మసహితో విప్రః కృషికర్మ చ కారయేత్।

గౌతమః.—తదలాభే క్షత్రియవృత్తిస్తదలాభే వైశ్యవృత్తిః॥

తా. కాలత్రయమునందు సంధ్యావందనము, స్నానము, గాయత్రిజపము, ఔపాసనాగ్నిహోత్రాది కర్మములు, దేవతారాధనము, అతిథిపూజ, వైశ్వదేవము, అనునీయాఱుకర్మంబులును నిత్యము గృహస్థుఁడు జరుపవలయు, మఱియు, శిష్యులకు



వేదము జెప్పుట, తాను అధ్యయనముచేయుట, యజ్ఞముచేయుట, ఇతరులచేఁజేయించుట, దానము, ఒకరివలన గవాదులఁ బరిగ్రహించుట, ఈయాఱుకర్మంబులు బ్రాహ్మణగృహస్థునకర్తవ్యంబులు. వీనిలో యాజనము, అధ్యాపనము, పరిశుద్ధునివలన దానముగొనుట, అనునీమూఁడు కర్మంబులును, జీవనోపాయంబులు. ఒకవేళ ఈయాజనాదులవలన జీవనముజరుగనియెడల షట్కర్మములసలుపుచు, కృషికర్మమును జరిగింపవచ్చును. అదియు సంభవింపనియెడలరాజునాశ్రయించి క్షత్రియవృత్తిచేతను, అదియు సంభవింపనియెడల, వైశ్యవృత్తి యగువాణిజ్యాదులచేతను జీవింపవచ్చును.

## క్షత్రియధర్మములు.

మనుః.—త్రయోధర్మా నివర్తంతే బ్రాహ్మణాత్ క్షత్రియంప్రతి।
అధ్యాపనం యాజనంచ తృతీయశ్చ ప్రతిగ్రహః॥

పరాశరః.—క్షత్రియోహి ప్రజారంజన్ శస్త్రపాణిః ప్రదండవాన్।
నిర్జిత్యపరసైన్యాని క్షితిం ధర్మేణపాలయేత్॥

యాజ్ఞవల్క్యః.—బ్రాహ్మణేషుక్షమీస్నిగ్ధే ష్వజిహ్మః క్రోధనోఽరిషు।
స్యాద్రాజాభృత్యవర్గేషు ప్రజాసు చ యథా పితా।
అన్యాయేననృపోరాష్ట్రా త్స్వకోశంయో ఽభివర్ధయేత్॥
సోచిరాద్విగతశ్రీకో నాశమేతిసబాంధవః॥

మనుః.—అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్।
అయశో మహదాప్నోతి నరకం చాధిగచ్ఛతి॥
పితాచార్య స్సుహృన్మాతా భార్యా పుత్రః పురోహితః।
నాదండ్యోనామరాజ్ఞోస్తి యస్స్వధర్మేణతిష్ఠతి॥
దుష్టానాంశాసనా ద్రాజా శిష్టానాం పరిపాలనాత్।
ప్రాప్నో త్యభీప్సితాన్ లోకాన్ వర్ణసంస్థాకరో నృపః॥

తా. క్షత్రియునకు బ్రాహ్మణులకుఁ జెప్పఁబడిన షట్కర్మములలో అధ్యాపనము యాజనము, ప్రతిగ్రహము, ఈమూఁడు దప్ప తక్కిన యజన అధ్యయన దానంబులనుష్ఠేయంబులు, క్షత్రియుఁడు, ప్రజలనుసంతోషపెట్టుచు ఆయుధమును చేతబూని, శత్రుసైన్యమును జయించి ప్రజలను ధర్మముచేఁ బరిపాలించవలయు. బ్రాహ్మణులయందు ఓర్పును, మిత్రులయందు నిజముగావర్తించుటయు, శత్రువులయందుఁ గోప

మనుగలిగి భృత్యులను ప్రజలను తండ్రివలెఁ బ్రేమతోఁ బాలించవలయును, లోకుల వలన నన్యాయముగ ద్రవ్యమార్జించి బొక్కసము పెంచినయెడల సంపదబోగొట్టుకొని బంధువర్గముతోడ శీఘ్రమునగశించును. దండింపఁదగనివారల దండించినను, దండనార్హుల దండింపకుండినను, అపకీర్తిపాలై నరకమును జెందును. తల్లి, తండ్రి. గురువు, మిత్రుఁడు, భార్య, పుత్రుఁడు, పురోహితుఁడు వీరలలో నెవరైనను, ధర్మముదప్పి రేని రాజుదండింపవచ్చును. తప్పొనర్చిన వారందఱు రాజదండనార్హులె యగుదురు, రాజు వర్ణాశ్రమ ధర్మములనిలుపుచు, దుష్టశిక్షణమును శిష్టపరిపాలనమును జేయుచుండిన కోరిన పుణ్యలోకములఁ జెందును.

## వైశ్య ధర్మములు.

మనుః.—పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవచ।
వణిక్పథంకుసీదంచ వైశ్యస్య కృషి రేవచ॥
వైశ్యస్తు కృతసంస్కారః కృత్వా దారపరిగ్రహం।
వార్తాయాం నిత్యయుక్తస్స్యాత్పశూనాంచైవరక్షణే॥
మణిముక్తాప్రవాళానాం లోహానాం తాంతవస్యచ।
గంధానాంచ రసానాంచ విద్యా దర్ఘబలాబలం॥
బీజానాముప్తివిచ్చస్యాత్ క్షేత్రబీజగుణస్యచ।
మానయోగాంశ్చ జానీయా త్తులయోగాంశ్చ సర్వదా॥
సారాసారంచ భాండానాం దేశానాంచగుణాగుణం।
లాభాలాభంచ పణ్యానాం పశూనాంచవివర్ధనం॥
భృత్యానాంచ భృతిం విద్యా ద్భాషాశ్చ వివిధా నృణాం॥
ద్రవ్యాణాంస్థానయోగంచ క్రయం విక్రయమేవచ।
ధర్మేణచద్రవ్యవృద్ధా వాతిష్ఠేద్యత్నముత్తమమ్॥
హారీతః—దానందేయం యథాశక్త్యా బ్రాహ్మణానాంచ భోజనమ్॥

తా. వైశ్యుఁడు పశుపాలనము, దానము, యజ్ఞము, వేదాధ్యయనము, వర్తకము, వడ్డివ్యాపారము, కృషికర్మము ఈధర్మముల ననుష్ఠింపవలయును. వైశ్యుఁడు ఉపనయనాదులచే సంస్కృతుఁడై, వివాహముచేసికొని, అధ్యయనము, యజనము,



దానము ఈమూఁడుకర్మముల నలుపుచు, నిత్యము వర్తకమును పశుపాలనమును జేయవలయు. మఱియు, మణులు, ముత్యములు, పగడములు, సువర్ణాదిలోహములు, వస్త్రములు, పరిమళద్రవ్యములు, రసములు, వీనియొక్క వెలల తారతమ్యమును బాగుగ నెఱుంగవలయు. భూమియందు విత్తులుచల్లునట్టి నేర్పును, క్షేత్రగుణమును, బీజగుణమును నెఱింగియుండవలయు. కొలతలను తూనికెలను, ద్రవ్యములయొక్క మంచిచెడుగులను, దేశములయొక్క గుణాగుణములను, అమ్మఁదగినవస్తువుల లాభాలాభములను, పశువులవృద్ధిని, భూతసంరక్షణమును, మనుష్యులయొక్క భాషణములను జేయించువిధమును, వస్తువులనునిచెడితావులను, కొనుటను, విక్రయించుటను, బాగుగనెఱింగి, ధర్మబుద్ధిచేతనే ద్రవ్యవృద్ధియందు యత్నముగలవాఁడై యుండవలయు. శక్తికొలఁది నిత్యము దానమును, బ్రాహ్మణభోజనమును జరుపవలయు.

## శూద్ర ధర్మములు.

పరాశరః.—శూద్రస్య ద్విజశుశ్రూషా పరమో ధర్మఉచ్యతే।
అన్యథాకురుతే కించి త్తద్భవే త్తస్యనిష్ఫలం॥
లవణం మధు తైలంచ దధి తక్రం ఘృతం పయః।
నదుష్యేచ్ఛూద్రజాతీనాం కుర్యాత్సర్వేషువిక్రయం।
విక్రీణన్మద్యమాంసాని హ్యభక్ష్యస్యచభక్షణం।
అగమ్యాగమనం కుర్వన్ శూద్రఃపతతితత్క్షణాత్।
కపిలాక్షీరపానేన బ్రాహ్మణీగమనేనచ।
వేదాక్షరవిచారేణ శూద్రశ్చండాలతాంవ్రజేత్॥
మనుః.—అశక్నువంస్తు శుశ్రూషాం శూద్రఃకర్తుంద్విజన్మనాం।
పుత్రదారాత్యయం ప్రాప్తో జీవేత్కారుకకర్మభిః॥
యైఃకర్మభిస్సుచరితై శ్శుశ్రూష్యంతే ద్విజాతయః।
తానికారుకకర్మాణి శిల్పానివివిధానిచ।
శూద్రస్స్వధర్మమాకాంక్షన్ క్షత్రి మారాధయేదిహ॥
ధనినంవాప్యుపారాధ్య వైశ్యంశూద్రోజిజీవిషేత్।
స్వర్గార్థ ముభయార్థంవా బ్రాహ్మణానేవ భారయేత్।
శుశ్రూషైవతు శూద్రస్య ధర్మోనైశ్రేయసః పరః॥
శుచి రుత్కృష్టశుశ్రూషు ర్మృదువాగనహంకృతః।
బ్రాహ్మణోపాశ్రయోనిత్య ముత్కృష్టాం జాతిమశ్నుతే॥

తా. శూద్రునకు బ్రాహ్మణ శుశ్రూషయే పరమ ధర్మము, అటులజేయని యెడల వాఁడు చేయుకర్మంబులు నిష్ఫలములు. ఉప్పు, తేనె, నూనె, పెరుగు, మజ్జిగ, నేయి, పాలు, వీనిలోదేనినైనను, అన్నిటినిగాని విక్రయించుకొనవచ్చును. మద్యమాంసవిక్రయము, అభక్ష్యభక్షణము, అగమ్యాగమనము, కపిలగోవుపాలు ద్రాగుట, బ్రాహ్మణస్త్రీగమనము, వేదాక్షరవిచారము, ఇవిచేయుటవలన శూద్రుఁడు పతితుఁడై చండాలుఁడగును. ఒకవేళ పెండ్లాము బిడ్డలులేక బ్రాహ్మణపరిచర్య చేయుటకసమర్థుఁడయ్యేనేని, ద్విజులకుపయోగించునట్టి నానావిధములగు వడ్లపనులు, వస్త్రప్రక్షాళనాదికృత్యములు, అనేకవిధములగు చిత్రపుపనులు, వీనిమూలముగ జీవించవలయు. ఇదిసంభవింపనిచో స్వధర్మమునువదలక క్షత్రియులనుగాని ధనికుండగు వైశ్యునిగాని యాశ్రయించి పైజెప్పిన శిల్పకర్మాదులవలన జీవింపవచ్చును. ఇహ పర లోకసుఖంబులఁ గోరువాఁడు విప్రుల నాశ్రయించి యహంకారములేక, మృదువాక్యములుగలిగి బ్రాహ్మణశుశ్రూషయే సలుపుచుండిన దేహావసానంబునం బుణ్యలోకంబులబొంది జన్మాంతరమున గొప్పకులమునఁబుట్టును.

వ్యాఘ్రః.—ఉచ్ఛిష్టమన్నందాతవ్యం శూద్రాయాగృహమేధినే।
గృహస్థాయతుదాతవ్య మనుచ్ఛిష్టందినేదినే ॥

తా. వివాహముగాని గృహదానునకు భుక్తశేషాన్నమును ఇయ్యవచ్చును. వివాహితుండగు గృహదానునకు నుచ్ఛిష్టము నియ్యగూడదు.

యాజ్ఞవల్క్యః.—భార్యారతిశ్శుచిర్భృత్య భర్తాశ్రాద్ధక్రియారతః ।
నమస్కారేణమంత్రేణ పంచయజ్ఞాన్నహాపయేత్ ॥

గృహ్యకారః.—శూద్రస్యాపినిషేకపుంసవన సీమంతోన్నయన జాతకర్మ నామకరణోపనిష్క్రమణాన్న ప్రాశనచౌళా న్యమంత్రకాణి యథా కాలముపదిష్టాని ॥

ఉశనాః.—సచ్ఛూద్రస్స్నాయాదసచ్ఛూద్రః పాణిపాదౌప్రక్షాళయేచ్ఛ్రాద్ధకర్మామావాస్యాదౌ ఆమశ్రాద్ధంమంత్రవర్జంకర్తవ్యం ॥

స్కాందే.—శూద్రోవానుపనీతోవాస్త్రియోవా పతితోపివా ।
కేశవంవా శివంవాపి స్పృష్ట్వానరకమశ్నుతే ॥

తా. శూద్రుఁడు పరస్త్రీసంగమమువదలి, స్వభార్యారతుండును, స్వభృత్యులబోషించువాఁడును, శ్రాద్ధక్రియల జరుపువాఁడునై, పంచయజ్ఞములను, నిషేక, పుంసవన, సీమంత, జాతకర్మ, నామకరణ, నిష్క్రమణ, అన్నప్రాశన, చౌళములను



ఆయాకర్మములకుఁ జెప్పఁబడిన కాలములందు వేదమంత్రవర్జితముగ, "నమః" అను మంత్రముతో సలుపవలయు. సచ్ఛూద్రుఁడు రెండుకాలములయందును స్నానముచేయవలయు. అసచ్ఛూద్రులు కాలు సేతులు గడుగుకొనవలయు. అమావాస్య, శ్రాద్ధదినము, మొదలగు పర్వదినములయందు, బియ్యము మొదలయిన యపక్వద్రవ్యములతో శ్రాద్ధముసలుపవలయు. శూద్రుఁడు, అనుపనీతుఁడు, స్త్రీలు, జాతి భ్రష్టులు, వీరు భగవద్విగ్రహములను సాలగ్రామాదులను, తాకినయెడల నరకమునఁ బడుదురు.

## బ్రాహ్మణశ్రేష్ఠ్యము.

ఆపస్తంబః.—చత్వారోవర్ణా బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రాస్తేషాం
పూర్వఃపూర్వోజన్మతశ్శ్రేయాన్ ॥

మనుః.—ఉత్తమాంగోద్భవాజ్జ్యైష్ఠ్యాద్బ్రహ్మణశ్చైవధారణాత్ ।
సర్వస్యైవాస్యసర్గస్య ధర్మతోబ్రాహ్మణః ప్రభుః ॥
తంహిస్వయంభూస్స్వదాస్యా త్తపస్తప్త్వాదితోఽసృజత్ ।
హవ్యకవ్యాభివాహ్యాయ సర్వస్యాస్యచగుప్తయే ॥
యస్యాస్యేనసదాశ్నంతి హవ్యానిత్రిదివౌకసః ।
కవ్యానిచైవపితరః కింభూతమధికంతతః ॥
ఉత్పత్తిరేవవిప్రస్య మూర్తిర్ధర్మస్యశాశ్వతీ ।
సహిధర్మార్థముత్పన్నో బ్రహ్మభూయాయకల్పతే ।
తపస్తప్త్వాసృజద్బ్రహ్మాబ్రాహ్మణాన్ వేదగుప్తయే ।
తృప్త్యర్థం పితృదేవానాం ధర్మసంరక్షణాయచ ॥

శాతాతపః.—జన్మనైవమహాభాగో బ్రాహ్మణోనామజాయతే ।
మాతాసాసర్వభూతానాం వర్ణశ్రేష్ఠఃపితాగురుః ॥
నాస్త్యేషాంపూజనీయోఽన్య స్త్రిషులోకేషుకశ్చన ॥
వేదవిద్యావిశేషేణ పూజయంతః పరస్పరం ॥
అన్యోన్యగురవోవిప్రా అన్యోన్యాతిథయస్స్మృతాః ।
అన్యోన్యముపకుర్వాణాస్తారయంతితరంతిచ ॥
యోహియాందేవతామిష్టామారాధయితుమీహతే ।
సర్వోపాయప్రయత్నేన సంతోషయతాసద్విజాన్ ॥

దేవతాదివ్యభూతేషు క్వచిత్కాచిత్ప్రతిష్ఠితా ।
బ్రాహ్మణోదేవతాస్సర్వాస్తస్మాత్సంపూజయేత్సదా ॥
శ్రుతిః.—బ్రాహ్మణోవై సర్వాదేవతాః యావతీర్వైదేవతాస్తాస్సర్వావేద
విదిబ్రాహ్మణేవసంతి ॥
మనుః.—భూతానాంప్రాణినశ్శ్రేష్ఠాః ప్రాణినాంబుద్ధిజీవినః ।
బుద్ధిమత్సునరాశ్శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాస్స్మృతాః ॥
బ్రాహ్మణేషుచవిద్వాంసో విద్వత్సుకృతబుద్ధయః ॥
కృతబుద్ధిషుకర్తారః కర్తృషుబ్రహ్మవేదినః ॥

ఇతి శ్రీ మానవధర్మచంద్రికాయాం
ధర్మాదిస్వరూపకథనంనామ
ప్రథమోధ్యాయః.

---

తా. జగత్సృష్ట్యారంభమున నేర్పడిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనెడు నాలుగుజాతులలో క్రిందనుండి యొకరికంటె నొకరు జన్మముచేతనే శ్రేష్ఠులగు చున్నారు. భగవంతుని యుత్తమాంగమునందుఁ బుట్టుటవలనను, వేదమును ధరించుట వలనను, అన్నిటికి ధర్మముగా బ్రాహ్మణుఁడే ప్రభువు. దేవతలు పితృదేవతలును హవ్య కవ్యములను బ్రాహ్మణముఖముగా భుజించుచున్నారు. అట్లగుటంజేసి యితరవర్ణముల వారికంటె విప్రులధికులు. బ్రాహ్మణజన్మమే శాశ్వతధర్మముయొక్క శరీరము. కావున బ్రాహ్మణుఁడు ధర్మమునిలుపుటకై పుట్టి తుదిని మోక్షమునకు సమర్థుండగుచున్నాఁడు. తొలుత చతుర్ముఖుఁడు శ్రీమన్నారాయణునిగూర్చి తపముచేసి వేదముల గాపాడుట కును, పితృదేవతలఁదృప్తినొందించుటకును, ధర్మముల రక్షించుటకును, బ్రాహ్మణుల సృజించెను గనుక జన్మముచేతనే శ్రేష్ఠుఁడై సకలభూతములకును తల్లియు, తండ్రియు గురువునై సకలవర్ణములకు శ్రేష్ఠుఁడుగానున్నందున, ముల్లోకములయందును, వీరల కంటెఁ బూజనీయుఁడు మఱియొకఁడులేఁడు. వేదవిద్యావిశేషముచేత దమలో నొకరి నొకరు పూజించుకొనుచు, నొకరికొకరు గురువులై అతిథులై పరస్పరముపకరించు కొనుచు, తాముతరించి యితరుల దరింపజేయుచున్నారు. కావున నిట్టి మహిమలచే బ్రత్యక్ష దేవతలైయున్న యీబ్రాహ్మణులను తృప్తులజేసినయెడల వారలు సకలదేవ తాస్వరూపు లగుటంజేసి, వారివారి యిష్టసిద్ధులను, బ్రాహ్మణసత్కారముచేఁ



దనివినొందుదురు. కావున నందఱు సకలదేవతాస్వరూపుఁడగువిప్రుని దైవబుద్ధితోఁ బూజిం చవలయు. అని వేదముపలుకుచున్నది. మఱియు సకలభూతములలో ప్రాణులు శ్రేష్ఠములు. వానికంటె చేతనములు శ్రేష్ఠములు. వానిలో మనుష్యులు శ్రేష్ఠులు. వారిలో బ్రాహ్మణులును, బ్రాహ్మణులలో విద్వాంసులును, విద్వాంసులలో వేదార్థ పరిజ్ఞాతలును వారిలో కర్మానుష్ఠాతలును, వారిలో బ్రహ్మవేత్తలును శ్రేష్ఠులగుదురు.

---

## ద్వితీయాధ్యాయము.

# దినచర్య.

### ప్రాతఃస్మరణీయము.

శ్లో. బ్రాహ్మేముహూర్తేబుధ్యేత స్వస్థోరక్షార్థమాయుషః।
తత్రసర్వాఘశాంత్యర్థం స్మరేచ్చమధుసూదనం॥
స్మృతే సకలకల్యాణభాజనం యత్ర జాయతే।
పురుషస్తమజం నిత్యం వ్రజామిశరణంహరిం॥
పుణ్యశ్లోకోనలోరాజా పుణ్యశ్లోకోయుధిష్ఠిరః।
పుణ్యశ్లోకా చ వైదేహీ పుణ్యశ్లోకో జనార్దనః॥
అశ్వత్థామా బలిర్వ్యాసోహనూమాంశ్చ విభీషణః॥
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః॥
సప్తైతాన్ సంస్మరేన్నిత్యం మార్కండేయ మథాష్టమం।
జీవేద్వర్షశతంసోపి సర్వవ్యాధివివర్జితః॥
అహల్యా ద్రౌపదీ సీతా తారామండోదరీతథా।
పంచకన్యాస్స్మరేన్నిత్యం మహాపాతకనాశనం॥

తా. మనుష్యుఁడు ఆయుష్యమును కాపాడుకొనుటకు చక్షురాదీంద్రియము లకు బహిర్వ్యాప్తిని కలుగనీయక నిర్మలచిత్తుఁడై అరుణోదయకాలమునందులేచి సకల పాపములుహరించుటకు శ్రీమన్నారాయణుని ధ్యానించుచు, పుణ్యశ్లోకోనలోరాజా అను మొదలగు శ్లోకములను పఠించవలయు.

### నిద్రమేల్కొనినపిమ్మట చూడఁదగినవస్తువులు.

శ్లో. దధ్యాజ్యాదర్శసిద్ధార్థం బిల్వగోరోచనస్రజం।
వాజివారణగోవిప్ర హరిద్రాశతపర్వణాం॥
దర్శనం స్పర్శనం కార్యం ప్రబుద్ధేన శుభావహం॥
స్వమాననం ఘృతేపశ్యే ద్యదీచ్ఛేచ్చిరజీవితం॥
ఈక్షేత తతఉత్థాయ వహ్నిం గాం శ్రోత్రియం శుభం।
హిత్వా చాంధం చపాపిష్ఠం నగ్నం ముత్కృత్తనాసికం॥

తా. నరుఁ డుదయకాలమునందు నిద్రలేచినతోడనే, పెరుగు, నేయి, అద్దము, తెల్లవాలు, మారేడు, గోరోచనము, గుఱ్ఱము, ఏనుఁగు, ఆవు, అగ్నిహోత్రము, శ్రోత్రియబ్రాహ్మణులు, పసుపు, వెదురు, వీనినిచూచినను స్పృశించినను శుభకరము. మఱియు దీర్ఘాయువును గోరెడివాఁడు, నేతియందుతనముఖమును చూచుకొనవలయు. గ్రుడ్డివానిని, పాపిష్ఠుని, దిగంబరుని, ముక్కులేనివానిని, చూచినయెడల పాపము సంభవించును.

### మలాదివిసర్జనగుణము.

శ్లో. ఆయుష్య ముషసి ప్రోక్తం మలాదీనాం విసర్జనం।
తదంత్ర కూజనాధ్మానో దరగౌరవవారణం॥

తా. ఉదయకాలమున మలమూత్రాదులవిసర్జించిన, ప్రేగులరచుట, కడుపుబ్బరము, కడుపులోగురుత్వము మొదలగునవి హరించును.

### మలాదినిరోధావగుణము.

శ్లో. వాతమూత్రపురీషాణాం సంగోధ్మానం క్లమోరుజా।
జఠరే వాతజాశ్చాన్యే రోగాస్స్యుర్వాతనిగ్రహాత్॥

తా. అపానవాతమును, ఉదయకాలమునందు మలమూత్రములను, విసర్జింపక అడ్డగించినయెడల, కడుపుబ్బరము, బడలిక, ఉదరమునందు నానావిధవాతరోగములును కలుగును.

### శౌచాదికగుణము.

శ్లో. గుదాదిమలమార్గాణాం శౌచం కాంతి బలప్రదం।
పావిత్ర్యకర మాయుష్య మలక్ష్మీ కలి పాపహృత్॥



తా. మలమూత్రాదులవిసర్జనమునుజేసి ప్రక్షాళనాదులచే శుద్ధియైనయెడల నిర్మలత్వము, ఆయుష్యమునుగలిగి, దారిద్ర్యము, పాపమును తొలఁగును.

### శౌచవిధి.

వా. — పూర్వోక్త బ్రాహ్మేముహూర్తే ఉత్థాయాచమ్యేష్టదేవతాం నమస్కృత్య ప్రాతస్స్మరణం విధాయ రవింగురూన్ నమస్కృత్య గ్రామాద్బహిర్నైరృత్యాం మిషుక్షేపాత్యయేశుద్ధమృత్తికాంససికతాంజలపాత్రంచాదాయ కీటాదిరహితస్థలంగత్వా మృజ్జలపాత్రేనిధాయాయజ్ఞియైరనార్ద్రైస్తృణైర్భూమిమాచ్ఛాద్య ప్రావృతశిరాః పృష్ఠతః కంఠలంబితయజ్ఞోపవీతః, ఏకవస్త్రశ్చేద్దక్షిణకర్ణే నిహిత యజ్ఞోపవీతో మౌనీఘ్రాణాస్యే పిధాయ దివోదఙ్ముఖో రాత్రౌదక్షిణాభిముఖో మూత్రపురీషే ఉత్సృజ్య లోష్టాదినా గుదంపరిమృజ్య గృహీత శిశ్న ఉత్థాయ పూర్వగృహీత మృజ్జలపాత్రే గృహీత్వార్ద్రాం మలకమాత్ర మృజ్జలైర్ద్వివారం లింగశౌచంకృత్వా ర్ధప్రసృతి తదర్ధార్ధ మృజ్జలైస్త్రివారమపానంసంశోధ్య పునర్జలైరేవ లింగగుదే ప్రక్షాళ్య శుద్ధమృత్తికయైకవారం హస్తం ప్రక్షాళ్య శుద్ధభూమి మాగత్యాన్య మృజ్జలైర్దశవారం వామకరం ప్రక్షాళ్య తతః కరద్వయం సప్తవారంతావద్భిరేవ మృజ్జలైః ప్రక్షాళ్య వామ దక్షిణపాదౌప్రత్యేకంత్రిః ప్రక్షాళ్యాన్యజలేన ద్వాదశగండూషాన్ వామభాగే కృత్వాజలపాత్రంత్రిః పర్యుక్ష్య జలబిందూన్ జలేనిక్షిప్యోపవీతీ ద్విరాచామేత్॥

తా. పూర్వోక్త ప్రకారము, మనుష్యుఁడు అరుణోదయకాలంబున లేచి ఆచమనముచేసి యిష్టదేవతకు నమస్కరించి ప్రాతస్స్మరణీయ శ్లోకములఁబఠించి సూర్యుని, గురువులనునమస్కరించి గ్రామమునకు వెలుపట నిరృతిమూలను, బాణము పోవునంతటి దూరముపోయి, ఇసుక కలిసిన శుద్ధమృత్తికను, జలపాత్రమునుతీసికొని, పురుగులులేనిచోటనునిచి, యజ్ఞసంబంధముకాని యెండిన గరికపోచలను, భూమిపైగప్పి, పైవస్త్రమును శిరమునకుఁ జుట్టుకొని, యజ్ఞోపవీతమును దండవలెచేసికొని, ఏకవస్త్రమును ధరించియున్న యెడల యజ్ఞోపవీతమును కుడిచెవినిచుట్టుకొని, మౌనియై ముక్కునునోటిని మూసికొని, పగలుత్తరముఖముగను, రాత్రియందు దక్షిణముఖముగను కూర్చుని మలమూత్రోత్సర్జనముచేసి మట్టిపెల్ల గడ్డిపోచలు మొదలగువానిచే గుదమునుతుడిచి, లింగమును వస్త్రమునకు తగులకుండ కరతలముచే గ్రహించి

లేచి తాను తెచ్చి యునిచియున్న మృజ్జలపాత్రములో నుసిరికాయంతమృత్తును తీసికొని జలముచే రెండుమారులు లింగశౌచముచేసి, అరపుడిసిలి (లేక) అందులోసగము మట్టినీళ్ళచే మూఁడుమార్లు గుదమునుగడిగి, మరల నీళ్లచే లింగమును గుదమునుగడిగి, శుద్ధమృత్తికచే నొకమారు చేతినికడుగుకొని మంచిచోటికివచ్చి, యితరమృజ్జలములచేఁ బదిమారులు ఎడమచేయికడుగుకొని పిమ్మట రెండుచేతులను ఏడుమారులు మృజ్జలములచే గడుగుకొని, కుడియెడమ పాదములను ప్రత్యేకముగ ముమ్మారుకడుగుకొని యితరజలములచే బన్రెండుమారులు గండూషముచేసి యెడమపార్శ్వమున నుమిసి, జలపాత్రమును ముమ్మారుకడిగి మిగిలిన యుదకము నుదకమునందు వైచి జందెమును జక్కగ ధరించి రెండుమార్లు ఆచమనము చేయవలయును.

శ్లో. దివాయద్విహితంశౌచం తదర్ధంనిశికీర్తితం।
తదర్ధమాతురే ప్రోక్త మాతురస్యార్ధ మధ్వని॥
స్త్రీశూద్రాదే రశక్తానాం గంధలేపక్షయోభవేత్॥

తా. ఇట్లు పగటిశౌచవిధి, రాత్రియందయిన యెడల పైజెప్పిన శౌచాచమనవిధిలో సగముజరిగింపవలయు. దానిలోసగము రోగులును, దానిలోసగము మార్గస్థుఁడును చేయవలయు. అశక్తులు బాలురు స్త్రీలు శూద్రులు వీరలు దుర్గంధము నశించువరకు శౌచకర్మను జేయవలయు.

హస్తపాదప్రక్షాళనగుణము.

శ్లో ప్రక్షాళనం మృదాపాణ్యోః పాదయోశ్శుద్ధికారకం।
మలశ్రమహరం వృష్యం చక్షుష్యం రాజసాపహం॥

తా. హస్తపాదములను మృజ్జలములచే శుద్ధిచేసికొనుటవలన పరిశుద్ధ ధాతువృద్ధి మంచి దృష్టియుగలిగి, మలము-శ్రమము-రజోగుణము ఇవి హరించును.

దంతధావనవిధి.

శ్లో. ప్రక్షాళ్యచరణౌ హస్తౌ ముఖం చాథ యథావిధి।
ఆచమ్యప్రాఙ్ముఖస్థిత్వా దంతధావన మాచరేత్॥

తా. ఇట్లు హస్తపాదముఖములను శోధించి యాచమనము చేసి తూర్పుముఖముగ గొంతుగూర్చుని కుడిచేతిని మోకాలిలోపల వేసికొని దంతధావనముచేయవలయు.

శ్లో భక్షయే ద్దంతకాష్ఠంచ ద్వాదశాంగుళ మాయతం।
కనిష్ఠికాగ్రవత్ స్థూల మృజ్వగ్రంథి తథా వ్రణం॥
ఏకైకంఘర్ష యేద్దంతం మృదునాకూర్చకేనచ।



తా. ౧౨ అంగుళముల పొడవును, చిటికెనవ్రేలి కొనయంతటి లావును గలిగి బుడుపులు పుండ్లులేక సమముగనుండు దంతకాష్ఠముయొక్క కొనను మెత్తగ నగునట్లు నమిలి యొక్కొకపంటిని తోమవలయు.

ప్రశస్తదంతకాష్ఠగుణము.

శ్లో ఆర్కేవీర్యంవటేదీప్తిః కరంజే విజయోభవేత్।
ప్లక్షేచైవార్థసంపత్తి ర్బదర్యాం మధురోధ్వనిః॥
ఖదిరే ముఖసౌగంధ్యం బిల్వేతు విపులంధనం॥
ఉదుంబరేతువాక్సిద్ధి రామ్రే త్వారోగ్య మేవచ॥
కదంబేతు ధృతిర్మేధా శ్చంపకేతుదృఢామతిః।
శిరీషే కీర్తి సౌభాగ్య మాయురారోగ్య మేవచ॥
అపామార్గేధృతిర్మేధాః ప్రజ్ఞాశక్తిస్తథాధ్వనిః।
దాడిమ్యాం సుందరాకారః కకుభేకుటజేతథా।
జాతీతగరమందారై ర్దుస్స్వప్నం చ వినశ్యతి॥

తా. జిల్లేడుపుల్లతో దంతధావనముచేసిన - బలముగలుగును. మఱ్ఱిపుడక - కాంతిని, కానుగు - గెలుపును, జువ్వి - ధనమును, రేగు - మధురమైన కంఠధ్వనిని, చండ్ర - నోటికి మంచి వాసనను, మారేడు - విశేషధనమును, అత్తి - వాక్సిద్ధిని, మామిడి - ధైర్యమును ధారణాశక్తిని, సంపెంగ - దృఢమైనబుద్ధిని, దిరిసెనముకీర్తిని, సౌభాగ్యమును, ఆయువును, ఆరోగ్యమును, ఉత్తరేణి - ధైర్యమును, ధారణాశక్తిని, బుద్ధిని, బలమును, కంఠధ్వనిని, దానిమ్మ - మద్ది - కొడిసె ఇవి సుందరాకారమును, ఇచ్చును. జాజి - గ్రంథితగరము - మందారము ఇవి దుస్స్వప్నముల నశింపఁజేయును.

నిషిద్ధదంతకాష్ఠములు.

శ్లో. గువాక స్తాలహింతాలా కేతకశ్చ బృహత్తృణః।
ఖర్జూరంనారికేళంచ సప్తైతేతృణరాజకాః॥
తృణరాజసముత్పన్నం యః కుర్యాద్దంతధావనం।
సరశ్చండాలయోనిస్స్యా ద్యావద్గాం నైవ పశ్యతి॥

తా. పోక, తాటి, గిరుకతాడి, మొగలి, ఈత, ఖర్జూరము, కొబ్బరి, ఈయేడువృక్షములును తృణరాజములనఁబడును. వీనిపుడకలతో పండ్లుతోమినవాఁడు గోవును చూచువరకు చండాలుఁడగును.

### దంతధావన మంత్రము

శ్లో. ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశువసూనిచ ।
బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచ త్వన్నో దేహి వనస్పతే ॥
ఇత్యాదిస్తుతివాక్యేన యేగృహ్ణాంతి వనస్పతిం ।
తత్ప్రియచ్ఛంతు సంస్కర్తు రాయుర్ధీశ్శ్రీర్యశస్థితిః ॥

తా. "ఆయుర్బలం" అను స్తోత్రవాక్యశ్లోకమునుచ్చరించి చెట్టునుండి పుడకను విరిచినయెడల వారికి, ఆయుష్యము, బుద్ధి, సంపద, కీర్తి ఇవికలుగును.

### దంతకాష్ఠప్రమాణము.

శ్లో. ద్వాదశాంగుళంవిప్రాణాం క్షత్రియాణాం దశాంగుళం ।
అష్టాంగుళంతువైశ్యానాం శూద్రాణాంతుషడంగుళం ॥

తా. దంతకాష్ఠము బ్రాహ్మణులకు ౧౨ అంగుళములును, రాజులకు ౧౦ అంగుళములును, వైశ్యులకు ౮ అంగుళములును, శూద్రులకు ౬ అంగుళములును పొడవు గలిగియుండవలయు.

శ్లో. ఇష్టకాలోష్టపాషాణై రితరాంగుళిభి స్తథా ।
ముక్త్వాచానామికాంగుష్ఠౌ వర్జయేద్దంతధావనం ॥

తా. ఇటికె, మట్టిపెళ్ళ, పెంకు, బొగ్గు, బూడిదె మొదలగు వానిచేతను, బొటనవ్రేలు పవిత్రపువ్రేలుతప్ప తక్కిన మూడువ్రేళ్ల చేతను దంతధావనము చేయదగదు.

### నాలుకగీచికొనుట.

శ్లో. జిహ్వానిర్లేఖనంహైమం రాజతంతామ్రజంతథా ।
పాటితంమృతత్కాష్ఠం మృదుపత్రమయంతథా ।
దశాంగుళంమృదుస్నిగ్ధం తేనజిహ్వాంలిఖేత్సుఖం ।
తజ్జిహ్వామలవైరస్య దుర్గంధజడతాహారం ॥
జిహ్వానిర్లేఖనంకుర్యా త్ప్రాఙ్ముఖోవాప్యుదఙ్ముఖః ।
అభావేదంతకాష్ఠస్య నిషిద్ధదివసేషుచ ॥
అపాంద్వాదశగండూషైర్ముఖశుద్ధిర్విధీయతే ॥

తా. నాలుకను-బంగారము, వెండి, రాగి, వీనిలో దేనిచేనైనను, చీల్చిన పుడకతోనైనను, మెత్తని ఆకులతోనైనను, తూర్పుగ (లేక) ఉత్తరముగగూర్చుని, గీచుకొనవలయును. నాలుకగీచుకొనునట్టిది ౧౦ అంగుళముల పొడవుగలదిగను, మెత్తనిదిగను, నునుపుగనునుండిన సుఖముగ నుండును. దానివలన నాలుకయందలి మలము, అరుచి, కంపు, జడత్వము ఇవిహరించును. దంతకాష్ఠము దొరకనప్పుడును, నిషిద్ధదినములయందును, ౧౨ మారులు నీటితో గండూషమును చేసికొనిన ముఖశుద్ధియగును. నిషిద్ధదినములగు, పాడ్యమి, పంచపర్వములు, షష్ఠి, చతుర్దశి, నవమి, ఆదివారము, శ్రాద్ధము, జననము, వివాహము, వ్రతములు, ఉపవాసములు, ఈదినములందు-పుడకలచేత పండ్లుతోముకొనగూడదు.

### గండూషవిధి.

శ్లో. గండూషమథకుర్వీత శీతేన పయసాముహుః ।
కఫతృష్ణామలహారం ముఖాంతశ్శుద్ధికారకం ॥
కుర్యాద్ద్వాదశగండూషా పురీషోత్సర్జనేతతః ।
మూత్రోత్సర్గేతుచతురో భోజనాంతేతుషోడశ ॥

తా. నాలుక గీచికొనినపిదప చన్నీళ్లతో పలుమారు గండూషమును చేయవలయును. దానివలన, కఫము, దప్పి, మురికి, ఇవిహరించి నోరు పరిశుద్ధముగనుండును. పురీషోత్సర్జనమున ౧౨ మారులును, మూత్రోత్సర్జనమున ౪ మారులును, భోజనాంతమున ౧౬ మారులును, గండూషమును జేయవలయు.

### స్నానవిధి.

శ్లో. ప్రక్షాళ్య దంతకాష్ఠం వై భక్షయిత్వాయథావిధి ।
ఆచమ్య ప్రయతో నిత్యం ప్రాతస్స్నానం సమాచరేత్ ॥
ప్రాతస్స్నానం ప్రశంసంతి దృష్టాదృష్టఫలంహితత్ ।
సర్వమర్హతిశుద్ధాత్మా ప్రాతస్స్నాయీజపాదికం ॥
ప్రాతస్స్నానేన పాపాని పూయంతే నాత్రసంశయః ।
యామ్యం హి యాతనాదుఃఖం నిత్యస్నాయీ న పశ్యతి ॥
స్నానమూలాః క్రియాస్సర్వా శ్శ్రుతిస్మృత్యుదితా నృణాం ।
తస్మాత్స్నానం నిషేవేత శ్రీపుష్ట్యారోగ్య వర్ధనం ॥

తా. పూర్వోక్తప్రకారము దంతధావనాచమనములనొనర్చి పరిశుద్ధుడై నిత్యము ప్రాతస్స్నానము సేయుచుండవలయు. ప్రాతస్స్నానమువలన అదృష్టఫలంబులగు యమదండనాదులుతొలగును. ప్రాతస్స్నానములేక శ్రుతిస్మృత్యుక్తజపాదిక్రియలు సిద్ధింపవు. కావున సకలపాపహారంబగు స్నానమును ముఖ్యముగా జేయవలయు

శ్లో. మృతే జన్మని సంక్రాంతౌ శ్రాద్ధే జన్మతిథౌ తథా ।
అస్పృశ్య స్పర్శనేచైవ నస్నాయా దుష్ణవారిణా ॥
సంక్రాంత్యాం భానువారేచ సప్తమ్యాం రాహుదర్శనే ।
ఆరోగ్యపుత్రమిత్రార్థీ నస్నాయాదుష్ణవారిణా ॥
పౌర్ణమాస్యాంతథాదర్శే యస్స్నాయాదుష్ణవారిణా ।
సగోహత్యాకృతం పాపం ప్రాప్నోతీహనసంశయః ॥
స్నానం కృత్వా ర్ద్రవస్త్రంతు ఊర్ధ్వముద్ధృత్య నిక్షిపేత్ ।
స్నాన వస్త్రమధస్తాచ్చే త్పునస్స్నానేన శుద్ధ్యతి ॥

తా. మృతాశౌచము, జాతాశౌచము, సంక్రాంతి, శ్రాద్ధము, పుట్టిన దినము, చండాలస్పర్శనాదులు, ఆదివారము, రథసప్తమి, గ్రహణము. పౌర్ణమి, అమావాస్య వీనియందుష్ణోదకముతో స్నానమొనర్చిన గోహత్యాపాపము గలుగును గనుక శీతోదకముతోనే స్నానముచేయవలయు. స్నానముచేసి తడిసినవస్త్రమును చేతితో పైగాతీసి క్రిందనుంచవలయును గాని, క్రిందుగాజారవిడువఁగూడదు. అటులజేసిన తిరిగి స్నానము చేయవలయు.

స్నానగుణము.

శ్లో. దీపనంవృష్యమాయుష్యం స్నాన మోజోబల ప్రదం ।
కండూమల శ్రమస్వేద తంద్రాతృడ్దాహ పాపనుత్ ॥
శీతేనపయసాస్నానం రక్తపిత్త ప్రశాంతికృత్ ।
తదేవోష్ణేనతోయేన బల్యం వాతకఫాపహం ।
శిరస్స్నానమచక్షుష్య మత్యుష్ణేనాంబునా సదా ।
వాతశ్లేష్మ ప్రకోపేతు హితంతచ్చప్రకీర్తితమ్ ॥
అశీతేనాంభసా స్నానం పయఃపానం నవాస్త్రియః ।
ఏత ద్వో మానవాః! పథ్యం స్నిగ్ధమల్పంచ భోజనం ॥
యస్సదామలకైస్స్నానం కరోతి సవినిశ్చితం ।
వలీపలితనిర్ముక్తో జీవే ద్వర్షశతంనరః ॥

తా. స్నానమువలన జఠరాగ్నిదీపనము, ధాతుపుష్టి. ఆయుష్యము, తేజము బలము కలుగును. దురద, మురికి, బడలిక, చెమట, సోమరితనము, దప్పి, పాపములు హరించును. శీతోదకస్నానమువలన రక్తపిత్తరోగము నశించును. ఉష్ణోదకమువలన వాతకఫము శాంతినిబొందు బలము కలుగును. మిక్కిలి వేడినీళ్ళతో శిరస్స్నానముచేసిన



నేత్రములకు చెరుపు కలుగును, వాతశ్లేష్మములు ప్రకోపించినపుడు హితకరము. మనుజులకు, సుఖోష్ణోదకస్నానము. క్షీరపానము, నవయౌవనస్త్రీలు, నేయి మొదలగు వానిచే స్నిగ్ధంబై స్వల్పంబగు భోజనమును, హితకరములు. ఉసిరికపప్పుచే స్నానము చేసిన శరీరమునందు ముదిమివలనగలుగుముడతలు వెండ్రుకలునెరియుట ఇవిపోవును.

స్నాననిషేధము.

శ్లో. స్నానంజ్వరేతిసారేచ నేత్రకర్ణానిలార్తిషు ।
ఆధ్మానపీనసాజీర్ణ భుక్తవత్సుచ గర్హితం ॥

తా. జ్వరము, అతిసారము, నేత్ర-కర్ణ-వాతరోగములు, కడుపుబ్బరము, పీనస, అజీర్ణము, ఈరోగములుగలవారును, అప్పుడు భుజించినవారును, స్నానము చేయకూడదు.

అభ్యంగవిధి.

శ్లో. అభ్యంగంకారయేన్నిత్యం సర్వేష్వంగేషు పుష్టిదం ।
శిరశ్శ్రవణ పాదేషు తం విశేషేణ శీలయేత్ ॥

తా. తైలాభ్యంగమువలన సర్వాంగములకు పుష్టికలుగును. శిరము, చెవులు, పాదములు వీనియందు విశేషముగ తైలముతో మర్దనముచేసిన నారోగ్యముగలుగును.

అభ్యంగయోగ్యాయోగ్య వారఫలము.

శ్లో. రవిస్తాపం కాంతింవితరతిశశీ భూమితనయో
మృతింలక్ష్మీంసౌమ్యస్సురపతిగురు ర్విత్తహరణం ।
విపత్తిందైత్యానాంగురు రఖిల భోగానుగ మసం ।
నృణాంతైలాభ్యంగా త్సపదికురుతేసూర్యతనయః ॥

తా. భానువారమునందభ్యంగము చేసికొనిన తాపము, సోమవారమున కాంతిని, మంగళవారమునందు మరణము, బుధవారమునందు సంపత్తు, గురువారమునందు దారిద్ర్యము, శుక్రవారమునందు ఆపద, శనివారమునందు సకలభోగములును గలుగును.

అభ్యంగగుణము.

శ్లో. అభ్యంగో వాతకఫహృ చ్ఛ్రమం శాంతింబలం సుఖం ।
నిద్రావర్ణ మృదుత్వాయుః కురుతేదృఢపుష్టికృత్ ॥
అద్భిస్సంసిక్తమూలానాం తరూణాంపల్లవాదయః ।
వర్ధంతేచతథాన్యాంగానాం స్నేహసంసిక్తధాతవః ॥

ఉద్వర్తనంకఫహరం మేదోఘ్నం శుక్రదంపరం ।

బల్యం శోణితకృత్కాంతి త్వక్ప్రసాద మృదుత్వకృత్ ॥

తా. అభ్యంగమువలన వాతకఫము, బడలిక హరించి బలము సుఖము, నిద్ర, కాంతి, మృదుత్వము, ఆయువు, మంచిపుష్టికలుగును, శిరస్సు, చెవులు, పాదములు, వీనియందు తైలముచేమర్దించినయెడల సకలేంద్రియములకు పుష్టికలిగి, శిరోరోగములు కర్ణరోగములు, మార్గాయాస రోగములును, పోవును. "వేళ్లుఉదకముచేతడిసిన యెడల వృక్షములయందు చిగురుటాకులు మొదలగునవి వృద్ధిజెందినట్లు" శరీరమునందు తైలముచేనభ్యంగమొనర్చిన ధాతువులు వృద్ధిబొందును. శరీరమున నలుగుపెట్టుకొనుటవలన, కఫము, మేదస్సు హరించి, శుక్రశోణితములు వృద్ధిజెంది బలము కాంతి మృదుత్వము నిర్మలత్వము గలుగును.

## వస్త్రధారణము.

శ్లో. సితం మాంజిష్ఠ పీతంచ నీలం బ్రాహ్మణతః క్రమాత్ ।

అష్టహస్తం నవం శ్వేతం సదశంనాన్యధారితం ॥

అహతంతద్విజానీయాత్సర్వకర్మసుపావనం ।

శీతకాలేతుకౌశేయం కషాయంఘర్మవాసరే ॥

వర్షాసు శ్వేతవస్త్రంస్యా దేవం వస్త్రాణిధారయేత్ ॥

కదాపినజనైస్సద్భి ర్ధార్యం మలినమంబరం ।

తత్తుకండూకృమికరం గ్లాన్యలక్ష్మీకరంపరం ॥

తా. బ్రాహ్మణుఁడు, తెల్లనివస్త్రమును, క్షత్రియుఁడు మిక్కిలి యెఱుపు కలిసినపసుపు వన్నెగల వస్త్రమును, వైశ్యుఁడు పచ్చనివస్త్రమును, శూద్రుఁడు నల్లని వస్త్రమును, ధరించవలయు. రామారలుగలదియు, క్రొత్తదియు, తెల్లనిదియు, చినుఁగులులేనిదియు, ఇతరునిచే ధరింపఁబడనిదియు నగు వస్త్రము సర్వకర్మములయందును పావనమగును. శీతకాలమునందు పట్టువస్త్రమును ఉష్ణకాలమునందు కాషాయవస్త్రమును, వర్షాకాలమునందు తెల్లనివస్త్రమును ధరించవలయు, మలినవస్త్రము, దురదను పురుగులను శ్రమను దారిద్ర్యమును గలిగించును గనుక దానిని సత్పురుషులగు వారెప్పుడును ధరింపఁగూడదు.

## ఊర్ధ్వపుండ్రధారణవిధి.

పాద్మే—సస్నాతస్సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః ।

ధారయేదూర్ధ్వపుండ్రంతు మృదాశుభ్రేణ వైష్ణవః ॥



పర్వతాగ్రేనదీతీరే బిల్వమూలే జలాశయే ॥

సింధుతీరేచవల్మీకే హరిక్షేత్రేవిశేషతః ।

విష్ణోస్స్నానోదకం యత్ర ప్రవాహయతి నిత్యశః ।

శ్రీకృష్ణతులసీమూలే మృదమాదాయ భక్తిమాన్ ।

ధారయేదూర్ధ్వపుండ్రాణి హరిస్తస్యప్రసీదతి ।

శ్యామంశాంతికరంప్రోక్తం రక్తం వశ్యకరంభవేత్ ॥

శ్రీకరంపీత మిత్యాహు శ్శ్వేతం మోక్షప్రదం శుభం ॥

ఊర్ధ్వపుండ్రమృజుం సౌమ్యం సుపార్శ్వం సుమనోహరం ।

ఆరభ్యనాసికామూలం లలాటాంతం లిఖేన్మృదా ।

అశ్వత్థపత్రసంకాశం వేణుపత్రాకృతింతథా ।

పద్మకుట్మలసంకాశం మోహనం త్రితయంస్మృతం ।

అంగుష్ఠః పుష్టిదః ప్రోక్తో మధ్యమాయుష్కరీభవేత్ ।

అనామికాన్నదా నిత్యం ముక్తిదాచ ప్రదేశినీ ।

ఏతైరంగులిభేదైస్తు కారయేన్ననఖైస్స్పృశేత్ ॥

తా. శుభ్రమృత్తికచేనూర్ధ్వపుండ్రమును ధరించినవాఁడు, సర్వతీర్థములయందు స్నానమాచరించినవాఁడును, సర్వయజ్ఞములనొనర్చినవాఁడును అగును. పర్వతాగ్రము నదీతీరము, బిల్వవృక్షమూలము, సముద్రతీరము వల్మీకము, హరిక్షేత్రము, విష్ణుస్నానోదకము ప్రవహించెడిస్థలము, కృష్ణతులసీమూలము ఈస్థానములయందలి మృత్తికచే నూర్ధ్వపుండ్రమును ధరించినవానికి విష్ణువు ప్రసన్నుఁడగును. ఈమృత్తిక శ్యామలవర్ణమగునేని శాంతిని, రక్తవర్ణమగునేని వశ్యమును, పీతవర్ణమగునేని సంపత్తును, శ్వేతవర్ణమగునేని మోక్షమును గలుగజేయును. ఊర్ధ్వపుండ్రము, నాసికామూలము మొదలుకొని లలాటాంత్యభాగమువరకు, వంకరలేనిదిగను, చూచుటకు సౌమ్యముగను, మనోహరముగను, వ్యత్యస్తములు లేని పార్శ్వములుకలదిగను, రావియాకు, వెదురాకు తామరమొగ్గ, వీనియాకృతిగలదిగను నుండవలయు. ఊర్ధ్వపుండ్రమును ధరించుటయందు బొటనవ్రేలు పుష్టిని, నడిమివ్రేలు ఆయుష్యమును, అనామిక-అన్నమును, ప్రదేశిని ముక్తిని ఇచ్చును. ఇట్లు వ్రేళ్లతోనేధరింపవలయు. గోళ్లచేతాకఁగూడదు.

శ్లో. ఏకాంతినో మహాభాగా స్సర్వభూతహితేరతాః

సాంతరాళంప్రకుర్వీరన్ పుండ్రం హరిపదాకృతి ॥

తా. సమస్తజీవహితరతులును, పరమైకాంతులు నగువారు ఊర్ధ్వపుండ్రమును, విధ్యుక్తరీతిగ, శ్రీహరిపాదాకారముగను, నడుమ అంతరాళముతో గూడినదిగను ధరించవలయు.

అత్రిః.—ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు రజనీచూర్ణముత్తమం ।
లక్ష్మీరూపంధరేన్నిత్య మన్యద్రవ్యం ననిక్షిపేత్ ॥

తా. ఊర్ధ్వపుండ్రమునడుమ లక్ష్మీరూపంబగును త్తమంబైనహరిద్రాచూర్ణమును ధరించవలయు. ఇతరద్రవ్యములను ధరించగూడదు.

పాద్మే.—లలాటే కేశవం ధ్యాయే న్నారాయణ మథో దరే ।
వక్షస్థలే మాధవం తు గోవిందం కంఠకూబరే ॥
విష్ణుం చ దక్షిణే కుక్షౌ బాహుకే మధుసూదనం ।
త్రివిక్రమం స్కంధదేశే వామనం వామపార్శ్వకే ।
శ్రీధరం బాహుమధ్యే తు హృషీకేశం తు తద్భుజే ।
పృష్ఠే తు పద్మనాభం చ త్రికే దామోదరం న్యసేత్ ।
ఏవం ద్వాదశపుండ్రాణి బ్రాహ్మణ స్సతతంధరేత్ ।
తత్తత్పుండ్రేషు తన్మూర్తిం ధ్యాత్వా మంత్రేణ ధారయేత్ ॥

తా. ఊర్ధ్వపుండ్రములధరించుకొనునపుడు, లలాటమున కేశవుని, కడుపున నారాయణుని, వక్షస్థలమున మాధవుని, కంఠమున గోవిందుని, ఉదరమున దక్షిణభాగమందు విష్ణువును, కుడిభుజమున మధుసూదనుని, దక్షిణస్కంధమున త్రివిక్రముని ఉదరమున వామభాగమున వామనుని, వామభుజమున శ్రీధరుని, వామస్కంధమున హృషీకేశుని, పృష్ఠమున పద్మనాభుని, త్రికమున (వీపుయెముకయొక్క క్రింది భాగమున) దామోదరుని, ధ్యానించుచు నాయాస్థానములయం దూర్ధ్వపుండ్రముల ధరించవలయు.

శ్లో॥ అర్ధచంద్రాకృతి స్త్రీణాం ధార్యం పుండ్రం భ్రువో రధః ।
తన్మధ్యే దీపవద్ధార్యం శ్రీచూర్ణం శ్రీప్రియం శుభం ॥

తా. స్త్రీలు, కనుబొమలకునడుమక్రిందుగా అర్ధచంద్రాకృతిగా పుండ్రమును దానికినడుమ లక్ష్మీప్రియం బగు శ్రీచూర్ణమును దీపాకారముగా ధరించవలయు.

సంధ్యావందనము—భగవదారాధనము.

శ్లో. కులాచారం తు కుర్వీత సంధ్యోపాసన మాదృతః ।
సూర్యోపాస్తిం తతః కుర్యా దిష్టదేవస్యచార్చనం ॥



తా. కులాచారప్రకారము ఆదరణతోడ త్రికాలములయందు సంధ్యావందనమును, సూర్యోపాస్తిని, ఇష్టదేవతారాధనమునుంజేయవలయు.

చతుర్విధేచ్ఛలు.

శ్లో. శరీరే జాయతే నిత్యం వాంఛా నౄణాం చతుర్విధా ।
బుభుక్షా చ పిపాసా చ సుషుప్తా సురతస్పృహా ॥

తా. మనుష్యునికి-భోజనేచ్ఛ, ఉదకపానేచ్ఛ, నిద్రాసక్తి, సంభోగేచ్ఛ ఇవి శరీరమున నిత్యము కలుగుచుండును.

భోజనేచ్ఛావిఘాతజదోషములు.

ఆయుర్వేదే.—భోజనేచ్ఛావిఘాతా త్స్యా దంగమర్దో ఒరుచి శ్శ్రమః ।
తంద్రాలోచనదౌర్బల్యం ధాతుదాహో బలక్షయః ॥

తా. ఆకలిగొన్నపుడు భుజింపనియెడల ఒడలు విరుపు, అరుచి, శ్రమము కునుకుపాట్లు, నేత్ర దౌర్బల్యము, రసాదిధాతువులు దహించుట, బలహీనతయుగలుగును.

శ్లో. బుభుక్షితో న యో ఒశ్నాతి తస్యాహారేంధనక్షయాత్ ।
మందీభవతి కాయాగ్ని ర్యథాచాగ్ని ర్నిరింధనః ॥
ఆహారం పచతి శిఖీ దోషా నాహారవర్జితః పచతి ।
దోషక్షయే చ ధాతూన్ పచతి చ ధాతుక్షయే ప్రాణాన్ ॥

తా. ఆకలిగొన్నవాఁ డన్నమును భక్షింపనియెడల, "కట్టెలులేక అగ్నినశించునట్లు" జాఠరాగ్ని, అన్నాద్యాహారము అను కాష్ఠములు లేమింజేసి మందమగును. ఆహారమును జఠరాగ్నిపండును. ఆహారములేనివాఁడు వాతపిత్తాదిదోషముల నశింపజేయును, అవి నశించిన రసాదిధాతువులు నశించును. అందువలన ప్రాణములు శరీరమునువదలును. కావున భోజనేచ్ఛాకాలమునందు తప్పక భుజించుచుండవలయు.

పిపాసేచ్ఛావిఘాతజ దోషములు.

శ్లో. విఘాతేన పిపాసాయాః శోషః కంఠాస్యయో ర్భవేత్ ।
శ్రవణస్యావరోధ శ్చ రక్తశోషో హృది వ్యథా ॥

తా. దప్పిని ఆపుటవలన-కంఠము, నోరు, రక్తము ఇవియెండుట, చెవులు వినరాకుండుట, హృదయమున పీడయు గలుగును.

నిద్రావిఘాతజదోషములు.

శ్లో. నిద్రావిఘాతతో జృంభా శిరోలోచనగౌరవం ।
అంగమర్ద స్తథా తంద్రా స్యా దన్నాపాకఏవ చ ॥

తా. నిద్రగాచుటవలన, ఆవులింతలు, శిరమునందును కన్నులయందును బరువు, ఒడలువిరుపు, తూగుట, అన్నము జీర్ణింపకుండుట, ఇవి కలుగును.

వ్యవాయవిఘాతజదోషములు.

శ్లో. అవ్యవాయాన్మేహమేదో వృద్ధి శ్శిథిలతా తనోః ॥

తా. స్త్రీసంభోగము లేకుండిన, మేహము మేదస్సు వృద్ధిజెందును, అవయవములు సడలిపోవును.

భోజనవిధి.

శ్లో. యామమధ్యే నభోక్తవ్యం యామయుగ్మం నలంఘయేత్ ।
యామమధ్యే రసోత్పత్తి ర్యామయుగ్మా ద్బలక్షయః ॥

తా. ఉదయమున జాములోపల రసాద్యుత్పత్తి కాలమగుటంజేసి అప్పుడుభుజింపక, ఒకజామునకుపైగా రెండుజాములకులోపల భుజింపవలయు. రెండుజాములు దాటిన బలము క్షీణించును.

శ్లో. యథోక్తగుణసంపన్న ముపసేవేత భోజనం ।
విచార్యదోషకాలాదీ౯ కాలయో రుభయో రపి ॥
సాయం ప్రాత ర్మనుష్యాణా మశనం శ్రుతినోదితం ।
నాంతరా భోజనం కుర్యా దగ్నిహోత్రసమో విధిః ॥

తా. రెండు కాలములయందును, దోషకాలములను విచారించి శాస్త్రోక్తగుణములచేనిండిన భోజనమును జేయవలయు. పగటిపూటను రాత్రిపూటను మాత్రము భుజింపవలయునుగాని యితరకాలములయందు భుజింపఁగూడదని శ్రుతిచేఁజెప్పఁబడినది.

శ్లో. ఆహారో విజనే కుర్యా న్నిర్హార మపి సర్వదా ।
ఉభాభ్యాం లక్ష్మ్యపేత స్స్యా త్ప్రకాశే హీయతే శ్రియా ॥
ఆహారనిర్హారవిహారయోగా స్సదైవ సద్భి ర్విజనే విధేయాః ॥

తా. భోజనమొనర్చుట, మలమూత్రముల విసర్జించుట, సంభోగము ఇవి జనులులేనిచోటచేసిన లక్ష్మీకరమగును, జనులుగలచోట నొనర్చిన లక్ష్మీనాశమగును.

భోజనస్థానము.

శ్లో. స్వచ్ఛం వ్యవకరం లిప్తం గోమయాద్యై ర్మనోహరం ।
సుధాధవలితం సమ్య క్ప్రతిమాద్యై ర్విచిత్రితం ॥
దుష్టశబ్దాదిరహితం త చ్ఛస్తం భోజనాలయం ॥



తా. శుభ్రముగా నూడ్వఁబడినదియు, గోమయాదులచే నలకఁబడినదియు, మనోహరమైనదియు, తెల్లనిసున్నముచే పూయఁబడినదియు, చిత్తరువులు అద్దములు మొదలగువానిచే చిత్రితమైనదియు దుష్టశబ్దములు మొదలగునవి లేనిదియునగు భోజనాలయము ప్రశస్తమైనది.

భోజనకాలనిషిద్ధదృష్టి.

శ్లో. హీనదీనక్షుధార్తానాం పాపపాషండరోగిణాం ।
కుక్కుటాహిశునాం దృష్టి ర్భోజనే నైవ శోభనా ॥

తా. అల్పుఁడు, దీనుఁడు, ఆఁకలిచేఁ బీడింపఁబడినవారు, పాపులు, పాషండులు, రోగులు వీరిదృష్టియు, సర్పములు, కోళ్లు, కుక్కలు వీనిదృష్టియు, భోజనకాలమునందు అశుభకరము.

శుభదృష్టి.

శ్లో. పితృమాతృ సుహృద్వైద్య పాకకృ ద్ధంస బర్హిణాం ।
సారసస్య చకోరస్య భోజనే దృష్టి రుత్తమా ॥

తా. తల్లి, తండ్రి, స్నేహితులు, వైద్యుఁడు, వంటవాఁడు, వీరిదృష్టియు, హంసలు, నెమళ్లు, బెగ్గురు, చకోరపక్షులు, వీనిదృష్టియు భోజనకాలమునందు శుభకరము

దృష్టిదోషనివారణోపాయము.

శ్లో. అన్నం బ్రహ్మ రసో విష్ణు ర్భోక్తా దేవో మహేశ్వరః ।
ఇతి సంచింత్య భుంజానో దృష్టిదోషై ర్నలిప్యతే ॥
అంజనీగర్భసంభూతం కుమారం బ్రహ్మచారిణం ।
దృష్టిదోషవినాశాయ హనుమంతం స్మరామ్యహం ॥

తా. ఈశ్లోకములను రెంటిని ధ్యానించి భుజించిన భోజనకాలమునందలి దృష్టిదోషము తొలఁగును.

భోజనపాత్రము.

శ్లో. హైమేవా రాజతే కాంస్యే ఆయసే కాచనిర్మితే ।
పాత్రే పత్రమయే వాపి నరః కుర్వీత భోజనం ॥

తా. బంగారు, వెండి, కంచు, ఇనుము, గాజు, కొయ్య వీనిసంబంధమైనపాత్రములయందుగాని ఆకులయందుగాని భోజనము చేయవలయు.

భోజనపాత్రగుణము.

శ్లో. దోషఘ్నం దృష్టిదం పథ్యం హైమం భోజనభాజనం ।
రౌప్యంభవతి చక్షుష్యం పిత్తఘ్నం కఫవాతకృత్ ॥

కాంస్యం బుద్ధిప్రదం రుచ్యం రక్తపిత్తప్రసాదనం ।
పైత్తలం వాతకృద్రూక్షం ఉష్ణం కృమికఫప్రణుత్ ।
ఆయసే కాచపాత్రే చ భోజనం సిద్ధికారకం ।
శోథపాండుహరం బల్యం కామలాపహ ముత్తమం ।
శైలజే మృణ్మయే పాత్రే భోజనం శ్రీనివారణం ।
దారూద్భవం విశేషేణ రుచిదం శ్లేష్మకారిచ ।
పాత్రం పత్రమయం రుచ్యం దీపనం విషపాపనుత్ ॥

తా. బంగారు పాత్రమునందు భుజించిన దోషములు హరించి మంచిదృష్టి గలుగును. పథ్యకరంబుగ నుండును. వెండిపాత్రము నేత్రములకు మేలును, పిత్తశాంతిని, వాతప్రకోపమును జేయును. కంచుపాత్రము బుద్ధిని రుచిని ఇచ్చును. రక్తపిత్తమును బోగొట్టును. పిత్తమును వాతమును రూక్షను ఉష్ణమును చేయును. క్రిములను కఫమును పోగొట్టును. ఇనుము గాజు పాత్రములు బుద్ధిని బలమును వృద్ధిచేయును, వాపు-పాండు-కామిల- ఈరోగముల హరింపజేయును. ఱాతిమరిగెలు-మట్టిపాత్రములు సంపదనుతొలఁగించును. కొయ్యపాత్రములు రుచిని కఫమును చేయును, పత్రములతోఁగూర్చబడిన పాత్రములు రుచిని అగ్నిదీపనమును చేయును, విషపాపముల హరింపఁజేయును.

శ్లో. రంభాపత్రే ఽశనం హృద్యం రుచ్యం వృష్యం బలాగ్నిదం ।
విషశ్రమానిలార్తేషు హితం పాండౌ న శస్యతే ॥
పాలాశపత్రం చ మరుచ్ఛ్లేష్మగుల్మోదరక్రిమీన్ ।
నిహన్యా త్పీనసం కాసం జ్వరంచైవాతిదారుణం ।
పత్రంతు క్షీరవృక్షాణాం తృష్ణాదాహాస్రపిత్తనుత్ ।
నలినాదిదలం రూక్షం నిందితం భోజనే హిమం ॥

తా. అరఁటియాకునందు భుజించిన హృద్యముగ, రుచికరముగ, ధాతువృద్ధికరముగను నుండును. బలము అగ్నిదీపనము కలుగును. విషము-బడలిక- వాతరక్తరోగము వీనియందు హితముగను, పాండురోగమునం దహితముగను నుండును. మోదుగాకు, వాతము కఫము గుల్మము ఉదరము క్రిములు పీనస కాసము అతిదారుణజ్వరము వీనిని పోగొట్టును. మఱ్ఱి, జువ్వి మొదలగు క్షీరవృక్షపత్రములు-దప్పి, తాపము రక్తపిత్తము ఈరోగముల హరింపఁజేయును, తామర మొదలయిన యాకులు రూక్షను చలువను చేయును-భోజనమునందు నిందితములుగ నుండును.



భోజనమునకుముందు భక్షింపఁదగినవి.

శ్లో. భోజనాగ్రే సదా పథ్యం లవణార్ద్రక భక్షణం।
రోచనం దీపనం వహ్ని జిహ్వాకంఠ విశోధనం ॥

తా. భోజనమునకుముందుగ అల్లమును, సైంధవలవణమును చేర్చి భక్షించిన రుచి అగ్నిదీపనము గలుగును, నాలుక కంఠము ఇవి పరిశుద్ధియగును.

శ్లో. ద్రవాద్యన్నం తు చేత్సేవేత్తత్రాంబు న పిబేద్బహు ।
మధ్యే తు కఠినే భక్ష్యే యథేష్టం శస్యతే జలం ।
తథా చ భోజనస్యాంతే పీత మంబు బలప్రదం ॥

తా. ద్రవపదార్థముతోఁజేర్పఁబడిన అన్నమును భుజించునపుడు విశేషముగ నుదకమును త్రాగగూడదు, గట్టియనుపానముతో భుజించునపుడు యథేష్టముగ నుదకమును త్రాగవచ్చును, అట్లే భోజనాంతమున జలపానముచేసిన బలముగలుగును.

శ్లో. గురు పిష్టమయం ద్రవ్యం తండులాన్ పృథుకా నపి ।
న జాతు భుక్తవాన్ ఖాదే న్మాత్రాం ఖాదే ద్బుభుక్షితః ॥
ఘృతపూర్వం సమశ్నీయా త్కఠినం ప్రాక్ తతో మృదు ।
అంతే పునర్ద్రవాశీ తు బలారోగ్యం న ముంచతి ॥

తా. అన్నమును భుజించిన పిదప గురుత్వకర పదార్థములు పిండిపదార్థములు వేపుడుబియ్యము అటుకులు వీనిని ఎప్పుడును భక్షింపగూడదు, ఆఁకలిగొన్నవారు కొంచెముగ భక్షింపఁదగును. భోజనారంభమున రొట్టెలు భక్ష్యములు మొదలగుకఠిన పదార్థములను నేతితోడను, భోజనమధ్యమున అన్నము మొదలగు మృదుపదార్థములతోడను, భోజనాంతమున పెరుగు పాలు మొదలగు ద్రవపదార్థములతోడను భుజించిన శరీరమునకు బలారోగ్యములు గలుగును.

శ్లో. అత్యుష్ణాన్నం బలం హంతి శీతం శుష్కంచ దుర్జరం ।
అతిక్లిన్నం గ్లానికరం యుక్తియుక్తంహి భోజనం ।
అతిద్రుతాశితాహారో గుణాన్ దోషా న్న విందతి ।
భోజ్యం శీత మహృద్యం చ స్యా ద్విలంబిత మశ్నతః ॥

తా. మిక్కిలివేడియన్నము, బలమును నశింపఁజేయును. మిక్కిలిచల్లనిది ఎండినది శరీరశైథిల్యమునుగలుగజేయును. మిక్కిలి తడిసిన అన్నము బడలికను గలిగించును. కావున మనుష్యుఁడు యుక్తియుక్తముగ, కొంచెముష్ణముగలిగి భోజ్యంబైనయన్నమును భుజింపవలయు. మిక్కిలి శీఘ్రముగ భుజించువాఁడు ఆహారముయొక్క-

గుణదోషముల నెఱుంగజాలదు, మిక్కిలి యాలస్యముగ భుజించిన భోజ్యపదార్థములు చల్లనై రుచిదప్పును గావున మిక్కిలి ఆలస్యము, వేగము లేక సమకాలమున భుజింపవలయు.

## చతుర్విధాగ్ని పరత్వభోజనము.

శ్లో. మంద స్తీక్ష్ణో విషమ స్సమ శ్చ వహ్ని శ్చతుర్విధః పుంసాం।
లఘుమందే గురుతీక్ష్ణే స్నిగ్ధం విషమే సమే సమంభోజ్యం ॥

తా. మనుష్యులకు జఠరాగ్ని మందము, తీక్ష్ణము, విషమము, సమము, అని నాలుఁగువిధములుగనుండును, మందాగ్నిగలవాఁడు లఘుపదార్థములను, తీక్ష్ణాగ్నిగలవాఁడు గురుపదార్థములను, విషమాగ్నిగలవాఁడు స్నిగ్ధపదార్థములను, సమాగ్నిగలవాఁడు గురులఘుత్వములు లేని సమపదార్థములను భక్షింపవలయు.

శ్లో. పత్నీం విహితశృంగారాం ప్రాప్య భోజనమండపం।
యథాచాగ్నిబలం వీక్ష్య కుర్యా ద్భోజనకం నరః।
ఏకఏవ నభుంజీత యదీచ్ఛే త్సిద్ధి మాత్మనః।
ద్విత్రిభి ర్బహుభి స్సార్థం భోజనం తు దివానిశం ॥

తా. గృహస్థుడు, భోజనమండపమున జేరి తగినయలంకారముతో నొప్పుచున్న భార్యచే వడ్డింపఁబడిన యన్నాది పదార్థములను తన యగ్నిబలమునుజూచి భుజింపవలయు. ఆయురారోగ్యాది సిద్ధుల నపేక్షించువాఁడు తానొక్కఁడుగా భుజింపగూడదు. ఇద్దరు ముగ్గురితోగాని బహుమందితోగాని రాత్రింబగళ్లు భుజింపవలయు.

## స్థలశుద్ధి.

శ్లో. ఉపలిప్తే శుచౌ దేశే చతురస్రం త్రికోణకం।
వర్తులం చార్ధచంద్రం చ విప్రాదీనాంచ మండలం ॥

తా॥ అలకబడిన పరిశుద్ధస్థానమందు భోజనపాత్రమునుంచుటకు బ్రాహ్మణులు చచ్చౌకముగను, క్షత్రియులు త్రికోణముగను, వైశ్యులు గుండ్రముగను శూద్రులు అర్ధచంద్రాకారముగను నుదకముచే మండలములను చేయవలయు.

శ్లో. పంచాశత్పలికం కాంస్యం స్థాపయే త్తత్ర రాజతం।
సౌవర్ణం వాథ పత్రై ర్వా నిర్మితం భాజనం శుభం ॥

తా. ఏబదిపలములయెత్తు, కంచు, వెండి, బంగారులోహములలో దేనిచేనైనను పత్రములచేనైనను నిర్మింపఁబడిన పాత్రములయందు భోజనము శుభకరము.



## అన్నాదిస్థాపనక్రమము.

శ్లో. శాకాదీ న్పురత స్థాప్య భక్ష్యం భోజ్యం చ కామతః।
అన్నం మధ్యే ప్రతిష్ఠాప్య దక్షిణే ఘృతపాయసౌ ॥
హస్తౌ పాదౌ తథై వాస్యం ప్రక్షాల్యాన్నం ప్రణమ్య చ।
తతో గ్రాసా న్సముద్ధృత్య గవాం చ వినివేదయేత్ ॥
బాలాన్ సువాసినీ వృద్ధ గర్భిణ్యాతురకన్యకాః।
సంభోజ్యాతిథివృద్ధాం శ్చ దంపత్యో శ్శేషభోజనం ॥

తా. శాకాదిపదార్థములను ముందరను, భక్ష్యభోజ్యపదార్థములను ఇచ్ఛానుసారముగను, అన్నమును నడుమను కుడిప్రక్కన ఘృతపాయసములను, ఉనిచి, హస్తపాదములను శోధించుకొని యాచమనముచేసి అన్నమును బ్రహ్మస్వరూపముగా ధ్యానించి కబళముల నెత్తి గోవులకు నివేదనచేసి బాలురను ముత్తయిదువలను వృద్ధులను గర్భిణులను రోగులను కన్యకలను అతిథులను భుజింపఁజేసి మిగిలినదానిని దంపతులు భుజింపవలయు.

## భోజనసమయనియమము.

శ్లో. భుంజానో న బహు బ్రూయా న్న నిందే దపి కంచన।
జుగుప్సితకథాం నైవ శృణుయా దపి వా వదేత్ ॥

తా. భోజనము చేయునపుడు విశేషసంభాషణమును పరనిందను చెయగూడదు. నీచకథలను చెప్పుట వినుటయు కూడదు.

శ్లో. ఈర్ష్యాభయక్రోధపరిప్లుతేన లుబ్ధేన రుగ్దైన్యనిపీడితేన।
విద్వేషయుక్తేన చ సేవ్యమాన మన్నం న సమ్య క్పరిపాక మేతి॥

తా. భుజించునపుడు, ఈర్ష్య, భయక్రోధములు, లుబ్ధత్వము, రోగము, దైన్యము, ద్వేషయుక్త మనస్సు ఇవి కలిగియుండినయెడ అన్నము జీర్ణింపదు.

శ్లో. యో వేష్టితశిరా భుంక్తే యో భుంక్తే దక్షిణాముఖః।
వామపాదకర స్థిత్వా తద్వై రక్షాంసి భుంజతే ॥

తా. శిరమునకు వస్త్రమును చుట్టుకొనియు, దక్షిణముఖముగ గూర్చునియు ఎడమకాలిమీఁద చేయినునిచికొనియు, నిలుచుండియు భుజించిన ఆయన్నము రాక్షసులఁ జెందును.

శ్లో. ఆయుష్యం ప్రాఙ్ముఖో భుంక్తే యశస్యం దక్షిణాముఖః।
శ్రియం ప్రత్యఙ్ముఖో భుంక్తే ఋతం భుంక్తే హ్యుదఙ్ముఖః ॥

తా. తూర్పుముఖముగ గూర్చుని భుజించిన ఆయుర్వృద్ధి. దక్షిణముఖమునందు - యశస్సు, పడమటి ముఖంబున - సంపద, ఉత్తరముఖమున సత్యమునుగలుగు.

శ్లో. పాదుకస్థో న భుంజీత పర్యంకస్థః స్థితోపి వా ।
శ్వానచండాల దృక్శైవ భోజనం పరివర్జయేత్ ॥

తా. పాదరక్షలు తొడిగికొనిగాని, మంచము పైనగూర్చునిగాని, కుక్కలు మాలవాఁడు చూచుచుండగగాని భుజింపఁగూడదు.

శ్లో. అన్నాద్యే కీటసంయుక్తే మక్షికాకేశ దూషితే ।
తదంతరా స్పృశేచ్చాప స్తదన్నం భస్మనా స్పృశేత్ ॥

తా. అన్నమును, పురుగులు, వెంట్రుకలు ఇవి తాకినయెడల, జలమును కొంచెము భస్మమును చల్లవలయు.

శ్లో. ఏకపంక్త్యుపవిష్టానాం విప్రాణాం సహభోజనే ।
యద్యేకోపి త్యజే త్పాత్రం శేష మన్నం న భోజయేత్ ॥

తా. ఒకపంక్తిగాఁగూర్చుని భోజనముచేయువారిలో నొకఁడు ముందుగ పాత్రమునువిడిచిలేచిపోయినమిగిలినవారుతమపాత్రములయందుమిగిలినయన్నమునుతినదగదు.

శ్లో. బహుస్తోక మకాలే వా జ్ఞేయం త ద్విషమాశనం ।
ఆలస్యగౌరవాటోప శబ్దాంశ్చ కురుతే భృశం ।
హీనమాత్రం తనోః కార్శ్యం కరోతి చ బలక్షయం ॥

తా. మిక్కిలి స్వల్పముగ భుజించినను, అకాలమున భుజించినను అది విషమాశన మనఁబడును. అటులజేయుటవలన - ఆలస్యము, గురుత్వము కడుపులో గుడగుడమనుట ఈదోషములనుజేయును. కేవల స్వల్పాహారము శరీరమును కృశింపఁజేసి బలమును క్షయింపఁజేయును.

శ్లో. నాప్రాప్తకాలం భుంజీత హీనాధిక మథాపివా ।
అప్రాప్తకాలే భుంజానో అసమర్థతను ర్నరః ॥
తాంస్తాన్ వ్యాధీ నవాప్నోతి మరణం చాధిగచ్ఛతి ।
కాలేఽతీతేఽశ్నతో జంతో ర్వాయునోపహతేఽనలే ॥
కృచ్ఛ్రా ద్విపచ్యతే భుక్తం న స్యా ద్భోక్తుం పున స్స్పృహా ।
తస్మా త్సుసంస్కృతం యుక్త్యా దోషై రేతై ర్వివర్జితః ।
సుఖాసనస్థో గుణై ర్యుక్త ముపసేవేత భోజనం ।
దౌర్మనస్యం భయం క్రోధం భుంజానః పరివర్జయేత్ ॥



తా. కాలముకాకమునుపు భుజించినను, ఎచ్చుతక్కుచగా భుజించినను, శరీరసామర్థ్యముచెడి యనేకవ్యాధులనుజెంది మరణమునుసగా పొందును. కాలమతిక్రమించినయెడల వాయుప్రకోపముచే జఠరాగ్నిచెడి ఆలస్యముగ నతికష్టముచేత జీర్ణమునకువచ్చును. మరల భుజించుట కిష్టముగలుగదు. కావున మనుజుఁడు బాగుగ సంస్కరింపఁబడిన యన్నమును పూర్వోక్త దోషములులేక, సుఖాసీనుఁడై యుక్తిచే భుజింపవలయు. భుజించునపుడు ఈర్ష్యాదులచే మనస్సును జెరుచుకొనుట, భయము క్రోధము వీనిని వర్జింపవలయు.

భోజనప్రమాణము.

శ్లో. కుక్షే ర్భాగద్వయం భోజ్యై స్తృతీయం వారి పూరయేత్ ।
వాయోస్సంచరణార్థాయ చతుర్థ మవశేషయేత్ ॥

తా. తన కుక్షిలో రెండు భాగములను భోజ్యపదార్థములచే నిండించవలయు. మూఁడవభాగము నుదకముచే నిండించవలయు. వాయువు సంచరించు నిమిత్తము నాలవభాగమును మిగిలించవలయు,

జలప్రమాణము.

శ్లో. అత్యంబుపానా న్నవిపచ్యతేఽన్నం నిరంబుపానా చ్చ సఏవదోషః ।
తస్మా న్నరో వహ్నివివర్ధనాయ ముహుర్ముహు ర్వారి పిబే దభూరి ॥
భుక్తస్యాదౌ జలం పీతం కార్శ్యమందాగ్నిదోషకృత్ ।
మధ్యేఽగ్నిదీపనం శ్రేష్ఠ మంతే స్థౌల్యకఫప్రదం ॥

తా. భుజించునపుడు జలమును మిక్కిలిత్రాగినను, త్రాగకుండినను అన్నము బాగుగ పక్వముకాదు ; కావున అన్నముజీర్ణించి యగ్నిదీపనముగలుగుటకు, పలుమారు స్వల్పముగ జలమును త్రాగవలయు. భోజనమునకు ముందు జలపానముచేసిన శరీరకార్శ్యము అగ్నిమాంద్యము కలుగును భోజనమధ్యమున నుదకమును త్రావిన అగ్నిదీపనముగలుగును, భోజనాంతమున జలమును బుచ్చుకొనిన శరీరమును బలియజేసి కఫమును బుట్టించును.

భుజించినపిదప క్షీరపానము.

శ్లో. విదాహీ న్యన్నపానాని యాని భుంక్తే హి మానవః ।
తద్విదాహప్రశాంత్యర్థం భోజనాంతే పయఃపిబేత్ ॥
కుర్యాత్ క్షీరాంత మాహారం న దధ్యంతం కదాచన ।
లవణామ్లకటూష్ణాని విదాహీ న్యత్తి యాని తు ।
తద్దోషం హర్తు మాహారం మధురేణ సమాపయేత్ ॥

తా. భోజనాంతరమున క్షీరపానమొనర్చిన, అన్నపానాదులవలన గలిగిన విదాహాదిదోషములు శమించును. భోజనమును పాలతో ముగించవలయునుగాని పెరుగుతో ముగింపఁగూడదు. ఉప్పు, పులుసు, కారముగల పదార్థములు, ఉష్ణవిదాహకరపదార్థములు వీనిని భక్షించినయెడల వానిదోషముశమించుటకై మధురాహారముచే భోజనమును ముగింపవలయు.

ఆవుపాలగుణము

శ్లో. గోదుగ్ధం మధురం శీతం గురు హృద్యం రసాయనం ।
వయసస్థాపనం స్వాదు స్నిగ్ధం పథ్యతమం మతం ।
రుచ్యం బల్యం శుక్రలం చ మేధ్యం పుష్టిప్రదాయకం ।
కాంతికృ త్తృప్తిజనకం వాతే పిత్తే విషే భ్రమే ।
రక్తపిత్తే వాతరక్తే దాహే చైవాతిసారకే ।
ఉదావర్తే మదే కాసే శ్వాసే జీర్ణజ్వరే తృషి ।
ఉదరే మూత్రకృచ్ఛ్రే చ గుల్మే శూలేఽమ్లపిత్తకే ।
అథావర్శస్యపస్మారే క్షయే పాండావతిశ్రమే ।
యోనిరోగే గర్భపాతే నేత్రరోగే హితావహం ॥
పథ్యం ప్రవాహికాయాం చ ప్రవదంతి భిషగ్వరాః ॥

తా. ఆవుపాలు మధురముగను శీతముగను మనోహరముగను నుండును. గురుత్వమునుచేయును. ముదిమినిపోగొట్టును. వయస్సునునిలుపును. స్నిగ్ధముగను, పథ్యకారిగను నుండును. రుచిని, బలమును, శుక్రమును, బుద్ధిని, పుష్టిని వృద్ధిజేయును. కాంతిని, తృప్తిని ఇచ్చును. వాతము, పిత్తము, విషము, భ్రమ, రక్తపిత్తము, వాతరక్తము తాపము, అతిసారము, ఉదావర్తము, మదము, కాసము, శ్వాసము, జీర్ణజ్వరము దప్పి, ఉదరము, మూత్రకృచ్ఛ్రము, గుల్మము, శూల, అమ్లపిత్తము, అర్శోరోగము, అపస్మారము, క్షయము, పాండువు, యోనిరోగము, గర్భపాతము, నేత్రరోగము, ప్రవాహికారోగము ఈరోగములయందావుపాలు పథ్యకరము.

గోజాతిపరత్వ క్షీరగుణము.

శ్లో. కృష్ణాయా గో ర్వరం క్షీరం వాతపిత్త కఫప్రణుత్ ।
పీతాయా వాతపిత్తఘ్నం రక్తాయా వాతహృ త్పరం ॥
వాతఘ్నం చిత్రవర్ణాయా శ్శ్వేతాయాః కఫకృ ద్గురు ।
బాలవత్సావివత్సానాం గవాం క్షీరం త్రిదోషకృత్ ।



బష్కయణ్యా స్త్రిదోషఘ్నం తర్పణం బలదం పయః ।
పిణ్యాకామ్లాన్నభో క్త్రీణాం క్షీరం గురు కఫప్రదం ।
నిద్రా రేతో బల స్థౌల్య వహ్నిమాంద్యకరం హిమం ।
గవాం పలాలభో క్త్రీణాం దుగ్ధం యవసభో క్త్రీణాం ।
కథితం మునిభి ర్వైద్యై స్సర్వరోగే హితావహం ।
తరుణీనాం గవాం దుగ్ధం మధురం చ రసాయనం ।
త్రిదోషనాశకం చైవ వృద్ధాయా దుర్బలం స్మృతం ।
సగర్భాయా స్సముద్దిష్టం త్రిమాసోర్ధ్వం చ పిత్తలం ।
క్షారం చ మధురం చైవ స్మృతం వై శోషకారకం ।
ధారోష్ణం తు గవాం దుగ్ధం వృష్యం ధాతువివర్ధనం ।
నిద్రాకాంతికరం స్నిగ్ధం పథ్యం స్వా ద్వగ్నిదీపనం ।
అమృతేనసమం ప్రోక్తం సర్వాతంకవినాశనం ।
సపాదప్రహరా దూర్ధ్వం త్రిదోషజనకం భవేత్ ॥

తా. నల్లగోవుపాలు శ్రేష్ఠమైనవి. వాతపిత్తకఫదోషముల హరించును. పచ్చగోవుపాలు పిత్తమునుహరించును. ఎఱ్ఱనిది చిత్రవర్ణముగలదియగు గోవుపాలు వాతమును హరించును. తెల్లగోవుపాలు గురుత్వమును కఫమునుచేయును. లేతదూడగలదియు, దూడలేనిదియునగు ఆవుపాలు త్రిదోషములను చేయును. చిరకాలమున కీనిన గోవుపాలు త్రిదోషముల హరింపజేయును. తృప్తిని బలమును ఇచ్చును. తెలికపిండి, పుల్లనీళ్లఅన్నము తినిన ఆవుపాలు గురుత్వమును కఫమును చేయును, నిద్రను రేతస్సును, బలమును, స్థౌల్యమును, అగ్నిమాంద్యమును కలుగజేయును, చలువగనుండును. మాంసమును గడ్డిని తినిన ఆవుపాలు సర్వరోగములయందు హితకరము. తొలియీతగల ఆవుపాలు మధురముగ నుండును. ముదిమినిపోగొట్టును, త్రిదోషములహరించును. ముసలియావుపాలు బలహీనమునుచేయును. మూఁడు నెలలు కడచిన గర్భముగల యావుపాలు పిత్తరోగమును శోషను పుట్టించును. ఉప్పగనుండును. అప్పుడు ధారగా పితకఁబడుచున్న పాలు ధారోష్ణమనఁబడును. అది వీర్యపుష్టిని, సప్తధాతువుల వృద్ధిని, నిద్రను, కాంతినిచేయును. స్నిగ్ధముగ పథ్యకరముగ రుచిగనుండును. అగ్నిదీపనమును చేయును సమస్తరోగములబోగొట్టును, ౧। జాముకుపైనఁ బుచ్చుకొనిన త్రిదోషములఁ బుట్టించును.

## బఱ్ఱెపాల గుణము.

శ్లో. మహిష్యా మధురం దుగ్ధం పాకే శీతం చ పౌష్టికం ।
స్నిగ్ధం నిద్రాకరం బల్యం గురు వృష్యం చ శుక్రలం ।
పిత్తదాహశ్రమఘ్నం చ కఫాలస్యరుచిప్రదం ।
అభిష్యంది చ సంప్రోక్త మగ్నిమాంద్యకరం మతం ॥

తా. బఱ్ఱెపాలు మధురముగ, పాకకాలమున శైత్యము చేయునదిగనుండును. పుష్టిని మెఱుగును నిద్రను బలమును గురుత్వమును, ధాతువృద్ధిని శుక్రవృద్ధిని చేయును. పిత్తము - దాహము - శ్రమము-వీనిని హరించును. కఫమును ఆలస్యమును రుచిని అగ్నిమాంద్యమును చేయును.

## క్షీరపాననిషేధకాలము.

శ్లో. నవజ్వరే చాగ్నిమాంద్యే కుష్ఠే చైవామదోషకే ।
ప్రశస్తం న పయఃపానం కృమిరోగే విశేషతః ॥

తా. నూతనజ్వరము, అగ్నిమాంద్యము, ఆమదోషము, వీనియందును, విశేషముగ క్రిమిరోగమునందును, పాలుత్రాగగూడదు.

## ద్రవ్యసంయుక్తక్షీరగుణము.

శ్లో. శర్కరాసహితం క్షీరం రుచికృ ద్వాతనాశనం ।
తథాసితోపలాయుక్తం శుక్రదం దోషనాశకం ।
సగుడం మూత్రకృచ్ఛ్రఘ్నం పిత్తశ్లేష్మకరం మతం ॥

తా. పాలలో చక్కెరగలిపి పుచ్చుకొనిన రుచినిగలిగించును, వాతమునుహరించును. కలకండ చేర్చిన శుక్రవృద్ధిగలిగి త్రిదోషములు నశించును. బెల్లమునుజేర్చిన మూత్రకృచ్ఛ్ర రోగముపోవును, పిత్తశ్లేష్మములు ప్రకోపించును.

శ్లో. పక్వ మామ్రం సుమధురం గోస్తనీ మాక్షికం ఘృతం ।
నవనీతం శృంగబేరం శ్యామా చ శ్యామభూషణం ॥
సితా శివా చ పృథుకా పటోలం నాగరా శివాః ।
క్షీరేణ సహ సంసేవ్యా హితా స్స్యు స్సేవితా ఇమే ॥

తా. తియ్యమామిడిపండు-ద్రాక్షపండు-తేనె-నెయ్యి-వెన్న-అల్లము-పిప్పళ్లు మిరియాలు-చక్కెర-కరక్కాయ- అటుకులు - పొట్లకాయ-సొంటి. నెల్లికాయ- ఈ పదార్థములతో పాలను త్రాగిన హితముగనుండును.



శ్లో. మత్స్యమాంస పటుముద్గమూలకై ఃకుష్ఠమావహతి సేవితంపయః।
శాక జాంబవ సురాదికై స్తథా మారయ త్యబుధ మాశు సర్పవత్ ॥
నైకథ్యం పయసా శ్నీయా త్సర్వ ముష్ణం ద్రవాద్రవం ।
తైలం కపిత్థం జంబీరం పనసం మాతులుంగకం ।
వాంశం కరీరం బదరం కద ల్యామ్లం చ దాడిమం
ఫల మీదృగ్విధం చాన్యం తద్వ ద్బిల్వఫలాని చ ।
జనః క్షీరవిరుద్ధాని భుంజీయా చ్చేద్ధితత్సహ ।
బాధిర్యం మూకతాం చైవ వైరూప్యం చాగ్నిమందతాం ।
మరణం చా ప్యవాప్నోతి తస్మా త్తత్పరివర్జయేత్ ॥

తా. మత్స్యమాంసము, ఉప్పు, పెసలు, ముల్లంగి, వీనినిచేర్చి పాలనుత్రాగిన కుష్ఠరోగముగలుగును. వంకాయలు మొదలగు పదార్థములతోడను, నేరేడుపండు-మద్యము-వీనితోడను పాలను త్రాగినయెడల సర్పమువలె మృత్యుతుల్యముగనుండును. అన్నివిధములగు ద్రవపదార్థములు - గట్టిపదార్థములు - ఉష్ణపదార్థములు వీనితోఁగూడ పాలను త్రాగగూడదు - నూనె- వెలగ-పనస - నిమ్మ-మాదీఫలము - వెదురుమొలకలు-రేగు-అరటి-పుల్లదానిమ్మ-మారేడు ఈపండ్లు పాలకు విరుద్ధపదార్థములు వీనిని పాలతోఁగూడ.భక్షించిన చెవుడు-మూగతనము-కురూపము - అగ్నిమాంద్యము కలుగును. విశేషముగభక్షించిన మృత్యుతుల్యముగ నుండును.

శ్లో. క్షీరం న భుంజీత కదా ప్యతప్తం తప్తం చ నైత ల్లవణేన సార్థం।
పిష్టం న సంధానకషాయముద్గకోశాతకీ కందఫలాదికైశ్చ ॥

తా. పాలను కాచకుండా ఎప్పుడును త్రాగగూడదు. కాచినపాలను ఉప్పువేసిత్రాగగూడదు ఉప్పువేసిచేయబడిన పిండిపదార్థములు - ఊరుగాయలు - వగరు పదార్థములు-పెసలు బీరకాయ - కంద-పండ్లు-వీనితోడ పాలను త్రాగగూడదు.

## భోజనానంతరక్రియ.

శ్లో. ఆచమ్య జలయుక్తాభ్యాం పాణిభ్యాం చక్షుషీ స్పృశేత్ ।
భుక్త్వా పాణితలే ఘృష్ట్వా చక్షుషో ర్యది దీయతే ।
అచిరేణైవ తద్వారి తిమిరాణి వ్యపోహతి ॥

తా. ఇట్లు భుజించిన వెనుక లేచి ఆచమనముచేసి హస్తపాదములశోధించికొని తడిచేతులతోఁ గన్నులఁదుడుచుకొనవలయును; దానివలన నేత్రములయందలి తిమిరోగములు హరించును.

శ్లో. అగస్తిం కుంభకర్ణం చ శమ్యంచబడబానలం ।
ఆహారపాచనార్థాయ స్మరే ద్భీమం చ పంచమం ॥
ఇత్యుచ్చార్య స్వహస్తేన పరిమార్జ్య తథోదరం ।
అనాయాసప్రదాయీని కుర్యా త్కర్మా ణ్యతంద్రితః ॥

తా. భోజనముచేసినపిదప "అగస్తింకుంభకర్ణంచ" అనుశ్లోకమునందుఁజెప్పఁబడిన యగస్త్యాదులను ధ్యానించి యుదరమునుజేతదడవికొని, ఆయాసకరకార్యముల జేయకయు వెంటనేనిద్రింపకయు నుండవలయు.

శ్లో. భుక్త్వా శతపదీంగచ్ఛే చ్ఛనై స్తేన తు జాయతే ।
అన్నసంఘాతశైథిల్యం గ్రీవాజానుకటీసుఖం ।
భుక్త్వోపవిశత స్తుందం శయానస్య తు పుష్టతా ।
ఆయు శ్చంక్రమమాణస్య మృత్యు ర్ధావతిధావతః ॥

తా. భోజనముచేసినపిమ్మట, నూఱడుగులు మెల్లగనడచిన, అన్నము స్వస్థానమునఁజేరుటచే-మెడ, మోకాళ్లు, కటిప్రదేశము, వీనియందు సౌఖ్యముగలుగును, భుజించినతోడనే కూర్చుండిన కడుపు పెద్దదియగును. పండుకొనిన మేదస్సధికంబై పుష్టి కలుగును. మెల్లగ తిరిగినయెడల ఆయువువృద్ధియగును. పరుగెత్తిన ఆయువుక్షీణించును.

శ్లో. భుక్త్వోపస్థాయమార్తాండం పురాణాని సదాపఠేత్ ।
భావశుద్ధ్యాహరౌభక్తిః పురాణశ్రవణాద్భవేత్ ।
ఇతిహాసపురాణాని ధర్మశాస్త్రాణిచాభ్యసేత్ ।
వృథావివిధవాక్యాని పరివాదాంశ్చవర్జయేత్ ॥

తా. భుజించిలేచి సూర్యునిసేవించి వ్యర్థవాదములవదలి, హరిభక్తిగలుగుటకై, భావశుద్ధికై, ఇతిహాసపురాణ ధర్మశాస్త్రాదులఁ బఠించవలయు.

సుగంధలేపనము.

శ్లో. కుంకుమంచందనంచాపి కృష్ణాగరువిమిశ్రితం ।
ఉష్ణంవాతకఫధ్వంసి శీతకాలేతదిష్యతే ।
చందనంఘనసారేణ వాలకేనచమిశ్రితం ।
సుగంధిపరమంశీత ముష్ణకాలేప్రశస్యతే ।
చందనంఘుసృణోపేతం మృగనాభిసమాయుతం ।
నచోష్ణంనచవాశీతం వర్షాకాలేతదిష్యతే ।
గంధేనోద్వర్తనంచాదౌ తతోలేపం ప్రకారయేత్ ।



అనులేపస్తృషామూర్ఛా దుర్గంధశ్రమదాహజిత్ ।
సౌభాగ్యతేజస్త్వగ్వర్ణ ప్రీత్యోజోబలవర్ధనః ।
స్నానానర్హమనుష్యాణా మనులేపోఽపి నోహితః ॥

తా. శీతకాలమున చందనమును కుంకుమపువ్వు, కృష్ణాగరు వీనితోఁజేర్చి మేనఁబూసికొనిన ఉష్ణవాతకఫముల నశింపఁజేయును. ఎండకాలమునందు పచ్చకర్పూరము కురువేరుపొడి వీనిని చందనములోఁగలిపిపూసికొనిన దేహమునకు చలువ కలుగును. వర్షాకాలమునందు కుంకుమపువ్వు కస్తూరి వీనితోఁజేర్చిన చందనమును పూసికొనిన ఉష్ణము - శైత్యములేక హితముగనుండును-గంధముచేముందుగనలుగిడి పిదప పలచనగబూసికొనవలయును. దీనివలన, దప్పి, మూర్ఛ, దుర్గంధము, శ్రమము, తాపము, ఇవిపోవును. సౌభాగ్యము, తేజస్సు, కాంతి, ప్రీతి, అంతస్సారము బలము ఇవికలుగును - స్నానముసేయదగని మనుష్యులకు చందనానులేపనంబును దగదు.

పుష్పధారణము.

శ్లో. సుపుష్పాణిసుగంధీని నిత్యంశ్రేష్ఠప్రధారయేత్ ।
సుగంధిపుష్ప పత్రాణాం ధారణంకాంతికారకం ।
క్లేశాయాస సముద్భూత స్వేదదుర్గంధనాశనం ।
చక్షుష్యందాహశమనం సౌమనస్యంచజాయతే ॥
అస్నాతైర్మల్లికాధార్యా సుస్నాతై ర్జాతిబిల్వజం ।
అభ్యంగే కేతకీ ధార్యా ధార్యం చోత్పలకంసదా ॥

తా. మనుష్యుఁడు మంచిపరిమళముగల జాజి, పాదిరి, పొగడ, మల్లె, మందారము మొదలగు పుష్పములను, మరువము మొదలగు పరిమళపత్రములను నిత్యము ధరించుకొనవలయును. పుష్పాదిధారణము, కాంతినిచ్చును, దుఃఖ ఆయాసములవలనఁ గలిగినచెమటను, దుర్గంధమును, తాపమునుహరించును. నేత్రములకు మేలుచేయును, మనస్సుకు నిర్మలత్వమును గలుగజేయును. స్నానముచేయనివారు మల్లెపుష్పమును, స్నానము చేసినవారు, జాజి, మారేడుపుష్పములను, అభ్యంగముచేసికొనినవారు మొగలి పూవును, ఎల్లప్పుడు కలువపుష్పములను ధరించవలయు.

భూషణధారణగుణము.

శ్లో. భూషణైర్భూషయేదంగం యథావిభవసారతః ।
శుచిసౌభాగ్య సంతోషదాయకం కాంచనంస్మృతం ॥

తా. ఐశ్వర్యముకొలఁది భూషణములచే శరీరమునలంకరించుకొనవలయు, బంగారు, శుచిత్వమును సౌభాగ్యమును సంతోషము నిచ్చును.

తాంబూలగుణము.

శ్లో. కామంప్రదీపయతి రూపమభివ్యనక్తి
సౌభాగ్యమావహతి వక్త్రి సుగంధితాంచ ।
ఊర్జంకరోతి కఫజాంశ్చ నిహంతి రోగాం
స్తాంబూలమేవమపరాంశ్చగుణాన్ కరోతి ॥

తా. తాంబూలము కామాగ్నిని ప్రకాశింపఁజేయును, రూపమును స్పష్టము చేయును. సౌభాగ్యమును, నోటికిబరిమళమును ఉత్సాహమును గలిగించును. కఫజరోగముల బోగొట్టును. ఇంకను కొన్నిగుణములనుకూడ కలుగజేయును.

శ్లో. చంద్రం చంద్రనిభాననే! చ ఖదిరం త్వక్పత్రమేలా సుధా
జాతీపత్ర్యయి! పత్రయుక్తవదనే! కంకోలజాతీఫలం ।
కస్తూరీచలవంగ మేణనయనే! బాహ్లీకపూగీఫలం
ద్రవ్యైరేభిరపిత్రయోదశమితైస్తాంబూలమిత్యుచ్యతే ॥

తా. పచ్చకర్పూరము, కాచు, తమలపాకు, లవంగపుచెక్క, ఏలకులు, సున్నము, జాపత్రి, కంకోలము, జాజికాయ, కస్తూరి. లవంగము. కుంకుమపువ్వు, పోక ఈ ౧౩ పదార్థములుచేరి తాంబూలమనబడును.

శ్లో. తాంబూలం కటుతిక్త ముష్ణ మధురం క్షారం కషాయం సరం
రుచ్యం వీర్యకరం లఘు ప్రియతమే వైశద్యసౌగంధ్యకృత్ ।
ఆస్యస్యాభరణం ప్రసేకశమనం దౌర్గంధ్యహృచ్ఛుద్ధికృ
జ్జంతుశ్లేష్మ మరుద్గలామయహరం కాంతిప్రదం వశ్యకృత్ ॥
వృష్యం దంతవిరంజనం శ్రమహరం సౌభాగ్యదం కీర్తితం
జిహ్వాజాడ్యగదాపహం మునివరైర్నక్షత్రగుణ్యం మతం ॥

తా. తాంబూలము కారముగ, చేదుగ, ఉష్ణముగ, మధురముగ, క్షారముగ, వగరుగ, రుచిగ, వీర్యకారిగ, లఘువుగనుండును, నిర్మలత్వమును సౌభాగ్యమును ఇచ్చును. ముఖమునకలంకారముగనుండును. నోటనీళ్లూరుటను, దుర్గంధమును పోగొట్టును. హృదయమును శుద్ధిచేయును. జంతువులను, శ్లేష్మమును, వాతమును, కాంతిని వశ్యమునుచేయును, శ్రమమునుపోగొట్టును. సౌభాగ్యమునిచ్చును, నాలుకయందలిరోగములహరించును. ఇట్లు తాంబూలము ౨౭ గుణములు గలిగియుండును.

శ్లో. ఏకపూగం సుఖారోగ్యం ద్విపూగం నిష్ఫలంభవేత్ ।
అతిశ్రేష్ఠం త్రిపూగం తు అధికం నైవ దూష్యతే ॥



తా. ఒకవక్క సుఖారోగ్యములనిచ్చును. రెండువక్కలు దారిద్ర్యమునుగలిగించును. మూఁడువక్కలు మిగుల శ్రేష్ఠము, అరవక్క దూష్యము కానేరదు.

శ్లో. పర్ణమూలే భవే ద్వ్యాధిః పర్ణాగ్రే పాపసంభవః ।
చూర్ణపర్ణం హర త్యాయు స్సిరా బుద్ధివినాశినీ ।
తస్మా దగ్రం చ మూలం చ సిరాం చైవ విశేషతః ।
చూర్ణపర్ణం వర్జయిత్వా తాంబూలం ఖాదయే న్నరః ॥

తా. తమలపాకు మొదలువలన వ్యాధియు, కొనవలన పాపమును, సున్నపుఆకువలన ఆయుఃక్షీణమును, నరములవలన బుద్ధినాశమును గలుగును కావున, ఆకుకొన, మొదలు, నరములు, సున్నపాకు వీనిని వర్జించి తాంబూలమును భక్షించవలయు.

శ్లో. అనిధాయ ముఖే పర్ణం పూగం ఖాదతి యో నరః ।
సప్తజన్మ దరిద్ర స్స్యా న్నరకేషు నిమజ్జతి ॥

తా. ముందుగ నోటియందు ఆకువేసికొనక వక్కనునమలిన ఏడుజన్మముల వరకు దారిద్ర్యముననుభవించి, తుదిని నరకమునఁబడును.

శ్లో. ప్రాతఃకాలే ఫలాధిక్యం చూర్ణం మధ్యందినేఽధికం ।
సాయంపర్ణస్యచాధిక్యం త్రిధా తాంబూలభక్షణం ॥

తా. ప్రాతఃకాలమున వక్కలధికముగను, మధ్యాహ్నమున సున్నమధికముగను, సాయంకాలమున ఆకులధికముగను వేసికొనవలయును.

శ్లో. రతౌ సుప్తోత్థితే స్నాతే భుక్తే వాంతే చ సంగరే ।
సభాయాం విదుషాం రాజ్ఞాం కుర్యా త్తాంబూలచర్వణం ॥

తా. స్త్రీసంభోగసమయమందును, నిద్రలేచినపుడును, స్నానము, భోజనము జేసినపిదపను, వాంతిచేసికొనినప్పుడును, యుద్ధమునందును, పండితరాజసభలయందును, తాంబూలచర్వణము చేయఁదగినది.

శ్లో. తాంబూలం నాతిసేవేత న విరిక్తో బుభుక్షితః ।
దేహదృక్కేశదంతాగ్ని శ్రోత్రవర్ణ బలక్షయః ।
శోషః పిత్తానిలాస్రం స్యా దతితాంబూలభక్షణాత్ ॥

తా. తాంబూలమును పలుమారు భక్షింపఁగూడదు. విరేచనముచేసికొనినవాఁడును ఆఁకలిగొనినవాఁడును విశేషముగా తాంబూలమును భక్షింపఁగూడదు. భక్షించిన - దేహము, నేత్రములు, వెండ్రుకలు, దంతములు, అగ్ని, చెవులు, వీని వర్ణము బలము నశించు. శోష, పిత్తము, వాతరక్తము ఈరోగములును కలుగును.

శయనక్రమము.

శ్లో. శ్వాసా నష్టౌ సముత్తాన స్త్వాక్ ద్విః పార్శ్వే తు దక్షిణే ।
తత స్తు ద్విగుణా న్వామే పశ్చా చ్ఛస్వప్యా ద్యథాసుఖం ॥

తా. వెల్లగిలపరుండి ౮ శ్వాసములను, కుడిప్రక్కనతిరిగి ౧౬ శ్వాసములను, ఎడమప్రక్కనతిరిగి ౩౨ శ్వాసములను విడిచి పిదప స్వేచ్ఛానుసారముగఁబరుండవలయు.

వామపార్శ్వశయనము.

శ్లో. వామదిశాయా మనలో నాభేరూర్ధ్వేఽస్తి జంతూనాం ।
తస్మాత్తు వామపార్శ్వే శయీత భుక్తప్రపాకార్థం ॥

తా. ప్రాణులకు నాభికిపైగా - ఎడమప్రక్కనజాఠరాగ్నియుండును గావున భుజించినయన్నము జీర్ణించుటకై ఎడమప్రక్కన బరుండవలయు.

ఖట్వాదికగుణము.

శ్లో. త్రిదోషశమనీ ఖట్వా తూలీ వాతకఫాపహా ।
భూశయ్యా బృంహణీ వృష్యా కాష్ఠపట్టీ తు వాతలా ॥

తా. మంచముమీఁద శయనించిన వాతపిత్తశ్లేష్మప్రకోపము శమించును. దూదిమెత్త, వాత కఫములబోగొట్టును. భూశయ్య బలుపును ధాతువృద్ధినీ ఇచ్చును. కొయ్యపలకలమీఁద బరుండిన వాతమును జేయును.

పాదసంవాహనగుణము.

శ్లో. సంవాహనం మాంసరక్తత్వక్ప్రసాదకరం పరం ।
ప్రీతినిద్రాకరం వృష్యం కఫవాతశ్రమాపహం ॥

తా. కాళ్లుపిసికించుకొనిన, మాంసము, రక్తము, చర్మము ఇవి నిర్మలత్వము నొందును. ప్రీతిని నిద్రను ధాతువృద్ధినికలిగించును. కఫము వాతము శ్రమము వీనిని పోగొట్టును.

శ్లో. ప్రవాతం రౌక్ష్యవైవర్ణ్య స్తంభకృ ద్దాహపిత్తనుత్
స్వేదమూర్ఛాపిపాసాఘ్న మప్రవాత మతోఽన్యథా ॥

తా. శయనించినపిమ్మట గాలిసోకుటవలన రూక్షవైవర్ణ్యము స్తంభనము వీనినికలుగజేయును. తాపము, పిత్తము, చెమట, మూర్ఛ, దప్పి వీనినిపోగొట్టును. గాలి లేనియెడల పైదానికి విపరీతగుణములు గలుగును.

శ్లో. సుఖంప్రవాతం సేవేత గ్రీష్మే శరది చాంతరా ।
నిర్వాత మాయుషే సేవ్య మారోగ్యాయ చ సర్వథా ॥



తా. గ్రీష్మశరత్కాలములయందు శరీరమునకు హితమైన గాలిని సేవింపవలయు. ఆయుష్యమును ఆరోగ్యమును గోరువాఁడు, ఎక్కువగాలి, గాలిలేమి లేక మితమైనగాలిగలచోటఁ బరుండవలయు.

పగటినిద్రకు నిషేధము.

శ్లో. దివాస్వాపం న కుర్వీత యతోఽసౌ స్యాత్కఫావహః ।
గ్రీష్మవర్జ్యేషు కాలేషు దివాస్వాపో నిషిధ్యతే ॥

తా. పగటినిద్రవలన కఫమువృద్ధిజెందును, గ్రీష్మకాలమునందు దప్ప తక్కిన కాలములయందు పగలు నిద్రించకూడదు.

పగటినిద్రకు ఆజ్ఞ.

శ్లో. ఉచితో హి దివాస్వాపో నిత్యం యేషాం శరీరిణాం ।
వాతాదయః ప్రకుప్యంతి తేషా మస్వపతాం దివా ॥
వ్యాయామప్రమదాధ్వవాహనరతాన్ క్లాంతానతీసారిణ,
శ్శూలశ్వాసవత స్తథా పరిగతాన్ హిక్కా మరుత్పీడితాన్ ।
క్షీణాన్ క్షీణకఫాన్ శిశూన్ మదహతాన్ వృద్ధాం స్తథా జీర్ణినో,
రాత్రౌ జాగరితా న్నరా న్నిరశనాన్ కామం దివా స్వాపయేత్ ॥

తా. పగలునిద్రించుటకర్హులైనవారు పగలునిద్రించనియెడల వాతాదులు ప్రకోపించును. సంచారము, స్త్రీసేవ, మార్గమునడుచుట, అశ్వాద్యారోహణము ఇవి కలవారును, బడలిక, అతిసారము, శూల, శ్వాసము, వెక్కిళ్లు, వాతము, వీనిచేబీడితులైనవారును, క్షీణులు, క్షీణించిన కఫముగలవారును, బిడ్డలును, మదకరపదార్థముల భక్షించినవారును, వృద్ధులు, అజీర్ణరోగులును, రాత్రిమేల్కొనినవారును, ఉపవాసమున్నవారును, వీరందఱు యథేష్టముగ పగలు నిద్రింపవచ్చును,

భోజనానంతరనిద్రాగుణము.

శ్లో. భోజనానంతరం నిద్రా వాతం హరతి పిత్తకృత్ ।
కఫం కరోతి వపుషః పుష్టిం సౌఖ్యం తనోతి హి ॥

తా. భుజించినపిదప నిద్రించిన వాతముహరించి పిత్తము కఫము వృద్ధియగును. పుష్టి సౌఖ్యము కలుగును.

అజీర్ణహరణోపాయము.

శ్లో. ప్రాతరాశే త్వజీర్ణేఽపి సాయమాశో న దుష్యతి ।
సాయమాశే హ్యజీర్ణే చ ప్రాతర్భుక్తం విషోపమం ॥

తా. ప్రాతఃకాలమున భుజించినయన్నము, జీర్ణింపకుండిన సాయంకాలమున భుజించినను దోషముగలుగదు. రాత్రిభుజించిన యన్నము జీర్ణించనపుడు, ఉదయమున భక్షించిన విషతుల్యమగును.

శ్లో. భవే ద్యది ప్రాత రజీర్ణశంకా తదాభయా నాగరసైంధవాభ్యాం।
విచూర్ణితాం శీతజలేన భుక్త్వా భజే త్తతోన్నం మిత మన్నకాలే॥

తా. రాత్రిభుజించినయన్నము జీర్ణించనియెడల కరక్కాయ, సొంటి, సైంధవలవణము వీనిని చూర్ణముచేసి చన్నీళ్ళతోబుచ్చుకొని, యథాకాలమున మితముగ భుజించవలయు.

## భోజనానంతరవర్జ్యకార్యములు.

శ్లో. అగ్న్యాతప ప్లవన యాన నిషేవణైశ్చ
వ్యాయామ మైథున విధావన యుద్ధ గీతైః।
ఏభి శ్చ తత్క్షణకృతై ర్విషమాశనా చ్చ
హ్యన్నం నపాక ముపయాత్యపి జాగరా చ్చ॥

తా. భుజించినపిదప అగ్నిసేవనము – ఎండలో తిరుగుట, ఈదుట, మార్గమున నడుచుట, దండకసరతు, మైథునము, పరుగెత్తుట, యుద్ధము, గానము, అన్యపదార్థముల మిక్కుటముగ భుజించుట మేలుకొనుట ఈపనులవలన అన్నము జీర్ణింపదుగావున భుజించినతరువాత రెండుగడియల కాలమువరకు పైజెప్పినపనులఁ జేయఁగూడదు.

## దివాస్వాప మైథున నిషేధము.

అత్రిః — దివాస్వాపం న కుర్వీత గచ్ఛే న్నైవ దివా స్త్రియం।
ఆయుఃక్షయకరీ నిద్రా దివాస్త్రీ పుణ్యనాశినీ॥

తా, పగటియందునిద్ర-స్త్రీసంభోగముకూడదు. నిద్రవలన ఆయుఃక్షయమును స్త్రీసంభోగమువలన పుణ్యనాశమును గలుగును.

## ఉష్ణీషధారణగుణము.

శ్లో. ఉష్ణీషం కాంతికృ త్కేశ్యం గజోవాతకఫాపహం।
లఘు త చ్ఛస్యతే యస్మా ద్గురుపిత్తాక్షిరోగకృత్॥

తా. తేలికయైనతలపాగాను ధరించుటవలన కాంతి, వెండ్రుకలకు మేలు కలుగును. ధూళితొలఁగును. వాతము కఫము హరించును. బరువుగనుండు పాగా, పిత్తమును నేత్రరోగమును గలుగజేయును.



## పాదరక్షధారణగుణము.

శ్లో. ఉపానద్ధారణం నేత్ర్య మాయుష్యం పాదరోగహృత్॥
సుఖప్రచార మోజస్యం వృష్యం చ పరికీర్తితం॥
పాదాభ్యా మనుపానద్భ్యాం సదా చంక్రమణం నృణాం।
అనారోగ్య మనాయుష్య మింద్రియఘ్న మదృష్టిదం॥

తా. పాదరక్షలను ధరించుటవలన నేత్రములకు మేలు, ఆయుష్యముగలుగును పాదరోగములుపోవును. గమన సౌఖ్యము బలము ధాతువృద్ధి గలుగును. పాదరక్షలు లేక తిరిగినయెడల శరీరమునకు వ్యాధి, ఆయుః క్షీణము, ఇంద్రియనాశము, దృష్టినాశము కలుగును.

## ఛత్రధారణగుణము.

శ్లో. ఛత్రస్యధారణం వర్షాతపవాతరజోపహం।
హిమఘ్నం హిత మక్ష్ణో శ్చ మాంగల్య మపి కీర్తితం॥

తా. గొడుగును ధరించుటవలన వర్షము, ఎండ, గాలి, దుమ్ము, మంచు వీని బాధలేక నేత్రములకు మేలుగలుగును. మంగళప్రదముగ నుండును.

## దండధారణగుణము.

శ్లో. సత్త్వోత్సాహబలస్థైర్య ధైర్యవీర్యవివర్ధనం।
అవష్టంభకరంచాపి భయఘ్నం దండధారణం॥
విశ్వామిత్రాహిపశ్వాదీ న్వారయ త్యప్సు కర్దమే।
అంధేతమసి వార్ధక్యే దండం దశగుణం భవేత్॥

తా. దండమును ధరించుటవలన సత్త్వము, ఉత్సాహము, బలము, స్థిరత్వము ధైర్యము, వీర్యము ఇవివృద్ధియగును. పూనికగలుగును. భయము తొలఁగును. మఱియు, దండముచేత పక్షులు, కుక్కలు, శత్రువులు, సర్పములు, పశ్వాదులు నివారింపఁబడును. ఉదకమునందు లోఁతు తెలియును. బురదయందు పూనికనిచ్చును. గ్రుడ్డితనమునందును చీఁకటియందును, ముసలితనమునందును ఉపయోగించును; కావున దండము పదిగుణములు గలిగియుండును.

## గజారోహణగుణము.

శ్లో. పిత్తానిలకరో హస్తీ లక్ష్మ్యాయుఃపుష్టివర్ధనః।

తా. ఏనుఁగునెక్కిన వాతపిత్తములు వృద్ధిబొందును. సంపద ఆయుష్యము, పుష్టియుఁ గలుగును.

అశ్వారోహణగుణము.

శ్లో. ఘోటకారోహణం వాత పిత్తాగ్నిశ్రమకృత్స్మృతం ।
మేదోవర్ణకఫఘ్నం చ హితం తద్బలినాంవరం ॥

తా. గుఱ్ఱమునెక్కిన వాతపిత్తప్రకోపము, అగ్నిదీపనము, శ్రమ ఇవి కలుగును, మేదస్సు. వర్ణము, కఫము ఇవి హరించును. బలవంతులకు హితకరముగ నుండును.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం
దినచర్యాకథనం నామ
ద్వితీయోధ్యాయః.

---

తృతీయాధ్యాయము.

# రాత్రిచర్య.

సంధ్యాకాలవర్జనీయ కృత్యములు.

శ్లో. ఏతాని పంచకర్మాణి సంధ్యాయాం వర్జయే ద్బుధః ।
ఆహారం మైథునం నిద్రాం సంపాఠం గతి మధ్వని ॥
భోజనా జ్జాయతే వ్యాధి ర్మైథునా ద్గర్భవైకృతిః ।
నిద్రాయాం నిస్వతా పాఠా దాయుర్హాని ర్గతే ర్భయం ॥

తా. సాయంకాలమునందు భోజనము, మైథునము, నిద్ర, చదువుట, త్రోవన డచుట. అను నైదుకర్మలను బుద్ధిమంతుఁడగువాఁడు వర్జింపవలయు – భోజనమువలన వ్యాధియు, మైథునమువలన గర్భమునకు వికారమును నిద్రవలన దారిద్ర్యమును, చదువుటవలన ఆయుఃక్షీణమును, గమనమువలన భయమును గలుగును.

వెన్నెలగుణము.

శ్లో. జ్యోత్స్నా శీతా స్మరానందప్రదా తృట్పిత్తదాహహృత్ ।

తా. వెన్నెల చల్లదనమును, కామోద్రేకమును. ఆనందమును కలుగజేయును. దప్పి, పిత్తము, తాపము వీనిని పోగొట్టును.

మంచుగుణము.

శ్లో. తతో హీనగుణః కుర్యా దవశ్యాయోఽనిలం కఫం ॥



తా. మంచు వెన్నెలకంటె తక్కువగుణము గలిగియుండును – వాతమును కఫమును చేయును.

చీఁకటిగుణము.

శ్లో. తమో భయావహం మోహా ద్దిఙ్మోహజనకం భవేత్ ।
పిత్తహృ త్కఫకృ త్కామసంవర్ధనం క్లమకృ చ్చ తత్ ॥

తా. చీఁకటి భయమును దిగ్భ్రమమును కలుగజేయును. పిత్తమును హరించును కఫమును చేయును, కామమును వృద్ధిజేయును, శ్రమమును గలిగించును.

రాత్రిభోజనవిధి

శ్లో. రాత్రౌ చ భోజనం కుర్యా త్ప్రథమప్రహరాంతరే ।
కించిదూనం సమశ్నీయా ద్దుర్జరం తత్ర వర్జయేత్ ॥

తా. రాత్రియం దొకజాములోపల దుర్జరపదార్థముల వదలి యించుకతక్కువగా భుజించవలయు.

స్వాపవిధి.

శ్లో. శుచిదేశం వివిక్తం తు గోమయే నోపలేపయేత్ ।
వైదికై ర్గారుడై ర్మంత్రై రభిమంత్ర్య స్వపే త్తతః ।
మాంగల్యం పూర్ణకుంభం చ శిరస్స్థానే నిధాపయేత్ ।
ఉపానహౌ వేణుదండ మంబుపాత్రం తథైవచ ।
తాంబూలాదీని రమ్యాణి సమీపే స్థాపయే ద్గృహీ ॥
ప్రాచ్యాం వా దక్షిణాయాం వా శిరః కృత్వా స్వపే ద్గృహీ ॥

తా. పడకటింటికిసమీపమున జనములేని శుచిప్రదేశమున, గోమయముచే నలికి, వేదోక్తగారుడమంత్రములచే నభిమంత్రించి, యచ్చట శిరస్సుపైపున మంగళకరములగు పుష్పాదివస్తువులను, జలపూర్ణకుంభమును, శయ్యకుసమీపమున పాదరక్షలు, వెదురుకఱ్ఱ, ఉదకపాత్రము వీనిని, తనదగ్గర తాంబూలాదులను ఉనిచికొని, తూర్పుగా, లేక, దక్షిణముగా శిరస్సునునిచికొని నిద్రింపవలయు.

శ్లో. స్వగృహే ప్రాక్ఛిరా స్స్వతే శ్వాశుర్యే దక్షిణాశిరాః ।
ప్రత్యక్ఛిరాః ప్రవాసే తు న కదాచి దుదక్ఛిరాః ॥

తా. స్వగృహంబున తూర్పుశిరస్సుగను, మామగారియింట దక్షిణశిరంబుగను, అన్యదేశయాత్రయందు పడమర శిరస్సుగను, శయనించవలయు. ఉత్తరదిక్కు శిరస్సుగ ఎప్పుడును శయనించగూడదు.

శ్లో. పూర్వరాత్రే వ్యతీతే తు స గచ్ఛే ద్రతిమందిరం ।
పాదప్రక్షాళయే త్పూర్వం పశ్చా చ్ఛయ్యాం సమావిశేత్ ॥

తా. పూర్వరాత్రిని సల్లాపాదులచేఁ గడపి, పరరాత్రియందు పాదప్రక్షాళనము చేసికొని, రతిమందిరము జేరి శయ్యమీఁదఁ బరుండవలయును.

### శయ్యాలక్షణము.

శ్లో. చతురశీతిపర్వాణి దైర్ఘ్యేణ పరికల్పయేత్ ।
షష్ట్యంగుళాని విస్తారం మంచకం హస్తసమ్మితం ॥

తా. ౮౪ అంగుళములపొడవు, ౬౦ అంగుళముల వెడల్పును, ఒకహస్తప్రమాణము ఉన్నతమును గలుగునట్లు మంచము నేర్పఱచవలయును.

### వ్యవాయవిధిగుణము.

శ్లో. శరీరే జాయతే నిత్యం దేహినాం సురతస్పృహా ।
అవ్యవాయా న్మేహమేదో వృద్ధి శ్శిథిలతా తనోః ॥

తా. జనులకు నిత్యము స్వభావముగ శరీరమునందు సంభోగేచ్ఛ కలఁగును, సంభోగములేనియెడల మేహము, మేదస్సువృద్ధియై శరీరమునకు శైథిల్యముగలుగును.

శ్లో. తస్మా దవశ్యం పురుషో నియత శ్చ స్త్రియం వ్రజేత్ ।
య స్తు కామకళాం జ్ఞాత్వా స్త్రీభేదాదీ న్విచక్షణః ।
సురతే తర్పయే న్నారీం తృప్తా సా న త్యజే త్పతిం ।
అత స్త్రీస్త్రీజాతిభేదాది సంగ్రహేణ త్విహోచ్యతే ॥

తా. కావున పురుషుఁడు శాస్త్రోక్తనియమముచే స్త్రీని పొందవలయును. పురుషుఁడు శృంగారశాస్త్రమునందు కుశలుఁడై, స్త్రీజాతిభేదములను, కళాస్థానములను కాలములను బాగుగ నెఱింగి సురతంబున స్వస్త్రీలను తృప్తిపరచినయెడల స్త్రీలు ప్రేమించి పతిభక్తిగలిగి పతివ్రతలైయుందురు కావున, పురుషునకుఁ దెలియదగిన స్త్రీలయొక్క జాతిభేదములు మొదలగువిషయములు సంగ్రహముగ జెప్పంబడుచున్నవి.

### సంభోగాయోగ్యపురుషులు

శ్లో. అత్యాశితో ఽధృతిః క్షుద్వా న్సవ్యథాంగః పిపాసితః ।
బాలో వృద్ధో ఽన్యరోగార్త స్త్యజే ద్రోగీ చ మైథునం ॥

తా. మిక్కిలి భుజించినవాఁడును, ధైర్యములేనివాఁడును ఆఁకలిచేఁ బీడింపఁబడినవాఁడును, శరీరమునందు బాధగలవాఁడును, దప్పిగొన్నవాఁడును, బాలుఁడును, వృద్ధుఁడును, ఇతరరోగములుగలవాఁడును, సంతతరోగియు, సంభోగమును వర్జింపవలయును.



### సంభోగయోగ్యపురుషులు.

శ్లో. స్నాత శ్చందనలిప్తాంగ స్సుగంధ స్సుమనోన్వితః ।
భుక్తవృష్య స్సువసన స్సువేష స్సమలంకృతః ॥
తాంబూలవదనః పత్న్యా మనురక్తో ఽధికస్మరః ।
పుత్రార్థీ పురుషో నారీ ముపేయా చ్ఛయనే శుభే ॥

తా. పురుషుఁడు, స్నానాదులచేఁ బరిశుద్ధుఁడై, చందనాది సుగంధిద్రవ్యములఁ బూసికొని, మంచిమనసుగలిగి, మంచివస్త్రాభరణాదులచే నలంకృతుఁడై ఇంద్రియవృద్ధికరపదార్థముల భుజించి తాంబూలచర్వణము చేసి భార్యయందు ప్రేమగలవాఁడై కామాతురుఁడై పుత్రునిగోరుచు శుభకరం బగు శయనంబున భార్యనుగూడవలయును.

---

### స్త్రీలక్షణములు.

శ్లో. పద్మినీ చిత్రిణీ చాథ శంఖినీ హస్తినీ తతః ।
క్రమా చ్చతుర్ధా నారీణాం లక్షణాని బ్రువేఽధునా ।

### పద్మినీస్త్రీలక్షణము.

శ్లో. భ్రాంతా రక్తకురంగశాబనయనా పూర్ణేందుతుల్యాననా,
పీనోత్తుంగకుచా శిరీషమృదులా స్వల్పాశనా దక్షిణా ।
ఫుల్లాంభోజసుగంధి కామసలిల వ్యావర్తినీ మానినీ,
శ్యామా కాపి సువర్ణపంకజనిభా దేవాదిపూజారతా ॥

శ్లో. ఉన్నిద్రాంబుజకోశతుల్య మదనచ్ఛత్రా మరాళస్వనా,
తన్వీ హంసవధూగతి స్సులలితం వేషం సదా బిభ్రతీ ।
మధ్యం వాపి వళిత్రయాంకిత మిదం శుక్లాంబరా కాంక్షిణీ,
సుగ్రీవా సుమనాసికేతి గదితా నార్యుత్తమా పద్మినీ ॥

### చిత్రిణీలక్షణము.

శ్లో. తన్వంగీ గజగామినీ చపలదృ క్సంగీతశిల్పాన్వితా,
నోహ్రస్వా న బృహత్తరా థ సుకృశా మధ్యా మయూరస్వనా ।
పీనశ్రోణిపయోధరా సులలితే జంఘే వహంతీ కృశే,
కామాంభో మధుగంధి దృష్టమపి సా తు వ్యోచ్ఛన్నతం వత్సలా ॥

శ్లో. కామాగార మసాంద్రలోమసహితం మధ్యే మృదుప్రాయశో,
బిభ్రతీ త్యల్లసితం చ వర్తుల మధోరస్కా_గుణాఢ్యా సదా।
భృంగశ్యామలకుంతలా చ జలజగ్రీవా ప్రభోగే రతా,
చిత్రాసక్తవతీ రతేల్పరుచిరా జ్ఞేయాంగనా చిత్రిణీ॥

శంఖినీస్త్రీలక్షణము.

శ్లో. తను రతను రపి స్యా ద్దీర్ఘ దేహాంఘ్రిమధ్యా,
హ్యరుణ కుసుమ వాసః కాంక్షిణీ కోపశీలా।
అనిభృతసిర మంగం దీర్ఘనిమ్నం వహంతీ,
స్మరగృహ మతిలోమ క్షారగంధి స్మరాంబు॥

శ్లో. సృజతి బహునఖాంకం సంప్రయోగే లఘీయ,
స్మరసలిలపృషత్కా_కించి దుత్తప్తగాత్రీ।
నలఘు బహుకచా త్తి ప్రాయశః పిత్తలా స్యా,
త్విశున మలిన చిత్తా శంఖినీ రాసభోక్తిః॥

హస్తినీస్త్రీలక్షణము.

శ్లో. స్థూలా వంగళకుంతలా చ బహుభు క్కా_క్రిరా త్రపావర్జితా,
గౌరాంగీ కుటిలాంగుళీకచరణా హ్రస్వా నమత్కంధరా।
బిభ్రత్యేవ మదాంబుగంధి రతిజం తోయం భృశం మందగా,
దుస్సాధ్యా సురతే ఒతిగద్గదరవా స్థూలోష్ఠకా హస్తినీ॥

చిత్రిణ్యాదులకు సుఖతిథులు.

శ్లో. నయన (౨) యుగ (౪) శర (౫) ర్తు (౬) బ్రధ్న (౧౨) ది (౧౦)
జ్ఞాగ (౮) సంఖ్యా, తిథయ ఇహాభవంతి ప్రీతయే చిత్రిణీనాం।
గ్రహ (౯) తిథి (౧౫) భువనాఖ్యా (౧౪) ద్వీప (౭) యుక్తాః కరి
ణ్యా, స్తదితర తిథయ (౧-౩-౧౧-౧౩) స్స్యుశ్శంఖినీనాంచతస్రః॥

చంద్రకళానిరూపణము.

శ్లో. సీమంతాద్యధరే కపోల గలకే కక్షే కుచోరస్థలే,
నాభి శ్రోణి వరాంగ జాను విషయే గుల్ఫే పదేంగుష్ఠకే।
కృష్ణా కృష్ణవియోగతో మనసిజ స్తిష్ఠే త్క్రమా ద్వ్యేషితాం,
వామాంగే ష్వథ చోర్ధ్వతో భిగమనా న్మానస్యపక్షద్వయే॥



పద్మినీసుఖతిథులు.

శ్లో. కంఠే సంశ్లిష్య గాఢం మృదుకరజచయం గండపాళ్యాం నితంబే,
కక్షౌ పార్శ్వోదరే వా విదధతి రదనైః ఖండయే ద్దంతవాసః।
ప్రేమ్ణా చుంబ న్లలాటం వపుషిచ జనయ న్రోమహర్షం నితాంతం,
సీత్కార ప్రాయవక్త్రాం ప్రతిపది నలినీం ద్రావయేతాం విదగ్ధః॥

శ్లో. సంచుంబ్యదంతవసనం జఘనే కపోలే,
పాదద్వయే స్తనయుగే చ నఖానిదత్వా।
ప్రాయః ప్రబుధ్య మదనం యుగళాఖ్యతిథ్యాం,
కామీ రమే ద్ద్వివదళాం నలినీం సహర్షామ్॥

శ్లో. గాఢాలింగనపూర్వకం కుచయుగం సంపీడ్య దంతచ్ఛదం,
దష్ట్వా చాశు రదై రథోరుఫలకే యచ్ఛన్నఖా న్యాదరాత్।
దోర్మూలే సహసా సకృచ్ఛ ఛురితం కుర్వం శ్చతుర్థ్యాం తిథా,
కామం సంప్రతిబోధ్య చంద్రకలయా కుర్యా న్నిజాం పద్మినీం॥

శ్లో. దష్ట్వా ఒధరం తదను పీడ్య కుచం విమర్ద్య,
ప్రాయేణ చూచుకయుగం పరిచుంబ్య రాగాత్।
కేశా న్సుదక్షిణకరేణ విమృశ్య మందం,
కుర్యా త్సువిహ్వలతనుం కిల పంచమీషు॥

చిత్రిణీసుఖతిథులు.

శ్లో. అధరం పరిచుంబ్య కంధరా మథ సంశ్లిష్య నఖై ర్నితంబకం।
విలిఖ న్ద్రుత మేవ చిత్రిణీం నను షష్ఠ్యాం ద్రవతాం నయే ద్బుధః॥

శ్లో. కంఠే సంపరిరభ్య బాహులతయా నాభిం లిఖ న్పాణినా,
దష్ట్వా చాపి రదచ్ఛదం సపులకం గృహ్ణ న్నురోజద్వయం।
కుర్వ న్మన్మథమందిరే కరికరక్రీడాయితం బుద్ధిమా
న్నష్టమ్యాం స్మరవారి నిర్ఝరవతీం కుర్వీత చిత్రప్రియాం॥

శ్లో. కర్ణోరు స్తన మధ్య దృష్టి మదనా గారేషు కట్యాం తథా,
కామిన్యాం నిజపాణియుగ్మకమలం కాంత స్సమాలోడయేత్।
గ్రీవాం పాణిరుహై ర్లిఖం శ్చ శనకై శ్చుంబ న్లలాటం భృశం,
కుర్యా దాశు విశిష్టమన్మథజలాం రామాం దశమ్యాం తిథౌ॥

శ్లో. గాఢం సంపరిరభ్య గండఫలకౌ చుంబన్ దశం శ్చాధరం,
కర్ణ శ్రోణి నఖ ప్రదాన రసికః కుర్వ న్నిమేషం దృశోః ।
సంకృష్యం శ్చికురాన్ విలాసకుశల స్సీత్కారయుక్తాం ప్రియాం,
ద్వాదశ్యాం త్వరయా తివిహ్వలతనూం కుర్యా త్సమాంశ్చిత్రిణీం

శంఖినీసుఖతిథులు.

శ్లో. బాహుభ్యాం పరిరభ్య గాఢ మధరం దంతై ర్దశ న్నిర్దయం,
దోర్మూలే కరపాణిజ క్షతచయం యచ్ఛన్ యథేష్టం భృశం ।
సంకుర్వంశ్చురితం కుచద్వయతటే నూనం తృతీయాస్వలం,
ముక్తానంగజలాం స్వకీయవశగాం కుర్యా స్స్మర శ్శంఖినీం ॥

శ్లో. గాఢం విమృజ్య మదనాలయ మాశు నారీం,
సంద్రావయే స్స్మరవరః కిల సప్తమీషు ।
వక్షః కపోల గళ కర్ణ ప్రదేషు యచ్ఛన్,
ప్రాయో నఖాని పరిరభ్య కృతాస్యపాణిః ॥

శ్లో. పరిరభ్య దృఢం రదచ్ఛదం సకరాఘాతరతో వరాంగకే ।
నఖరైః పరితో విదారయన్ స్వవశాం విష్ణుతిథౌ నయే త్ప్రియాం॥

శ్లో. విలిఖ న్నఖరై శ్శిరోధరా మథ గృహ్ణాం శ్చ కుచౌ ససీత్కృతం।
పరిచుంబ్య కపోల మంగనాం శ్లథయే దాశు తిథౌ మనోభువః॥

హస్తినీసుఖతిథులు.

శ్లో. మదనసదన ముచ్చై ర్మర్దయన్ పాణిమూలే,
తరళితనిజపాణి ర్దంతవాసో నిపీడ్య ।
మృదుతరకరజాగ్రై స్సంలిఖన్ పార్శ్వదేశాన్,
కరికులజసతా సా వల్లభా స్యా న్నవమ్యాం॥

శ్లో. నయనే పరిచుంబ్య కక్షయో ర్నకరాఘాతరత స్మరాలయే ।
రచయన్ కరికేళి మానయే త్స్వవశాం శంభుతిథౌ ద్విపాంగనాం ॥

శ్లో. నానా లింగనచుంబనాని రచయన్ ప్రాయేణ తీక్ష్ణైర్నఖైః,
కక్షోరస్తన మండలా స్యకరుణం సంధారయే త్కేళిషు ।



కామాగార ముచూళికాంచితకర స్సంత్యక్త రత్యంబుకాం,
దర్శే పూర్ణతిథౌ చ నిస్సహతనూం కుర్యా న్నరో హస్తినీం ॥

స్త్రీబాల్యాదివయః ప్రమాణము.

శ్లో. బాలా స్యా త్షోడశాబ్దా త్తదుపరి తరుణీ వింశతే ర్యావదూర్ధ్వం,
ప్రౌఢా స్యా త్పంచపంచాశదవధి పరతో వృద్ధతా మేతి నారీ ।
దీర్ఘా కృష్ణా చ తన్వీ చిరవిరహవతీ నిమ్నకక్షా శ్లథా స్యాత్,
స్థూలా గ్గ్యాచ ఖర్వా సతతరతి రపి వ్యూఢకక్షా ఘనా స్యాత్ ॥

బాలాదితృప్తికరోపాయము.

శ్లో. బాలా తాంబూలమాలాద్యై స్తరుణీ భూరి భూషణైః ।
సుప్రేమ్ణా రజ్యతే ప్రౌఢా వృద్ధా స్వాలాపగౌరవైః ॥

ప్రకృతిభేదలక్షణము.

శ్లో. కఫప్రకృతి రుత్తమా పిత్తలా మధ్యమా స్మృతా ।
అధమా వాతలా నారీ తల్లక్ష్మా ణ్యభిదధ్మహే ॥

కఫప్రకృతిలక్షణము.

శ్లో. సుస్నిగ్ధ దంత నఖ లోచన పద్మయుక్తా,
మానోన్నతా ప్రియతమే సుదృఢానురాగా ।
శ్యామా సశీత మృదు మాంసల గుహ్యరంధ్రా,
ప్రోక్తా కఫప్రకృతి రేవ వరా పురంధ్రీ ॥

పిత్తప్రకృతిలక్షణము.

శ్లో. స్యా త్పిత్తలా థ గౌరాంగీ శోణ లోచన పాణిజా ।
క్షణక్రోధప్రసన్నా చ పీనశ్రోణిపయోధరా ॥
బిభర్తి ఘర్మసలిలం మిశ్రగంధి సుగంధికా ।
శ్లథ కోష్ణ వరాంగీ చ కుశలా సురతే మృదుః ॥

వాతప్రకృతిలక్షణము.

శ్లో. మేధావినీ సుకుశలా వహతి రతే చ నిశ్చితం మృదుతాం ।
పవనప్రకృతిః పరుషభ్రమరా స్యా ద్బహుప్రలాపా చ ॥
దరదగ్ర ద్రుమధూసర వర్ణా బహుభోజనా చ కఠినాంగీ ।
స్ఫుటితాగ్ర వక్ర కేశీ కఠినరతా శ్యామ నఖ నయనా ॥

గోజిహ్వాగ్ర స్పర్శా కఠినవరాంగా ధమూ నారీ ।
సంకీర్ణలక్షణేన చ సంకీర్ణప్రకృతి రేవ విజ్ఞేయా ॥

దేవసత్వా స్త్రీలక్షణము.

శ్లో. ప్రసన్నవక్త్రాంబుజసౌరభాంగీ సంతోషయుక్తా శుచికర్మదక్షా ।
ప్రియంవదా భూరిజనా ధనాఢ్యా నారీయ ముక్తా కిల దేవసత్వా॥

గంధర్వసత్వా స్త్రీలక్షణము.

శ్లో. సంగీతలీలా గతికాంతశీలా సుగంధమాల్యాది రుచి శ్శుభాంగీ ।
విలాసినీ నిర్మలచారుదేహా గంధర్వసత్వా వనితా ప్రదిష్టా ॥

యక్షసత్వా స్త్రీలక్షణము.

శ్లో. అపేతలజ్జా మధుమాంసభోక్త్రీ పీనస్తనీ చంపకగౌరదేహా । [త్వా
దోషాన్వితా సంతతభోగవాంఛా ప్రోక్తా మునీంద్రైః ఖలు యక్షస

మనుష్యసత్వా స్త్రీలక్షణము.

శ్లో. అతీవ సఖ్యాదిషు బద్ధభావా సురాగిణీ నిర్మలచిత్తవృత్తిః ।
నానావ్రతైః రేతి చ యా ప్రయాసం మనుష్యసత్వా పరికీర్తితా సా॥

పిశాచసత్వా స్త్రీలక్షణము.

శ్లో. దుశ్చారిణీ కుత్సితభూరిభోజ్యా హృష్టా తితుష్టా పరితప్తగాత్రీ ।
ఖర్వా తికుత్సానవికారవక్త్రా మాలిన్యయుక్తేతి పిశాచసత్వా॥

నాగసత్వా స్త్రీలక్షణము.

శ్లో. వ్యాకులీ భ్రాంతశీలా చ సోచ్ఛ్వాసం బహు జృంభతే ।
నిద్రాసక్తా చ సతతం నాగసత్వేతి చోచ్యతే ॥

కపిసత్వా స్త్రీలక్షణము.

శ్లో. అత్యంతచపలా యా తు సతతోద్భ్రాంతలోచనా ।
దంతసంగరరక్తా చ కపిసత్వేతి చోచ్యతే ॥

ఖరసత్వా స్త్రీలక్షణము.

శ్లో. స్వభావదుష్ట వాక్యాని విషయే నైవ గాహతే ।
అపేతరాగా స్వానాదా ఖరసత్వేతి చోచ్యతే ॥



కాకసత్వా స్త్రీలక్షణము.

శ్లో. ఉద్వేగం నిష్ఫలం కుర్యా న్నేత్రే చ భ్రామయే న్ముహుః ।
అప్రతీతా చ సతతం కాకసత్వేతి చోచ్యతే ॥

అథదేశజాలక్షణాని— మధ్యదేశ స్త్రీలక్షణము.

శ్లో. విచిత్రవేషా శుచికర్మదక్షా సుశీలినీ దంతనఖాది రక్తా ।
మనోజసంగ్రామ వినోదరంగా స్యా న్మధ్యదేశప్రభవా పురంధ్రీ ॥

మాళవదేశ స్త్రీలక్షణము.

శ్లో. ఉపభోగకళాసు రాగిణీ చిరసంభోగరసప్రతోషితా ।
కరఘాతన తుష్టమానసా వనితా మాళవదేశసంభవా ॥

ఆభీరదేశ స్త్రీలక్షణము.

శ్లో. అభిఘాతరుచి ర్న రజ్యతే నఖదంతైః పరిరభ్య లాలసా ।
బహుచుంబనహార్యమానసా వనితా భీరసముద్భవా స్మృతా ॥

లాటదేశ స్త్రీలక్షణము.

శ్లో. పరిరంభణలోలుపా రదచ్ఛదఘాతై ర్ద్రవ మేతి సత్వరం ।
సుకుమారతను ర్మనోరమా సురతే నృత్యతి లాటకామినీ ॥

ఆంధ్రకర్ణాటదేశ స్త్రీలక్షణము.

శ్లో. మృద్వీ దురాచారరతా వహంతీ రతార్తిముచ్చైరతిసర్మదక్షా।
త్రపావిహీనా తిమనోరమాంగీ స్యాదాంధ్రకర్ణాటభవా పురంధ్రీ॥

కోసలదేశ స్త్రీలక్షణము.

శ్లో. నితాంత కండూతియుతస్మరాలయా ద్రవంతి చండధ్వజఘాతనాచ్చిరం।
రతిప్రయోగేచతురా శ్చ యోషితః ప్రకీర్తితాః కోసలరాష్ట్రసంభవాః॥

పాటలీపుత్ర-మహారాష్ట్రదేశ స్త్రీలక్షణము.

శ్లో. ఈషద్భావమనోరమా స్సునిరతా స్సాక్షేప వాగ్విభ్రమా,
నిర్లజ్జా శ్చపలాః కలాసు కుశలా గాఢానురాగాన్వితాః ।
నార్యః పాటలిపుత్రజా అపి మహారాష్ట్రోద్భవా స్సంతతం,
నానావేష వినోదభావ రసికా స్సంకీర్తితాః పండితైః ॥

వంగగౌడదేశ స్త్రీలక్షణము.

శ్లో. కుసుమ మృదు శరీరా చుంబనాలింగనాఢ్యా,

బహుతర ధృతభావా క్రూరచేష్టా విరక్తా ।
విషమవిశిఖయుద్ధే స్తోకవేగా పురంధ్రీ,
భవతి తరళనేత్రా వంగజా గౌడజా చ ॥

ఉత్కళ దేశ స్త్రీ లక్షణము.

శ్లో. విపరీతరతాభిలాషిణీ గతలజ్జా నఖదానతోషిణీ ।
నితరామనురాగశాలినీ మదనార్తోత్కలదేశసంభవా ॥

కామరూప దేశ స్త్రీ లక్షణము,

శ్లో. ప్రియంవదా కోమల దేహవల్లీ భృశం ద్రవంతీ స్మర కేళిరంగే ।
విహీనలజ్జా ప్రచురానురాగా స్యాత్కామరూపప్రభవా పురంధ్రీ॥

వన దేశ స్త్రీ లక్షణము.

శ్లో. నిజదోషనిగోపనేరతా వరదోష గ్రహణేషు తత్పరా ।
వనితా వనవాససంభవా దృఢదేహా పరికీర్తితా బుధైః ॥

ఘూర్జర దేశ స్త్రీ లక్షణము,

శ్లో. ఉపభోగరతా సులోచనా లఘుసంభోగవిధి వ్రతోషితా ।
శుభవేషధరా విచక్షణా గదితా సా ఖలు ఘూర్జరీ బుధైః ॥

సింధు-అవంతి దేశ స్త్రీ లక్షణము.

శ్లో. ప్రచండవేగా హ్యతికష్టసాధ్యా స్సకోపవత్య శ్చలనేత్రపాతాః ।
భవంతి దుష్టాః కిల సింధుజాతా అవంతికావాసభవాశ్చనార్యః॥

ద్రవిడ - సౌవీర - మలయదేశస్త్రీలక్షణము.

శ్లో. మృదు స్సువాచో లఘుభోగసాధ్యా స్ససాహసా వీతభయత్రపాశ్చ
సమానరూపా ద్రవిడప్రజాతా స్సౌవీరదేశే మలయే చ నార్యః ॥

కాంభోజ - పౌండ్ర దేశస్త్రీలక్షణము.

శ్లో. నఖాదివిన్యాసకళా విహీనా స్సంభోగసమ్మర్దనజాతతోషాః।
స్వభావతో దుష్టతమాఃప్రచండాః కాంభోజపౌండ్రప్రభవాశ్చనార్యః॥

పర్వత, గాంధార, కాశ్మీర, మ్లేచ్ఛ దేశ స్త్రీలక్షణము.

శ్లో. దుర్గంధ గాత్రాలఘుభోగతుష్టా స్సచుంబనాశ్లేషణభావహీనాః।
మ్లేచ్ఛాంగనాః పర్వతజా శ్చ నార్యో గాంధార కాశ్మీరభవా స్తథైవ॥



సుఖసాధ్య స్త్రీ.

శ్లో. మార్గాదిశ్రాంతదేహా చిరవిరహవతీ మాసమాత్రప్రసూతా,
గర్భాలస్యా చ నవ్యజ్వరయుతతనుకా త్యక్తమానా ప్రసన్నా ।
స్నాతా పుష్పావసానే నవరతిసమయే మేఘకాలే వసంతే,
ప్రాయస్సంపన్నరాగా మృగశిశునయనా స్వల్పసాధ్యా రతేస్స్యాత్

---

స్త్రీగమనవిధి.

శ్లో. భార్యాంరూపగుణోపేతాం తుల్యశీలకులోద్భవాం ।
అభికామోఽభికామాం తు హృష్టోహృష్టామలంకృతాం ।
సేవేత ప్రమదాం యుక్త్యా వాజీకరణబృంహితః ॥

తా. పురుషుఁడు వాజీకరణాద్యౌషధముల భక్షించి, సౌందర్యాదిగుణములు గలదియు, నానాభరణాలంకృతురాలును, కామాభిలాషగలదియు, సంతుష్టహృదయురాలును, అగు భార్యను పొందవలయు.

శ్లో. స్త్రియా శ్శుక్లాధికే స్త్రీస్స్యా త్పుమాన్ పుంసోఽధికే భవేత్ ।
తస్మాచ్ఛుక్లవివృద్ధ్యర్థం వృష్యం స్నిగ్ధం చ భక్షయేత్ ।
లఘ్వాహారాం స్త్రియం కుర్యా దేవం సంజనయే త్సుతం ॥

తా. స్త్రీశోణితంబధికమైనయెడ కన్యకయు, పురుషునిశుక్రం బధికమైనయెడల పురుషుఁడును బుట్టును గావున స్నిగ్ధంబు లగుశుక్లవృద్ధికరౌషధంబులను పురుషుఁడు భక్షించి స్త్రీని లఘ్వాహారముకలదానిగజేసిన పుత్రుఁడు గలుగును.

సంభోగానర్హ స్త్రీలు.

శ్లో. నానిష్టాం నప్రకుపితాం నాప్రశస్తాం న రోగిణీం ।
నాదక్షిణాం నాన్యకామాం నాకామాం నాన్యయోషితం ।
క్షుత్క్షామాం నాతిభుక్తాం వా స్వయం చేతై ర్గుణైర్యుతః ॥

తా. ఇష్టములేనిదియు, కోపమును జెందినదియు, రోగముగలదియు, అసమర్థురాలును, ఇతరుని ప్రేమించియున్నదియు, ఇష్టములేనిదియు, ఆఁకలిచేఁగృశించినదియు, మిక్కిలి భుజించినదియు నగుస్త్రీని, పరభార్యను గూడజనదు. పురుషుఁడును, పై జెప్పిన స్త్రీగుణంబులులేక మంచిగుణములు గలిగియుండవలయు.

శ్లో. ఋతుస్నాతాం తు యో భార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి ।
ఘోరాయాం భ్రూణహత్యాయాం యుజ్యతే నాత్ర సంశయః॥

తా. ఋతుస్నానముచేసిన భార్యను, దగ్గరనుండియు పొందనివాఁడు, ఘోరంబగుశిశుహత్యాపాపము నొందును.

రజస్వలా-గర్భిణీ గమనప్రాయశ్చిత్తము.

శ్లో. రజస్వలాం చ యో గచ్ఛే ద్గర్భిణీ మష్టమాసికీం ।
తస్యపాపస్యశుద్ధ్యర్థ మతికృచ్ఛ్రం విశోధనం ॥

తా. పురుషుఁడు-రజస్వలను - అష్టమమాస గర్భిణినిగూడినయెడల తనపాపము పోవుటకు అతికృచ్ఛ్రమును చేయవలయు.

సంభోగనియమము

శ్లో. ఋతుకాలాభిగామీ స్యా త్స్వదారనిరత స్సదా ।
పర్వవర్జం వ్రజే చ్చైనాం తద్వ్రతో రతికామ్యయా ॥
ఋతు స్స్వాభావికః స్త్రీణాం రాత్రయ ష్షోడశ స్మృతాః ।
చతుర్భి రితరై స్సార్థ మహోభి స్సద్విగర్హితైః ।
తాసా మాద్యా శ్చతస్రస్తు నిందితై కాదశీ చ యా ।
త్రయోదశీ చ శేషా స్తు ప్రశస్తా దశరాత్రయః ।
యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽ యుగ్మాసురాత్రిషు ।
తస్మా ద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశే దార్తవే స్త్రియం ।
అమావాస్యా మష్టమీం చ పౌర్ణమాసీం చతుర్దశీం ।
బ్రహ్మచారీ భవే న్నిత్య మప్యృతౌ స్నాతకో ద్విజః ॥

తా. పురుషుఁడు స్వదారలయందు ఋతుకాలమున పర్వదినములవదలి రతికోరికతోఁగూడవలయు. స్త్రీలకు స్వభావముగ ఋతువైనదినము మొదలుకొని పదునాఱురాత్రులు ఋతుకాలము-వానిలో మొదటి నాలుగురాత్రులును ౧౧-౧౩ రాత్రులును నిందితములు. తక్కిన పదిరాత్రులు ప్రశస్తమైనవి. వానిలో సరిదినములయందు గూడిరేని పుత్రులును, బేసిదినములయందు గూడిరేని పుత్రికలును, గలుగుదురు. కావునపుత్రునిగోరువాఁడు సరిదినములయందుస్త్రీనిగూడవలయు. ఋతుకాలమునందును వచ్చెడి-అమావాస్య, అష్టమి,పౌర్ణమి, చతుర్దశీ ఈతిథులయందు స్త్రీనిగూడజనదు.

పరదారగమననిషేధము.

శ్లో. పరదారా న్న గచ్ఛేత మనసాపి కథంచన ।
పరదారరతిః పుంసా ముభయత్రాపి భీతిదా ॥
ఇతి మత్వా స్వదారేషు ఋతుమత్సు బుధో వ్రజేత్ ॥



తా. పురుషుఁడు, పరదారగమనమును మనస్సుననైనఁ దలఁపఁగూడదు. పరభార్యాగమనము - ఇహపరముల రెండిటియందును భయమునిచ్చును కావున స్వభార్యయందు ఋతుకాలమునందు గూడవలయు.

శ్లో. లంకేశ్వరోజనకజాహరణేన వాలీ
తారాపహారకతయా వ్యథ కీచకాఖ్యః ।
పాంచాలికాగ్రహణతో నిధనం జగామ
తచ్చేతసాపి పరదారరతిం న కాంక్షేత్ ॥

తా. సీతాపహరణముచే రావణుఁడును,తారాపహరణముచే వాలియు,ద్రౌపదీహరణముచేకీచకుఁడును,మరణముఁబొందిరికావునపరస్త్రీలనుమనస్సుననైనఁగోరఁబగదు.

సంభోగనిషేధకాలము.

శ్లో. నోపేయా త్పురుషో నారీం సంధ్యయో ర్న చ పర్వసు ।
గోసర్గే చార్ధరాత్రే చ తథా మధ్యందినేపి చ ॥

తా. ప్రాతస్సాయంకాలములయందును, పర్వములయందును, గోవులవిడుచునపుడును, అర్ధరాత్రియందును,మట్టమధ్యాహ్నమునందును, స్త్రీసంభోగముసేయఁదగదు

స్త్రీవిహారవిధి.

శ్లో. విహారం భార్యయా కుర్యా ద్దేశేఽతిశయ మావృతే ।
రమ్యే శ్రావ్యాంగనాగానే సుగంధే సుఖమారుతే ॥

తా. శ్రావ్యమైన స్త్రీలగానముచేనొప్పుచు రమ్యమై, మంచివాసన, సుఖమైనగాలియుఁ గలిగి యేకాంతమైన మంచిప్రదేశమున భార్యతోడ విహరింపవలయు.

సంభోగాయోగ్యస్థానము.

శ్లో. దేశే గురుజనాసన్నే వివృతేఽతిత్రపాకరే ।
శ్రూయమాణవ్యథాహేతు వచనే చ రమే న్న చ ॥

శ్లో. వహ్నిబ్రాహ్మణ పూజ్యవర్గ నికటే నద్యాంచ దేవాలయే
దుర్గాదౌచ చతుష్పథే పరగృహేఽరణ్యే శ్మశానే దివా ।
సంక్రాంతౌ శశిసంక్షయేపి చ తథా గ్రీష్మే జ్వరార్తా వ్రతే,
సంధ్యాయాంచ పరిశ్రమేషు సురతం కుర్యా న్నవిద్వాన్ క్వచిత్ ॥

తా. గురుజనులకు సమీపప్రదేశమునను, లజ్జగలుగఁజేయు బయలునందును, మనస్సునకు దుఃఖమునుగలిగించు వాక్యములు వినఁబడుచోటను, అగ్నిహోత్రము బ్రాహ్మణులు పెద్దలు, వీరిసమీపమునందును, నది-దేవాలయము-కోట-చతుష్పథము-పర

గృహము-అరణ్యము-శ్మశానము-వీనియందును, పగలు-సంధ్యాకాలము-సంక్రాంతి-అమావాస్య-గ్రీష్మఋతువు వీనియందును, జ్వరము-బడలిక-వ్రతాదులు వీనియందును స్త్రీసంభోగము సేయగూడదు.

### విహితప్రదేశము.

శ్లో. విస్తీర్ణే సజలే సుధాధవళితే చిత్రాదినాలంకృతే,
రమ్యేప్యున్నతచత్వరే ఽగరుమహాధూపాది పుష్పాన్వితే ।
సంగీతాంగవిరాజితే స్వభవనే దీపప్రభాభాసురే,
నిశ్శంకం సురతం యథాభిలషితం కుర్యా త్సమం కాంతయా ॥

తా. విశాలమై సున్నముపూయుటచేఁ దెల్లనై చిత్తరువులచే నలంకృతమై రమ్యమై యెత్తుగలిగి నలుచదరమై - అగరుధూపము పుష్పము పరిమళద్రవ్యములు మొదలగువానిచే వాసితమై సంగీతముచేనొప్పుచు దీపములచేఁ బ్రకాశించుచున్న స్వకీయభవనమునందు శంకలేక, స్వేచ్ఛానుసారముగ స్త్రీతోసంభోగ మొనర్చవలయు.

### ఋతుపరత్వసంభోగనియమము.

శ్లో. త్రిభి స్త్రిభి రహోరాత్రై స్సమేయాత్ప్రమదాం నరః ।
సర్వేష్వృతుషు ఘర్మే తు పక్షాత్పక్షా ద్విజే ద్బుధః ॥

తా. అన్ని ఋతువులయందును మూఁడుదినముల కొక్కసారియు. గ్రీష్మఋతువునందు ౧౫ దినముల కొకసారియు స్త్రీనిగూడవలయు.

### మైథునానంతరక్రియ.

శ్లో. ఋతౌ తు గర్భశంకిత్వా త్స్నానం మైథునినః స్మృతం ।
అనృతౌ తు యదా గచ్ఛే చ్ఛౌచం మూత్రవ దిష్యతే ॥

తా. ఋతుకాలమునందు మైథునమొనర్చిన, గర్భముగలుగు నను శంకచే స్నానముచేయవలయు. ఇతరకాలమునందు గర్భముగలుగదుగనుక శౌచమును మూత్రమునకువలె నుమ్మూరు చేయవలయు.

వా.—మిథునీభూయ న తయా సహ సర్వాం రాత్రిం సంవిశేత్ ॥

తా. పురుషుఁడు మైథునమొనర్చిన పిదప రాత్రియంతయు స్త్రీతోఁగూడి పరుండఁగూడదు.

శ్లో. స్నానం సశర్కరం క్షీరం భక్ష్యె మైక్షవసంస్కృతం ।
వాతో మాంసరస స్స్వప్నో వ్యవాయాంతే హితా అమీ ॥



తా. సంభోగానంతరము స్నానముచేయుట, శర్కరతోఁ గూడిన పాలు ద్రాగుట, బెల్లముకలిసినభక్ష్యముల భుజించుట, గాలిని-మాంసరసమును అనుభవించుట, నిద్రించుట ఈకార్యములు హితకరంబులు.

శ్లో. సద్యోబలహరా నారీ సద్యోబలకరం పయః ।
స్త్రియం గచ్ఛే త్పయః పీత్వా తాం చ త్యక్త్వా పునః పిబేత్ ॥

తా. స్త్రీ-బలమును తత్క్షణమున హరించును. పాలు తత్క్షణమున బలమునుగలుగఁ జేయును. కావున స్త్రీనిపొందుటకు పూర్వమును, అంతమునందును, పాలు ద్రాగవలయు.

### సద్యః ప్రాణకరంబులు.

శ్లో. సద్యోమాంసం నవంచాన్నం బాలా స్త్రీ క్షీరభోజనం ।
ఘృత ముష్ణోదకస్నానం సద్యఃప్రాణకరాణి షట్ ॥

తా. నూతనమాంసము, అప్పుడువండినయన్నము, బాలస్త్రీ, క్షీరము, ఘృతము, ఉష్ణోదకస్నానము, ఇవి సద్యః ప్రాణకరంబులు.

### సద్యః ప్రాణహరంబులు.

శ్లో. పూతిమాంసం స్త్రియోవృద్ధా బాలార్క స్తరుణం దధి ।
ప్రభాతే మైథునం నిద్రా సద్యఃప్రాణహరాణి షట్ ॥

తా. దుర్గంధమాంసము, వృద్ధస్త్రీలు, బాలసూర్యుఁడు, కూడికూడని పెరుగు, ప్రాతఃకాలమునందు మైథునము, నిద్ర ఇవి సద్యఃప్రాణహరంబులు.

### అయోగ్యమైథునగుణము

శ్లో. క్షుధితః క్షుబ్ధచిత్త శ్చ మధ్యాహ్నే తృషితో ఽబలః ।
స్థిత శ్చ హానిం శుక్రస్య వాయోః కోపం చ విందతి ।
వ్యాధితస్య రుజా ప్లీహా మూర్ఛా మృత్యు శ్చ జాయతే ॥

తా. ఆఁకలిగొన్నవాఁడు, కలతనొందిన మనస్సుగలవాఁడు, దప్పిగొన్నవాఁడు బలహీనుఁడు, నిలచియున్నవాఁడును మైథునము జేయఁగూడదు. అట్లుచేసిన-శుక్రహానియు, వాతప్రకోపమునుగలుగును. రోగి సంగమమొనర్చిన, ప్లీహారోగమును మూర్ఛారోగమును పొందుటయేగాక మృత్యువును సగా పొందును.

శ్లో. ధాతుక్షయో రోగవృద్ధి ర్భ్రశి స్సత్కర్మవిప్లవః ।
సౌభాగ్యాయుర్యశోనాశః పుంసాం స్త్రీష్వతిసంగినాం ॥
శూల కాస జ్వర శ్వాస కార్శ్య పాండ్వామయ క్షయాః ।
అతివ్యవాయా జ్జాయంతే రోగా శ్చాక్షేపకాదయః ॥

తా. స్త్రీలను అధికముగాఁ గూడుటవలన, ధాతుక్షయము, రోగవృద్ధి, అలక్ష్మి, సత్కర్మభంగము, సౌభాగ్య-ఆయుః-కీర్తులకునాశము, శూల, దగ్గు, జ్వరము, శ్వాస, కృశత్వము, పాండువు క్షయము, ఆక్షేపకాదివాతరోగములును జనించును.

ఋతుపరత్వ కామస్థానము.

శ్లో. శీతే రాత్రౌ దివా గ్రీష్మే వసంతే తు దివా నిశి।
వర్షాసు వారిదధ్వానే శరత్సు సరసి స్మరః॥

తా. శీతకాలమునందు రాత్రియందును, గ్రీష్మకాలమునందు పగటియందును, వసంతకాలమున రాత్రింబగళ్లును, వర్షాకాలమునందు మేఘము ఉరిమినప్పుడును, శరత్కాలమున సరస్సునందును మన్మథుఁడుండును.

ఋతుపరత్వ స్త్రీవిచారము.

శ్లో. నిదాఘశరదో ర్బాలా హితా విషయిణో మతా।
తరుణీ శీతసమయే ప్రౌఢా వర్షావసంతయోః।
నిత్యం వా సేవ్యమానా హి బాలా వర్ధయతే బలం॥
తరుణీ హ్రాసయే చ్ఛక్తిం ప్రౌఢో ద్భావయతే జరామ్॥

తా. గ్రీష్మశరత్కాలములయందు బాలస్త్రీతోడను, శీతకాలమునందు యౌవనస్త్రీతోడను, వర్షా వసంత కాలములయందు ప్రౌఢస్త్రీతోడను గూడవలయు. బాలతో నెల్లప్పుడుగూడినను, బలముగలుగును. యౌవనస్త్రీ బలమును హరించును, ప్రౌఢస్త్రీ ముదిమిని కలుగజేయును.

నిద్రకుముందు భక్షింపఁదగినద్రవ్యము.

శ్లో. యో లేఢి శయనసమయే మధుమిశ్రం బీజపూరదలచూర్ణం।
సచ పీడాకరవాత ప్రసరనిరోధా త్సుఖం స్వపితి॥

తా, పండుకొనునపుడు మాదీఫలపుఆకును పొడిచేసి తేనెగలిపి నాకినయెడల వాతము శాంతిజెంది సుఖముగ నిద్రగలుగును.

నిద్రాగుణము.

శ్లో. నిద్రా తు సేవితా కాలే ధాతుసామ్య మతంద్రితః।
పుష్టివర్ణ బలోత్సాహ వహ్నిదీప్తిం కరోతి చ॥

తా. రాత్రియందు సమకాలమున నిద్రించిన, ధాతువులు స్వస్థానమునఁ జేరును. జాగ్రత్త, దేహపుష్టి, కాంతి, బలము, ఉత్సాహము, అగ్నిదీపనమును గలుగును.



రాత్రిజాగరణగుణము.

శ్లో. రాత్రౌ జాగరణం రూక్షం కఫదోషవిషార్తిజిత్॥

తా. రాత్రి మేల్కొనుటవలన రూక్షగనుండును. కఫదోష, విషపీడలుతొలఁగును

ప్రాతఃకాలమున జలపానగుణము.

శ్లో. అంభతః ప్రసృతీ రష్టౌ రవా వనుదితే పిబేత్।
వాతపిత్తకఫాన్ జిత్వా జీవే ద్వర్షశతం సుఖీ॥

తా. నాలవజామున సూర్యోదయము కాకమునుపు రాత్రిసంగ్రహించి పెట్టుకొనిన జలమును ౮ పుడిసెళ్లు నిత్యముత్రాగిన-వాతపిత్త కఫదోషములు హరించి నూరుసంవత్సరములు సుఖముగ జీవించును.

శ్లో. అర్శశ్శోథగ్రహణ్యో జ్వర జఠరజరా కోష్ఠ మేదోవికారా,
మూత్రాఘాతాస్రపిత్త శ్రవణగళ శిరశ్శ్రోణి మూలాక్షిరోగాః।
యే చా న్యేవాతపిత్తక్షతజ కఫకృతా వ్యాధయ స్సంతి జంతో
స్తాం స్తా నభ్యాసయోగా దపహరతి పయః పీత మంతే నిశాయాః॥

తా. మఱియు మూలరోగము, వాపు, గ్రహణి, జ్వరము, జఠరరోగము, ముదిమి కోష్ఠరోగము, మేదోవికారము, మూత్రాఘాతము, రక్తపిత్తము, చెవులు-కంఠము-పిఱుదులు-నేత్రములు వీనియందలి రోగములు, వాతపిత్త కఫ-దోషములు, గాయపు రోగములును మానును.

నాసికద్వారా జలపానగుణము.

శ్లో. విగతఘననిశీథే ప్రాత రుత్థాయ నిత్యం
పిబతి ఖలు నరో యో నాసికా రంధ్రవారి।
స భవతి మతిపూర్ణ శ్చక్షుషా తార్క్ష్యతుల్యో
వలిపలితవిహీన స్సర్వరోగై ర్విముక్తః॥
—పాతవ్యం నాసయా నీరం ప్రసృతి త్రయమాత్రకం॥

శ్లో. వ్యంగం వలీపలితఘ్నం పీనసవైస్వర్యకాస శోథహరం।
రజనీక్షయేఽంబునస్యం రసాయనం దృష్టిసంజననమ్॥

తా. ప్రాతఃకాలమున - ముక్కు ద్వారమునుండి యుదకపానముచేసిన, మంచి బుద్ధి-గరుడదృష్టితోఁ దుల్యమైనదృష్టియు గలుగును. వణఁకు, వెండ్రుకల నెరపు, ముదిమి, ఇతరరోగములు, పీనసము, స్వరభేదము, కాసము, వాపు మొదలగు రోగములునుపోవును.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం రాత్రిచర్యాకథనంనామ
తృతీయోధ్యాయః.

## చతుర్థాధ్యాయము.

# ఋతుచర్య.

### కాలము.

వా.— కాలోహి నామ భగవాన్ స్వయంభూరనాదిమధ్యనిధనో ఽత్ర రసవ్యాపత్సంపత్తీ జీవితమరణే చ మనుష్యాణా మాయత్తే స సూక్ష్మ మపి కలాం న లీయతఇతి కాల స్సంకలయతి వా భూతానీతి కాలః॥

తా. కాలము భగవత్స్వరూపము. స్వయముగ నేర్పడినది. ఆదిమధ్యాంతము లులేనిది. మధురాదిరసములయొక్క కలిమిలేములను, మనుష్యులకు జీవితమరణములను చేయుచున్నది; అట్టికాలము సూక్ష్మాంశమునైనను లోపించనేరదు. (అనఁగాఁగొంచె మైన విడువక గణింపఁబడుననుట) మఱియు - సకలజంతువుల నేకకాలమున సుఖదుఃఖానుభవమునం దొక్కటిగా చేర్చును. మరణమునకును ప్రేరేపించును.

వా.—తస్య సంవత్సరాత్మనో భగవా నాదిత్యో గతివిశేషేణాక్షినిమేష కాష్ఠా కలా ముహూర్తా హోరాత్ర పక్షమాస ర్త్వయన సంవత్సర యుగ ప్రవిభాగం కరోతి ॥

తా. సంవత్సరస్వరూపంబగు ఆకాలమునకు-సూర్యుఁడు-తన గమనవిశేషముచే ఱెప్పపాటు - కాష్ఠ - కల - ముహూర్తము-అహోరాత్రము - పక్షము - మాసము- ఋతువు-అయనము-సంవత్సరము-యుగము అనునట్టి విభాగమును జేయుచున్నాఁడు.

### సంవత్సరనిమేషాదులు.

వా.—తత్ర లఘ్వక్షరోచ్చారణమాత్రో ఽక్షినిమేషః। పంచదశాక్షినిమేషాః కాష్ఠా । త్రింశత్కాష్ఠాఃకలా । వింశతికలో ముహూర్తః, కలాదశభాగశ్చ । త్రింశన్ముహూర్త మహోరాత్రం । పంచదశా హోరాత్రాణి పక్షః । స చ ద్వివిధ శ్శుక్లః కృష్ణ శ్చ, తౌ మాసః ॥

తా. "క" అని ఒక లఘువును మాత్రముచ్చరించునట్టి కాలము ౧ ఱెప్ప పాటు అనఁబడును. ౧౫ ఱెప్పపాట్లు ౧ కాష్ఠ, ౩౦ కాష్ఠలు. ౧ కల. ౨౦ కలలును, కలలో ౧౦-వ భాగమునుచేరి ౧ ముహూర్తము. ౩౦ ముహూర్తములు ౧ అహో రాత్రము. ౧౫ అహోరాత్రములు ౧ పక్షము. అది శుక్లము - కృష్ణము అని రెండు విధములు, ౨ పక్షములు ౧ మాసము.



### ఋతునామవిభాగము.

వా.—తత్ర మాఘాదయో ద్వాదశమాసా ద్విమాసక మృతుం కృత్వా షడృతవో భవంతి, తే శిశిర వసంత గ్రీష్మ వర్షా శర ద్ధేమంతాః; తేషాం తప స్తపస్యౌ శిశిర; మధుమాధవౌ వసంతః; శుచిశుక్రౌ గ్రీష్మః॥ నభోనభస్యౌవర్షా; ఇషోర్జౌశరత్; సహసహస్యౌ హేమంతః ఇతి ॥

తా. అందు - మాఘమాసము మొదలు ౧౨ మాసములను రెండేసిమాసములో క ఋతువుచొప్పున లెక్కించిన నాఱుఋతువు లేర్పడుచున్నవి. అనఁగా మాఘఫాల్గు నములు శిశిరర్తువు, చైత్రవైశాఖములు వసంతము, జ్యేష్ఠాషాఢములు గ్రీష్మము, శ్రావణ భాద్రపదములు వర్షర్తువు, ఆశ్వయుజ కార్తికములు శరదృతువు, మార్గశీర్ష పుష్య మాసములు హేమంతఋతువు.

### అయనవిభాగము.

వా.—తఏతే శీతోష్ణవర్ష లక్షణా శ్చంద్రాదిత్యయోః కాలవిభాగకరత్వా దయనే ద్వే భవతో దక్షిణ ముత్తరం చ ॥

తా. శీతము - ఉష్ణము - వర్షము - ఇవి లక్షణము గాఁగల ఋతువులు చంద్ర సూర్యులయందు కాలవిభాగము చేయుటవలన దక్షిణాయనము - ఉత్తరాయణముఅని రెండుఅయనము లేర్పడుచున్నవి.

వా.—తయో ర్దక్షిణం వర్షా శర ద్ధేమంతా స్తేషు భగవా నాప్యాయతే సోమో, ఽమ్లలవణ మధురా శ్చ రసా బలవంతో భవం త్యుత్త రోత్తరం చ సర్వప్రాణినాం బల మభివర్ధతే ॥

తా. అందు దక్షిణాయనమనఁగా - వర్ష-శరత్ - హేమంతములు ; దీని యందు చంద్రుఁడు ఆప్యాయత నొందుచున్నాఁడు . పులును-ఉప్పు - తీపు గల పదార్థములు బలిష్ఠములగును. ప్రాణులకును క్రమక్రమముగ బలము వృద్ధినొందును.

వా.—ఉత్తరం చ శిశిర వసంత గ్రీష్మా స్తేషు భగవా నాప్యాయతే ఽర్క స్తిక్త కషాయ కటుకా శ్చ రసా బలవంతో భవం త్యుత్తరోత్తరం చ సర్వప్రాణినాం బల మపహీయతే ॥

తా. ఉత్తరాయణమనఁగా, శిశిర వసంత గ్రీష్మ ఋతువులు; వీనియందు సూర్యుఁడు ఆప్యాయత నొందుచున్నాఁడు. చేఁదు, వగరు, కారము ఈరసములు బలిష్ఠములగును, సర్వప్రాణులకు నుత్తరోత్తరమున బలము తగ్గును.

శ్లో. శీతేఽగ్ర్యం వృష్టి ఘర్మే ల్పం బలం మధ్యం తు శేషయోః।

తా. హేమంత శిశిరర్తువులయందు జనులు అధికబలము గలిగియుందురు. వసంత, గ్రీష్మ ర్తువులయందు అల్పబలమును, తక్కినఋతువులయందు మధ్యమబలమును గలిగియుందురు.

శ్లో. శీతాంశుః క్లేదయ త్యుర్వీం వివస్వాన్ శోషయత్యపి।
తావుభా వపి సంశ్రిత్య వాయుః పాలయతి ప్రజాః ॥

తా. భూమిని చంద్రుఁడు తడుపుచున్నాఁడు, సూర్యుఁడు ఎండించుచున్నాఁడు; వీరిరువురినాశ్రయించి వాయువు జనులను పాలించుచున్నాఁడు.

వా.—అథ ఖ ల్వయనే ద్వే యుగప త్సంవత్సరో భవతి । తే తు పంచ యుగ మితి సంజ్ఞాం లభంతే । సఏష నిమేషాదియుగపర్యంతః కాల శ్చక్రవత్పరివర్తమానః కాలచక్ర మిత్యుచ్యత ఇత్యేకే. ॥

తా. ౨ అయనములుగసంవత్సరము. ౫ సంవత్సరములుగయుగముఅనఁబడును. ఇట్లు నిమిషము మొదలు యుగపర్యంతముగల కాలము చక్రమువలె తిరుగుచుండుట వలన కాలచక్రమని చెప్పఁబడుచున్నదని కొందఱు పెద్దలు చెప్పెదరు.

హేమంతఋతుచర్య.

వా.—యత్ర తుషారగిరి వినిర్గతజనితజాడ్య జనపద సందీపిత హుతాశన ధూమ ధూళిధూసర దర్పిత ఖడ్గకుంజర మహిష మేషవాయసో ౽థ లోధ్రప్రియంగు పున్నాగ పుష్పరాజిరాజితో దమనక మరువక సుసుత్థితబహుళపరిమళపవనరమణీయోద్యానస్స హేమంతఇతి జానీయాత్ ॥

తా. ఏఋతువునందు, హిమాలయ పర్వతమునందుఁబుట్టిన మంచుగలిగి, దేశములు జడత్వమును బొందియుండునో, మండుచుండెడి అగ్నియొక్క పొగయు, ధూళియు వ్యాపించి రెండవ యాకాశమువలె నుండునో, ఖడ్గమృగము, ఏనుఁగు, దున్నపోతు, మేక, కాకి, మొదలగుజంతువులు హర్షముతోఁ గూడియుండునో, లొద్దుగు, ప్రేంకణము, పున్నాగము, ఈవృక్షములు బాగుగ బుష్పించి యుండునో, దవనము, మరువము వీని మీఁదుగ లేచి మిగుల పరిమళించుచున్న గాలికలిగిన ఉద్యానవనములు గలిగియుండునో, అది హేమంత ఋతువని యెఱుంగవలయు.

శ్లో. వాయు ర్వా త్యుత్తర శ్శీతో రజోధూమాకులా దిశః ।
ఛన్న స్తుషారై స్సవితా హిమానద్ధా జలాశయాః ॥
దర్పితా ధ్వాంక్షఖడ్గాహ్వ మహిషో రభ్రకుంజరాః ।
వి స్తీర్ణ శాలి కేదారా సీలధాన్యోజ్జ్వలా మహీ ।
లోధ్ర ప్రియంగు పున్నాగాః పుష్పితా శ్చ హిమాహ్వయే ॥



తా. హేమంతఋతువునందు మిక్కిలిచలిచే రోమములు నిక్కబొడుచుకొని యుండును. ఉత్తరపుగాలి చల్లగ వీచును. దిక్కులు దుమ్ముచేతను పొగచేతను నిండియుండును. సూర్యమండలము మంచుచేఁగప్పఁబడియుండును. ఏఱ్ఱు చెఱువులు మొదలగునవి మంచుచేవ్యాప్తములై యుండును. కాకి-ఖడ్గమృగము - దున్నపోతులు గొఱ్ఱెలు- ఏనుఁగు-ఇవి మిగుల హర్షముతోనుండును. పొలములయందు వరిమొదలగు పెద్దధాన్యములు-నల్లధాన్యములు. ఇవి చక్కగ ఫలించును. లొద్దుగు - ప్రేంకణము- పున్నాగము ఈ వృక్షములు బాగుగఁబుష్పించును.

శ్లో. దీర్ఘప్రచారసురతాకిల ? యత్ర రాత్రి
స్సుశీతలం వారి వినా చ యత్నాత్ ।
యః ప్రేయసీకుచయుగం పరిరభ్య శేతే
స్వర్గో పి తస్య హృదయే తృణవ ద్విభాతి ॥

తా. హేమంతఋతువునందు రాత్రులు బహుకాలపర్యంతము సురతయోగ్యములై యుండును. జలములు అప్రయత్నముగ మిక్కిలిచల్లనై యుండును, ఇట్టిరాత్రులయందు సంసారులు, నిజభార్యాకుచద్వయా లింగనముగలవారై శయనించి స్వర్గసుఖమునుగూడ తృణప్రాయముగ నెంచియుందురు.

శ్లో. పృథుజఘనకుచాభి ర్యౌవనోన్మాదినీభి
ర్నవమృగమదమిశ్రైః కుంకుమై శ్చర్చితాభిః ।
భవతి శిశిరశాంతి స్త్రీభి రాలింగితాభి
ర్నిశి నిశి పురుషాణాం జన్మసాఫల్యభాజాం ॥

తా. స్థూలజఘనస్తనములుగలవారును, యౌవన మదోన్మత్తలును, మంచికస్తూరి కుంకుమపువ్వుకలసిన చందనమును పూసికొనినవారు నగు నిజవనితలను పురుషు లాలింగనము చేసికొని, శాలువలుకప్పుకొని రాత్రులయందు శయనించిన చలియణఁగును.

శ్లో. హేమంతేబహుదోషాఢ్యే ద్వౌ గుణౌ సర్వసమ్మతౌ ।
అయత్న శీతలం వారి సురతం స్వేదవర్జితం ॥

తా. అనేకదోషములతోఁగూడిన హేమంత ఋతువునందు సర్వసమ్మతములగు గుణములు రెండుకలవు. అప్రయత్నముగ నీళ్లుచల్లగనుండుటయొకటి. స్త్రీసంగమమునందుఁ జెమటపట్టకయుండుట యొకటి.

శ్లో. హేమంతే దధిదుగ్ధసర్పిరశనా మాంజిష్ఠవాసోభృతః,
కాశ్మీరద్రవలిప్తచారువపుషః ఖిన్నా విచిత్రై రతైః ।
వృత్తోరుస్తన కామినీజనకృతా శ్లేషా గృహాభ్యంతరే,
తాంబూలీదళపూగపూరితముఖా ధన్యా స్సుఖం శేరతే ॥

తా. హేమంతఋతువునందు - జనులు - బెల్లము - పాలు - నేయి-వీనినివిశేషముగ ననుభవించవలయు-ఎఱ్ఱనివస్త్రములధరింపవలయు, కుంకుమపువ్వుచేర్చిన చందనం బలదికొని, మంచితాంబూలముల వేసికొని, భార్యల నాలింగనముచేసికొని, చిత్రరతులొనర్చి సుఖంబుగ శయనించవలయు.

శ్లో. బలినశ్శీతసంరోధా ద్ధేమంతే ప్రబలోఽనలః ।
భవ త్యల్పేంధనో ధాతూ న్స పచే ద్వాయునేరితః ।
అతో హిమేఽస్మిన్ సేవేత స్వాద్వమ్లలవణాన్ రసాన్ ॥

తా. హేమంతమునందు బలవంతుఁడగు పురుషునికి శీతలప్రభావమువలన జఠరాగ్ని ప్రబలమగును; అప్పుడు ఆహారమనెడికట్టెలను పొందనియెడల-వాతప్రేరితమై రసరక్తాది ధాతువులనశింపఁజేయును. గావున ఉప్పు పులుసు తీపు రసముల విశేషముగ ననుభవించవలయు,

శ్లో. దైర్ఘ్యాన్నిశానా మేతర్హి ప్రాత రేవ బుభుక్షితః ।
అవశ్యకార్యం సంభావ్య యథోక్తం శీలయే దను ॥

తా. హేమంతమునందు రాత్రులు ప్రొద్దు ఎక్కువగనుండుటవలన ప్రాతఃకాలమందు, ఆఁకలిగొనినవారు, అవశ్యకార్యము లగు మలవిసర్జనాదికృత్యములఁ దీర్చుకొని, భోజనముసేయవలయు, పిదప అభ్యంగనాదులు చేసికొనవలసినయెడల చేసికొనవచ్చును.

శ్లో. ముహుర్ముహు రజీర్ణేఽపి భోజ్యా న్యస్యో పహారయేత్ ।
నిరింధనో ఽంతరం లబ్ధ్వా యథైనం న విపాదయేత్ ॥

తా. జఠరాగ్ని; అన్నాది పదార్థము లనెడికట్టెలులేనియెడ మనుజునిజంపును గావున నట్లుగాక, అజీర్ణముగనుండినను భక్షించుచుండవలయు.

శ్లో. వాతఘ్నతైలై రభ్యంగం మూర్ధ్ని తైలవిమర్దనం ।

తా. వాతఘ్నములగు - నారాయణీ - ప్రసారణీ - విషగర్భాది తైలములచే దేహమునమర్దనముచేసికొని పిదప శిరమును మర్దించుకొనవలయు.

శ్లో. మస్తకాభ్యంగశేషేణ క్వచి న్నోద్వర్తయే త్తనుం ।
పుణ్యహాని రలక్ష్మీ స్స్యా త్తస్మా త్తత్పరివర్జయేత్ ॥

తా. శిరమునకు అంటుకొనఁగా మిగిలిన తైలమును శరీరమునకు బూసికొనిన, పుణ్యహాని - దారిద్ర్యమునుగలుగును. కావున ముందుగ తైలమును శరీరమునకు బూసికొని పిదప శిరమునకు అంటుకొనవలయు.



శ్లో. నియుద్ధం కుశలై స్సార్థం పాదాఘాతం చ యుక్తితః ॥

తా. సాముసేర్చిన పురుషులు ఈఋతువునందు తమబోటిసమర్థులతో కుస్తీలుపట్టుట-దండకసరతు మొదలగు పనులజేయవలయు.

శ్లో. పాదాఘాత స్తైలయుక్తో దీపనో దేహపుష్టికృత్ ।
శుక్రౌజ స్తేజసాం వృద్ధికర శ్శ్రోత్రవిశోధనః ।
దృష్టికోద్ఘర్షణం వర్ణ్యం కండూకోష్ఠమలాపహః ॥

తా. శరీరమును తైలముచే మర్దించుకొని దండకసరతుచేసిన, అగ్నిదీపనము, దేహపుష్టియుగలుగును. శుక్రము, బలము, కాంతి ఇవివృద్ధియగును; చెవులు కన్నులు వీనికి శుద్ధికలుగును. దురద, కోష్ఠమలముపోవును.

శ్లో. కషాయాపహృతస్నేహ స్తత స్స్నాతో యథావిధి ।
కుంకుమేన సదర్పేణ ప్రదిగ్ధోఽగురుధూపితః ॥

తా. శీకాయ మొదలగువానిచే చమురునుబోగొట్టుకొని యథావిధిగ స్నానము చేసి, కస్తూరి కుంకుమపువ్వు కలిపిన చందనమును పూసికొని అగరు ధూపము వేసికొనవలయు.

శ్లో. వ్యాయామాదా తదంతే చ కల్కంవా ముద్గమాషజం ॥

తా. దండకసరతుకు ముందుగాని, పిమ్మటగాని, నానబోసిన పెసలనుగాని, మినుములనుగాని, భక్షింపవలయు.

శ్లో. గోధూమపిష్టమాషేక్షు క్షీరోత్థ వికృతీ శ్శుభాః ॥

తా. గోధుమపిండి పదార్థములు, పకోడలు, అటుకులు, అప్పడములు, వడియములు, లడ్డుమొదలగువానిని, క్షీరమిశ్రిత పదార్థములను బెల్లమును. ఈఋతువునందు భక్షింపవలయు.

శ్లో. లఘూష్ణ మంబరం సేవ్యం చందనాగురుధూపితం ।
తథాచ—ప్రావారాజినకౌశేయ ప్రవేణీ కౌచవాస్తృతం ।
ఉష్ణస్వభావైర్లఘుభిః ప్రావృత శ్శయనం భజేత్ ॥

తా. చందనాగరు ధూపమువేసిన తేలికవస్త్రమును ధరించవలయు. మఱియు ఉష్ణస్వభావము తేలికయుగల కవచములు అనఁగా (చొక్కాయలు,) మృగచర్మము వ్యాఘ్రచర్మము, పట్టుతాప్తావస్త్రములు, చిత్రకంబళులు, మృగరోమములవలనఁ జేయఁబడిన శాలువలు, కంబళవస్త్రములు మొదలగువానిని ధరించి శయనించవలయు.

శ్లో. సేవనం సూర్యరశ్మీనాం హుతాశస్య చ మాత్రయా ।
యథారుచి స్తు కిరణాన్ నిర్ధూమం చ హుతాశనం ॥
పృష్ఠతో౽ర్కం నిషేవేత జఠరేణ హుతాశనం ।
నాత్యుష్ణశీతసలిలైః శ్శౌచం కుర్యాత్ప్రయత్నతః ॥

తా. సహించదగునట్లు సూర్యకిరణముల సేవనమును, పొగలేని నిప్పుసెగ కాచుకొనుటను చేయవలయును. సూర్యునికి వీపుప్రక్కగను, అగ్నికి కడుపుప్రక్కగను కూర్చొనవలయును. మిక్కిలివేడిమిక్కిలిచల్లనగాని నీళ్లతో శౌచాదులను చేయవలయును.

శ్లో. పీవరోరు స్తనశ్రోణ్య స్సమదాః ప్రమదాః ప్రియాః ।
హరంతి శీత ముష్ణాంగ్యో ధూపకుంకుమయౌవనైః ।
అంగారతాపసంతప్త గర్భ భూవేశ్మచారిణః ।
శీతపారుష్యజనితో న దోషో జాతు జాయతే ॥

తా. ఉన్నతోరు కుచ శ్రోణులుగలవారును, యౌవనమదోన్మత్తలును, అగరు ధూపము వేసికొనినవారును, కుంకుమపువ్వు చందనమును పూసికొనినవారునగుస్త్రీలు తమయౌవనాగ్నిచే చలిని పోగొట్టుదురు - నిప్పు కుంపట్లుగలిగి గాలితగులని లోపలి గృహములయందు నివసించిన శీతబాధ నివర్తించును.

## హేమంతమునందు పథ్యము.

శ్లో. శివ శ్శివా బ్ధిజాఫలం హరీతకీగుడాన్వితా
విభీతమజ్జకార్ద్రికం జయా చ విశ్వభేషజం ।
లవంగ మామ్రమామ మబ్జలోచనే కపిత్థకం ॥
కణా శతాహ్వికా చ మేధికా రవిందబీజకం ॥
పయోదనాదమారిషా మరీచధాన్యబాహ్లికం
ఘృతం చ పాయసంసురాజశాశహారిణాని వై ।
ఫలాని వార్తి రాబ్దరావత్తైత్తిరాణి చాంగనే ! ।
పటోలకం రసోనకో హితా అమీ హిమాహ్వయే ॥

తా. నెల్లికాయ-కరక్కాయ-మారేడుపండు బెల్లముతోఁగూడిన కరక్కాయ-తానికాయ-కూరనెల్లి-అల్లము-సొంటి-లవంగము-మామిడికాయ-వెలగ-పిప్పళ్లు-సోపు-మెంతులు-తామరగడ్డ-తుంగముస్తెలు-నీరుచిత్రికూర - మిరియాలు-దనియాలు-ఇంగువ-నేయి-పరమాన్నము-మద్యము, మేక-కుందేలు-జింక-వెలిసపిట్ట- నెమలి-తిత్తిరిపక్షి వీనిమాంసములు, పొట్లకాయ-వెల్లుల్లి-ఈపదార్థములు హేమంతఋతువునందు హితకరములు



శ్లో. సైంధవ మేలాచిత్రక శాకం జాజిఫలం చంచూ దధి తక్రం ।
సూరణకం ద్రాక్షామపి కాంతే! కుండలికా మాన్యాచ హిమాహ్వే

తా. సైంధవలవణము - ఏలకులు - చిత్రమూలము - జాజికాయ - పొలముబచ్చలికూర - పెరుగు - మజ్జిగ - కందగడ్డ - ద్రాక్ష - జిలేబిభక్ష్యములు ఈపదార్థములును హేమంతమునందు హితకరంబులు.

శ్లో. కౌశేయా స్తరణే శయనం చ శ్యామాస్త్రీసురతం శుచిగంధం ।
తాంబూలం బహుభోజన మిష్టం హేమంతే హిత మాహు రిదం॥

తా. పట్టువస్త్రములు పరచినపాన్పుమీద శయనంబును, షోడశవర్ష స్త్రీ సంభోగంబును, సువాసనతోఁగూడిన తాంబూలంబును, తృప్తికరభోజనంబులును ఇవి హేమంతంబునందు పథ్యకరంబులు.

శ్లో. పక్వం కలింగం త్రపుసం చ పక్వం కోశాతకీ వాస్తుక ముద్గ తైలం।
క్షుద్రార్ఘుపాశ్చాగపయోగ్నిసేవా హేమంతకేమీసుహితాశ్చనిత్యం।

తా. పుచ్చపండు - ములుదోసపండు - బీరకాయ - చక్రవర్తికూర-పెసలు-నూనె-చిన్నచేఁపలు-మేఁకపాలు-అగ్నిసేవనము ఇవి హేమంతమున హితకరంబులు,

శ్లో. క్వాథలీక్వథితా సుభ్రు ! జంబీరం దాడిమీఫలం ।
జీవనం నైర్ఝరం దివ్యం వాప్యం కౌప్యం చ సారసం ॥
వ్యాయామం జీర్ణగోధూమా షష్టికా రక్తశాలయః ।
హేమంతే౽మీ హితా బాలే ! పీనోత్తుంగపయోధరే! ॥

తా. ముల్లంగి మొదలగువానినివేసి వండినమజ్జిగపులుసు-నిమ్మకాయ-దానిమ్మ-(ద్రాక్ష-అక్రోటుకాయలు) ప్రవాహజలము - వర్షోదకము. వట బావి - నూయి - గుంట వీనియందలి యుదకము -సాము చేయుట-ప్రాతగోధుమలు - అరువదిదినములకు ఫలించినధాన్యము - ఎఱ్ఱధాన్యము ఇవి హేమంతమునందు హితకరంబులు.

శ్లో. ప్రాత ర్భోజ్యం నవంచాన్న మమ్లం ఘర్మతిలక్రమాః ।
అభ్యంగం చ ప్రశంసంతి హేమంతే భిషగుత్తమాః ॥

తా. ప్రాతఃకాలభోజనము-వేడిఅన్నము-పులుసు పదార్థములు-సూర్యకిరణములు నువ్వులు - పాటుచేయుట-శరీరమునకు నూనెను చరుముకొనుట - ఇవి హేమంతమునందు హితకరంబులు. సొంటి కరక్కాయ వీనిని చూర్ణముచేసి కలిపి భక్షించవలయును.

## హేమంతమునం దపథ్యము.

శ్లో. హేమంతశ్శీతలస్స్నిగ్ధ స్స్వాదు ర్జఠరవహ్నికృత్ ।
అతిశీతా స్తతస్త్యాజ్యాః పదార్థా నవయౌవనే!॥

తా. హేమంతఋతువు-శీతలముగ-స్నిగ్ధముగ-స్వాదువుగనుండును. జఠరాగ్ని దీపనమునుజేయునుగాన అతిశీతలపదార్థములను వర్జించువది.

శ్లో. కశేరుం నాడికాశాకం శృంగాటం కదలీఫలం ।
ఆలుకం ఖాఖసం మాషా రాజకోశాతకీ ప్రియే ! ।
నాదేయం పాల్వలంనీరం కైదారం మాహిషం పయః ।
రాజమాషా యవా మేషస్యామిషం చ మకుష్ఠకం ।
దివానిద్రా పురాణాన్నం కుభోజన మభోజనం ॥
లఘుపాకి చ శైత్యాన్నం శీతనీరావగాహనం ।
ప్రవాతం నియతాహార ముదమంథం హిమాగమే ।
కషాయకటుతిక్తాని రూక్షాని చ లఘూని చ ॥
వర్జయే చ్ఛీతసంస్పర్శాన్ శీతా న్యుపవనాని చ ।
వహ్నిసంతప్తహేమాంగే! హేమంతే ఒమూని సంత్యజేత్ ।

తా. తుంగముస్తెలు. తోటకూర మొదలగునవి, పరికెగడ్డలు, అరటిపండ్లు, సొరకాయ, చారకంద, మినుములు, పెద్దబీర, నది మడుగు పాలములు వీనియందలి యుదకము, బఱ్ఱెపాలు, అలచందలు, యవధాన్యము, మేకమాంసము, ఏనుగుపెసలు, పగటినిద్ర, చద్దిఅన్నము, కుత్సితభోజనము, లంఘనము, శీఘ్రముగ జీర్ణమగుభోజనము, చల్లనిఅన్నము, చన్నీళ్ల స్నానము, గాలిసేవనము, ఒంటిపూట భోజనము, పేలపిండి, వగరు - కారము-చేదు-రూక్ష-లఘుత్వముగల పదార్థములు, శీతలవస్తువులను తాఁకుట, చల్లనితోఁటలు, ఇవి హేమంతఋతువునందు అపథ్యకరంబులు.

---

## శిశిరఋతుచర్య.

శ్లో. శిశిరే శీత మధికం వాతవృష్ట్యాకులాదిశః ।
శేషం హైమంతవ త్సర్వం విజ్ఞేయం లక్షణం బుధైః ॥

తా. శిశిరఋతువునందు, శీతమధికముగనుండును. గాలి, వాన వీనిచే దిక్కులు వ్యాప్తములైయుండును. మిగిలినది హేమంతఋతువుతో సమానముగ నుండును.

శ్లో. ఒహలశిశిరవాతా త్కించిదుద్భూతసస్యా
భవతి వసుమతీ యం పక్వసస్యై స్తు పీతా ।
కథమపి తుహినం స్యా ల్లింగవై శేషికం స్యాత్
పవనకఫవికారో జాయతే శైశిరే చ ॥



తా. మిక్కిలిచల్లనిగాలికొట్టుటవలన భూమియందు పచ్చిక కొంచెముగా మొలచును, అట్లే భూమి పండినకసువుచేత పసిమివర్ణముగలదై యుండును. మంచు మిక్కిలియధికమైయుండును. మఱియు వాతశ్లేష్మజనితరోగములు కలుగును.

శా.—యత్ర శీతా ద్భయం భవతి చంద్రచరణనిచయ రుచిరతర తుషార
సంకుల సలిలాశయో య స్స శిశిర ఇతి విజానీయాత్ ॥

తా. ఏ ఋతువునందు శీతమువలన భయమును, చంద్రకిరణములవలన అతిశయించిన మంచుచేత వ్యాప్తమైన జలాశయములును గలిగియుండునో అది శిశిరర్తువు.

శ్లో. సర్వంహి మోక్తం శిశిరేప్రయోజ్యం పథ్యాకణాతుల్యతమాచసేవ్యా।
ఆభుజ్య సేవేత జలం సుఖోష్ణం కాంతాయుతో వాసగృహే వసేత్తు॥
తప్తైవభక్ష్యాన్ సుకృతాన్ ప్రలేహాన్ స్యాత్పూరణం వై వటకాశ్చరుచ్యాః
పిష్టాన్న మన్నం చరుభోజనాని సేవేత సర్వా నితి శీతకాలే ॥

తా. శిశిరర్తువునందు - హేమంతర్తువునకుజెప్పిన అన్నిక్రియలనుచేయవలయు. మఱియు-పిప్పళ్లు-కరక్కాయ-వీనిని పొడిచేసికలిపి భక్షించవలయు. భోజనానంతరము సుఖోష్ణజలమును త్రాగవలయు. బాగుగఁజేయఁబడిన పచ్చళ్లు కందగడ్డ అప్పడములు-వడియాలు - పగోడా-అటుకులు - గోధుమపిండిపదార్థములు - పాలు - మీగడ - పెసరపిండి భక్ష్యములు - పూరీలు మొదలగుపదార్థముల భక్షించవలయు.

శ్లో. సార్ద్రికార్ద్రా నుసంధానా సబాహ్లీకా ససైంధవా ।
సస్నేహా కామినీ చే యం కృసరా శిశిరే హితా ॥

తా. అల్లముతోఁగూడ ఊరిన మామిడికాయ-నిమ్మ మొదలగు ఊరుగాయలు, ఇంగువ- సైంధవలవణము - నేయి వీనితోఁగూడిన పదార్థములు, ప్రీతితోఁగూడిన స్త్రీ-పొంగలి ఇవి శిశిరర్తువునందు హితకరములు- (పొంగలియందు-అల్లము-ఇంగువ-మంచినేయి వీనినివేయవలయు- భక్షించునపుడు-పెరుగును ఊరుగాయను చేర్చుకొనవలయు. బియ్యము-సెనగపప్పు-ముంతమామిడిపప్పు- ద్రాక్షపండు-ఏలకులు- కలకండపొడి-పాలు వీనినికలిపివండిన చక్కెర పొంగలియగును; దీనిని విశేషముగ ధనుర్మాసమునందుజేసి భక్షించవలయు.)

శ్లో. మత్తేభకుంభపరిణాహిని కుంకుమార్ద్రే
కాంతాపయోధరతటే రతిఖేదఖిన్నే ।
వక్షో నిధాయ భుజపంజరమధ్యవర్తీ
ధన్యః క్షపాం క్షపయతి క్షణవ త్స ధన్యః॥

తా. మత్తగజకుంభస్థలములఁ దిరస్కరించుచున్నవియు, కుంకుమపువ్వుచేఁ బూయఁబడినవియు, రతిభారముచే నలసినవియు నగు నిజకాంతకుచములపైన తనయురమునుని చికొని యాలింగనము చేసికొని రాత్రిని క్షణకాలమువలెగడపువాఁడు ధన్యుఁడు.

శ్లో. మందంమందం దినాంతే జ్వలతిహుతవహః పృష్ఠతః పార్శ్వతో వా
ధన్యో లోకస్తరుణ్యాస్స్తన జఘనపరీరంభ సంభోగసంగీ ।
ఉచ్చైస్స్వాలీవిలాసం సులలితశయనం క్వాపి తైలం సుగంధం
తాంబూలం తత్ప్రభోజ్యం తరుణివిరచితం వాసరే శైశిరేఽస్మిన్ ॥

తా. శిశిర ఋతువునందు-సాయంకాలమున కొంచెముగ ప్రజ్వలించుచున్న అగ్నిని వెనుకగానైనను ప్రక్కగానైనను ఉనిచికొనవలయు. యౌవనస్త్రీచే వండఁబడిన అన్నాదుల భుజించి, ఎత్తు తలగడలు వేసిన మంచిపాన్పునందు, అత్తరు మొదలగు సుగంధద్రవ్యములఁ బూసికొని మంచితాంబూలములొనర్చి నిజకాంతలయొక్క స్తనజఘనంబుల నాలింగనము చేసికొని సురతంబునకుఁ బ్రవర్తించువాఁడు ధన్యుఁడు.

## వసంతఋతుచర్య.

వా.— యత్ర వకుల తిలక నవమల్లికా కురవక ముచుకుంద సమూహసముత్థ సదాశివ్ఞమోదోన్మత్తకోకిలకూజితాన్యాకర్ణ్య మకరకేతు శరనికర పుంజ జర్జరీకృత విరహిణీసంఘాతో ముహుర్ముహుర్మోహముపైతి, అపిచ మలయాచలవాతచలిత చూతమంజరీనిచయ నిపతిత రేణురంజితశరీర షట్పదకుల కోలాహలాకులితవనాంతో యస్స వసంత ఇతి విజానీయాత్ ॥

తా. ఏఋతువునందు-వకుల (పొగడ) తిలక వృక్షములయొక్కయు, విరజాజి - ఎఱ్ఱనిపువ్వుముల గోరింట - ముచుకుందము - ద్రాక్ష ఈవృక్షములయొక్కయు వాసనచే మదించిన కోయిలలధ్వనులను వినుటవలన, మన్మథబాణములునాటిన విరహిణీజనసమూహము పలుమారు మోహమునుపొందుచున్నదో, మలయానిలముచే కదలి రాలిన మామిడిపుప్పొడి శరీరమునఁబడుటవలన వన్నెగలిగిన తుమ్మెదల ఝుంకారముచే సంకులంబగు వనాంతములుగలదో అది వసంతర్తువనఁబడును.

శ్లో. దిశో వసంతే విమలాః కాననైరుపశోభితాః ।
కింశుకాంభోజ వకుళ చూతాశోకాదిపుష్పితైః ॥
కోకిలాషట్పదగణై రుపగీతా మనోహరాః ।
దక్షిణానిలసంవీతాస్సుముఖాః పల్లవోజ్జ్వలాః ॥



తా. వసంతర్తువునందు దిక్కులు స్వచ్ఛములై వనములచేఁ బ్రకాశించుచుండును. పుష్పించిన-మోదుగ-తామర-పొగడ - మామిడి - అశోకవృక్షములుగలిగియుండును. తుమ్మెదలు-కోయిలలు మనోహరముగ శబ్దించుచుండును. దక్షిణానిలముచే వ్యాప్తములై సుందరము లగుచిగురుటాకులుగల వృక్షములు గలిగియుండును.

శ్లో. మల్లీవల్లీసమూహే సముదితకుసుమామోదమత్తాలిమాలా,
ఝూంకారోద్ఘుంకార నాదాకులపథికజనో వ్యాకులప్రోషితస్త్రీ।
మాకందానందమాద్యన్మధురపికకులాలాపదర్పో మనోజ్ఞః,
ప్రాప్తః కాంతో వసంత స్త్రిభువనవిజయః ప్రాణబంధుస్స్మరస్య॥

తా. మల్లెతీఁగెల సమూహమునందుఁ బుట్టిన పుష్పవాసనవలన మదించిన తుమ్మెదల ఝుంకారనాదమునకు ఆకులమునొందిన బాటసారులును. వ్యాకులమునొందిన ప్రోషితభర్తృకాస్త్రీలును, (మగఁడు దేశాంతరమునకేగియుండువారు) మామిడిపూదేనెను గ్రోలి మదించిన కోయిలల మధురాలాపములచే దర్పమునొందిన మన్మథుండును గలదియు, మన్మథునికి ప్రాణబంధువును, త్రిలోకములజయించునదియునైన వసంతఋతువు మనోహరముగనుండును.

శ్లో. కదలీదళనీలకోకిలాభిః కృతకోలాహలకాకలీప్రపంచః ।
మలయానిలమత్తవారణస్థోమదనశ్చైత్రచకార జైత్రయాత్రాం॥

తా. అరఁటియాకులవలె నీలము లగు కోయిలల మధురధ్వనులుగలవాఁడై మలయానిల మనెడిమత్తగజంబుపైనెక్కి, మన్మథుఁడు వసంతర్తువునందు దిగ్విజయయాత్రకు నైలు వెడలును (రాజులుజైత్రయాత్రకువెడలునప్పుడు, సేనలు జయశబ్దములు చేయునట్లు మన్మథుఁడు దిగ్విజయయాత్రకు వెడలునపుడు కోయిలలు శబ్దించును. రాజు మత్తగజంబుపైనెక్కి ప్రకాశించునట్లు, మన్మథుఁడు మలయానిలమనెడి మత్తగజంబుపైనెక్కి ప్రకాశించుననుట.)

శ్లో. కఫశ్చితోహి శిశిరే వసంతేఽర్కాంశుతాపితః ।
హత్వాగ్నిం కురుతే రోగానతస్తం త్వరయా జయేత్ ॥

తా. శిశిరర్తువునందుఁగలిగిన కఫము వసంతర్తువునందు సూర్యకిరణములవలన కరగి నీరై జఠరాగ్నిని నష్టపరచి యనేకరోగముల గలుగజేయును కావున నీదుష్టకఫమును శీఘ్రముగ జయించు ప్రయత్నము సేయవలయు.

శ్లో. తీక్ష్ణై ర్వమనసస్యాద్యై ర్లఘురూక్షైశ్చ భోజనైః ।
వ్యాయామోద్వర్తనాఘాతై ర్జిత్వా శ్లేష్మాణ ముల్బణం ॥

స్నాతో౽నులిప్తః కర్పూరచందనాగరుకుంకుమైః ।
పురాణయవ గోధూమ క్షౌద్ర జాంగల శూల్య భుక్ ॥
సహకారరసోన్మిశ్రా నాస్వాద్య ప్రియయార్పితాన్ ॥
ప్రియాస్యసంగసురభీన్ ప్రియానేత్రోత్పలాంకితాన్ ।
సౌమనస్యకృతో హృద్యాన్ వయస్యైః సహితః పిబేత్ ॥

తా. తీక్ష్ణద్రవ్యములచేతను, వమనవస్యాదులచేతను- లఘువులునురూక్షములు నగు భోజనములచేతను, సంచారము, నలుగుపెట్టుకొనుట, సాముచేయుట, వీనిచేతను కఫమును బోగొట్టుకొని, పిదపస్నానముచేసి, పచ్చకర్పూర చందన అగరు, కుంకుమ పుష్పాదులను శరీరమునకు బూసికొని, ప్రాతయవలు, గోధుమలు, తేనె, అడవిజంతువులమాంసము, వీనినిభక్షించవలయు తనప్రియురాలిచేఁగొంచెముభక్షించి యియ్యఁబడినవియు, ప్రియురాలివదనము దాకుటవలన సువాసన గలవియు, ప్రియురాలినేత్రములకు ఇంపైనవియు, మనోహరములు నగు మామిడిపండ్లరసము మొదలగువానిని వసంతర్తువునందు భక్షింపవలయు.

శ్లో. శృంగబేరాంబు సారాంబు మధ్వంబు జలదాంబు వా ॥

తా. సొంటిపొడి, చందనపొడి, తేనె, తుంగముస్తెలు ఇవి ప్రత్యేకముగ నొక్కొకదిమనువేసి కాచినజలమును త్రాగవలయు.

శ్లో. రూక్షంకషాయంకటుకంచతిక్తంతాంబూలకర్పూరమనోజ్ఞ వేషం।
క్షౌద్రేణ పథ్యాసహ సేవనీయా స్నేహేనతిష్ఠే ద్వనితాసహాయః॥

తా. రూక్ష-వగరు-కారము-చేఁదురసముల ననుభవించుట- పచ్చకర్పూరముతోఁగూడిన తాంబూలము వేసికొనుట, తేనెలో కరకపొడినికలిపిభక్షించుట - వనితతోఁబ్రీతిగఁగూడియుండుట-ఈకార్యములను వసంతర్తువునందుఁజేయవలయు.

శ్లో. దక్షిణానిలశీతేషు పరితో జలవాహిషు ।
అదృష్టనష్టసూర్యేషు మణికుట్టిమకాంతిషు ॥
పరపుష్టవిఘుష్టేషు కామకర్మాంతభూమిషు ।
విచిత్రపుష్పవృక్షేషు కాననేషు సుగంధిషు ।
గోష్ఠీకథాభి శ్చిత్రాభి ర్మధ్యాహ్నంగమయే త్సుధీః ॥

తా. దక్షిణపుగాలిచేఁ జల్లనై చుట్టు ప్రవహించెడి జలాశయములుగలవియు, వృక్షములు దట్టముగనుండుటవలన సూర్యరశ్మిలేనివియు, మణులుచెక్కిన గృహములుగలవియు, కోయిలలధ్వనులుగలవియు, సురతార్హములయినవియు, విచిత్రపుష్పవృక్షములయొక్క పరిమళముగలవియు నగుఉద్యానవనములయందుఁజిత్రకథలుసెప్పుకొనుచు మధ్యాహ్నకాలమును గడపవలయు.



శ్లో. గీతాంతరే చ విధివ త్సురతంనిషేవ్యం
డోలావిలాసశయనే హరిణేక్షణాభిః ।
సంవాహితో ఝుణఝుణత్కరహస్తతాళై
ర్ధన్య స్స్వహర్మ్యసమయే విచినోతి నిద్రాం ॥

తా. ప్రథమమునఁ బ్రియురాలి మనోహరగానమును వినుచు సురతంబొనర్చి భార్యతోఁగూడ విలాసముగ నుయ్యాలలూగి ఝుణఝుణయని కరతాళంబులొనర్చి నిజహర్మ్యంబులయందు నిద్రించువాఁడు ధన్యుఁడు.

శ్లో. స్నిగ్ధ శ్చందనకుంకుమప్రభృతిభిః కర్పూరసమ్మిశ్రితై
శ్శయ్యాంధూపితధౌతవస్త్రరచితా మాస్థాయ రమ్యే గృహే ।
గాఢాలింగనచుంబనాదిరచితై స్సంవర్ధయ న్మన్మథం
సేవేత్తాంప్రమదాం వసంతసమయే శ్లేష్మక్షయార్థం పుమాన్ ॥

తా. కుంకుమపువ్వు-పచ్చకర్పూరము చేర్చిన చందనమును పూసికొని. అగరుధూపాదులువేసిన తెల్లనివస్త్రములు పరచిన పాన్పునందు గాఢాలింగన చుంబనాదిపూర్వకముగ మన్మథోద్రేకముగలిగించి భార్యనుగూడవలయు. ఇట్లు వసంతర్తువునందు జేసిన - ప్రబలమైనకఫము నశించును.

శ్లో. ఉద్వర్తనం వాంతివిరేకనస్యా న్యయేప్రియే! చంక్రమణం వ్యవాయం।
వ్యాయామమేణాక్షి! వసంతకాలే బాలే హితాన్యాహురమూని వైద్యాః॥

తా. దేహమునకు నలుగుపెట్టుకొనుట, వమనవిరేచనములకుఁ దీసికొనుట, నస్యకర్మ, సంచారము, సురతము, సాము ఇవి వసంతర్తువునందు హితంబులు.

శ్లో. కాశ్మీరకృష్ణాగరుచందనై శ్చ కృతో విలేపోవిహితో హితాయ।
అగ్ర్యా నిశా వాసకమాతులానీ కటుత్రయంగ్రంథిక మశ్వగంధా॥
యవానికా జీరక మార్ద్రికం చ పునర్నవామూలకపోతికా చ।
కూష్మాండకం రామఠ మేధికేచ హితాయ తుంబీత్రపుసంసుపక్వం॥

తా. కుంకుమపువ్వు - కృష్ణాగరుకలసిన చందనమును పూసికొనుట, కరక, తాడి, ఉసిరిక, పసుపు, అడ్డసరము, జనపవిత్తులు, సొంటి, పిప్పలి, మిరియాలు, మోడి పెన్నేరుగడ్డ, ఓమము, జీలకర్ర, అల్లము, గలిజేరు, ముల్లంగి, బచ్చలికూర, బూడిద

గుమ్మడికాయ, ఇంగువ, మెంతులు, సొరకాయ, దోసపండు, ఇవి వసంతర్తువునందు హితకరములు.

శ్లో. దుగ్ధికావాస్తుకః కాంచనారోద్భవః కుట్మలస్స్యాద్ధితా మైవనృణాంప్రియే।
తండులీయః పటోల స్తథాసూరణో మారిషః కారవేల్లం చ కోశాతకీ॥

తా. పిన్నపాల, చక్రవర్తికూర, మందారపుమొగ్గలు, చిత్రికూర, పొట్లకాయ, కంద, నీరుచిత్రికూర, కాకరకాయ, బీరకాయ, ఈపదార్థములు వసంతమునందు హితకరములు.

శ్లో. మాగధీక్షౌద్రయుక్తా తథాపూతనా జాంగలానాంపలం షష్టికాసర్షపాః।
వాజిమంధో మసూరస్తథాయవో ముద్గకోవర్తులశ్చాఢకీకోద్రవాస్స్యుర్హితాః॥

తా. తేనెతోఁగూడిన పిప్పలి కరక్కాయలపొడి- అడవిజంతువులమాంసము - అరువదిదినములలో ఫలించెడిధాన్యము- తెల్లావాలు- సెనగలు-ఏనుఁగుపెసలు - యవలు పెసలు-లంకధాన్యములు- కందులు-ఆరికెలు; ఇవి వసంతమునందు హితంబులు.

శ్లో. తృణధాన్యం వరారోహే! మసూరీ రక్తశాలయః।
రాజకాజ్జుర్ణలీ చంచమా శిగ్రుః పక్వాంకలింగకం॥
వృంతాకం శిగ్రుపుష్పాణి రసోనం రసికప్రియే!।
లఘు రూక్షం కటూష్ణం య ద్ధితం తత్కుసుమాగమే॥

తా. చామలుమొదలగు తృణధాన్యములు, అనుములు, ఎఱ్ఱరాజనాలు, నల్లావాలు, మునగపూలు, వెల్లుల్లి, లఘువులును రూక్షములును కారములును ఉష్ణకరములగు పదార్థములు ఇవియన్నియు వసంతమునందు హితకరములు.

శ్లో. రస స్తీక్ష్ణః కషాయ శ్చ క్షార శ్చోరుష్కరం తథా।
స్వేదనం ధూమపానం చ గండూషః ప్రతిసారణం।
ప్రావరణం ప్రథమనం హ స్త్యశ్వై ర్గమనం భృశం।
నియుద్ధం మాక్షికం మద్యం జీర్ణ ముష్ణం గవాంపయః॥
తాంబూల మంజనం లాజా శ్చింతా జాగరణం శ్రమః।
వసంతే చ గణో గుణ్యో వాసంతీసుమకోమలే!॥

తా. తీక్ష్ణ, కషాయ, క్షారరసములును, జీడిగింజ, స్వేదనకర్మ(చెమటదీయుట) ధూమపానము(ఉక్కాపట్టుట) గండూషము-నస్యకర్మ, ఏనుఁగు గుఱ్ఱము వీనిమీఁద ఎక్కితిరుగుట, కుస్తిపట్టుట, ప్రాఁతతేనె, సుఖోష్ణక్షీరము, తాంబూలము, కన్నులకు కాటుకపెట్టుకొనుట, పేలాలు, చింతించుట, మేలుకొనుట, శ్రమపడుట. ఇవి వసంతర్తువునందు హితకరములు.



శ్లో. పానీయం నైర్ఝరం వాప్యం కౌప్యం హంసోదకం వరం।
గోధూమా శ్చ త్సముక్షీయా స్తథా వహ్నోషితా నపి॥
కఫామయహరీ ఖ్యాతా తత్రా ప్యంగారకర్కటీ।
నటీవా నందదా నాట్యే తాళాంతే చలకుండలా॥

తా. సెలయేఱు, కోనేరు, నూయి వీనియందలి జలము, హంసోదకము, ప్రాఁతగోధుమలు, నిప్పుమీఁద కాల్చిన గోధుమరొట్టె, వేశ్యానృత్యదర్శనము, ఇవి వసంతమునందు హితంబులు.

శ్లో. వ్యోషక్షారయుతం తక్రం క్వథితా క్వాథలీ తథా।
శశాజహారిణం మాంసం తైత్తిరం వార్తికం వరం॥
గృహచటకస్య చ మాంసం నీరదరావస్య చానిషం మత్స్యాః॥
నాదేయాస్తాడాగా శ్చోద్యా శ్చ శ్రిష్టా శ్చ మత్స్యకాః క్షుద్రాః॥

తా. సొంటి. పిప్పలి, మిరియాలు, యవక్షారము ఇవి కలిపిన మజ్జిగ, మజ్జిగపులుసు, కుందేలు-మేకపోతు-జింక-తిత్తిరిపక్షి-వెలిసెపిట్ట- ఇంటిపిచ్చుక-నెమలి- వీనిమాంసము- నది చెఱువు వీనియందలి మత్స్యములు, చిన్నచేపలు ఇవి వసంతకాలమున హితంబులు.

వసంతఋతువునం దపథ్యము.

శ్లో. నాడికో పోదికా రాజకోశాతకీ
మాషదధ్యాలుకా నీశుశృంగాటకౌ।
రాజమాషాం శ్చ నీవారకుల్మాషకా
నాలుకం మేషమాంసం త్యజే త్కైక్కటం॥

తా. పెఱుగుతోటకూర, బచ్చలికూర, పెద్దబీర, మినుములు, పెఱుగు, తెల్లసొరకాయ, చెఱకు, పరికెగడ్డ, అలచందలు, నివ్వరిధాన్యము, కారామణులు, గొఱ్ఱెపోతు కోడి వీనిమాంసము, ఈపదార్థములు వసంతమునం దపథ్యము.

శ్లో. కృసరా పృథుకేక్షువికార మయే! మహిషీభవదుగ్ధమురోజఘనే!।
వటకానపి మాషకృతాంశ్చపలాండు మితీహ వసంతఉశంత్యహితం॥

తా. నువ్వులు (లేక) పప్పువేసివండినపులగము, అటుకులు, చెఱకురసము, కలకండ, బఱ్ఱెపాలు, మినపవడలు, ఉల్లిగడ్డలు, ఇవి వసంతమునం దపథ్యములు,

శ్లో. అమ్లం స్నిగ్ధం దివాస్వాపం దుర్జరం భోజనం ప్రియే! ।
త్యాజ్య మాహు రయే! వైద్యా వసంతర్తౌ హితేప్సుభిః ॥

తా. పులుసు, జిగట గలవియు అజీర్ణములు నగు పదార్థములు, పగటినిద్ర, వీనిని వసంతఋతువునందు వర్జింపవలయు.

శ్లో. స్నాతః కవోష్ణనీరై రాభూషితో నిజకాంతయా సార్థం ।
గత్వోపవనేప శ్యే ద్రమే చ్చ త్వత్రైవ నిర్జనేదేశే ॥

తా. ఈఋతువునందు సుఖోష్ణజలస్నానముచేసి వస్త్రాదులచే నలంకృతుఁడై, నిజభార్యతోఁగూడ ఉద్యానవనమునకేగి నిర్జనప్రదేశమునఁ గ్రీడించుచు సుఖముగ నుండవలయు.

---

## గ్రీష్మఋతుచర్య.

వా.—తీవ్రతర దినకర సంజాత సంతాప సంతాపిత శరీర పాంథసార్థ సంసేవిత మార్గ పాదపచ్ఛాయా విపులపిపాసావిధురమృగయూథ మరుస్థలీస్థాన పరుషతరవిచలితమారుత నికటతటినీతట తరుపత్రనికరకలుషితసలిలాశయో యస్సనిదాఘ ఇతి విజానీయాత్ ॥

తా, మిక్కిలితీక్ష్ణముగనుండు సూర్యునివలనగలిగిన సంతాపముచే దపించిన బాటసారులచే నాశ్రయింపఁబడిన మార్గమునందలి చెట్లనీడ గలదియు మిక్కిలిదప్పిచే డస్సిన మృగసమూహముగలదియు, చౌటిభూములయందుఁ గఠోరముగా వీచుచున్న గాలిగలదియు, గట్టునందలి వృక్షములనుండిరాలిన ఆకులచేఁ గలుషితములయిన జలాశయములు గలదియు నైయుండునది గ్రీష్మర్తువని యెఱుంగవలయు.

శో. గ్రీష్మే తీక్ష్ణాంశు రాదిత్యో మారుతో నైరృతో౽సుఖః ।
భూ స్తప్తా సరిత స్తన్వ్యో దిశః ప్రజ్వలితా ఇవ ॥
భ్రాంతచక్రాహ్వయుగళాః పయఃపానాకులామృగాః ।
ధ్వ స్తవీరు త్తృణలతా విశీర్ణాంకితపాదపాః ॥

తా. గ్రీష్మర్తువునందుసూర్యుఁడు మిక్కిలితీక్ష్ణము లగుకిరణములుగలిగియుండును, గాలి నిరృతిమూలనుండి యసౌఖ్యముగలుగునట్లు విసరును. భూమి కాలి నదులు శుష్కములయి దిక్కులు ప్రజ్వలితములయియుండును; చక్రవాక పక్షులు వేఱువేఱై తిరుగుచుండును. మృగములు దప్పిగొని నీళ్ళకు దిరుగుచుండును; పొదలు, గడ్డి, తీఁగెలు, ఇవి యెండిపోయి యుండును; చెట్లఆకులు ఎండి రాలిపోవును.



శ్లో. తీక్ష్ణాంశురతితీక్ష్ణాంశు ర్గ్రీష్మే సంక్షిపతీవయత్ ।
ప్రత్యహం క్షీయతే శ్లేష్మ తేన వాయుశ్చ వర్ధతే ॥
అతో౽స్మిన్ పటుకట్వమ్ల వ్యాయామార్కకరాం స్త్యజేత్ ।
భజే స్మధుర మేవాన్నం లఘు స్నిగ్ధం హిమం ద్రవం ।
సుశీతతోయైస్సిక్తాంగో లిహ్యా త్సక్తూన్ సశర్కరాన్ ॥

తా. గ్రీష్మర్తువునందు సూర్యుఁడు మిక్కిలి తీక్ష్ణములయిన కిరణములుగలవాఁడై భూమియందలి జిగటను హరించుటవలన నిత్యము కఫము క్షీణించి వాతమువృద్ధియగును; కావున, ఉప్పు, పులుసు, కారము ఈరసములు, దండకసరత్తు, ఎండ వీనిని వర్జింపవలయు. మధురాన్నమును లఘు, స్నేహ, శీతల ద్రవపదార్థములను, శీతోదకస్నానమును, చక్కెరగలిపిన పేలపిండి పదార్థములను భక్షింపవలయు.

శ్లో. కుందేందుధవళం శాలి మశ్నీయా జ్జాంగలైః పలైః ।
పిబే ద్రసం నాతిఘనం రసాలాం రాగఖాండవౌ ।
పానకం పంచసారం వా నవమృద్భాజనే స్థితం ।
మోచచోచదలై ర్యుక్తం సామ్లం మృణ్మయశుక్తిభిః ॥

తా. తెల్లనిబియ్యపు అన్నమును అడవిజంతువులమాంసముతోడ భుజింపవలయు. మిక్కిలిగట్టిలేక పలచనగనుండు మాంసరసమును త్రాగవలయు. రాగ ఖాండవములను (అనఁగా, చక్కెర - తేనె - మామిడిపండు మొదలగు మధురరసములు రాగములనఁబడును. వీనియందు పులుసు కలిపిన ఖాండవములనఁబడును.) ద్రాక్ష-ఖర్జూరము - ఈత - దానిమ్మ మొదలగువాని రసములతోఁజేయఁబడిన పానకములను, క్రొత్తకుండలోఁబోసి కొంచెమునేపునిచి తీసి, అరఁటి (లేక) పనసఆకులదొన్నెలలోనైనను మట్టిపిడతలలోనైనను పోసి కొంచెముపులుసుకలిపి పానము చేయవలయు.

శ్లో. పాటలావాసితం చాంభ స్సకర్పూరం సుశీతలం ।
శశాంకకిరణా న్భక్ష్యాన్ రజన్యాం భక్షయన్ పిబేత్ ॥
ససితం మాహిషం క్షీరం చంద్రనక్షత్రశీతలం ॥

తా. వెన్నెలసోఁకినవియు, పచ్చకర్పూరము-పాదిరిపువ్వు వీనివాసనపట్టించినవియు నగు జలమును త్రాగవలయు. రాత్రులయందు-పచ్చకర్పూరముచేర్చినభక్ష్యములను, చక్కెరతోఁగూడిన బఱ్ఱెపాలను సేవించవలయు.

శ్లో. అభ్రంకషమహాశాల తాలరుద్ధోష్ణరశ్మిషు ।
వనేషు మాధవీశ్లిష్ట ద్రాక్షాస్తబకశాలిషు ।

సుగంధహిమపానీయ సిచ్యమాన పటాలికే ।
కాయమానే చితే చూతప్రవాలఫలలుంబిభిః ॥
కదళీదళకల్హార మృణాలకమలోత్పలైః ।
కల్పితేకోమలై స్తల్పే హసత్కుసుమపల్లవే ।
మధ్యందినేఽర్కతాపార్త స్స్వప్యాద్ధారాగృహేఽథవా ।
పుస్తస్త్రీ స్తనహస్తాస్య ప్రవృత్తోశీరవారిణి ॥

తా. మిక్కిలి యున్నతములగు ఏపి, తాటిచెట్లచే కానరాకుండెడి సూర్యకిరణములుగలవియు, మల్లెతీఁగెలు అల్లుకొనిన ద్రాక్ష గోత్తులుగలవియు నగువనములయందు, సుగంధముగల పన్నీరుచేఁ దడుపఁబడిన వస్త్రముల పరజాలుగలదియు, లేఁతచిగుళ్లు పిందెలుగల మామిడిమండలు, అరఁటియాకులు, కొంచెము ఎఱ్ఱనికలువపువ్వులు, తామరతూండ్లు, తామరపూలు, కలువపూలు, వీనిచే నేర్పరచబడినపాన్పుమీద, పుష్పములను, చిగురుటాకులనుపరచి గృహమునకుచుట్టు స్త్రీప్రతిమల నేర్పరచి యాప్రతిమల స్తన, హస్త, ముఖములగుండా సన్నని యుదకధారలు పడునట్లేర్పరచి మధ్యాహ్నకాలమునందు, ఎండచేఁదపించినవాఁడు శయనించవలయు.

శ్లో. సరాంసి వాపీ సరితోవనాని స్రక్చందనం శీతగృహంచ సేవ్యం ।
గుడేన పథ్యాసహ సేవనీయా మంథః ప్రయోజ్యః కిల ఘర్మకాలే ॥

తా. సరస్సులు - కోనేర్లు - నదులు - వనములు - పుష్పమాలలు - చందనము - చల్లనియిండ్లు - వీనిని ఎండకాలమునం దనుభవింపవలయు. బెల్లములో కరక్కాయపొడి కలిపి భక్షించవలయు. పిండిలో నేయి కొంచెముచన్నీళ్లుపోసి కొంచెముగట్టిగనుండునట్లు కలిపి భక్షించవలయు.

శ్లో. స్రోతోనిదాఘసమయే సితసూక్ష్మవాసో
హేమాహ్వచంపక నిపీళిత కేశపాశః ।
శ్రీఖండతోయ మృగనాభి వికుంఠితాంగో
ధన్యః క్షపాం క్షపయతే క్షణలబ్ధనిద్రః ॥
—అతిశిశిరపయోభిః క్షాళితేసౌధపృష్ఠే
సురభికుసుమయుక్తాం సమ్యగాస్థాయ శయ్యాం ।
శశధరకిరణౌఘైర్మారుతైశ్చ ప్రసక్తైః
ప్రశమితపరితాపోఽగ్లానియోగ్యం శయీత ॥

తా. చెమటకారునప్పుడు గ్రీష్మ సమయమని యెఱింగి అప్పుడు - తెల్లని సన్న



నివస్త్రములు ధరించవలయు. పద్మకేసరములు - సంపెంగపూలు వీనిని శిఖయందు ధరించి కస్తూరికలిపిన చందనమును పూసికొని శీఘ్రముగ నిద్రించువాఁడై గ్రీష్మఋతురాత్రులనుగడపువాఁడు ధన్యుఁడు. మఱియు మిక్కిలిచన్నీళ్ళతోఁగడిగిన మేడలో చంద్రకిరణములు - గాలియు ప్రసరించుప్రదేశమునందు సుగంధపుష్పశయ్యయందు శ్రమగలుగకుండునట్లు శయనించవలయు.

శ్లో. వర్జయే ల్లవణామ్లోష్ణం కటు వ్యాయామ మైథునం ।
ధారయే దురసా హారం సూక్ష్మవస్త్రధరో భవేత్ ॥
ప్రాప్తమధ్యాహ్నసమయే ఉశీరస్యోపవీజనం ।
శయీత భూగృహం గచ్ఛే దథవా రుచిరం వనం ॥

తా. గ్రీష్మర్తువునందు ఉప్పు - పులుసు - కారము - ఈరసములు - ఉష్ణపదార్థములు - సంచారము - సురతము - వీనినివర్జించవలయు. ముత్యాలహారమును తెల్లవస్త్రమునుధరించవలయు. మధ్యాహ్నసమయమున వట్టివేళ్ళవిసనకఱ్ఱతో విసరుకొనవలయు. భూగృహములయందుగాని, మంచివనములయందుగాని నివసించవలయు.

శ్లో. మద్యం నపేయం పేయంవా స్వల్పం సుబహు వారివా ।
అన్యథా శోఫశైథిల్య దాహ మోహాన్ కరోతి తత్ ॥

తా. గ్రీష్మర్తువునందు మద్యమును త్రాగకూడదు. వాతప్రకృతిగలవాఁడు-వాతమునశించుటకు త్రాగునెడల కొంచెముగ త్రాగవలయు. కఫపిత్త ప్రకృతిగలవాఁడు కఫము నశించుటకు మిక్కిలి నీళ్లుకలిపి త్రాగవలయు. అటుగాక విపరీతముగ త్రాగినయెడల, వాపు - శైథిల్యము - తాపము - మోహము మొదలగురోగములు గలుగును.

గ్రీష్మర్తువునందు పథ్యము.

శ్లో. శాలయష్షష్టికా గ్రీష్మకాలే యవా జూర్ణలీ ముద్గ నీవారగోధూమకాః
వర్తులశ్చాఢకీ కోద్రవా వల్లకాః ఖండికాస్స్యుర్హితా వైమసూరీప్రియే

తా. శాలిధాన్యము, అరువదిదినములకు ఫలించినధాన్యము, యవలు, జొన్నలు పెసలు, నెవ్వరిధాన్యము, గోధుమలు, లంకలు, కందులు, ఆరికెలు, అనుములు, బోడసెనగలు ఇవి గ్రీష్మర్తువునందు హితకరములు.

శ్లో. కాలింగంస్యాదపక్వం త్రపుసమపితథా కర్కటీచాప్యపక్వా
కూశ్మాండం కారవెల్లం ఘనకుచరుచిరే ! వాస్తుకో మేఘనాదః ।
చంచూతుంబీ పటోలం దధి మధుర మయే! శర్కరామిశ్రితంవై
తద్వత్తక్రం సితాఢ్యం నవనలినకరే ! గ్రీష్మకాలే హితాస్స్యుః ॥

తా. పుచ్చకాయ - దోసపండు - నక్కదోసకాయ- బూడిదెగుమ్మడుకాయ- కాకరకాయ - చక్రవర్తికూర - చిత్రికూర - పొలముబచ్చలికూర - సొరకాయ - పొట్లకాయ-చక్కెరగలిపినమీగడపెరుగు-కలకండగలిపినమజ్జిగ ఇవిగ్రీష్మమునహితములు.

శ్లో. ప్రియే! కోశాతకీశ్రేష్ఠా మారిష శ్చాప్యుపోదికా ।
గ్రీష్మర్తౌ సుహితే బాలే! శృంగాటకకశేరుకౌ ॥
పానీయం నైర్ఝరం వాప్యం కౌప్యం శ్రేష్ఠంనిదాఘకే ।
సితా చేక్షుగణో బాలే! పూజిత స్తద్రసోపిచ ॥
సేవికా స్సితయాసార్ధం భక్షితాస్సుహితా మతాః ।
శృతశీతం పయోనీరం శీతలం పానకం హితం ॥

తా. బీరకాయ - నీరుచిత్రికూర - పొలముబచ్చలికూర-పరికెగడ్డ-నమ్మదుంప-ఈకూరలు, సెలయేఱు - కోనేరు - నూయి వీనియందలినీళ్లు, కలకండ - చెఱకురసము - పెసరపిండితోఁజేయఁబడి చక్కెరతోగూడిన సేవికమను భక్ష్యములు, కాఁగి చల్లారినపాలు - శీతలజలము - పానకము ఇవి గ్రీష్మర్తువునందు హితంబులు.

శ్లో. చంద్రపాదా దివాస్వప్నం చందనం తరణం చ కే ।
లఘు స్నిగ్ధం ద్రవం పథ్యం కాయస్థా సగుడా హితా ॥
ఉశీరై శ్ఛాదితం గేహం సిక్తైర్నీరై స్సుగంధిభిః ।
శీతలంచ తరుచ్ఛాయా ద్రాక్షాచో శీరవీజనం ।
దుగ్ధాంధశ్చ ప్రసూనాని బాలాయా అధరామృతం ।
హితా న్యాహు రయేబాలే! గ్రీష్మే వైద్యా ఇమాని హి ॥

తా. వెన్నెల - పగటినిద్ర - చందనలేపనము - నీళ్లలోనీదుట - లఘు స్నిగ్ధపదార్థభోజనము - బెల్లములోఁగలిపిన కరక్కాయపొడి - సువాసనగల జలములచేఁ దడిపిన వట్టివేళ్ళుకట్టిన శయనగృహము - శీతలపదార్థములు - చెట్లనీడ - ద్రాక్ష-వట్టివేళ్ల పంఖాలు - పాలఅన్నము - పుష్పములు - బాలస్త్రీయొక్క అధరామృతము-ఇవి గ్రీష్మమునందు హితంబులు.

గ్రీష్మర్తువునందపథ్యము

శ్లో. క్షారామ్లకటుఘర్మాణి మద్యం తీక్ష్ణం పటు ప్రియే! ।
లఘూష్ణ తిలతైలాని త్యాజ్యా న్యాహు ర్భిషగ్వరాః ॥

తా. ఉప్పుగనుండుపదార్థములు - ఉప్పు - పులుసు - కారము - ఎండ - మద్యము, తీక్ష్ణ - లఘు - ఉష్ణపదార్థములు, నూనె ఇవి గ్రీష్మమునందు వర్జ్యములు.



శ్లో. వృంతాకం చ కలింగం పక్వం శిగ్రూశ్చ గృంజనం మాషాః ।
నిష్పావ కంగు కృసరా భయ శుక్క్రోధాఇమేఽహితా గ్రీష్మే ॥

తా. వంకాయ-పుచ్చపండు-మునగ-వెల్లుల్లి-మినుములు-అనుములు-కొఱ్ఱలు-పొంగలి-భయము-దుఃఖము-క్రోధము, ఇవి గ్రీష్మర్తువునందు వర్జ్యంబులు.

శ్లో. సర్షపా రాజికామస్తు వటకా మాషసంభవాః ।
క్వథితా మేష మాంసంచ విదగ్ధాన్నం చ మైథునం ॥
—ఉపవాసోపగమన మాయాసో దధి పిణ్యాక మతసికా కాంతే! ।
కథితం వా ఇదమహితం బాలే! అయి గోధాపిశిత మపీత్థం స్యాత్

తా. ఆవాలు-తెల్లావాలు-మీగడ-మినపవడియములు-మజ్జిగపులుసు -మేఁకపోతుమాంసము-చెడిపోయినఅన్నము సురతము-ఉపవాసముండి త్రోవనడుచుట-శ్రమము పెఱుఁగు - తెలికపిండి - అగసికూర - ఉడుముమాంసము ఇవి గ్రీష్మమునవర్జ్యంబులు.

శ్లో. ఉన్నిద్రతా మగ్ని సేవాం త్యజే త్తీవ్రం సమీరణం ।
సూర్యతప్తజలస్నానం గ్రీష్మకాలే ఘటస్తని! ।

తా. రాత్రిమేల్కొనుట - అగ్నిసేవ - పెనుగాలి - ఎండకుఁగాగిన నీళ్ళతో స్నానము - ఇవి గ్రీష్మమునందహితంబులు.

---

వర్షర్తుచర్య.

వా. —అభినవ తమాలపల్లవ నీలజలధర ధ్వనిత ముదిత మయూర సంఘట్టవిస్తార స్వనముఖరితకాననః కేతకీ కదంబ కుసుమ నిచయాతిశయ సుగంధ రమణీయమారుతసందీపిత మదన దావానల దాహ వేదనా విధురిత విరహిజన నికరో గగనతల పతిత విపుల సలిల పరిపూర్ణ బహుల జల కల్లోల సంఘట్ట ఘటితసంవాహినీ సంఘాతో యస్స వర్షా ఇతి విజానీయాత్ ॥

తా. చీఁకటిమ్రానుల చిగురుటాకులవలె నల్లనైన మేఘముయొక్క గర్జనమునకు సంతోషించిన నెమళ్ల సమూహముయొక్క ధ్వనిగలయరణ్యములును, మొగలి కడిమి వీనిపుష్పముల వాసనగలిగి రమణీయముగా వీచుచున్నగాలివలన నతిశయించిన మదనాగ్ని వేదనగల విరహిజనులును, ఆకాశమునుండిపడిన విస్తారజలము నిండుటవలన గొప్పతరంగములతోగూడిన నదులును గలిగియుండునది వర్షర్తువని యెఱుంగునది

శ్లో. తత్ర వర్షాసు నద్యంభః పురోద్భగ్న తటద్రుమాః ।
వాప్యః ప్రోత్ఫుల్లకుముద నీలోత్పలవిరాజితాః ॥
భూ రవ్యక్తస్థలశ్వభ్రా బహుసస్యోపశోభితా ।
నాతిగర్జత్స్రవన్మేఘనిరుద్ధార్కగ్రహంనభః ॥

తా. వర్షర్తువునందు, ప్రవాహజల మతివేగముగ వచ్చుటవలన నదులు విరిగి నగట్లు చెట్లునుగలవై యుండును; కోనేఱులయందు తెల్లకలువ, నల్లకలువ ఇవిబాగుగ వికసించియుండును. భూమిపల్లములుఁబడి నీళ్ళునిండి కనబడకయుండును. మిక్కిలి పచ్చికగలిగియుండును; మిక్కిలిగర్జింపక వర్షించుచున్న మేఘములచే నాకస మాచ్ఛాదింపఁబడి సూర్యుఁడు నక్షత్రములును గనబడకయుండును.

శ్లో. కేకీ కూజతి కాననే చ సరసీ మ్లానాంబుపూర్ణాతథా,
హంసామానస మావ్రజంతి కమలాని మ్లానతాంయాంతి చ ।
గర్జన్మేఘమహీధ్రకందరదరీసస్యావృతా శ్యామలా,
భాత్యేవం పవనస్య కోపనకరీ వర్షాఋతు శ్శ్రియసీ ॥

తా. వనములయందు నెమళ్ళు ధ్వనించుచుండును, సరస్సులయందు జలములు కలకబారియుండును, హంసలు మానససరస్సున కేగును, పద్మములు ముకుళించియుండును, గర్జించుచున్న మేఘముల ధ్వనులు పర్వతగుహలయందునిండి ప్రతిధ్వనులు గలుగును, భూమి పచ్చికగలిగి పచ్చనైయుండును. ఇట్టివర్షర్తువు జనులకు వాతమును ప్రకోపింపజేయును.

వర్షాకాలమునందు పథ్యము.

శ్లో. గోధూమా షష్టికామాషాః కుళుత్థా రక్తశాలయః ।
రాజికాప్రావృషి శ్రేష్ఠాతసీసిద్ధార్థఇత్యపి ॥
కూష్మాండం త్రపుసంపక్వం తథాపక్వం కలింగకం ॥
కోశాతకీ చ వృంతాకం వాస్తుకో మారిషోఽపిచ ।
—చంచూపటోలా లశునః పలాండు స్సైంధవంతక్రముపోదికాచ।
మద్యం సితా శిగ్రురయే! రసాలా చౌద్యం ప్రియే సారస మంబుపథ్యం॥

తా. గోధుమలు, అఱువది దినములకు ఫలించెడి ధాన్యము, మినుములు, ఉలవలు, ఎఱ్ఱబియ్యము, ఆవాలు, అగసివిత్తులు, తెల్లఆవాలు, బూడిదెగుమ్మడికాయ, దోసపండు, పుచ్చపండు, బీరకాయ, వంకాయ, చక్రవర్తికూర, నీరుచిర్రికూర, పాలము బచ్చలికూర, పొట్లకాయ - తెల్లగడ్డలు, ఉల్లిగడ్డలు, సైంధవలవణముకలిపినమజ్జిగ,



మద్యము, తెల్లచక్కెర, మునగకాయ, దొన-గుంట వీనియందలి నీళ్ళు ఇవి వర్షర్తువునందు హితంబులు.

శ్లో. సగుడందధి చేక్షుగణం కృసరా ఘృతపూరక పాయసకం సఘృతం ।
క్వథితాహరిణాజకపోతపలం శశతిత్తిరవార్త్తిరమాంస మపి ॥

తా. బెల్లముకలిపిన పెరుగు, చెఱకు, పొంగలి, ఘృతపూరభక్ష్యము, నేయి పోసిన పాయసము, మజ్జిగపులుసు, జింక - మేఁక - పావురాయి - కుందేలు - తిత్తిరిపక్షి - వెలిసెపిట్ట - వీనిమాంసము ఇవి వర్షర్తువునందు హితంబులు.

శ్లో. శృతందుగ్ధం చ ధాన్యాక మగ్నిసేవా చ వాస్తుకః ।
పద్మబీజం చ ఖర్జూరం బీజపూర శ్చ మారిషః ।
మహాకోశాతకీ చంచూ సుపక్వంకరమర్దకం ।
తూత మంజీరకంపక్వం సుపక్వంబదరీఫలం ।
ఆమ్రమామం తథాపక్వం నారికేలం గవాంపయః ।
దుగ్ధమాజం జలందివ్యం పనసః కదలీఫలం ॥
దధి కోశాతకీ ఖండం శక్రగోధూమముద్గకాః ।
పాయసం లప్సికాపూప షష్టికా రక్తశాలయః ।
క్షుద్రమత్స్య స్తథా హర్మ్య శయనం లలనోత్తమే! ।
మనుష్యాణాం హితాయైతే వర్షర్తా స్వ్య రహర్నిశం ॥

తా. కాచినపాలు, ధనియాలు, నిప్పుసెగకాచుకొనుట - చక్రవర్తికూర, తామరగడ్డ, ఖర్జూరపండు, మాదీఫలము, నీరుచిర్రికూర - నేతిబీరకాయ - పాలము బచ్చలికూర, కలివిపండ్లు, సీమఅత్తి, రేఁగుపండు, మామిడికాయ, మామిడిపండు, కొబ్బెర, ఆవుపాలు, మేఁకపాలు, వర్షోదకము, పనసపండు, అరఁటిపండు, పెఱుగు, బీరకాయ, చక్కెర, మజ్జిగ, గోధుమలు, పెసలు, పరమాన్నము, లప్సికభక్ష్యము, అప్పము, అఱువదిదినములకు ఫలించినధాన్యము- ఎఱ్ఱధాన్యము- చిన్నచేఁపలు, మేడలలోశయనించుట, ఇవి వర్షాకాలమునందు హితకరంబులు.

వర్షర్తువునం దపథ్యము.

శ్లో. ఆమాంకర్కటికాం తుంబీ మామం చ త్రపుసం యవాన్ ।
రాజకోశాతకీం నాడీం డిండిసం కారవెల్లకం ।
కర్కోటకం చ పాలక్యాం శృంగాటం చ కశేరుకం ।
ఆలుకం మాహిషం క్షీరం ప్రావృట్కాలే వివర్జయేత్ ।

నిష్పావం వర్తులంకంగు రాజమాషం మకుష్ఠకం ।
త్రిపుటాం శ్చణకాన్ ముద్గాన్ మసూరీ మాఢకీం త్యజేత్ ॥

తా. నక్కదోసకాయ, సొరకాయ, పుచ్చకాయ, యవలు, నేతిబీరకాయ, నాడీశాకము, కాకరకాయ, ఆగాకరకాయ, పాలకికూర, పరికెగడ్డ, నమ్మదుంప, చేమగడ్డ, బచ్చలిపాలు, అనుములు, లంకధాన్యము, కొఱ్ఱలు, అలచందలు, ఏనుఁగు పెసలు, బొడసెనగలు, సెనగలు, చిఱుసెనగలు, కందులు, ఇవి వర్షర్తువునవర్జ్యములు.

శ్లో. వల్లూరం కోద్రవాన్ శ్యామే! శ్యామాకం జూర్ణలీ మపి ।
నీవారం లంఘనం చైవ కుల్మాషా నపి వర్జయేత్ ।
అతివ్యావాయ మేణాక్షి! బలవద్విగ్రహం తథా ।
అతివ్యాయామకం చైవాధ్వశనం పరివర్జయేత్ ॥

తా. ఎండినమాంసము, ఆరికెలు, చామలు, జొన్నలు, నివ్వరిధాన్యము, అలచందలు, లంఘనము, అతిమైథునము, బలవంతునితో విరోధము, జీర్ణముకాకమునుపు భక్షించుట, వీనిని వర్షర్తువునందు వర్జింపవలయు,

శ్లో. ప్రధావనం ప్రతపన మభిఘాతం ప్రపీడనం ।
ప్లవనం తరణం రాత్రి జాగరం విషమాశనం ।
భారప్రహరణం వాత మూత్రవర్చోనిరోధనం ।
క్షువథూద్గారబాష్పాణాం నిరోధం ఛర్దిశుక్రయోః ।
శీతవీర్యం కషాయం చ కటుతిక్తలఘూని చ ।
రూక్షం చ శుష్కశాకం చ వర్జయే త్ప్రావృషి ప్రియే ! ।
మాయూరమామిషం చర్యాం గజాశ్వరథపత్రకైః ।
ఏతాని వర్జయే న్నిత్యం ప్రావృట్కాలే శుభాననే ! ॥

తా. వేగముగబరుగెత్తుట, తాపమునుబొందుట, గాయముతగిలెడిపనులజేయుట, దేహమునకు పీడగలిగెడి కార్యములనొనర్చుట, ఈదుట-దాటుట-రాత్రిమేల్కొనుట, అధికముగభక్షించుట, బరువుమోసికొనినడుచుట, అధోవాయువు-మలమూత్రములు-తుమ్ము-తేనుపు-కన్నీరు-వాంతి-శుక్రము వీనినిఅడ్డగించుట, శైత్యము-కారము చేదు-లఘుత్వము-రూక్షగలపదార్థములు-ఎండినకూరలు, నెమలిమాంసము, గజాశ్వరథయానము-ఈకార్యములను వర్షఋతువునందు వర్జింపవలయు.

శ్లో. గోజిహ్వాం డిండిసం చామం పనసం చిర్భటం గుడం ।
మకుష్ఠం కర్కటీంపక్వాం భంగాం చిత్రఫలం తథా ।



వృంతాకం త్రపుసంపక్వం పక్వంచాపికలింగకం ।
తౌషారం పాల్వలం నీరం కేదారం తటినీభవం ।
దివానిద్రాం చ మాయూరం మాంసం పౌర్వంసమీరణం ।
వృష్టి ఘర్మ శ్రమాన్ రూక్షం శీతంచైవాశనం ప్రియే ! ।
వర్జయే దరవిందాక్షి ! వర్షర్తౌ మనుజో౽నిశం ॥

తా. బఱిపెంక, పనసకాయ, బుడమకాయలు, బెల్లము, ఏనుఁగుపెసలు, నక్కదోసపండు, గంజాయిఆకు, పాపరబుడమకాయ, వంకాయ, దోసపండు, పుచ్చపండు, మంచినీళ్లు, ఊదుపుమడినీళ్లు, పడియకుంటనీరు, ఏటినీరు, పగటినిద్ర, నెమలిమాంసము, తూర్పుగాలి, వానలోఁదడియుట, ఎండలోఁదిరుగుట, శ్రమపడుట, రూక్షములు శీతములు నగు పదార్థములు వీనిని వర్షాకాలమునందు వర్జింపవలయు.

శ్లో. అగాధచారీ సురభి స్సతతం ధూపితాంబరః ।
హర్మ్యపృష్ఠే వసే ద్బాష్పశీతశీకరవర్జితే ॥

తా. వర్షర్తువునందు మనుజుఁడు కాళ్ళతో సంచరింపక వాహనములనెక్కి సంచరించవలయు. పరిమళజలముచే స్నానముచేయవలయు. సువాసనపట్టించిన వస్త్రముల ధరించవలయు. వేడి - చలి - వానతుంపురులులేని మేడలయందు నివసింపవలయు.

శ్లో. అయే బాలే ! భజే న్నారీం పౌఢాం మేఘే సుగర్జతి ।
కాయస్థాం ద్రావిడీం గౌరీం రసాలాం నవయౌవనే! ।
శివముష్ణోదకస్నానం ఘృతపానం పయూషకం ।
సారమజ్జాదనం ద్రాక్షాం ప్రశంసంతి విచక్షణాః ॥

తా. వర్షర్తువునందు మేఘము ఉరిమినప్పుడు నిజభార్యను గూడవలయు. కరక్కాయ - ఏలకులు - పసపు - శిఖరిణియనుభక్ష్యము - ఈపదార్థములను భక్షించవలయు. ఉష్ణోదకస్నానము - ఘృతపానము - పేరినపండు - సారపప్పు - ద్రాక్ష ఇవి వర్షర్తువునందు హితకరంబులు.

శ్లో. భజే చ్ఛివాం గుడేన సైంధవం యథేష్టభోజనం,
పటోలమాద్చిదం జలం కపిత్థదాడిమీఫలే ।
ఉపోదికా పలాండు నారికేళతైలసట్టకాన్,
సితోపలా మయే శరత్సరోజలోచనే ప్రియే!॥

తా. బెల్లముతోఁగూడిన కరకపొడి - సైంధవలవణము - అట్టుప్పు - యథేష్టభోజనము - పొట్లకాయ - వెలగ - దానిమ్మ - పొలముబచ్చలికూర - ఉల్లిగడ్డలు - కొబ్బెరనూనె - పెలుగుపచ్చళ్ళు - కలకండ వీనిని వర్షాకాలమునందు భుజించవలయు.

## శరదృతుచర్య.

వా.— ఉద్యచ్చండ చండకర కిరణనికర పరిశుష్కకర్దమనిచయ విగతధారాధర సంరోధ శశధరధామ ధవళితసకలభువనతల విరలజల కల్లోల కంపిత కమల కుముద కల్హార మనోరమ తడాగ భూషితతలో యస్స శరదితి విజానీయాత్ ॥

తా. ఉదయించి మిక్కిలి తీవ్రమునొందిన సూర్యుని కిరణములచే నెండిన బురదగల స్థలంబును, మబ్బువిడిచి నిర్మలంబైన యాకాశంబును, దానంజేసి సకలలోకములకును తెల్లనివెన్నెలయు, విశేషజలతరంగములచే గదలుచున్న కమల, కుముద (తెల్లకలువ) కల్హార (ఎఱ్ఱగలువ) పుష్పములచే రమణీయము లగుతటాకములును గలిగియుండునది శరదృతు వని యెఱుంగునది. (ఇందు - నల్ల పెద్దగోరంట, పంకెన, జిల్లు, వేగిస, ఇవి పుష్పించియుండును.)

శ్లో. దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః ।
నవసంగమసవ్రీడా జఘనానీవ యోషితః ॥

తా. నూతన సంగమమునందు స్త్రీలు తమ జఘనములను లజ్జచే ప్రియునికి మెల్ల మెల్లగజూపుభంగి, శరత్కాలనదులు-ఇసుకదిబ్బలను మెల్ల మెల్లగ గనబఱచును.

శ్లో. సంశుష్యత్పంకశంకా ఖరకిరణరుచా ఫుల్ల రాజీవరాజీ,
రాజత్కల్హారవల్లీ కుసుమచయమిళద్వాసనా వాసితాశా ।
దుగ్ధాంభోధేస్తరంగద్యుతిరివ వికస త్కాశపుష్పప్రకాశా,
చంచచ్చంద్రాంశుశోభా సకలజనముదే శారదీ రాత్రి రేషా ॥

తా. ఎండచేనెండిన బురదయు, వికసించిన కమల కల్హార పుష్పములవాసనచే బరిమళయుక్తము లగుదిక్కులును, పాలసముద్రపు తరంగములమాడ్కి తెల్లని జిల్లుపుష్పముల ప్రకాశంబును, చలించుచున్నచంద్రుని వెన్నెలయు గలిగిన శరద్రాత్రి సకలజనులకు సంతోషమును గలుగ జేయును.

శ్లో. పిత్తేనసాంద్రం రుధిరంశరత్సు వృద్ధింసమాగచ్ఛతి సూర్యరశ్మిభిః।
తదాశు రక్తం పరిమోక్షణీయం పానే జలం సారస ముద్దిశంతి ॥
—భోజ్యాస్సదాలోహితశాలిముద్గాగవ్యంఘృతంచంద్రకరాశ్చసేవ్యాః
ఇక్షోర్వికారామరిచైశ్చభక్ష్యాఃపథ్యాసితాధాత్ర్యకిలసేవనీయా॥

తా. శరదృతువునందు సూర్యకిరణములచే పిత్తము ప్రకోపమును జెంది దానివలన రక్తము గట్టిపడి వృద్ధియగును, కావున అప్పుడు సిరలను వేధించి రక్తమోక్షణముజేయవలయు. గుంటలనీళ్లు త్రాగవలయు. ఎఱ్ఱబియ్యము, పెసలు, ఆవునెయ్యి, బెల్లము, మిరియాలు వేయబడిన భక్ష్యములు, కలకండపొడి కలిపిన కరకపొడి వీనిని భక్షించవలయు, వెన్నెలలో నివసించవలయు.



శ్లో. భూయాన్నరశ్శరది చందనలిప్తగాత్ర
స్త్రీ(స్స)శర్కరాక్వథిత దుగ్ధయుతా చ సేవ్యా ।
కర్పూరపూగపరిపూర్ణముఖం చ కాంతా
మాచుంబ్య శీతలకుచాం పరిరభ్య శేతే ॥

తా. శరదృతువునందు మనుజుఁడు చందనమును బూసికొని కలకండకలిపి కాచినపాలను త్రాగవలయు, కర్పూరము వక్కలు వీనితోఁగూడిన తాంబూలమును వేసికొనిన నిజకాంతనాలింగనముచేసికొని శయనించవలయు.

### శరదృతువునందు పథ్యము.

శ్లో. సితాయుక్తాశివా బాలే! సితాయుక్తశ్శివోపి చ ।
గుడయుక్తా చ కాయస్థా ధాన్యాకం సైంధవం శివః ॥
గోజిహ్వాపద్మబీజాని మృణాళం గోస్తనీఘృతం ।
నాళికేరం హితాయ స్యుశ్శరత్కాలే దివానిశం ॥

తా. చక్కెరతోఁగూడిన కరకపొడినైనను, నెల్లికాయనైనను, బెల్లముతోఁగూడిన కరకపొడినైనను భక్షించవలయు. ధనియాలు, సైంధవలవణము, నెల్లికాయ, బరివెంకపట్టి, తామరగడ్డలు, తామరవిత్తులు, ద్రాక్ష, నేయి, కొబ్బెర, ఈపదార్థములు శరత్కాలమునందు హితకరంబులు.

శ్లో. రసాలాం తథామం రసాలం కపిత్థం
కలింగం తథైవామకం తండులీయం ।
పటోలం పలాండుం సితా మాజదుగ్ధం
శగద్యావహా హేతాని వైద్యా హితాయ ॥

తా. పెఱుగుపచ్చళ్ళు-మామిడికాయ-వెలగ-పుచ్చకాయ - చిఱ్ఱికూర - పొట్లకాయ-ఉల్లిగడ్డలు-చక్కెర-మేఁకపాలు - ఇవి శరత్కాలమునందు హితంబులు.

శ్లో. వాస్తుకోపోదికానాడికామారిషాః పానకంపాయసంశాలయష్షష్టికాః।
కుండలీఫేనికాజంబురంభాఫలం స్యుశ్శరద్యంగనే! మానవానాంముదే॥

తా. చక్రవర్తికూర-పాలముబచ్చలికూర-పెఱుగుతోఁటకూర- నీరుచిత్రికూర-పానకము-పాయసము-శాలి (వరి)ధాన్యము - అఱువదిదినములకు ఫలించెడిధాన్యము జిలేబిభక్ష్యము-ఫేణీలు-నేరేడుపండ్లు-అరఁటిపండ్లు-ఇవిశరదృతువునందుహితంబులు.

శ్లో. చంచూ కోశాతకీ బాలే! శృంగాటం దాడిమీఫలం ।
మాతులుంగోప్యయేకాంతే! శరద్యేతే హితావహాః ।
కశేరుకం జలం దివ్యం తౌషారం సారసం ప్రియే! ।
హంసోదకం చ గోధూమా స్సోమాలీ హారిణంపలం ।
వార్తిరం తైత్తిరం మాంసం శాశ మాజం చ రేచనం ।
క్షుద్రమత్స్యాశ్శరత్కాలే హితాయ స్యు రహర్నిశం ॥

తా. చుక్కకూర-బీరకాయ-పరికెగడ్డ-దానిమ్మపండు-మాదీఫలము-నమ్మదుంప వర్షోదకము-మంచునీరు-గుంటనీరు- హంసోదకము-గోధుమలు, ఇత్రీ-మీనవల్లంకిపిట్ట తిత్తిరిపక్షి-కుందేలు-మేకపోతు-వీనిమాంసము, చిన్నచేపలు-ఇవి శరదృతువునందు హితంబులు.

హంసోదకలక్షణము.

శ్లో. తప్తం తప్తాంశుకిరణై శ్శీతం శీతాంశురశ్మిభిః ।
సమంతాద ప్యహోరాత్ర మగస్త్యోదయనిర్విషం ।
శుచి హంసోదకం నామ నిర్మలం మలజిజ్జలం ।
నాభిష్యంది న వా రూక్షం పానాది ష్వమృతోపమం ॥

తా. సూర్యకిరణములచే పగలంతయు తప్తమయి, రాత్రియందు చంద్రకిరణములచే శీతలంబయి, రాత్రింబగళ్ళు అగస్త్యోదయముచే స్వచ్ఛములయినవియు, స్వభావముగ నిర్మలము లయినవియు నగుజలము హంసోదకమనఁబడును. ఇది వాతకఫమును పోగొట్టును-చలువజేయును. స్నానపానాదులయం దమృతతుల్యంబుగనుండును.

శ్లో. కషాయకం స్వాదురసం చ శీతలం పటు ప్రియే! సాబ్జసరోవగాహనం।
లఘుప్రియంభోజనమంబుజాక్షి! శరద్యయేజాంగలమాంసమంహితం॥

తా. కషాయ - మధుర - శీతల - లవణరసములు - కమలములుగల గుంటలయం దుస్నానము, లఘువయి ప్రియం బగు భోజనము, అడవియందలి పశువులమాంసము ఇవి శరదృతువునందు హితకరంబులు.

శరదృతువునం దపథ్యము.

శ్లో. శరదుష్ణా పిత్తకర్త్రీ నృణాంమధ్యబలావహా ।
తస్మాత్పిత్తకరం సర్వం త్యజే న్నిత్యం ప్రయత్నతః ।
పిప్పలీం మరిచం భంగాం శతపుష్పాం రసోనకం ॥



చిర్భటం రామఠం తక్రం వృంతాంకం కృసరాందధి ॥
క్వథితం సార్షపం తైలం మద్యం చిత్రఫలం తథా ।
అమ్లం తీక్ష్ణం కటూష్ణం చాతపంవ్యాయామకంగుడం ॥
దివానిద్రా తిసురతం మాషాన్నం రాత్రిజాగరం ।
మత్స్యం క్రోధం త్యజే ద్యత్నాచ్ఛర ద్యంబురుహేక్షణే! ॥

తా. శరదృతువు - ఉష్ణమును పిత్తమును కలుగజేసి మధ్యమబలము నిచ్చును; కావున పిత్తకర పదార్థములను వర్జించవలయు. పిప్పళ్ళు, మిరియాలు, గంజాయియాకు, సోపు, తెల్లగడ్డలు, బుడమకాయ, ఇంగువ, మజ్జిగ, వంకాయ, పొంగలి, పెరుగు, మజ్జిగపులుసు, ఆవనూనె, మద్యము, పాపరబుడమకాయ, పులుసు, కారము, ఉష్ణతీక్ష్ణపదార్థములు, ఎండలోతిరుగుట, సాముచేయుట, బెల్లము, పగటినిద్ర, అతిసురతము, మినపపిండి, రాత్రిమేల్కొనుట, మత్స్యములు, క్రోధము, వీనిని శరదృతువునందు వర్జించవలయు.

శ్లో. పక్వంకలింగంత్రపుసంచపక్వం త్యజేత్తథా కర్కటీకాంచపక్వాం।
మాంసంప్రియే! మేషమయూరయోశ్చశరద్యయే!కుండలశోభితాస్యే!।

తా. పుచ్చపండు, దోసపండు, నక్కదోసపండు, మేకపోతు - నెమలి, వీని మాంసము ఈపదార్థములను శరత్కాలమునందు వర్జించవలయు.

శ్లో. వర్జనాదృతుసాత్మ్యానాం కృశో నిత్యం సుదుర్బలః ॥
నిత్యం రోగాభిభూత శ్చ పుమాన్ సాత్మ్య విసర్జనాత్ ॥
తస్మా త్సాత్మ్యం నిషేవేత అసాత్మ్యం పరివర్జయేత్ ।
సాత్మ్యసేవీ జితక్రోధీ నిత్యం చాపి జితేంద్రియః ।
జీర్ణభోజీ మితస్వప్న స్సుఖం జీవ త్యనామయః ॥

తా. ఆయాఋతువులకుఁ జెప్పఁబడిన ప్రకారముగాక, పదార్థములను విరుద్ధముగ భక్షించినయెడ, శరీరమునకు దౌర్బల్యము, కృశింపు, రోగము మొదలగునవికలుగును గావున శాస్త్రప్రకారము నిషిద్ధపదార్థములను వదలి-ఉచితపదార్థములను శరీరానుగుణముగ ననుభవించుచు క్రోధమునువదలి జితేంద్రియుఁడై పూర్వభుక్తాహారము జీర్ణించినవెనుక మరలభుజించువాఁడై మితమైన నిద్రగలవాఁడై యుండువాఁడు రోగరహితుఁడై సుఖముగ జీవించును.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం ఋతుచర్యాకథనంనామ
చతుర్థోఽధ్యాయః.

పంచమాధ్యాయము.

# సంస్కారప్రకరణము.

శ్లో. వైదికైఃకర్మభిఃపుణ్యై ర్నిషేకాద్యై ర్ద్విజన్మనాం ।
కార్య శ్శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ ॥

తా. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు వేదోక్తము లగు నిషేకాదిపుణ్యకర్మములచే శరీరసంస్కారమొనర్చిన, ఇహమందును పరమందును పవిత్రులగుదురు.

## నిషేకము.

శ్లో. షష్ఠ్యష్టమీంపంచదశీంచతుర్థీం చతుర్దశీమప్యుభయత్ర హిత్వా ।
శేషాశ్శుభాస్స్యుస్తిథయోనిషేకే వారాశ్శశాంకార్యసితేందుజానాం॥

తా. ౪ - ౬ - ౮ - ౯ - ౧౩ - ౧౪ - ౧౫ - ౩౦ ఈతిథులనువిడిచి తక్కిన తిథులును, సోమ, బుధ, గురు,శుక్రవారములును, నిషేకకార్యమునందు శుభకరములు.

శ్లో. విష్ణుప్రజేశరవిమిత్ర సమీరపౌష్ణ,
మూలోత్తరా వరుణభాని నిషేకకార్యే ।
పూజ్యాని పుష్యవసు శీతకరాశ్విచిత్రా.
దిత్యా శ్చ మధ్యమఫలా విఫలా స్స్యు రన్యాః ॥
-వృషభమిథునకర్కి సింహకన్యా తులఘటచాపఝషా శ్శుభాభవంతి।
యది శుభబలకారిణోఽనుకూలా నిధనవిశుద్ధికరా నిషేకకార్యే ॥

తా. శ్రవణము, రోహిణి, హస్త, అనూరాధ, స్వాతి, రేవతి, మూల, ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిషము ఈనక్షత్రములు శుభకరములు. పుష్యమి, ధనిష్ఠ, మృగశిర, అశ్విని, చిత్త, పునర్వసు, ఇవి మధ్యమములు. మిగిలినవి అధమములు. వృషభము, మిథునము, కటకము, సింహము, కన్య, తుల, కుంభము, ధనుస్సు, మీనము, ఈలగ్నములు మంచివి. శుభగ్రహము లగు చంద్ర-బుధ-గురు-శుక్రులు కేంద్రాదిస్థానములందుబలవంతులై, లగ్నమునకుఅష్టమస్థానముగ్రహవర్జితమైయుండవలయు

## గర్భాధానవర్జ్యకాలము.

శ్లో. గర్భాధాన మరిష్టమష్టమవిధా పాపగ్రహాక్రాంతభే,
దస్రాహిద్వయ కాలమూల నిధనజ్యేష్ఠాంత్యజన్మోడుషు



షష్ఠీవిష్టివిషావమాసు పరిఘాద్యర్ధే దివావైధృతౌ,
సంధ్యాపర్వచతుర్దశీ వ్రతపిత్ర్యశ్రాద్ధేషు పాతే భవేత్ ॥

తా. స్త్రీపురుషుల నక్షత్రరాశి కెనిమిదవ యింట చంద్రుఁడుండునపుడును, సూర్యాది పాపగ్రహములున్న నక్షత్రములందును, అశ్విని - భరణి - ఆశ్లేష - మఖ - జ్యేష్ఠ - మూల - రేవతి - స్త్రీపురుషుల జన్మనక్షత్రము - దీని కేడవనక్షత్రము వీనియందును, పరిఘానామయోగ పూర్వభాగమునందును, వైధృతి, వ్యతీపాత యోగములయందును, (భద్రకరణము-షష్ఠి-చతుర్దశి-పంచపర్వములు- సంక్రాంతులు-సంధ్యాకాలములు-వ్రత-శ్రాద్ధదినములు-విషగడియలు వీనియందును, ఆషాఢము, భాద్రపదము, ఆశ్వయుజము, పుష్యము ఈమాసములయందును, అర్ధరాత్రంబునందును, పగటియందును మూఢాది మహాదోషంబులందును,) నిషేకము చేయగూడదు.

—పురుషరాసులగు, మేష, మిథున, సింహ, తులా, ధనుః, కుంభ, షడ్వర్గులయందైనను, పురుషగ్రహరాసులైన-మేష సింహ వృశ్చిక ధనుర్మీనముల షడ్వర్గులయందైనను, ఈరాసులను పురుషగ్రహములు గూడియుండినను,చూచినను, బృహస్పతి-లగ్న-పంచమ,నవమస్థానములయందుండినపుడునుగర్భాధానము చేసిన పుత్రుఁడుగలుగును;స్త్రీరాసు లగువృషభ, కర్కాటక, కన్యా, వృశ్చిక,మకర, మీనరాసులయందైనను,స్త్రీగ్రహరాసు లగు, వృషభ, కర్కాటక, తులా రాసుల షడ్వర్గులయందైనను, లగ్నము స్త్రీగ్రహములచేఁ జూడఁబడిగాని,కూడిగానియుండునప్పుడును, లగ్న-పంచమ-నవమస్థానములయందు బృహస్పతి లేకయున్నప్పుడును గర్భాధానముచేయఁ బుత్రికగలుగును.

## పుంసవనము.

శ్లో. కుర్యాత్పుంసవనంకరత్రయవిధి శ్రోణిత్రయార్యోత్తరా
మిత్రాంత్యాదితి మూలదస్రశశభృద్భేష్వాద్యగర్భేస్ఫుటే ।
లగ్నేపుంగ్రహవాసరే రవిగృహం త్యక్త్వాళిసద్మాప్యమా
రిక్తాఛిద్రవివర్జితేఽహ్నియువతౌ మాసే తృతీయే పతిః ॥

తా. గర్భముధరించినస్త్రీకి గర్భమునకుశుభముగలుగుటకై మూఁడవమాసమున పుంసవనమును చేయవలయు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనురాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, ఉత్తరాభాద్ర, రేవతి ఈనక్షత్రములయందును, వృశ్చికసింహరాసులయందును, చవితి-నవమి-చతుర్దశి - అమావాస్యలవిడిచి తక్కినశుభదినములయందును, లగ్నమునకు-పంచమ అష్టమ ద్వాదశములయందు- సూర్య-కుజ - శని-రాహు

కేతు-క్షీణచంద్రాది పాపగ్రహములు లేనపుడును, చంద్రుఁడు లగ్నమునందులేనపుడును పుంసవనకర్మ చేయఁదగినది.

## సీమంతోన్నయనము.

శ్లో. చతుర్థ షష్ఠాష్టమ మాసభేదే భర్త్రాద్యగర్భే ప్రథమంవిధేయం।
సీమంతకర్మద్విజభామినీనాం మాసేఽష్టమే విష్ణుబలిం చ కుర్యాత్॥

తా. ౪-౬-౮ మాసములలో దేనియందైనను, పుంసవనమునకుజెప్పిన తిథివారనక్షత్రాదులయందు సీమంతోన్నయనమును జేయవలయు. మఱియు బ్రాహ్మణస్త్రీలకు గర్భసంరక్షణార్థము ౮ వ మాసమున విష్ణుదేవతకు బలియొసంగవలయు.

## జాతకర్మము.

శ్లో. జాతే పుత్రే పితు స్స్నానం సచేలం తు విధీయతే।
దత్వా గోభూ హిరణ్యాది పశ్చాల్లగ్నం నిరీక్షయేత్॥

తా. పుత్రుఁడు జనింపగానే తండ్రి పుత్రునిముఖమునుజూచి సచేలస్నానముచేసి గో భూ హిరణ్యాదులను బ్రాహ్మణులకు దానంబొసంగి పిదప జన్మలగ్నమును నిశ్చయింపవలయు.

శ్లో. జాతే జాతదినాదిరాదశదినా త్తజ్జాతకర్మాత్మజే,
కుర్యాద్రుద్రదినేఽథవా స్థిరచరక్షిప్రాఖ్యమైత్రాదిషు।
రిక్తామారహితేష్వఖండదివసేలగ్నే శుభే వాసరే,
పూర్వాహ్ణేసురపూజితే సురగురౌ వ్యక్తే చ సౌమ్యాయనే॥

తా. పుత్రుఁడు జన్మించినపుడైనను జన్మము మొదలు ౧౦ దినములలో నేదినమందైనను ౧౧ వ దినముననైనను జాతకర్మముచేయవలయు. అట్లుచేయనియెడల, అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, ఉత్తరాభాద్ర ఈనక్షత్రములయందును, ౪-౯-౧౪-౩౦ ఈతిథులుతప్ప తక్కినతిథులయందును, ఉత్తరాయణమందును, గురుశుక్రమౌఢ్యములులేనికాలమునందును, పూర్ణతిథులయందును, సోమ - బుధ-గురు-శుక్రవారములందును, శుభగ్రహాధిపలగ్నములందును - పూర్వాహ్ణమందును జాతకర్మముచేయవలయు.

## నామకరణము.

శ్లో. జాతానంతరమేవనామకరణం త్వేకాదశాహేస్ఫుటం,
పుత్రస్యైవసమాక్షరంతుయువతేః కార్యంతతోవ్యత్యయం॥
శుద్ధిర్జాతకవచ్చనామ్ని సకలైస్సద్వాదశే షోడశే,
ద్వావింశేఽప్యథ వింశకేఽప్యహ్ని విహితం జాతివ్యవస్థాంవినా॥



తా. పుత్రుఁడుకలుగగానే, నక్షత్రనామమును, అనఁగా, రోహిణీనక్షత్రమందు బుట్టినవానికి రౌహిణుఁడు, ఈమొదలగునక్షత్రనామమును రహస్యముగానేర్పరచి, ౧౧వ దినమందు కుమారవిషయమై సమానవర్ణములుగలపేరు, (అనగా, కృష్ణః-శివః-మహేశ్వరః అను వ్యవహారనామములను.) పుత్రికావిషయమై- బేసి అక్షరములుగల నామమును (అనఁగా- జానకీ-పార్వతీఅనునట్టినామములను) నిశ్చయింపవలయు. ఈ నామకరణవిషయమై లగ్నాదిశుద్ధి జాతకర్మమునకువలెనే నిశ్చయింపవలయు. ౧౧-వ దినమునజేయనిపక్షమున బ్రాహ్మణులు మొదలుగాగల ౪ వర్ణములకు ౧౦ దివసముల పర్యంతము జాతాశౌచమని విశేషవచనముండుటవలన నాలుగు వర్ణములవారును, జన్మదినము మొదలు ౧౨-౧౬-౨౦-౨౨ వీనిలోనేదినమందైనను క్రమముగ నామకరణమును జేయవచ్చును.

శ్లో. మిత్రాదిత్యమఖోత్తరాశతభిషక్స్వాతీధనిష్ఠాచ్యుత
ప్రాజేశాశ్వి శశాంక పౌష్ణదినకృత్పుష్యేష్వరాశౌస్థిరే।
ఛిద్రాః పంచదశీం విహాయ నవమీం శుద్ధేఽష్టమే భార్గవ
జ్ఞాచార్యామృతపారవారదివసే నామాని కుర్యాచ్ఛిశోః।

తా. అనూరాధ - పునర్వసు - మఖ-ఉత్తర-ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర-శతభిషము- స్వాతి, ధనిష్ఠ - శ్రవణము - రోహిణి - అశ్విని-మృగశిర-రేవతి-హస్త-పుష్యమి- ఈనక్షత్రములందు-స్థిరరాసులయందును- ఛిద్రతిథులు-పున్నమ-నవమి వీనిని విడిచి - అష్టమస్థానముశుద్ధమైయుండగాను-శుక్ర-బుధ-గురు-సోమ- కుజవారములయందును-నామకరణము చేయఁదగినది.

శ్లో. కృష్ణోఽనంతోఽచ్యుత శ్చక్రీ వైకుంఠోఽథ జనార్దనః।
ఉపేంద్రో యజ్ఞపురుషో వాసుదేవ స్తథా హరిః।
గోవిందః పుండరీకాక్షో మాసనామా న్యనుక్రమాత్॥

తా. చైత్రాదిద్వాదశమాసములయందువరుసగ-కృష్ణ-అనంత-అచ్యుత- చక్రి-వైకుంఠ-జనార్దన-ఉపేంద్ర-యజ్ఞపురుష-వాసుదేవ-హరి-గోవింద - పుండరీకాక్ష - అని నామముల నేర్పఱచవలయు.

## నిష్క్రమణము

శ్లో. ద్వాదశేఽహని కర్తవ్యం శిశో ర్నిష్క్రమణం గృహాత్॥

తా. పండ్రెండవదినమందు సూతికాగృహమునుండి శిశువును బయలువెడలించవలయు.

## డోలారోహణము.

శ్లో. తృతీయే పంచమేమాసి తన్మాసే వా శుభే దినే ।
ధాతృమూలోత్తరాత్రీణి తిర్యగ్భేషు ద్విదైవభే ।
చంద్రతారాబలయుతే చాష్టమే శుద్ధిసంయుతే ।
డోలామారోపయేద్బాలం ద్విజపుణ్యాంగనాదిభిః ॥

తా. ౧-౩-౫ ఈ నెలలలో దేనియందైనను చంద్రతారాబలముగల శుభదినమున, రోహిణి, మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర-రేవతి, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, అశ్విని, మృగశిర, అనూరాధ, జ్యేష్ఠ, విశాఖ ఈనక్షత్రములందు, అష్టమశుద్ధిగల లగ్నమునందు శిశువును ఉయ్యాలయెక్కించ యూచవలయు.

## అన్నప్రాశనము.

శ్లో. అన్నప్రాశనమర్భకస్యశుభదం మాస్యేవయుగ్మేశుభే,
షష్ఠాదావథ పంచమాదివిషమేమాసే వధూనాం శుభే ।
వారేసౌమ్యగృహేవిశుద్ధదశమే నందాష్టమీద్వాదశీ,
రిక్తామారహితే దినే చర మృదుక్షిప్ర ధ్రువాఖ్యోడుషు ॥

తా. పురుషశిశువునకు, ౬-౮-౧౦ ఈనెలలయందును, స్త్రీశిశువునకు, ౫-౭-౯- ఈనెలలయందును, సోమ-బుధ-గురు-శుక్రవారములయందును, దశమశుద్ధిగలలగ్నమునందును, వృషభ-కర్కాటక-మిథున-కన్యా-ధనుర్మీనలగ్నములయందును, ౧-౪-౬-౮-౯-౧౧-౧౨-౧౪-౩౦ ఈదినముల విడిచి తక్కినతిథులయందును, అశ్విని-రోహిణి మృగశిర-పునర్వసు-పుష్యమి ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనూరాధ-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-ఉత్తరాభాద్ర-రేవతి ఈనక్షత్రములయందును అన్నప్రాశనము చేయఁదగినది.

శ్లో. క్షుష్టీలగ్నగతేరవౌ తనుకళే చంద్రేసదాభిక్షుకః
పూర్ణేందౌ బహుసత్రదోఽవనిసుతే పిత్తార్దితో జ్ఞానవాన్ ।
జ్ఞేజీవేబహుభోగవాన్ భృగుసుతే దీర్ఘాయురర్కాత్మజే
వాతాంగీ తమసి ధ్వజే వ్యసనశనీ బాలోఽన్నభోక్తా భవేత్ ॥

తా. అన్నప్రాశనలగ్నమందు-సూర్యుఁడుండిన-బాలుఁడు-కుష్ఠరోగియు, క్షీణచంద్రుఁడుండిన దరిద్రుండును, పూర్ణచంద్రుఁడుండిన అన్నదాతయు, అంగారకుఁడుండిన పైత్యరోగియు, బుధుఁడుండిన విశేషజ్ఞానవంతుఁడును, గురువుండిన మిక్కిలి భోగవంతుఁడును, శుక్రుఁడుండిన దీర్ఘాయువుగలవాఁడును, శనైశ్చరుఁడుండిన వాతరోగియు, రాహుకేతువు లుండిన మిక్కిలి దరిద్రుఁడును అగును.



శ్లో. దేవతాపురతస్తస్య దాత్ర్యాత్సంగతస్య చ ।
అలంకృతస్యభూషాభి రన్నపాత్రే చ వాంఛితే ।
మధ్వాజ్యకనకోపేతే ప్రాశయేత్పాయసంశుభం ॥

తా. బాలురకు నూతనముగ అన్నప్రాశనము సేయుసెడల మేనమామ మొదలగువారు భగవత్సన్నిధియందు శిశువుకు ఆభరణాదులచే నలంకరించి తొడమీదఁగూర్చుండబెట్టుకొని సువర్ణాదిమయంబైనపాత్రమునందు పాయసమునునించి, అందు తేనె నెయ్యి మిశ్రమముచేసి ఆపాయసమును సువర్ణాభరణాదులచేత శిశువుకు నాకించవలయు.

శ్లో. అగ్రతోఽథ ప్రవిన్యస్య శిల్పభాండానిసర్వశః ।
శస్త్రాణిచైవ వస్త్రాణి తతఃపశ్యేత్తు లక్షణం ॥
ప్రథమంయత్స్పృశేద్బాల స్తతోభాండంస్వయంతథా ।
జీవికాతస్యబాలస్య తేనైవ తు భవిష్యతి ॥

తా. అన్నప్రాశనము చేయించినపిమ్మట- శిల్పవస్తువులను-పాత్రసామానులను-ఆయుధములను-వస్త్రములను బాలునిముందరనునిచిన, వానిలో దేనిని బాలుఁడు మొదట స్పృశించునో దానిమూలముగా బాలునికి జీవనవృత్తియని యూహింపవలయును.

## కేశఖండనము.

శ్లో. అశ్వీపుష్యపునర్వసూమృగశిర స్స్వాత్యంత్యవిష్ణుత్రయం -
చంద్రజ్ఞామరపూజ్య శుక్రసహితాః పూర్ణాజయాఖ్యాశ్శుభాః ।
పూర్వాహ్ణేశుభలగ్న హోరదివసే యుగ్మేచమాసేశిశోః
కేశచ్ఛేదనమిష్టదం మునివరై రుక్తం వరాహాదిభిః ॥

తా. అశ్విని-పుష్యమి-పునర్వసు-మృగశిర-స్వాతి-రేవతి-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము- ఈనక్షత్రములయందును, సోమ - బుధ- గురు- శుక్రవారములందును. ౩,౫ ౭-౧౦-౧౩ ఈతిథులయందును, పూర్వాహ్ణమందును- శుభగ్రహాధిపత్యముగల లగ్నమునందును, శుభహోరలయందును- సరినెలలయందును- పుట్టువెండ్రుకలు తీయవలయు.

## కర్ణవేధనము.

శ్లో. జాతాద్ద్వాదశషోడశేఽహ్నినిధనే శుద్ధేఽష్టమేసప్తమే
షష్ఠేమాసి శుభే చ వారభవనే కర్ణౌ సువేధ్యౌ శిశోః ।
రిక్తాపర్వనిశాదినాది రహితే సంపూర్ణతిథ్యృక్షయోః
పౌషాదిత్య కరద్వయోత్తర హరిశ్రోణద్వయార్ద్యేందుషు ।

తా. శిశువుపుట్టినది మొదలు ౧౨వ ౧౬వ దివసమందైనను- పగటియందును- లగ్నమునకు ౮ వయింట నేగ్రహములులేకయుండగాను జెవులుకుట్టవలయు. ఈచెప్పఁబడిన కాలమునతిక్రమించిన యెడల - ౬-౭-౮ ఈనెలలయందును, సోమ-బుధ-గురు శుక్రవారములయంచును, వృషభ- మిథున- కర్కాటక - కన్యా - ధనుర్మీనలగ్నముల యందును, ౪-౯-౧౪-౧౫-౩౦, కృష్ణాష్టమి-కృష్ణచతుర్దశి- సంక్రమణములు-రాత్రి కాలము- శుక్లపాడ్యమి ఈతిథులనువిడిచి తక్కిన పూర్ణతిథులయందును, మృగశిర- ఆర్ద్రి - పునర్వసు - పుష్యమి - హస్త- చిత్త- ఉత్తర- ఉత్తరాషాఢ - శ్రవణము- ధనిష్ఠ- ఉత్తరాభాద్ర- రేవతి ఈనక్షత్రములయందును, శిశువుకు పండ్లురాకమునుపు, బాలునితల్లి తొడమీఁదనునిచికొని,దారమును రెండుపేటలుగ సూదియందుగ్రుచ్చి దానితో బాలురకుఁ జెవులుకుట్టవలయు.

## చౌలము.

శ్లో. మధ్యేషూత్తర వాయుమిత్రవరుణ బ్రహ్మాభిధే షూత్తమే
చిత్రాంత్యేందు పునర్వసూద్వయకరశ్రోణద్వయా ద్యేదివా ।
బాలస్యత్రితయేఽథపంచమసమే మాసాదిరిక్తాష్టమీ,
పర్వాన్యాసు శుభాంశవారభవనే చౌలం విశుద్ధేఽష్టమే ॥

తా. పుత్రుఁడు జనించినది మొదలు, మూఁడవ, లేక, ఐదవ సంవత్సరమందును-౧-౪-౬-౯-౧౪-౧౫-౩౦ ఈతిథులను సంక్రమణమునువిడిచి తక్కిన తిథులయందును, సోమ-బుధ-గురు-శుక్రవారములయందును, వృషభ-మిథున- కర్కాటక- కన్యా ధనుర్మీనలగ్నములయందును- శుభగ్రహనవాంశలయందును, అశ్విని- మృగశిర- పునర్వసు- పుష్యమి- హస్త- చిత్త- శ్రవణము- ధనిష్ఠ- రేవతి యీనక్షత్రములయందును, వీనియందు వలనుపడనియెడల మధ్యమము లగు రోహిణి. ఉత్తర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రి యీనక్షత్రములయందైనను, అష్టమశుద్ధిగలలగ్నమునందు పగటియందు బాలునికి క్షౌరముజేయించి శిఖనుంచవలయు.

శ్లో. సూనో ర్మాతరి గర్భిణ్యాం చూడాకర్మ నకారయేత్ ।
యదికుర్యా ద్విపత్తి స్స్యా ద్దంపత్యో శ్చ శిశో శ్చ వా ॥

తా. తల్లి గర్భవతియైయుండఁగా బాలునికి చూడాకర్మము చేయింపఁదగదు. చేసినయెడల దంపతులకైనను, శిశువునకైనను ఆపద కలుగును.

## క్షౌరకర్మ.

శ్లో. శ్రవణత్రితయే హస్తా త్రితయే రేవతీద్వయే ।
జ్యేష్ఠాయాం మృగశీర్షే చ పునర్వసుద్వయే తథా ॥



క్షురకర్మ బుధైః ప్రోక్తం త్యక్త్వా భౌమశనీ రవిం ।
అనూరాధాముషాంచైవ కృత్తికాం రోహిణీం మఖామ్ ॥

తా. మంగళవారము, శనివారము, ఆదివారము, అనూరాధ, ఉత్తర ఫల్గుని, కృత్తిక, రోహిణి, మఖ, వీనిని వర్జించి, సోమ, బుధ, గురు, శుక్రవారములయందును శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, హస్త, చిత్త, స్వాతి, రేవతి, అశ్విని, జ్యేష్ఠ, మృగశిర పునర్వసు, పుష్యమి, ఈనక్షత్రములయందును, క్షురకర్మప్రశస్తము.

శ్లో. మాతు శ్చతుర్థీ భగినీ చతుర్దశీ భ్రాతు శ్చ షష్ఠీ పితురేవ పర్వసు।
ఆదౌనవమ్యాంధనధాన్యనాశం కుటుంబహానిః క్షౌరాష్టమీషు ॥
—దశమీపుత్రనాశాయ స్వనాశాయ త్రయోదశీ ।
ఏవంవిజ్ఞాయమతిమాన్ క్షురకర్మనకారయేత్ ॥

తా. చవితియందు క్షౌరముచేయించికొనిన మాతృహత్యాదోషంబును, చతుర్దశియందు భగినీహత్యాదోషంబును, షష్ఠియందు భ్రాతృహత్యాదోషంబును, పర్వములయందు పితృహత్యా దోషంబును గలుగు ; పాడ్యమియందు ధనహానియు, నవమియందు ధాన్యహానియును, అష్టమియందు కుటుంబహానియు, దశమియందు పుత్రనాశము, త్రయోదశియందు స్వనాశంబును గలుగును.

శ్లో. భాను ర్మాసం శని స్సప్త భౌమోఽష్టౌ నాశయే త్సుఖం ।
వర్ధయే ద్బోధనః పంచ మాసాన్ సప్త నిశాపతిః ।
శుక్ర స్త్వేకాదశ క్షేమం క్షౌరే వాచాంపతి ర్దశ ॥

తా. క్షురకర్మను ఆదివారమునజేయించికొనిన నొకమాసములోను, శనివారమున ఏడుమాసములలోను, మంగళవారమున ఎనిమిదిమాసములలోను సౌఖ్యమును నశింపజేయు. బుధవారమున జేయించికొనిన ఐదుమాసములలోను, సోమవారమున జేయించికొనిన ఏడుమాసములలోను శుక్రవారమునజేయించికొనిన పదునొకండుమాసములలోను గురువారమున పదిమాసములలోను క్షేమమునుగలుగజేయును.

## నూతన వస్త్రధారణము.

శ్లో. హస్తోత్తరానిల పునర్వసు తిష్యమిత్ర,
త్వష్ట్ర ద్విదైవ విధివారుణపౌష్ణభేషు ।
రిక్తాః క్రియా ళి హరి చాప ఝషార్క-భౌమ
వారా న్విహాయ నవవస్త్ర ముశంతి ధార్యం ॥

తా. హస్త-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-స్వాతి-పునర్వసు-పుష్యమి-అనూరాధ-చిత్త-విశాఖ-రోహిణి-శతభిషము-రేవతి ఈనక్షత్రములయందును, రిక్తతిథులను-మేష-వృశ్చిక-సింహ-ధనుర్మీనములను-సూర్య అంగారకవారములనువిడిచి తక్కిన తిథిలగ్నములయందును నూతనాంబర ధారణము చేయదగినది.

కంచుకధారణము.

శ్లో. అశ్వినీత్వష్ట్రపౌష్ణేజ్య మిత్రోత్తరకరానిలే ।
సితసౌమ్యేజ్యవారేషు చంద్రతారాబలాన్వితే ।
సుముహూర్తేచపూర్వాహ్ణే జయేపూర్ణదినే తథా ।
కేంద్రత్రికోణగాస్సౌమ్యాః పాపాస్త్ర్యాయారిరాశిగాః ।
శిశూనాంధారయేత్తత్ర కంచుకంచిత్రవర్ణకం ॥

తా. అశ్విని-చిత్త-రేవతి-పుష్యమి - అనూరాధ-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-హస్త-స్వాతి ఈనక్షత్రములయందును, బుధ-గురు-శుక్రవారములందును,పూర్ణ-జయతిథులయందును, చంద్రతారాబలములుగలిగిన శుభముహూర్తమున,పగటిమొదటిభాగమున, శుభగ్రహములు కేంద్ర త్రికోణములయందును, పాపగ్రహములు తృతీయ ఏకాదశషష్ఠములయందును గలలగ్నమునందు బాలునకుచొక్కాను తొడిగింపవలయు.

అక్షరాభ్యాసము.

శ్లో. బాలానాం శుభవాసరేఽహ్నినిధనే శుద్ధేఽక్షరస్వీకృతిః
కార్యాపంచమవత్సరేప్రతిపదం రిక్తాష్టమీమావస్యమాః ।
హిత్వా పూష్ణిచరే స్థిరేచరగృహే వ్యక్తే గురౌ భార్గవే
మిత్రాంత్యాద్యరవిత్రయాదితి గురుశ్రోణాసు సౌమ్యాయనే ॥

తా. బాలునకు ౫వ సంవత్సరమున, శుభవారములయందును, పగటియందును, అష్టమశుద్ధిగల లగ్నమందును, పాడ్యమి- రిక్తతిథులు-అష్టమి-అమావాస్య ఈతిథులనువిడిచి తక్కిన తిథులయందును, సూర్యుడు, మేష-కర్కటక- తులా-మకరరాసులయందుగాని, వృషభ-సింహ-వృశ్చిక-కుంభరాసులయందుగాని యుండునపుడును, చరలగ్నములయందును, గురుశుక్రుల స్తమయమును పొందక యుండునపుడును, అనూరాధ-రేవతి-అశ్విని-హస్త-చిత్త- స్వాతి-పునర్వసు-పుష్యమి - శ్రవణము ఈనక్షత్రములయందును, ఉత్తరాయణమందును అక్షరాభ్యాసము సేయదగినది.

శ్లో. పూజయిత్వా హరిం లక్ష్మీం దేవీంచైవ సరస్వతీం ।
స్వవిద్యాసూత్రకారాంశ్చ స్వాంవిద్యాంచవిశేషతః ।



ఏతేషా మేవ దేవానాం నామ్నాం తు జుహుయాద్ఘృతం।
దక్షిణాభి ర్ద్విజేంద్రాణాం కర్తవ్యం చాత్ర పూజనం ॥
ప్రాఙ్ముఖో గురు రాసీనో వారుణాభిముఖం శిశుం ॥
అధ్యాపయేత్తు ప్రథమం ద్విజాశీర్భి స్సుపూజితం ॥

తా. శ్రీమహావిష్ణువును, లక్ష్మీసరస్వతులను, స్వవిద్యాసూత్రకారులను పూజించి యాదేవతలనామముల నుచ్చరించి హోమముచేసి, గురువును తూర్పుముఖముగను, బాలుని పశ్చిమముఖముగను గూర్చుండబెట్టి అక్షరాభ్యాసముచేయించవలయు. పిదప బ్రాహ్మణాశీర్వచనములుజరిగించి యథాశక్తిదక్షిణలతో విప్రుల బూజింపవలయు.

విద్యారంభము.

శ్లో. విద్యారంభవిధి ర్ద్వివైవ శుభదోఽనధ్యాయరిక్తావినా,
దస్రార్క-త్రయ సోమపంచక హరి క్రవ్యాదపూర్వత్రయే ।
శాఖేశార్యకవిజ్ఞ సోమదినకృ ద్వారేషు లగ్నే చరే,
నోవిద్యాబుధసోమయోః పరమతంశస్త్రంకుజేఽర్కేఽభ్యసేత్ ॥

తా. అనధ్యాయ తిథులను రిక్తతిథులను విడిచి పగటియందును, అశ్విని-హస్త-చిత్త-స్వాతి-మృగశిర-ఆర్ద్ర-పునర్వసు-పుష్యమి-ఆశ్లేష-శ్రవణము- మూల- పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర- యీనక్షత్రములయందును, గురు-శుక్ర-బుధ-సోమ-భానువారములయందును, చరలగ్నములయందును,విద్యాభ్యాసము చేయింపవలయు. అంగారక - భానువారములయందు శస్త్రవిద్యాభ్యాసము చేయింపవలయు.

---

ఉపనయనము.

శ్లో. బ్రహ్మక్షత్రవిశా మథోపనయనం వక్ష్యే వసంతే క్రమా
ద్గ్రీష్మర్తౌ శరదీహ వర్ణనియతే తత్రాపి సాధారణాః ।
మాసా మాఘముఖాస్తు పంచ జననాద్యాగర్భతోఽబ్దేఽష్టమే
నిత్యే విప్రవిశోః క్రమాన్నృపవిశో రేకాద శేద్వాదశే ॥

తా. బ్రాహ్మణులకు, గర్భసంవత్సరము మొదలుకొనియైనను, జననసంవత్సరము మొదలుకొనియైనను, ౮వ సంవత్సరమునందు, వసంతఋతువునందును, క్షత్రియులకు - ౧౧-వ సంవత్సరమునందు గ్రీష్మర్తువునందును, వైశ్యులకు ౧౨వ సంవత్సరమునందు శరదృతువునందును ఉపనయనము చేయదగినది. మరియు, మాఘ-ఫాల్గున-చైత్ర వైశాఖ, జ్యేష్ఠమాసములు శ్రేష్ఠములగుటవలన నీమాసములయందును ఉపనయనము

చేయవచ్చును, (గురువు, బాలుని నక్షత్రరాశికి, ౨-౧౧-౭-౯-౫ ఈస్థానముల యందుండినపుడు ఉపనయనముజరుగును. )

శ్లో. ద్వితీయాచతృతీయా చ పంచమీ సప్తమీ తథా ।
త్రయోదశీ చ దశమీ ప్రశస్తా స్తిథయో వ్రతే ॥

తా. ఉపనయనమునకు, ౨-౩-౫-౭-౧౩-౧౦ ఈతిథులు ప్రశస్తములయినవి.

శ్లో. శుక్రార్కేందుజ వాసరేఽర్క-శశినో ర్వారే చ మధ్యాతయో
ర్మిత్రాంత్యాదిమృగస్థిరా దితిగురు శ్రోణత్రయార్క-త్రయే ।
స్వాంశాదస్తశుభాంశగేహిమకరే శ్రోణాదితి స్వాంశగే
లగ్నేచంద్రవివర్జితే శుభదినేపూర్వాహ్ణే శుద్ధేఽష్టమే ॥

తా. బుధ-గురు-శుక్రవారములయందును, అనూరాధ-రేవతి-అశ్విని-మృగశిర-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-పునర్వసు-పుష్యమి-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-హస్త-చిత్త-స్వాతి-రోహిణి యీనక్షత్రములయందును, చంద్రుఁడు స్వకీయాంశమం దుండఁగా, స్వాంశ మగుకర్కాటకమునుండి, బుధ గురు శుక్రులయంశమును బొంది యుండునపుడును, చంద్రుఁడులేనిలగ్నమందును, పూర్వాహ్ణమందు నుపయనలగ్నమున కెనిమిదవయింట నేగ్రహములేనప్పుడు నుపనయనము సేయఁతగినది.

శ్లో. వర్ణేశార్క-కవీజ్యవేదపబలం చాబ్దేందుతారాబలం
తత్రాచార్యకుమారయో ర్గురుబలం తేభ్యో హి ముఖ్యం వ్రతే।
తేషాం వార్ధకబాల్యమౌఢ్యరహితే మూలత్రికోణాలయే
స్వోచ్చస్వాలయ మిత్రరాశిసహితే ష్వేతేషు కార్యం వ్రతం ॥

తా. బ్రాహ్మణులకు బృహస్పతిబలమును, క్షత్రియులకు సూర్యబలమును, వైశ్యులకు చంద్రబలమును, అందరికిని సూర్య, గురు, శుక్రబలమును, తమ వేదాధిపతుల బలము నుపనయనము జరిగెడి సంవత్సరాధిపతి గ్రహబలమును, చంద్ర తారాబలమును, ఈచెప్పినబలములకంటె ఆచార్యవటువులకు బృహస్పతిబలమును ఉండవలయు. మఱియు నీచెప్పఁబడిన గ్రహములకు, మౌఢ్య-బాల్య-వృద్ధత్వములు లేకుండునపుడును, ఈగ్రహములే తమతమ మూల త్రికోణములయందు నుచ్చస్థానములయందును స్వక్షేత్రమిత్ర క్షేత్రములయందునుండునపుడు నుపనయనముచేయఁదగినది.

శ్లో. ఋగ్వేదప్రభృతీశ్వరా గురుభృగుక్ష్మాపుత్రసౌమ్యా వ్రతే
స్వీయం వేదపలగ్నవాసరబలం త్వేతత్త్రియం దుర్లభం ।
లగ్నేందుః క్షయరోగిణం చ కురుతే స్వోచ్చస్థితో వ్యర్భకం
లగ్నాద్ద్వాదశగం రవిం యది కుజఃపశ్యేత్ గురో ర్నేత్రహృత్ ॥



తా. ఋగ్వేదమునకు గురువును, యజుర్వేదమునకు శుక్రుఁడును, సామవేదమునకు అంగారకుఁడును, అధర్వణవేదమునకు బుధుఁడును, అధిపతులు. ఉపనయనవిషయమై, స్వకీయవేదాధిపతిబలమును, వటువుయొక్క జన్మలగ్నాధిపతిబలమును, జన్మవాసరాధిపతిబలమును ముఖ్యముగానుండవలయు. ఈచెప్పఁబడిన మూఁడుబలములు నేకకాలమునందుగలుగుట దుర్లభము. మఱియు, చంద్రుఁ డుపనయనలగ్నమందున్నను, స్వకీయమైన యుచ్చరాశియందున్నను వటువును క్షయరోగినిగాఁజేయును. ఉపనయనలగ్నమునకు ౧౨ ఇంటసూర్యుఁడుండి యతనికి అంగారకవీక్షణముకలిగినను ఆచార్యునికి నేత్రనాశముకలుగును.

శ్లో. నీచస్థేషు పరాజితే ష్వరిగృహస్థే ష్వస్తగేషు వ్రతే
వర్ణాధీశకవీజ్యవేదపతిషు స్యా దంత్యతుల్యో వటుః ।
అన్యైరప్యఖిలైః కవింశతిమహాదోషైర్వియుక్తేఽఖిలే
కేంద్రేపాపవివర్జితేయది శుభే లగ్నే చ కార్యం వ్రతం ॥

తా. వర్ణాధిపతులును- గురుశుక్రులును-వేదాధిపతులును-నీచరాసులయందుండఁగాను, శత్రుగ్రహయుతులైయుండఁగాను, శత్రుక్షేత్రములయందుండఁగాను, అస్తమించియుండునపుడు నుపనయనముచేసిన - వటువు చండాలునితో సమానుఁడని చెప్పవలయు; మఱియు- ౨౧ మహాదోషములవర్జించి, లగ్న-చతుర్థ. సప్తమ దశమ కేంద్రములయందు పాపగ్రహములులేకయుండఁగాను, శుభగ్రహములు కేంద్రములయం దుండఁగాను, శుభలగ్నమునం దుపనయనము చేయవలయు.

శ్లో. లగ్నాత్కేంద్రగతే రవౌ స్ఫుజిత ఇ త్యాచార్యశిష్యౌ వ్రతే
భౌమే కూజితనామక స్తు జననీం హంత్యేవ మందే కులం ।
దోషోఽయం రుధిరాభిధ స్తమసిచే దుగ్రాభిధో బాలకం
రంధ్రాఖ్యః పితరం ధ్వజే నగదశక్ష్మిత్యబ్ధికేంద్రాభిధాః ॥

తా. లగ్న - చతుర్థ-సప్తమ-దశమ స్థానములయందు సూర్యుఁడుండిన స్ఫుజితమనుదోషము; దీనివలన ఉపనీతునికి నతని తండ్రికిని మారకముగలుగును. అంగారకుఁడుండిన కూజితమను దోషము; దీనివలన వటువుతల్లికి మారకముగలుగును; శనియుండిన రుధిరమనుదోషము; దీనివలన- గోత్రజులకుమారకము; రాహువుండిన నుగ్రమనుదోషము; దీనివలన వటువునకు మారకము; కేతువుండిన రంధ్రమనుదోషము; దీనివలన వటువుతండ్రికి మారకముగలుగును.

శ్లో. జీవః కర్కటచాపమీనగృహగ స్తద్భాగసంస్థోఽపివా ।
జన్మద్వాదశరంధ్రగో యది వటో ర్వేదార్థద స్స్యాద్ద్విజే ।

స్త్రీగోయుగ్మతులామృగాఖ్యగృహగ స్తద్భాగసంస్థోపివా,
విద్యాచారసుఖాయురర్థరహితం కుర్యాద్గురుస్తం శిశుం ॥

తా. కర్కాటక ధనుర్మీనరాసులయందైనను, ఈరాసుల యంశములయందైనను, ఉపనీతుని జన్మరాశియందైనను, అష్టమద్వాదశములయందైనను, బృహస్పతి యుండఁగా నుపనయనవటువు సంపూర్ణవిద్యావంతుఁడగును. వృషభ మిథున కన్యాతులా మకరరాసులయందైనను, గురుఁడుండఁగా నుపనీతుఁడగువాఁడు, విద్యాచారసుఖాయుర్ధనములలో నొకటియైనను లేక నిర్భాగ్యుఁడగును.

శ్లో. కుర్యాత్పాతకినంవటుం శశధర స్సూర్యాంశగస్స్వాంశగో,
నిస్స్వంభూమిసుతాంశమాయుధభృతం జ్ఞాంశంతు విద్యాయుతం।
జీవాంశం క్రతుకారిణం భృగుసుతస్యాంశం వివాహాన్వితం
మందాంశంగత ఆశుచోపనయనే చండాలసేవాకరం ॥

తా. చంద్రుఁడు సింహరాశియందుండఁగా నుపనయనమైన వాఁడు పాపవంతుఁడును, కర్కాటకరాశియందుండిన దరిద్రుండును, మేషవృశ్చికరాసులయందుండిన ఆయుధధరుండును, కన్యామిథునరాసులయందుండిన పండితుండును, ధనుర్మీనరాసులయందుండిన సోమయాజియు, తులావృషభరాసులయందుండిన శీఘ్రముగ భార్యావంతుఁడును, మకరకుంభరాసులయందుండిన చండాలసేవకుండును అగును.

శ్లో. పూర్వేద్యుశ్చ పరేహని వ్రతదినాత్తస్మాచ్చతుర్థేదినే,
ఽనధ్యాయశ్చ రజస్వలా స్వజననీ గర్భాన్వితా వా శిశోః ।
పిత్రోశ్చక్షయవత్సరో యది గురో స్సంధ్యాభిజిత్సద్మవా,
బాలో వా యది కర్ణవేధ రహితో నైతేషు కార్యం హితం॥

తా. ఉపనయనముహూర్తదినమునకుఁ బూర్వదినమును, పరదినమును, నాలవదినమును వీనిలోనొకదినము అనధ్యాయ దినమైయుండునపుడును, బాలుని తల్లి నాందీ కర్మము చేయకముందు రజస్వలయైనను ౬ మాసముల గర్భిణియైనపుడును, కుమారుని తలిదండ్రులు, పితామహీపితామహులును, చనిపోయిన సంవత్సరమందును, సూర్యుఁడున్న రాశియందును, ఈరాశికి ౪ వ రాశియందును, బాలునికి చెవులుకుట్టక యుండునపుడును ఉపనయనముజేయగూడదు.

శ్లో. జన్మర్క్షంశుభదం నిషేకమఖయో శ్చౌలాన్నభుక్త్యోఃకృషౌ,
మౌంజీబంధనపట్టబంధనమహీప్రాప్త్యక్షరావాప్తిషు ।
ఏభ్యోఽన్యేష్వశుభప్రదం చ సువనే సీమంతసంగ్రామయో ।
ర్గర్భాధాన పితృక్రియా క్షుర భిష గ్యాత్రా వివాహేష్వపి ॥



తా. నిషేకము-యాగము-చౌలకర్మము-అన్నప్రాశనము-వ్యవసాయము-ఉపనయనము-పట్టాభిషేకము-భూసంపాదనము - అక్షరాభ్యాసము ఈకార్యములను జన్మనక్షత్రమున జేయవచ్చును; వీనికంటెనితరములగు పుంసవనము యుద్ధము సీమంతము గర్భాధానము క్షౌరకర్మ ఔషధసేవ ప్రయాణము వివాహము ఇవి చేయగూడదు. (స్త్రీలకుమాత్రము జన్మనక్షత్రమున వివాహము చేయవచ్చునని కొన్నిగ్రంథములయందుఁ జెప్పఁబడియున్నది.)

శ్లో. దోషాణాం నియుతం నిహంతి బలవాన్ లగ్నస్థితశ్చేందుజ
శ్శుక్ర స్తద్ద్విగుణం గురు ర్దశగుణం లగ్నం చ పంచేష్టికం ।
లగ్నస్యోపచయే స్థితో గృహపతిః క్రూరో బలీ చే ద్వ్రితే
లగ్నైకాదశగో రవి శ్చ సకలాన్ దోషాన్నిహంత్యేవ తాన్ ॥

తా. బుధుఁడు స్థానాదిషడ్బలములతోఁ డంగూడి యుపనయనలగ్నమందుండిన లక్షదోషములఁబోగొట్టును. శుక్రుఁడు లగ్నమందుండిన రెండులక్షలదోషములహరించును. బృహస్పతియుండిన,లగ్నము పంచేష్టికబలముగలదైనను (అనఁగా కాలాధిప లగ్నాధిప గురు సూర్యచంద్రుల బలముగలది; కాలాధిపులనఁగా—పూర్వరాత్రియందు చంద్రుఁడును, అర్ధరాత్రియందు శుక్రుఁడును, అపరరాత్రియందు కుజుఁడును, ప్రాతఃకాలమున బుధుఁడును, మధ్యాహ్నమున సూర్యుఁడును, సాయంకాలమున శనియు, ఎల్లప్పుడు గురువును బలవంతులు.) ౧౦ లక్షలదోషములనుబోగొట్టును. లగ్నాధిపతి-౩-౬-౧౧ స్థానములయందుండిన ౨ లక్షలదోషములహరించును; సూర్యాంగారకశనైశ్చరులతో బలయుక్తమైయేగ్రహమైన, లగ్న తృతీయ షష్ఠ ఏకాదశ స్థానములయందుండిన ౨ లక్షలదోషములను హరించును-సూర్యుండు లగ్నమునకేకాదశంబుననుండిన సర్వదోషముల హరించును.

## ఉద్వాహవిధి.

శ్లో. గురుణానుమత స్స్నాత్వా సమావృత్తో యథావిధి ।
ఉద్వహేత ద్విజోభార్యాం సవర్ణాం లక్షణాన్వితాం ॥

తా. బ్రహ్మచారి యగుపురుషుఁడు గురువుచే ననుజ్ఞాతుండై - స్నాతకవ్రతమును సమావర్తనకర్మను యథావిధిగసలిపి-సవర్ణురాలును సులక్షణవతియు నగుకన్యకను వివాహమాడవలయు.

## కన్యాలక్షణము.

శ్లో. వయోధికాం నోపగచ్ఛే ద్దీర్ఘాం కన్యాం స్వదేహతః ।
స్వవర్షా ద్ద్వి త్రి పంచాది న్యూనాం కన్యాం సముద్వహేత్ ॥

తా. తనకంటె నెక్కువవయస్సు-పొడవునులేక, ౨-౩-౫-౧౨ సంవత్సరము లు తక్కువగల కన్యకను వివాహముచేసికొనవలయు.

వరలక్షణము.

శ్లో. కులంచ శీలంచ వపుర్వయశ్చ విద్యాంచ విత్తంచ సనాథతాంచ।
ఏతాన్ గుణాన్సప్త పరీక్ష్య కన్యా దేయా బుధై శ్శేష మచింతనీయం॥

తా. వరునియొక్క కులము-స్వభావము- సదాచారసంపత్తి- శరీరసౌందర్యము-వయస్సు-వేదశాస్త్రాదివిద్యలు-భాగ్యము-స్వజనముగలిగియుండుట వీనిని జక్కగ బరీక్షించి వరునకుఁ గన్యనియ్యవలయు.

---

# పురుషసాముద్రికము.

శ్లో. అథ పుంసాం ప్రవక్ష్యామి లక్షణాని ద్విజోత్తమ!।
యై ర్జ్ఞాయతే సదా లోకే ధనధాన్యాయుషాం స్థితిః॥

తా. లోకమునందుఁ బురుషులయొక్క ధన ధాన్యాయుష్య స్థితులను దెలుపునట్టి పాదాద్యవయవరేఖా లక్షణములు సెప్పఁబడుచున్నవి.

అఱకాలు.

శ్లో. ధ్వజాబ్జ వల్లరీ కుంభ మీన వజ్రాంకుశాంకితం।
అస్వేదం మృదులం స్నిగ్ధం పుంసాం పాదతలం శుభం॥

తా. అఱకాలు-ధ్వజము, పద్మము, పూగుత్తి, కడవ, మత్స్యము, వజ్రము, అంకుశము లోనగు వానిలో దేనిచేనైన చిహ్నితంబై చెమటలేక మెత్తన నునుపుగలిగియుండిన శుభప్రదము.

పాదములు.

శ్లో. పద్మాకారా శుభా దీర్ఘా వసిరాలౌ సుకోమలౌ।
పాదౌ రాజ్యప్రదౌ పుంసాం కూర్మాభౌ చ సమాంగుళీ॥
పరదారరతాః పాదై ర్నాక్షై ర్నిస్వా శ్చ మానవాః।
శిష్టాస్తు సూక్ష్మసర్వాణో దీర్ఘా శ్చాంగుళయ శ్శుభాః॥
రక్తా వృత్తా మృదూత్తుంగా స్నిగ్ధాః పాదనఖా శ్శుభాః॥



సర్పాకారా విరూక్షౌ చ శుష్కౌ పాదౌ సిరాలకౌ।
సంశుష్కౌ పాండురనఖౌ నిస్వ స్స్యా ద్విరళాంగుళీ॥
మార్గాయఘటకౌ పాదౌ రూక్షౌ వసదృశౌ తథా।
విచ్ఛిన్నాగ్రౌ వంశహరౌ బ్రహ్మఘ్నౌ పంకసన్నిభౌ॥

తా. పద్మాకారములును, నిడుదలును, నరములు దెలియనివియు, కోమలములును, కూర్మాకారములును. సమములగువ్రేళ్లుగలవియు, నగు పాదములు రాజ్యప్రదములు. పాదములు కఠినముగ నుండిన ధనహీనులును, పరదార రతులును అగుదురు. ఎడములేనివియు, చిన్నగణుపులుగలవియు దీర్ఘములు నగు వ్రేళ్లు ప్రశస్తములు. ఎఱుపు వట్రువ, మెత్తన, నునుపుగల కాలిగోళ్లు శుభప్రదములు, సర్పాకారములును, మిక్కిలి కాఠిన్యముగలవియు, ఎండినవియు, నరములుదెలియునవియు, మిక్కిలియొండిన తెల్లని గోళ్ళుగలవియు నగుపాదములు గలవాఁడు దరిద్రుఁడగును. కఠినములును, ఎచ్చుతక్కువలు నగు పాదములు త్రోవనడిపించును. వ్రేళ్లకొనలు చింపులుగనుండిన వంశమును నశింపజేయును. పాదములు బురదవలె నల్లగనుండిన బ్రాహ్మణహింసకుఁడగును.

పిక్కలు.

శ్లో. అగమ్యాగమనే ప్రీతి ర్జంఘే విరళరోమకే।
నిస్వ స్స్యా న్మృదులాజంఘా రోమైకైకం చ కూపకే॥
మృదురోమా సమా జంఘా తథా కరికరప్రభా।
అసిరాళా విదీర్ఘా చ వృత్తా చానతిమాంసలా॥
స్నిగ్ధా రాజ్యప్రదా జంఘా దరిద్రాణాం కృశా భవేత్॥

తా. పిక్కలు దట్టమైన ‥ మములు గలిగియుండిన అగమ్యాగమనమునందుఁ బ్రీతియు దారిద్ర్యంబును గలుగును. పిక్కలు మృదువులై రోమకూపములయందొక్కొక మృదురోమముగలిగి సమములై యేనుఁగుతొండమువలెనుండినను, నరములు తెలియక కొంచెము పొడువై గుండ్రమై మిక్కిలిస్థూలములుగాక నునుపుగలిగియుండినను, రాజ్యప్రదములు. కృశించియుండిన దారిద్ర్యముగలుగును.

మోకాళ్లు, తొడలు.

శ్లో. జానునీ మృదులే నృణాం భవతో రాజ్యసంపదే।
తోరణస్తంభసదృశౌ సమావూరూ సుశోభనౌ॥

తా. మోకాళ్లు మృదువులై యుండిన రాజ్యసంపదలుకలుగును. తొడలు తోరణస్తంభములవలె మొదటలావు క్రమముగసన్నముకలిగి సమముగనుండిన శుభకరములు.

ముష్కములు.

శ్లో. సమౌ దీర్ఘౌ చ వృషణౌ సంపదాయుర్వివృద్ధిదౌ ।
ఏకాండేన జలా న్మృత్యు ర్విషమాభ్యాం బలం స్త్రియః ॥
సమాభ్యాం క్షితిపః ప్రోక్తః ప్రలంబేన సదాత్మవాన్ ॥

తా. వృషణములు సమములై దీర్ఘములై యుండిన సంపదాయుస్యములు వృద్ధియగును. ఏకవృషణముకలవాఁడు నీటియందు మరణించును. ఎచ్చుతక్కువలుగనుండిన బలము స్త్రీలుగలిగియుండును. సమములుగనుండిన రాజగును. వ్రేలుచుండిన ధైర్యవంతుఁడగును. రెండును ఊర్ధ్వముగనుండిన దీర్ఘాయుష్యముగలవాఁడగును.

లింగము.

శ్లో. సూక్ష్మం లక్ష్మీప్రదం శేఫో దీర్ఘం దౌర్భాగ్యదం నృణాం ।
సమపాదోపవిష్టస్య గుల్ఫం స్పృశతి మేహనం ।
యస్యేశ్వరం విజానీయా త్సుఖినం చైవ మానినం ।
మేఢ్రేఽతివామనే చైవ సుతాయూరహితో భవేత్ ।
వక్రేఽన్యథా పుత్రవాన్ స్యా ద్దారిద్ర్యం వినతే త్వథ ।
నాతిస్థూలం నాతికృశం బహుపుత్రఫలప్రదం ।
అపత్యరహిత శ్చైవ స్థూలలింగోఽధనీ నరః ।
కర్కశైః కఠినై ర్లింగైః పరదారరతా స్సదా ।
రమతే చ సదా దాస్యా నిర్ధనో భవతి ధ్రువం ॥
కృశలింగేన రక్తేన లభతే చోత్తమాంగనాం ।
రాజ్యం సుఖం చ దివ్యం చ కన్యకాయాః పతి ర్భవేత్ ॥
పాండురై ర్మణిభి ర్నిస్స్వా మలినై స్సుఖభాగినః ॥

తా. లింగము హ్రస్వముగ నుండిన సంపదగలుగును. దీర్ఘముగనుండిన దారిద్ర్యముగలుగును. మిక్కిలిపొట్టిగనుండిన సంతానాయుష్యములు కొఱవడును. పాదములను సమముగనునిచి గొంతుగూర్చొనినయెడ లింగము చీలమండను తాకిన ధనవంతుడును సౌఖ్యవంతుడును మానవంతుడును అగును. కుడిపార్శ్వమునకు వాలియుండినపుత్రవంతుడును, ఎడమపార్శ్వమునకువాలియుండిన నిర్ధనుడును అగును. వంగియుండినదారిద్ర్యముగలుగును. మిక్కిలి స్థూలముగాక మిక్కిలికృశింపకయుండిన ననేకపుత్రులు గలుగుదురు. స్థూలలింగముగలవాడు సంతానరహితుడును నిర్ధనుడునునగును. లింగముకఠినముగను, బిరుసుగనునుండిన పరదారరతులును దాసీలతో రమించువారును నిర్ధనులునగుదురు. కృశించియెఱ్ఱగనుండినను ఉత్తమస్త్రీని రాజ్యమును సౌఖ్యమును పొందుదురు. లింగాగ్రమందలిమణి ఎఱ్ఱగనుండిన ధనవంతుఁడగును. తెల్లగనుండిన దరిద్రుఁడగును.



మూత్రము.

శ్లో. సశబ్దమూత్రేణ సుఖీ నిశ్శబ్దే దరిద్రతా ।
వక్ర ద్వి త్రి చతుః పంచ త్వద్ధారాదిభి రేవచ ॥
దక్షిణావర్తచలితమూత్రాభి శ్చ నృపాః స్మృతాః ॥

తా. మూత్రించునపుడు శబ్దము గలిగిన సుఖియగును. శబ్దములేనియెడదరిద్రుండగును. మూత్రధారవక్రముగ ౨-౩-౪-౫ ధారలుగ-కుడిపార్శ్వముగ వెడలినరాజగును.

శుక్లము.

శ్లో. నృపాః పుష్పామోదశుక్లా మధుగంధి మహాధనః ।
పుత్ర శ్శుక్లే మత్స్యగంధే తనుశుక్లే చ కన్యకా ॥
మహాభోగీ మాంసగంధే గదీ స్యా న్మదగంధి ।
దరిద్రః క్షారగంధేన దీర్ఘాయు శ్శీఘ్రమైథునీ ।
అశీఘ్రమైథు న్యల్పాయుః

తా. పురుషునికి శుక్లముపుష్పవాసనగలిగియుండినరాజగును. తేనెకల్లువీనివాసన గలిగియుండిన ధనవంతుడును పుత్రవంతుడును అగును. మత్స్యవాసనగలిగి యల్పముగనుండిన స్త్రీసంతానముగలవాఁడగును. మాంసగంధముగలిగినమహాభోగియగును. మదవాసనగలిగియుండినరోగియగును. క్షారగంధముగలిగియుండినదరిద్రుడగును. శుక్లస్ఖలనము శీఘ్రముగనగువాడు దీర్ఘాయువగును. ఆలస్యముగనగువాడు అల్పాయువగును.

పిఱుదులు.

శ్లో. స్థూలస్ఫిక్కా స్స్యు ర్ధనార్జకః ॥
మాంసలస్ఫి క్సుఖీ స్యా చ్చ సింహస్ఫిక్ నృపతి స్తథా ॥

తా. పిఱుదులు స్థూలముగనుండిన ధనార్జకుఁడగును. బలిసియుండిన సుఖియగును. సింగముపిఱుదులవలె నుండిన రాజగును.

నడుము.

శ్లో. భవే త్సింహకటీ రాజా నిస్స్వః కిటికటి ర్నరః ।
విశాలా చ కటిః పూజ్యా మాంసలా చ సమా ద్విజ ! ॥

తా. నడుము సింగమునడుమువలె నుండిన రాజగును. పందినడుమువలెనుండిన దరిద్రుఁడగును. కటిపశ్చాద్భాగము (మడికట్టు) విశాలమై బలిసియుండిన ప్రశస్తము.

### కడుపు-ముడతలు.

శ్లో. కుక్షి స్సమున్నత స్త్వేష క్లీబ స్స్యా త్పరిమండలః ।
బహ్వపత్యప్రద శ్చైవ మృష్టాన్నసుఖభోగదః ॥
వళిత్రయం తథా దీర్ఘం మాంసలం బహ్వపత్యకం ॥

తా. కడుపు మిక్కిలియెత్తుగనుండిన నపుంసకుఁడగును. మండలాకారముగనుండిన విశేషసంతానము, మంచిభోజనము, సుఖము, భోగముగలుగును. కడుపుమీఁది మూఁడు ముడతలు బలిసి దీర్ఘములయి యుండిన విశేషసంతానము గలుగును.

### బొడ్డు.

శ్లో. సమున్నతా చ గంభీరా విశాలా మృదులా తథా ।
నాభి స్సౌభాగ్యదా నృణాం పుత్రపౌత్ర ప్రవృద్ధిదా ।
వళీమధ్యగతా నాభి ర్భృదుసేవాం తనోతి హి ।
వామావర్త మసాధు స్స్యా న్మేధాం దక్షిణత స్తథా ॥

తా. బొడ్డు లోఁతైవిశాలమైమృదుత్వముగలిగియుండిన సౌభాగ్యము, పుత్రపౌత్రవృద్ధికలుగును. నాభి ముడతలనడుమనుండిన సేవకావృత్తిచేయును. ఎడమనుడిగలిగియుండిన పాపియగును. దక్షిణపు నుడిగలిగియుండిన బుద్ధిమంతుఁడగును.

### డొక్క

శ్లో. ధనినో విపులైః పార్శ్వై ర్నిస్వా శ్చక్రై స్తు నిమ్నకైః ।
పార్శ్వా విశాలా గూఢాస్థీ బహుసౌఖ్యప్రదా నృణాం ।
బహుస్త్రీవల్లభత్వం చ సౌభాగ్యం దిశత స్తథా ॥

తా. ప్రక్కలు విశాలముగనుండిన ధనవంతుఁడగును. పల్లములుగ చక్రాకారముగనుండిన దారిద్ర్యముగలుగును. ఎముకలు తెలియకుండిన సౌఖ్యము, అనేకస్త్రీలు, సంపదగలుగును.

### ఱొమ్ము.

శ్లో. సమోన్నతం చ హృదయం దీర్ఘం చ మాంసలం పృథు ।
నృపాణా మధమానాం తు ఖరరోమసిరాళకం ।
వక్షోభి ర్విషమై ర్నిస్వ శ్శస్త్రేణ నిధనం తథా ॥

తా. ఱొమ్ము సమముగ-ఉన్నతముగ-దీర్ఘముగ-పుష్టికలదిగ-విశాలముగనుండిన రాజులగుదురు. కఠినరోమములుగలదై యెముకలు తెలియుచుండిన అధములగుదురు. ఎచ్చుతక్కువలుగనుండిన దారిద్ర్యము శస్త్రముచే మరణమును గలుగును.



### మెడకొంకులు.

శ్లో. విషమై ర్జత్రుభి ర్నిస్వా అతిసూక్ష్మై శ్చ మాసవాః ।
ఉన్నతై ర్భోగినో నిమ్నై ర్నిస్వాః పీనై ర్నరాధిపాః ॥

తా. మెడకొంకులు ఎచ్చుతక్కువలుగను, అతిసూక్ష్మములుగను, లోఁతుగనునుండిన దారిద్ర్యము, ఎత్తుగనుండినభోగము, బలిసియుండిన రాజ్యము గలుగును.

### కంఠము.

శ్లో. నిస్వ శ్చిపిటకంఠ స్స్యా న్నర స్స్థూలగళ స్సుఖీ ।
శూర స్స్యా న్మహిషగ్రీవ శ్శస్త్రాన్తో గూఢకంఠకః .
కంబుగ్రీవ శ్చ నృపతి ర్లంబకంఠోఽతిభక్షణః ॥

తా. కంఠము చప్పిగనుండిన దారిద్ర్యము, స్థూలముగ నుండిన సౌఖ్యము, మహిషకంఠమువలెనుండిన శౌర్యముగలుగును. కంఠము వెలుపలికిదెలియకుండిన శస్త్రముచేమరణము గలుగును. శంఖమువలెనుండినరాజగును. వ్రేలాడుచుండిన తిండిపోతుఅగును.

### వీఁపు.

శ్లో. విశాలం చ తథా పృష్ఠం దీర్ఘం గూఢాస్థి శస్యతే ।
అరోమ మాభుగ్నపృష్ఠం శుభంచాశుభమేవచ ॥

తా. వీఁపు విశాలముగ, దీర్ఘముగనుండి ఎముక తెలియక, రోమములులేకయుండిన శుభకరము; వంగియుండిన నశుభకరము.

### హస్తములు.

శ్లో. ఉన్నతౌ మాంసలౌ కర్కౌ విశాలౌ నాతిరోమశౌ ।
బహుసౌభాగ్యదౌ పుంసా మసిరాళౌ ద్విజోత్తమ ! ॥
దీర్ఘౌ విశాలౌ పద్మాభౌ సుప్రశస్తౌ కరౌ మతౌ ।
సూక్ష్మపర్వాంగుళీ రక్త మృదుతుంగనఖౌ శుభౌ ॥
కపితుల్యకరా నిస్వా వ్యాఘ్రతుల్యకరా మతాః ।
క్రరైః కరతలై శ్చైవ లాక్షాభై రీశ్వరా స్తు తే ॥

తా. హస్తములున్నతములై బలిసి నునుపుగలిగి విశాలములై అతిరోమములులేకనరములు తెలియకయుండిన నైశ్వర్యము. గలుగును. దీర్ఘములై పద్మాకారములైయుండిన ప్రశస్తములు. సూక్ష్మములగుగణుపులుగలవ్రేళ్లను, ఎఱుపుమృదుత్వముగలగోళ్లను గలిగియున్న హస్తములు శుభప్రదములు. కోఁతిచేతులవలెను, పులిచేతులవలెను నుండిన దారిద్ర్యముగలుగును. చేతులు అఱచేతులు లక్కవలె నెఱ్ఱగనుండిన ప్రభువులగుదురు.

### బాహువులు.

శ్లో. ఆజానులంబినౌ బాహూ వృత్తౌ పీనౌ ధనేశ్వరః ।
నిస్స్వానాం రోమశౌ హస్తౌ శ్రేష్ఠౌ కరికరప్రభౌ ॥

తా. బాహువులు మోకాలిపర్యంతము దీర్ఘములై వర్తులవగలిగి బలిసియుండిన ధనవంతుఁడగును. రోమములుగలిగియుండిన దారిద్ర్యము; ఏనుఁగుతొండమువలెనుండిన సౌభాగ్యము గలుగును.

### భుజశిరస్సులు.

శ్లో. సమున్నతౌ తథా వాంసౌ విశాలౌ విరళౌ సమౌ ।
దీర్ఘమాయు స్తథైశ్వర్యం శంసతోఽరిజయం సదా ॥

తా. భుజశిరస్సులు ఎత్తుగలిగి విశాలముగను విరళముగను సమముగనునుండిన దీర్ఘాయుష్యము - ధనము - శత్రుజయము గలుగును.

### చేతివ్రేళ్ళు.

శ్లో. హస్తాంగుళ్యయ ఏవ స్యు శ్శ్లిష్టా శ్చైవాయతా శ్శుభాః ।
మేధావినాం చ సూక్ష్మా స్స్యు ర్భృత్యానాం చిపిటాః స్మృతాః ।
స్థూలాంగుళీభి ర్నిస్స్వా స్స్యు ర్నతా స్స్యు ర్బహిరున్నతాః ॥

తా. వ్రేళ్ళుకలిసికొని నిడుపుగనుండిన శుభప్రదములు. సన్నగనుండిన ధారణాశక్తిగల బుద్ధిగలిగియుందురు. చప్పిగనుండిన సేవకులగుదురు, మొద్దుగనుండిన దరిద్రులగుదురు. పైకియెత్తుకొనియుండిన లొంగియుందురు.

### గోళ్లు.

శ్లో. తుషతుల్యనఖాః క్లైబ్యాః కుట్టనై స్స్ఫుటితై ర్నరాః ।
నిస్స్వాశ్చక్రనఖై స్తద్వ ద్వినతైః పరతార్కికాః ॥
తామ్రై ర్భూపా ధనాఢ్యా శ్చ అంగుష్ఠై స్సరళై స్తథా ।
దీర్ఘాంగుళి శ్చ దీర్ఘాయు ర్నిర్ధనో విరళాంగుళిః ॥

తా. గోళ్ళునరిపొట్టువలెనుండిన క్లైబ్యముగలుగును, చీలిపుప్పిగలిగి గుండ్రముగ నుండిన దారిద్ర్యము; వర్ణహీనముగనుండిన వరులను ఆక్షేపించును. గోళ్ళుఎఱ్ఱగ నుండినను బొటనవ్రేలు సరళముగనుండినను - ధనము భూమి కలుగును. వ్రేళ్ళు పొడవుగనుండిన దీర్ఘాయుష్యము—ఎడములుగలిగియుండిన దారిద్ర్యముకలుగును.



### అఱచేయి.

శ్లో. అకర్మకఠినం పాణితలం మధ్యే తదున్నతం ।
దానినాం కృపణానాం తు భవే దత్యంతనిమ్నగం ॥
పితృవిత్తవిహీనా స్స్యు ర్నిమ్నైః కరతలై ర్నరాః ॥

తా. అఱచేయి పనిచేయకయుండినను కఠినమై పల్లము లేకయుండిన ధనవంతులై దానము చేయువారగుదురు. పల్లముగనుండిన పితృధనములేనివారగుదురు. మిక్కిలిలోఁతైయుండిన లోభియగును.

### రేఖలు.

శ్లో. పాణౌ స్యు శ్చతస్రో రేఖా శ్చ యస్య తిష్ఠం త్యభంగురాః ।
రక్తా గభీరా స్స్నిగ్ధా స్తం భూపాలం వినిర్దిశేత్ ॥

తా. అఱచేతియందు నాలుగురేఖలు దీర్ఘములుగా తెంపులు కత్తెరలు లేక ఎఱ్ఱగ లోఁతుగనుండిన భూపాలుఁడగును. నాలుగురేఖలనఁగా —౧-పురుషరేఖ, ౨ స్త్రీరేఖ, 3 ఆయుష్యరేఖ, ౪ ధనరేఖ.

—(తూర్పుముఖముగ కూర్చుండి) అఱచేతిని చూచునపుడు, బొటనవ్రేలికిని చూపుడువ్రేలికిని నడుమజనించి అడ్డముగా ఉత్తరముగ వ్యాపించిన రేఖ స్త్రీరేఖయనఁబడును బొటనవ్రేలికి చూపుడువ్రేలికి నడుమజనించి స్త్రీరేఖతోఁగలిసి పడమరగ మణికట్టు వరకు వ్యాపించినరేఖ పురుషరేఖయనఁబడును, ఈరెండును కలిసియుండిన దాంపత్యానుకూల్యముకలదు. కలియనియెడల అనుకూల్యముండదు. పురుషరేఖ అధికముగానుండిన పురుషసంతానము. స్త్రీరేఖ అధికముగానుండిన స్త్రీసంతానముగలుగును.

—చిటికెనవ్రేలికి క్రిందుగా అఱచేతికొననుపుట్టి దక్షిణముగ సాగి నడిమివ్రేలికి చూపుడువ్రేలికి మధ్యవరకు సాగియుండిన రేఖ ఆయుష్యరేఖ యనఁబడును ఇట్లుండిన నూఱుసంవత్సరములుజీవించును. ఆ రేఖ సగముగనుండిన అరువదిసంవత్సరములుబ్రతుకును. అందుకుతక్కువ అయినయెడల తక్కువ ఆయుష్యముగలుగును. ఈ రేఖలకు అడ్డగీతలున్నను, తెంపులుగలిగియున్నను అపమృత్యువు గండములు సంభవించును.

—మణికట్టునందలి శంఖము రేఖనుండుబుట్టి అఱచేతిమధ్యభాగమందు పురుషరేఖకు ఉత్తరప్రక్కగా ఊర్ధ్వముగా వ్యాపించి స్త్రీరేఖ ఆయుష్యరేఖలకుమీదుగా బోయి నడిమివ్రేలికి ఉంగరపువ్రేలికిని నడుమప్రవేశించిన రేఖ ధనరేఖ అనఁబడును. ఇది సంపూర్ణముగనుండిన—పుట్టినదిమొదలు అంతమువరకుధనముగలిగియుండును. కత్తెరగీతలుకలిగిన ధనలాభము నాలుగంశములగును. ౩-౪ కత్తెరలుగలిగిన దారిద్ర్యము. ఆ రేఖను మూఁడుగాభాగించిన ఏభాగమునందు రేఖకనుపడునో, ఆయుష్యమునందును ఆభాగమున

ధనములభించును. ధనరేఖ మధ్యమునతుంపులుగలిగియుండిన అప్పుడప్పుడు ధనము నష్టమగుచుండును. ధనరేఖకు ఇతరరేఖలస్పర్శకలిగిన-అనగా-ధనరేఖకుప్రక్కన తటాక-ధ్వజ-పశ్వాదిరేఖలుండిన వానిమూలముగాజీవించును.

శ్లో. మణిబంధే కంకణాఖ్యా శ్చతస్రో భోగలక్షణాః ।
రాజ్ఞాం తిస్ర స్తు నారీషు కామినాం ద్వితయం స్మృతం ॥

తా. చేతిమణికట్టున ౪ రేఖలుండినభోగవంతులగుదురు. ౩ ఉండిన రాజులగుదురు. ౨ ఉండిన స్త్రీసౌఖ్యముగలవారగుదురు.

శ్లో. అంగుష్ఠాగ్రం తు తర్జన్యా ద్వితీయం పర్వసంస్పృశేత్ ।
శిల్పే చ లేఖనే శస్త్ర విద్యాయాం వా బలాధికః ॥

తా. బొటనవ్రేలికొన తర్జనీవ్రేలి రెండవగణుపును తగిలినయెడ, శిల్పవిద్యలయందును, లేఖనమునందును, శస్త్రవిద్యలయందును నిపుణుండగును.

శ్లో. అనామికా తృతీయా చ్చ సముత్తుంగా కనిష్ఠికా ।
బంధుశ్రైష్ఠ్యం ప్రకురుతే ధనాధిక్యం చ పౌరుషం ॥

తా. చిటికెనవ్రేలికొన అనామికాంగుళియొక్క మూఁడవగణుపును అతిక్రమించియుండిన బంధువులలో గౌరవమును, ధనమును, పౌరుషమును పొందును.

శ్లో. పర్వాంతరాళం సూక్ష్మం చ పృథుపర్వ యదా భవేత్ ।
సంయోజనే ఛిద్రదర్శీ నిర్ధనో భవితా నరః ॥

తా. వ్రేలిగణుపులు లావుగను, గణుపులమధ్యసన్నగను, వ్రేళ్ళు చేర్చిన సందులు గనబడినను నిర్ధనుఁడగును.

శ్లో. అంగుష్ఠస్య తు పర్వాంతా గోధూమ యవరేఖకాః ।
సూచయం త్యపి మృష్టాన్నం ధనధాన్యాదిసంపదః ॥

తా. బొటనవ్రేలిగణుపునకుపైన గోధుమగింజలవలెను బియ్యమువలెను యవరేఖయుండును. (తక్కినవ్రేళ్లయందును ఉండును.) ఇదిగలవానికిమృష్టాన్నభోజనము, ధనధాన్యసంపదలు కలుగును.

శ్లో. శంఖం చక్రం చ కలశ మంగుళ్యగ్రేషు దృశ్యతే ।
ఏకచక్ర స్సదాభోగీ ద్విచక్రో రాజపూజితః ।
ధనాఢ్య స్త్రిభి శ్చక్రై శ్చతుశ్చక్రో దరిద్రకః ।
విలాసీ పంచచక్రేణ షట్చక్రేణ చ కాముకః ।



సప్తచక్రేణ శుభవా నష్టచక్రేణ రోగవాన్ ।
భూపాలో నవచక్రేణ దశచక్రేణ యోగవాన్ ॥

తా. వ్రేలికొనలయందు శంఖ చక్ర కలశరేఖలుండును. ఒకచక్రముగలవాఁడు సుఖవంతుఁడు. రెండుచక్రములుండిన రాజపూజితుఁడగును. మూఁడుండిన ధనవంతుఁడగును. నాలుగుండిన నిర్ధనుండగును. అయిదుండిన స్త్రీలోలుఁడగును. ఆఱుండిన కాముకుఁడగును. ఏడుండిన శుభముగలుగును. ఎనిమిదిగలిగిన రోగవంతుఁడగును. తొమ్మిదిగలిగిన భూపాలుఁడును, పదిగలిగిన యోగవంతుఁడును అగును. ఇట్లు కాలివ్రేళ్ళయందును దెలిసికొనవలయు.

శ్లో. ఏకశంఖే సుఖీ భోగీ ద్విశంఖేన దరిద్రవాన్ ।
చతుశ్శంఖేన గుణవాన్ త్రిశంఖేనాగుణో భవేత్ ॥
నిర్ధనీ పంచశంఖేన షట్శంఖేన ప్రతాపవాన్ ।
సప్తాదిదశశంఖాంతం రాజచిహ్నం ప్రదృశ్యతే ॥

తా. ఒకశంఖముగలవాఁడు సుఖియగును. రెండుశంఖములుగలిగిన దరిద్రుఁడు. నాలుగుశంఖములుండిన గుణవంతుఁడు. మూఁడుశంఖము లుండిన దుర్గుణవంతుఁడు. ఐదుశంఖములుండిన నిర్ధనుండు; ఆరుశంఖములుండిన సమర్థుఁడు. ఏడుమొదలు పదివరకు గలిగిన రాజగును.

శ్లో. కనిష్ఠాంగుళిపర్వాంత శ్చతుష్కోణం భవే ద్యది ।
స భూజీవనమాప్నోతి మండలేశ్వరసన్నిభః ।

తా. బొటనవ్రేలి పర్వరేఖలనడుమ విషమ చతుష్కోణాకారముగ రేఖయుండిన భూజీవనమును పొంది రాజగును, మిగిలిననాలుగువ్రేళ్ల పర్వరేఖలనడుమ పొడవుగ నాలుగురేఖలుండిన అధికభోగముగలుగును. మూఁడురేఖలుండిన సమభోగముగలుగును. రెండుండిన అల్పభోగము, ఒకటిగలిగిన వైరాగ్యముగలుగును. రేఖలేనియెడల కష్టముగలుగును. ఈ రేఖలకు కత్తెరలుమొదలగు వైకల్యములుండిన చెప్పిన యోగము ఫలించదు, వైకల్యములులేక సంపూర్తిగనుండిన సంపూర్ణఫలముగలుగును.

శ్లో. క్రీడావిద్యాభోగపుణ్య ఫల మంత్యాది కీర్తితం ।
సూక్ష్మాభ్యాం చ ద్విరేఖాభ్యాం తద్భంగే భంగసంభవః ॥

తా. చిటికెనవ్రేలిక్రింద సన్ననిపొట్టిరేఖలు రెండుగలిగిన బాల్యమునందు సౌఖ్యము, ఉంగరపువ్రేలిక్రిందనుండిన విద్యాలాభము, నడిమివ్రేలిక్రిందనుండిన మంచిభోగము, చూపుడువ్రేలిక్రిందనుండిన కార్యసాఫల్యముగలుగును. వీనికి అడ్డగీతలు గలిగిన ఈఫలములు తప్పిపోవును.

శ్లో. యుగమీనాంకితకరో భవేత్సశ్రీయుతో నరః ।
వజ్రాకారా శ్చ ధనినాం మత్స్యపుచ్ఛనిభా స్తథా ॥

తా. హస్తమునందు - రథముయొక్క కాడి, మత్స్యము, వీనియాకారముగ రేఖలుండిన సంపదగలుగును. వజ్రాకారములును, మత్స్యపుచ్ఛమువంటివియునగు రేఖలుండిన ధనవంతులగుదురు.

శ్లో. శంఖాతపత్రశిబిరా గజపద్మసమా నృపే ।
కుంభాంకుశపతాకాభా శ్శూలాభా శ్చ కరే శ్వరే॥

తా. శంఖము - ఛత్రము - వరిగింజ - గజము - పద్మము ఈ రేఖలుండిన రాజులగుదురు. కలశము - అంకుశము -ధ్వజము-శూలము - ఈ రేఖలుండిన ధనవంతుఁడగును. (శంఖము - గజము, అంకుశము - శూలము - ఈ రేఖలు బొటనవ్రేలి మొదటనుండును. ఛత్రరేఖ - ధనరేఖకును బొటనవ్రేలికిని నడుమనుండును. పద్మము - ధనరేఖకు ఎడమభాగముననుండును. ధ్వజము-ఆయురేఖకు పైతట్టుననుండును, కలశము స్త్రీ రేఖకును ధనరేఖకును నడుమనుండును.)

శ్లో. దామాభా శ్చ గవాఢ్యానాం స్వస్తికాభా నృపోత్తమే ।
చక్రాసితోమరధనుః కుంతాభా నృపతేః కరే ॥

తా. అరచేతియందు పలుపుత్రాడువలె రేఖయుండిన పశుసమృద్ధిగలుగును. స్వస్తికము - చక్రము-ఖడ్గము-చిల్లకోల- ధనుస్సు - ఈ టె వీనియాకారముగ రేఖలుండిన రాజులగుదురు. (స్వస్తికము - స్త్రీరేఖకు పురుషరేఖకు ధనరేఖకును నడుమనుండును. ఖడ్గరేఖ-స్త్రీరేఖకు ధనరేఖకు నడుమనుండును. ధనూరేఖ-ఆయుష్య ధన స్త్రీ రేఖలనడుమనుండును. మిగిలినవి అరచేతి మధ్యముననుండును-ఆయుష్య రేఖకు పైతట్టున కిరీట-విద్యా-సింహాసన-పల్లీ చిత్రరేఖలుండును. వీనివలన మంచిపాండిత్యము గలుగు.)

శ్లో. ఉలూఖలాభా యజ్ఞాఢ్యే వేద్యాభా శ్చాగ్నిహోత్రిణి ।
వాపీదేవగృహాభా శ్చ త్రికోణాభా శ్చ ధార్మికే॥

తా. అరచేతియందు, ఉలూఖల (ఱోలు) రేఖయుండిన సోమయాజి యగును. వేదిక (అరుగు) రేఖయుండిన ఆహితాగ్నియగును. నడబావి, దేవాలయము, త్రికోణము వీనివలె రేఖలుండిన ధార్మికుఁడగును. (వాపీ - త్రికోణరేఖలు, పురుష-స్త్రీ-ధనరేఖలనడుమనుండును. దేవాలయరేఖ, ఆయుష్య-స్త్రీ-ధన రేఖలనడుమనుండును.)

శ్లో. అంగుష్ఠమూలగా రేఖాః పుత్రా స్స్యాత్సూక్ష్మా స్తు దారికాః ।
నిస్వా శ్చ బహురేఖా స్స్యు స్సతతం క్లేశభాగినః ॥



తా. బొటనవ్రేలి మొదటనుండు రేఖలు పుత్రసంతానమును దెలుపును; అవి సూక్ష్మములుగనుండిన స్త్రీసంతానమును దెలుపును. * ఆయుష్యరేఖకు పైగా, చిటికెనవ్రేలికి క్రిందుగానుండు రేఖలు భార్యలను సూచించును. దానిక్రిందనుండు రేఖలలో ఎడమపైపు రేఖలు పుత్రసంతానమును, కుడిపైపు రేఖలు స్త్రీసంతానమును సూచించును. * ఆరోగ్యరేఖ—పురుషరేఖ దగ్గఱనుండి సాగి ధనరేఖమీఁదుగా ఎడమభాగమునకు వ్యాపించియుండును. ఇదిదృఢముగనుండిన ఆరోగ్యమును సూచించును. ఇదిపురుషరేఖను అంటియుండిన మంచిదిగాదు. * విద్యారేఖ-ఇది ఉంగరపువ్రేలి క్రిందుగా సాగియుండును. దీనికిమాపుగలిగియుండిన విద్యరానేరదు. దృఢమైవిశేషరేఖలతోఁ గూడియుండిన ననేకవిద్యలయందు నిపుణతకలుగును. * భ్రాతృరేఖ—చిటికెనవ్రేలిక్రిందుగా నరచేతియందు చిల్లరగానుండును. ఇద్దిసూక్ష్మముగా-తెంపులుగలిగియుండిన భ్రాతలు రోగపీడితులగుదురు. దృఢముగలిగిబాగుగనుండిన ఆయుష్యవంతులగుభ్రాతలు గలిగియుందురు. * భగినీరేఖ - ఇదిభ్రాతృరేఖాస్థానమునందు అల్లికగలిగిదట్టముగానుండును. * మాతృరేఖ-ధనరేఖకు కుడిప్రక్కన నరచేతిలోనుండును దృఢముగనుండిన తల్లి వంకవారినిసూచించును. *పితృరేఖ-ధనరేఖకు ఎడమప్రక్కగానుండును. ఇదితండ్రివంకవారిని సూచించును. మత్స్యరేఖ-ధనరేఖకు ఆత్మరేఖకు నడుమ మణికట్టుకు సమీపముననుండును; దీనివలన పుణ్యకర్మసిద్ధి - ద్రవ్యము - పురుషసంతతిగలుగును. * చిల్లరరేఖలు - చిటికెనవ్రేలిక్రింద సన్నమై కురుచలైనరేఖలు రెండుండిన బాల్యమునందు సౌఖ్యమునుపొందును. ఉంగరపువ్రేలిక్రిందనుండిన విద్యయు, నడిమివ్రేలిక్రిందనుండిన ధనస్త్రీసంతానాదిభోగములును, చూపుడువ్రేలిక్రిందనుండిన కార్యసిద్ధియుగలుగును. హస్తమునందు రేఖలు పెక్కులుగానుండిన దారిద్ర్యము-కష్టముగలవారగుదురు.

శ్లో. ఏవం సామాన్యతః ప్రోక్తం రేఖానాం లక్షణం బుధః ।
విశేషా ద్దక్షిణం పుంసాం స్త్రీణాం వామం పరీక్షయేత్ ॥

తా. ఇట్లుసామాన్యముగ హస్తరేఖాలక్షణఫలంబులు చెప్పబడియె-పురుషులకు కుడిహస్తంబును స్త్రీలకు ఎడమహస్తంబును పరీక్షించిఫలముజెప్పవలయు- స్త్రీకికుడిచేతి రేఖలు బాగుగనుండిన వానిఫలముపెనిమిటికిని-పురుషునియెడమచేతియందు బాగుగనుండిన ఆఫలము భార్యకును జెప్పవలయు.

గడ్డము.

శ్లో. అనువృత్తై శ్చ సుఖినో నిర్ధనా శ్చుబుకైః కృశైః ।
మాంసలై శ్చ ధనోపేతాః ॥

తా. గడ్డము గుండ్రముగనుండిన సౌఖ్యము, కృశించియుండిన దారిద్ర్యము, పుష్టికలిగియుండిన ధనముగలుగును.

## పెదవి.

శ్లో॥ ఆరక్తైరధరైర్నృపాః ।
బింబబంధూకసదృశో మాంసలో మృదులోఽధరః ॥
సర్వసౌభాగ్యదో నౄణాం మన్యశ్చాశర్మణే మతః ॥

తా. అధరము ఎఱుపుగలిగియుండిన రాజులగుదురు. దొండపండు - మంకెన పుష్పమువీనివలె నెఱ్ఱనై పుష్టిగలిగి మృదువైయుండిన సకలసౌభాగ్యములుంగలుగును. విపరీతముగనుండిన సౌఖ్యహీనతగలుగును.

## మీసములు.

శ్లో॥ సంపూర్ణభోగినాం కృష్ణం శ్మశ్రు స్నిగ్ధం సమం మృదు ।
సంహతం స్ఫుటితాగ్రం చ రక్తశ్మశ్రుశ్చ చోరకః ।
రక్తాల్పపరుషశ్మశ్రు నరా స్స్యుః పాపమృత్యవః ॥

తా. మీసములు - నునుపుగ - సమముగ - నలుపుగ - మృదువుగనుండిన సంపూర్ణభోగముగలుగును, గుంపుగను - కొనలుచీలియు-ఎఱ్ఱగనునుండిన దొంగయగును. ఎఱ్ఱగ - అల్పముగ-కఠినముగనుండిన మహాపాపులగుదురు.

శ్లో॥ చుబుకే యస్య రోమాణి న వక్షసి చ గండయోః ।
స త్యాజ్య స్సర్వదా తుష్టో యది నిర్మానుషం జగత్ ॥

తా. గడ్డమునందు వెండ్రుకలుజనించి, చెక్కిళ్ళు, ఱొమ్మువీనియందు రోమములులేకుండిన, లోకమునకంతయు నపకారియగును గావున వానిని విడువవలయు.

## కటుమర్లు.

శ్లో॥ మాంసలౌ చ హనూ యస్య భవత స్త్వీషదున్నతౌ ।
స నరో మృష్ట మశ్నాతి యావదాయుస్సుభావ్రతః ॥

తా. కటుమర్లు కొంచెముగ ఎత్తుగలిగిబలిసియుండిన యావజ్జీవము మృష్టాన్న సౌఖ్యములుగలిగియుండును.

## చెక్కిళ్ళు.

శ్లో॥ అసిరాలౌ సమౌ గండౌ యస్య నైనాతికోమలౌ ।
సమున్నతౌ సదాసౌఖ్యం దిశతో భృగునందన ! ॥

తా. చెక్కిళ్లు-నరములు తెలియక - సమముగ కొంచెము ఎత్తుగలిగి అధికగోమములు లేకయుండిన నెల్లప్పుడు సౌఖ్యముగలుగును.



## దంతములు.

శ్లో॥ ఈషత్సమున్నతా స్నిగ్ధా గోక్షీరధవళా స్సమాః ।
ద్వాత్రింశత్సంఖ్యదశనా మహారాజ్యప్రదాయకాః ।
త్రింశద్భి ర్దశనై ర్విద్వా నేకత్రింశ త్సుఖీ భవేత్ ।
ఊనత్రింశేన దారిద్ర్యం విరళై శ్చ నతైః కుధీః ।
దంష్ట్రికరా శ్చ చత్వారో దంతా స్తీక్ష్ణా స్సమున్నతాః ।
స్నిగ్ధాః పంక్త్యో ర్ద్వయో స్స్యు స్తే మతిమంతోఽతిభోగినః ।
తీక్ష్ణా దంతా స్సమా శ్శ్రేష్ఠాః

తా. దంతములు ఇంచుకయెత్తుగలిగి నునుపులుగను, ఆవుపాలవలె తెల్లనై ముప్పదిరెండుగలిగియుండిన మహారాజ్యము గలుగును. ముప్పదియుండిన పండితుండగును. ముప్పదియొకటియుండిన సుఖియగును. ఇరువదితొమ్మిదిగలిగిన దారిద్ర్యము, ఎడములుగలిగి వంగియుండిన కుత్సితబుద్ధిగలుగును. నాలుగుకోరలుగల దంతములు తీక్ష్ణములై నిగనిగలై దంతపంక్తికి ఎచ్చులేకుండా కొంచెము ఎత్తుగలిగి వరుసదప్పక సమానముగనుండిన నతిశ్రేష్ఠము; బుద్ధిని, అధికభోగమును ఇచ్చును.

## నాలుక.

శ్లో॥ జిహ్వా రక్తా సమా శుభా ।
శ్లక్ష్ణా దీర్ఘా బుద్ధికరీ శ్వేతా కుర్యా ద్ధనక్షయం ॥

తా. నాలుక మిట్టపల్లములులేక ఎఱ్ఱగనుండిన శ్రేష్ఠము. సన్నమైపొడవుగనుండిన సూక్ష్మబుద్ధిగలుగును. తెల్లగనుండిన ధననాశముగలుగును.

## నోరు.

శ్లో॥ వక్త్రం చాపరుషం సౌమ్యం వరం సౌభాగ్యసంయుతం ।
భూపాలానాం సమం శ్లక్ష్ణం విపరీతం తు దుఃఖదం ।
ఆఢ్యానాం బహుళం వక్త్రం నిర్ధనానాం తు దీర్ఘకం ।
భీమవక్త్రః పాపకర్మా ధూర్తానాం చండవక్త్రకం ।
నిమ్నం వక్త్ర మపుత్రాణాం కృపణానాం చ హ్రస్వకం ॥

తా. నోరు మృదువై సౌమ్యమైయుండిన శ్రేష్ఠము. సౌభాగ్యముగలుగును. సమముగ, పలచనగనుండిన రాజగును. ఈచెప్పినలక్షణములకు విరుద్ధముగనుండిన కీడుగలుగును. నోరుపెద్దదిగనుండిన ధనవంతుండగును. పొడవుగనుండిన దరిద్రుండగును. భయంకరముగనుండిన పాపకర్ముండగును. తీక్ష్ణముగనుండిన ధూర్తుండగును. పల్లముగలిగియుండిన పుత్రులుకలుగరు. పొట్టిగనుండిన దరిద్రులగుదురు.

## చెవులు.

శ్లో. నిర్మాంసై శ్చిపిటై ర్నిస్వాః కృపణా హ్రస్వకర్ణకాః ।
దీర్ఘకర్ణా శ్చ రాజానో రోమకర్ణా శ్శతాయుషః ।
బృహత్కర్ణా శ్చ బలినో రాజానః పరికీర్తితాః ॥

తా. చెవులు మాంసరహితములై చప్పిగనుండిన దారిద్ర్యము. పొట్టిగనుండిన లోభియగును. దీర్ఘములుగ - పెద్దవిగనుండిన బలవంతులును రాజులును అగుదురు. చెవులయందు రోమములుండిన నూరుసంవత్సరములు జీవించును.

## ముక్కు.

శ్లో. శుకనాస స్సుఖీ స్యా చ్చ ఋజునాసోఽతిజీవనః ।
ఛిన్నాగ్రకూపనాస స్స్యా దగమ్యా గమనే రతః ॥
దీర్ఘనాసా తు సౌభాగ్యం చోరత్వం కఠినా చ యా ॥

తా. ముక్కు చిలుకముక్కువలెనుండిన సుఖియగును. సమముగనుండిన అతిజీవనముగలుగును. ముక్కురంధ్రములు తెగియుండిన అగమ్యాగమనమునందు ప్రీతిగలుగును. ముక్కు నిడుపుగనుండిన సౌభాగ్యముగలుగును. కఠినముగనుండిన దొంగయగును.

## కన్నులు.

శ్లో. రక్తాంతైః పద్మపత్రాభై ర్లోచనై స్సుఖభోగినః ।
మార్జారలోచనైః పాపా మహాంతో మధుపింగళైః ॥
క్రూరాః కేకరనేత్రా శ్చ హరిణాక్షా స్సకల్మషాః ।
జిహ్మై శ్చ లోచనైః క్రూరా స్సేనాన్యో గజలోచనాః ।
గంభీరాక్షా ఈశ్వరా స్స్యు ర్మంత్రిణ స్థూలచక్షుషః ।
నీలోత్పలాక్షా విద్వాంస స్సౌభాగ్యం శ్యామచక్షుషాం ।
మండలాక్షా శ్చ పాపా స్స్యు ర్నిస్వా స్స్యు ర్దీనలలోచనాః ।
దృక్స్నిగ్ధా విపులా భోగ మల్పాయు రపి చోన్నతా ।
విశాలాక్షా శ్చ సుఖినః

తా. నేత్రములు తామరరేకులవలె కొనలయందెఱుపుగలిగియుండిన సౌఖ్యము భోగముగలుగును. పిల్లికండ్లవలెనుండిన పాపులగుదురు. తేనెవన్నె - కపిలవర్ణముగలిగియుండిన గొప్పవారగుదురు. మెల్లకన్నుగలవాఁడు క్రూరుఁడగును. కన్నులు తెల్లగనుండిన కపటస్వభావులగుదురు. వంకరగనుండిన క్రూరులగుదురు. ఏనుగుకన్నులవలెనుండిన సేనానాయకుఁడగును. గంభీరములుగనుండిన ద్రవ్యవంతులగుదురు. స్థూలములుగనుండినమంత్రులగుదురు. నల్లకలువరేకులవలెనుండిన పండితులగుదురు. నల్లగనుండిన సౌభాగ్యముగలుగును. గుండ్రముగనుండిన పాపులగుదురు. నీలములుగనుండిన దరిద్రులగుదురు. లోఁతు మెఱుగుగలిగియుండినభోగము, మిట్టగనుండిన అల్పాయుష్యము, విశాలముగనుండిన సుఖముగలుగును.



## కనుబొమ.

శ్లో. దరిద్రా విషమభ్రువః ।
ఘనా దీర్ఘాయుష్యయుక్తా భూపాలా స్స్యు ర్నతభ్రువః ॥
అధ్యో నిస్వా శ్చ ఖండభ్రూ ర్మధ్యే చ వినతభ్రువః ॥

తా. కనుబొమలు ఎచ్చుతక్కువలుగనుండిన దారిద్ర్యము, దట్టముగనుండిన దీర్ఘాయుష్యముగలుగును. విల్లువలె వంగియుండిన ధనవంతులును రాజులునగుదురు. తెగియుండినను నడుమవంగియుండినను దారిద్ర్యముగలుగును.

## కణతలు - లలాటము.

శ్లో. ఉన్నతై ర్విపులై శ్శంఖై ర్లలాటై ర్విషమై స్తథా ।
నిర్ధనా ధనవంత శ్చ అర్ధేందుసదృశై ర్నరాః ॥
నిమ్నై ర్లలాటై ర్వధార్హాః క్రూరకర్మరతా స్తథా ।
సంవృతై శ్చ లలాటై శ్చ కృపణా ఉన్నతై ర్నృపాః ॥

తా. కణతలు-ఉబ్బియున్నను-మిక్కిలిపల్లముగనుండినను-ముఖము మిట్టపల్లములుగనున్నను నిర్ధనులగుదురు. ముఖము అర్ధచంద్రునిపోలియుండిన పాపకర్ములై వధార్హులగుదురు. గుండ్రముగనుండిన లోభియగును. ఉన్నతముగనుండిన రాజగును.

## లలాటరేఖలు.

శ్లో. లలాటోపహితా స్తిస్రో రేఖా స్స్యు శ్శతవర్షిణాం ।
నృపత్వం స్యా చ్చతసృభీ రాయుః పంచనవత్యథ ॥
అరేఖేణానపత్యాయు ర్విచ్ఛిన్నాభి శ్చ పుంశ్చలాః ।
కేశాంతోపగతాభి శ్చ అశీత్యాయు ర్నరో భవేత్ ॥
పంచభి స్సప్తభి షడ్భిః పంచాశ ద్బహుభి స్తథా ।
చత్వారింశ చ్చ వక్రాభి స్త్రింశ ద్భృకుటిగామిభిః ।
వింశతి ర్వామవక్రాభీ రాయుః క్షుద్రాభి రల్పకం ॥

తా. లలాటమునందు మూఁడు రేఖలుండిన నూరుసంవత్సరములు జీవించును. నాలుగు రేఖలుండిన రాజై ౯౫ సంవత్సరములు బ్రతుకును. రేఖలు లేకుండిన సంతానాయుష్యహీనుఁడగును. తెంపులుగలిగియుండిన జారులగుదురు. రేఖలు కేశాంతమునందుండిన (౯౦) సంవత్సరములు జీవించును. ౫-౬-౭ రేఖలుండిన ౫౦ సంవత్సరములు ఆయుస్సు; బహు రేఖలుండిన ౪౦ సంవత్సరములును, వంకరయై కనుబొమ్మల దగ్గరనుండిన ౩౦ సంవత్సరములును ఆయుస్సు; ఎడమపార్శ్వమునకు వంగియుండిన ౨౦ సంవత్సరములు జీవించును. రేఖలు అల్పముగనుండిన అల్పాయుష్యము.

## నవ్వు.

శ్లో. అకంపహసితం శ్రేష్ఠం మీలితాక్ష మఘావహం ।
అసకృద్ధసితం దుష్టం శ్రేష్ఠం దోషవివర్జితం ॥

తా. నవ్వునపుడు ఒడలుకదలకయుండిన మంచిది. కన్నులుమూసికొనిపోయిన పాపియగును. పలుమారునవ్వుటమంచిదికాదు. ఈదోషములు లేకుండిన శ్రేష్ఠము.

## శిరస్సు.

శ్లో. ఛత్రాకారై శ్శిరోభి స్తు నృపో నిమ్నశిరా ధనీ ।
చిపిటై శ్చ పితు ర్మృత్యు ర్దారఘ్నః పరిమండలైః ॥
ఘటమూర్ధా పాపరుచి ర్ధనాఢ్యః పరికీర్తితః ॥

తా. శిరస్సు వెడల్పుగనుండిన రాజగును. కొంచెముపల్లముగలిగియుండిన ధనవంతుఁడగును. చప్పిగనుండిన తండ్రి మరణించును. గుండ్రముగనుండిన భార్యలుచక్కరు. కుండవలెనుండిన పాపమునందాసక్తికలవాఁడై ధనవంతుఁడగును.

## వెండ్రుకలు.

శ్లో. కృష్ణై రాకుంచితైః కేశై స్స్నిగ్ధై రేకైకసంభవైః ।
అచ్ఛిన్నాగ్రై శ్చ మృదుభి ర్నచాతిబహుభి ర్నృపాః ।
బహుమూలై శ్చ విషమైః స్థూలాగ్రైః కపిలై స్తథా ।
నిస్వాశ్చైవాతికుటిలై ర్ఘోరై రపిచ మూర్ధజైః ॥

తా. వెండ్రుకలు నంగి నలుపు నునుపుగలిగి కూపములయం దొక్కొక్కటిగ మొలిచి మృదువులై కొనలుపగులకయుండిన రాజగును. కూపములయం దనేకరోమములుగలిగి ఎచ్చుతక్కువలుగను, కొనలు లావుగను, కపిలవర్ణముగను మిక్కిలివంకరగను, భయంకరముగనునుండిన దరిద్రులగుదురు.



## శరీరము.

శ్లో. యేషాం గాత్రం మహారూక్షం సిరాళం మాంసవర్జితం ।
తత్తు స్యా దశుభం సర్వం శుభం సర్వం తతోఽన్యథా ॥

తా. శరీరము మిక్కిలి బిరుసుగనుండి నరములు దెలియుచు మాంసరహితమై యుండిన అశుభకరము-ఈలక్షణములు లేకుండిన శుభప్రదము.

—(శరీరము ప్రతిమనుష్యునికి-కాలివ్రేళ్లు మొదలుకొని వానిజేనతో నేడుజేనలుండును. ఊర్ధ్వకాయము అధఃకాయము పాదవునందు సమముగానుండును. ఎచ్చుతక్కువలుగానుండిన శూరుఁడును, త్వరితముగ నడుచువాఁడును అగును. నాభినుండినాసికాగ్రమువరకునుండుదూరము స్తనమధ్యభాగదూరమునకు రెండింతలుండును. శిరస్సుచుట్టుకొలత - నాసికాగ్రమునుండి నాభివరకుగలదూరముండును. కంఠముయొక్కచుట్టుకొలత భుజమధ్యప్రదేశమునకు సమానముగానుండును. గడ్డమునుండి కనుబొమలవరకుగల దూరము ఫాలపుపొడుగంతయుండును. గడ్డమునుండి నాసికాగ్రమువరకుగల దూరము నుదుటిపొడుగంత యుండును. ఈ చెప్పిన విధంబున సర్వావయవము లుండిన పురుషుండు త్తముఁడును, శౌర్యధైర్యవంతుఁడును, దీర్ఘాయుష్మంతుండును అగును.)

శ్లో. త్రిపురీషః ద్విరాహార ష్షణ్మూత్ర శ్చైకసంగమీ ।
పంచవాయుః క్షుతం త్రీణి జీవే ద్వర్షశతం నరః ॥

తా. రెండుసాళ్లుభోజనంబును, ప్రతిదినము మూఁడుసార్లు మలవిసర్జనంబును, ఆరుతేపలు మూత్రవిసర్జనంబును, ఒక్కసారి స్త్రీసంగమంబును, అయిదుపర్యాయములు అధోవాతవిసర్జనంబును, మూఁడుతుమ్ములును గలమనుజుఁడు నిరుపద్రవముగ నూఱుసంవత్సరములు జీవించును.

---

## వివాహము.

శ్లో. జాతాబ్దస్త్వష్టదశాబ్దతోఽథవిషమే ష్వబ్దేషుపుంసాంశుభో,
గోదానాహ్వయకర్మలోపకరణే చే త్పంచమాబ్దాదిషు ।
కన్యానాం సమవత్సరేషు విహితః పాణిగ్రహః పుత్రకృ,
జ్జాతాద్ద్వాదశవత్సరా త్తు నియమో నేయం వ్యవస్థాపరే ॥

తా. పుట్టిన ౧౭వసంవత్సరమునందును అది మొదలుకొని బేసిసంవత్సరములయందును బురుషులకును, కన్యకలకుసరిసంవత్సరములయందును, వివాహము చేయదగినది. స్త్రీలకు ౧౦వ సంవత్సరమునకుపైన రజోదర్శనకాలమగుటవలన బేసిసంవత్సరములయందును జేయవచ్చును.

శ్లో. జన్మనా జన్మ కుర్వీత నామ్నా నామైవ కారయేత్ ।
ఉభయం బలహీనం చే త్పుంజన్మ స్త్రీషు నామతః ॥

తా. పురుషునికి జన్మనక్షత్రముండిన, స్త్రీకిని జన్మనక్షత్రమునుబట్టియు, పురుషునకు జన్మనక్షత్రములేక నామనక్షత్రం బైన, స్త్రీకిని నామనక్షత్రమునుబట్టియు విచారింపవలయు. స్త్రీపురుషులయొక్క జన్మ నామనక్షత్రములు రెండును బలహీనము లైనయెడ పురుషుని జన్మనక్షత్రమును స్త్రీనామనక్షత్రమునుబట్టి ఫలము విచారింపఁదగినది.

శ్లో. కుంభాజోక్షనృయుగ్మతౌళిసదనే ష్వర్కే స్థితే ఫాల్గునే,
మాఘే మాధవశుక్రయో శ్చ శుభద స్త్వూర్జద్వయే మధ్యమః।
చైత్రే మీనగతే ధనుర్మృగగతే పౌషే చ యుగ్మాన్వితే ।
హ్యాషాఢే న శుభో ధనుర్ఝషయు తేప్యర్కే. వివాహ శ్శుభః ॥

తా. మేష - వృషభ - మిథున- తులా-కుంభ రాసులయందు సూర్యుఁడుండఁగాను, సూర్యుఁడు పుష్యమాసమునకంటె నితరమాసములయందు ధనుర్మకరములఁబొందియుండఁగాను, వైశాఖ - జ్యేష్ఠ - ఫాల్గున మాసములయందును వివాహముచేయుట మంగళకరము. కార్తిక, మార్గశిర మాసములు మధ్యమములు. సూర్యుఁడు పుష్యమాసమందు ధనుర్మకరరాసులయందుండఁగాను, ఆషాఢమాసమందు మిథున కర్కాటక రాసులయందుండఁగాను, చైత్రమాసమున మీనమందుండగాను వివాహముచేయఁగూడదు. (సూర్యుఁడు చైత్రమాసమున మీనరాశియందుండఁగాఁగలిగెడి దోషము వింధ్యపర్వతోత్తర దేశమునకేగాని దక్షిణదేశమునకులేదు గావున దక్షిణదేశస్థులు మీనచైత్రమందు మేషాయన ప్రవేశమైనను వివాహము చేయఁదగును.)

శ్లో. అర్కే కర్కటకన్యకా ఘటధనుర్ముక్తే భృగౌ మంత్రిణి,
స్ఫారజ్యోతిషి శీతరోచిషి ఖలోపేతే విరిక్తే తిథౌ ।
రోహిణ్యుత్తరరేవతీ పితృమరు న్మిత్రేందుహస్తాసు రే,
ష్వారార్కార్కజవాసరై శ్చ రహితే షూద్వాహకర్మారభేత్ ॥

తా. సూర్యుఁడు, కటక-కన్యా-కుంభ-ధనూరాసులయందు లేకుండఁగాను, శుక్రుఁడు, బృహస్పతి వీరు ప్రకాశించుచుండఁగాను, చంద్రుఁడు బలవంతుఁడైయుండఁగాను, రిక్తతిథులుగాక ఇతరము లగుతిథులయందును, రోహిణి - ఉత్తర - ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర - రేవతి - మఖ - స్వాతి - అనూరాధ - మృగశిర - హస్త - మూల - ఈనక్షత్రములయందును, సోమ-బుధ-గురు-శుక్రవారములయందును వివాహము చేయఁదగినది.



శ్లో. శ్రేష్ఠా స్త్వాళి యమాంగనా ఘటధను ర్గోకర్కి కంఠీరవా,
మధ్యా స్సౌమ్యయుతా స్తదూర్ధ్వరహితా స్సర్వే వివాహే హితాః,
సౌమ్యాః కేంద్రధనాయపుత్రసహితాః పాపా స్త్రిషష్ఠాయగాః,
పూజ్యా శ్శుక్రగురూ మృతాఽశుభదా శుద్ధోభవేత్సప్తమః ॥

తా. వివాహమునకు- తులా-మిథున-కన్యా-కుంభ-ధను-వృషభ-కటక-సింహరాసులు శ్రేష్ఠములు; మిగిలినవిమధ్యమములు. సమస్తరాసులును శుభగ్రహసహితము లై పాపగ్రహవర్జితములైనయెడ శుభప్రదములు; కేంద్రములయందును ౨-౧౧-౫ ఈస్థానములయందును గురు-శుక్ర-బుధ-పూర్ణచంద్రులును, ౩-౬-౧౧ స్థానములయందు రవ్యంగారక శని రాహు కేతువులునుండిన శుభము. గురుశుక్రులు అష్టమముననుండినను అశుభము. వివాహలగ్నమునకు సప్తమస్థానము గ్రహవర్జితం బైయుండవలయు.

శ్లో. వధ్వా ద్వాదశరంధ్రజన్మసు గురు ర్వైధవ్యదస్స్యా త్త్రిష
ట్సంస్థ స్త్రీక్షయకృచ్చతుర్థ దశమస్థానస్థితో దుఃఖకృత్ ।
ఆవశ్యం బల మార్య సూర్య శశినాం భానాం వివాహే ద్వయో,
ర్దుష్టస్థానగతా అమీ తు విహితా స్తేషాం చ పూజాదినా ॥

తా. కన్యకజన్మలగ్నమునకైనను- జన్మకాలచంద్రలగ్నమునకైనను, ౮-౧౨ ఈ స్థానములయందును జన్మలగ్నమునందును బృహస్పతియుండినఁగన్యకవిధవయగును వరునిజన్మలగ్నమునకు ౩-౬ స్థానములయందుండిన మృతభార్యావంతుఁడగును. ౪-౧౦ స్థానములయందుండిన దంపతులు దుఃఖవంతులగుదురు. ౨-౫-౭-౯-౧౧ స్థానములనున్న శుభకరుఁడగును. మఱియు దంపతులకు, రవి- చంద్ర-బృహస్పతి తారాబలము లవశ్యములు. ఈగ్రహము లనిష్టస్థానమందుండిన జప హోమదానాదుల నొనర్చవలయు.

ఏకవింశతి( ౨౧)మహాదోషములు.

శ్లో. యః పంచాంగవిశుద్ధిహీనదినకృ త్సంక్రాంత్యహః పాపినాం,
షడ్వర్గః కునవాంశకోఽష్టమకుజ ష్షట్కంభృగోః కర్తరీ ।
లగ్నాదష్టమమష్టమేందురుభయో శ్చంద్రోఽష్టరిష్ఫారిగ
శ్చంద్రస్సగ్రహఏవ వారజనిత స్స్యాద్దుర్ముహూర్తాభిధః ॥
—ఖర్జూరిస్థసమాంఘ్రిభం గ్రహణభం చోత్పాతభంక్రూరయు
గ్ధిష్ణ్యంచాశుభవిద్ధభం విషయుతం లగ్నా స్తదోష స్తథా ।
గండాంతో వ్యతిపాతవై ధృతిమహాయోగావితిస్వాభిధా
లగ్నస్యాప్యఖిలైకవింశతిమహాదోషాన్ప్రవక్ష్యేథతాన్ ॥

తా. పంచాంగశుద్ధిహీనము, సంక్రాంత్యహస్సు, పాపషడ్వర్గము, కునవాంశము, కుజాష్టమము, భృగుషట్కము, కర్తరి, లగ్నాష్టమము, చంద్రాష్టమము, షడష్టరిష్ఫచంద్రదోషము, చంద్రసగ్రహదోషము, వారజనితదుర్ముహూర్తము, ఖర్జూరిస్థసమాంఘ్రిభము, గ్రహణభము, ఉత్పాతభము క్రూరయుగ్ధిష్ణ్యము, అశుభవిద్ధము, విషయుత లగ్నము, లగ్నాస్తదోషము, గండాంతము, వ్యతీపాత వైధృతిమహాయోగములని ఏకవింశతిమహాదోషములుగలవు. వీనిని వివాహాదులయందు వర్జింపవలయు.

ఏకవింశతిమహాదోషవివరణము:—అశుభకరములగు తిథి-వారము-నక్షత్రము-యోగము-కరణము ఈయైదునుగూడినపంచాంగశుద్ధిదోషమనంబడు. (౧)—సూర్య సంక్రమణప్రవేశకాలంబునకుబూర్వమందును- పరమునందును - పదియాఱుగడియలును, మేష-కర్కట-తులామకరరాసులయందుమాత్రము ముందురాశియందు ౩౦ గడియలు, వెనుకటిరాశియందు ౩౦గడియలును సంక్రాంతిదోషమనబడును. (౨) —పాపగ్రహషడ్వర్గమైనయెడల పాపగ్రహ షడ్వర్గదోషమనబడును. (౩)—శుభగ్రహనవాంశము గానియెడల కునవాంశదోషమనబడును. (౪)—అంగారకుఁడు లగ్నమునకెనిమిదవస్థానమున నుండిన కుజాష్టమదోషమనఁబడును. (౫)—వివాహలగ్నమునకు ఆఱవస్థానమున శుక్రుడుండిన భృగుషట్కదోషమనబడును. (౬)—లగ్నమునకు ద్వితీయ ద్వాదశస్థానములయందు పాపగ్రహములు వక్రించియుండినయెడల కర్తరీదోషమనఁబడును. ఇది దంపతులకు మృత్యుప్రదము. (౭)—వధూవరులజన్మలగ్నములకు - జననకాలచంద్రరాశికిని ౮వలగ్నము ముహూర్తలగ్నమైనయెడల లగ్నాష్టమదోషమనఁబడును. ఆయష్టమాధిపతి వివాహలగ్నమునుబొందినయెడ దంపతులకు మృత్యుప్రదుఁడగును. చంద్రుడు జన్మరాశికి ౮ రాశినిబొందియున్నయెడ దంపతులకు నిత్యదారిద్ర్యముగలుగును. మఱియు జన్మమునకు ద్వాదశలగ్నమును జన్మమును వివాహమునందు అశుభకరము. (౮)—చంద్రుఁడు వివాహలగ్నమునకు ౬-౮-౧౨ ఈస్థానములయందుండిన షడష్టరిష్ఫగచంద్రదోషమనఁబడును. (౯)—చంద్రుఁడు క్రూరగ్రహములతోఁగూడియుండిన చంద్రసగ్రహదోషమనబడును. ఇది నిధనప్రదము. చంద్రుండు-ఏకరాశియందు సూర్యునితోఁగూడియుండిన వివాహితస్త్రీకి దారిద్ర్యముగలుగును. అంగారకునితోఁజేరినమరణము, బుధునితోఁజేరినఁబుత్రహీనతయు, బృహస్పతితోఁజేరియుండిన దౌర్భాగ్యంబును, శుక్రునితోఁగూడిన సపత్నీప్రాప్తియు, శనితోఁగూడిన దారిద్ర్యమును, రాహువుతోఁగూడిన కలహంబును, కేతువుతోఁగూడిన దుఃఖంబును గలుగును. (౧౦)—ప్రతిదినమందును పగలు ౧౫ ముహూర్తములు-రాత్రి ౧౫ముహూర్తములు తిరుగుచుండును. పగటిముహూర్తములు క్రమముగా-రుద్రము-ఉరగము-మిత్రము-పిత్ర్యము-వసువము-వారము-విశ్వేదేవము-విధి-బ్రహ్మము- ఇంద్రము-ఇంద్రహుతాశన



ము-దైత్యము-వరుణము-అర్యమము-భగము- ఈ ౧౫ ముహూర్తములలో-ఉరగ-దైత్య-పిత్ర్య-రౌద్ర-ఇంద్ర-హుతాశన-భగ-ముహూర్తములు ౭ను నిషిద్ధములు. మిగిలినవి శుభప్రదములు. రాత్రిముహూర్తములు క్రమముగా-గిరిశము-అజపాదము-అహిర్బుధ్న్యము- పూషము-నాసత్యము-అంతకము-వహ్ని-ధాత-అదిత్యము-జీవము-అచ్యుతము-అర్కము-త్వచము-నుముహూర్తము- ఈ ౧౫ ముహూర్తములలో-అజపాద-అంతక-వహ్ని - గిరిశముహూర్తములు ౪ గును నిషిద్ధములు. మిగిలినవి శుభకరములు. ముహూర్తమనగా రెండుగడియలకాలము. ఇది దుర్ముహూర్త దోషమనఁబడును. (౧౧)—ఆదివారమందు అర్యమము, సోమవారమందు బ్రహ్మము, అసురము, మంగళవారమందు పిత్ర్యము,అనలము, బుధవారమునందు విధి, గురువారమందుదైత్యము,వారము, శుక్రవారమందు పిత్ర్యము,బ్రహ్మము, శనివారమందు ఉరగము, రుద్రము ఈముహూర్తములు ఆయావారములయందునిషిద్ధములు (౧౨)—ఖర్జూరిస్థసమాంఘ్రిభదోషముఅనగా-ఖర్జూరపత్రమువలె నూర్ధ్వరేఖయొకటివ్రాసి దానిమీద ౧౩ అడ్డగీతలు గీచిన సప్తవింశతి రేఖాత్మకమగును, ఈచక్రముయొక్క-శిరస్సున అశ్వినినక్షత్రమును విష్కంభనామయోగమును వ్రాసి యక్కడనుండి సవ్యముగా వ్రాయుచురాఁగా సూర్యచంద్రులొక రేఖయందున్న నక్షత్రములయందుండి యొకరినొకరుచూచిన నది మృత్యుప్రదముగావున నిషేధము. ఇచ్చట సూర్యచంద్రులకు నేక రేఖాగత నక్షత్రములయందు దున్నమాత్రముచేతనే పరస్పరవీక్షణముగలుగదు. మఱియేమనగా-వీరిలో నాలవపాదమున నొకగ్రహమును, మొదటిపాదమున నొకగ్రహమునుండగాను, రెండవపాదమున నొకగ్రహమును, మూఁడవపాదమున నొకగ్రహమునుండగాను పరస్పరవీక్షణము గలుగునని యెఱుంగవలయు; విష్కంభము-వ్యతీపాతము-శూల-పరిఘ - గండము-అతిగండము-వజ్రము-వ్యాఘాతము-వైధృతి-ఈయోగములును, అశ్విని-ఆశ్లేష -మృగశిర-మఖ-మూల-అనూరాధ-పుష్యమి-పునర్వసు-చిత్త-ఈ ౯ నక్షత్రములు క్రమముగ అనఁగా విష్కంభమునకు అశ్విని,వ్యతీపాతమునకు-ఆశ్లేష-ఇట్లు ప్రదక్షిణముగా లిఖించవలయు. (౧౩)—గ్రహణోదయంబైన నక్షత్రము-భూకంపము-ధూమకేతువు మొదలగు నుత్పాతములుపుట్టిన నక్షత్రము - పూర్ణగ్రహణము వీనియందు ఆఱుమాసముల వరకు శుభకర్మములఁ జేయఁగూడదు. అర్ధగ్రహణమునందు మూఁడుమాసములుగూడదు. మఱియు ఉత్పాతములును, సూర్యచంద్రగ్రహణములునుగలిగిన ఏడుదినముల వరకును - శుభకర్మలు చేయగూడదు. అర్ధగ్రహణమై, గ్రస్తాస్తమయమైనపక్షమున ముందు మూఁడుదినములును, అర్ధగ్రహణమై గ్రస్తోదయమైనయెడల అనంతరము మూఁడుదినములును కూడదు. సాయంకాలమున గ్రస్తాస్తమయమైనను, సర్వగ్రస్త గ్రహణమందును ముందు ౭ దివసంబులును, గ్రస్తోదయ సర్వగ్రస్త గ్రహణమందు దనం

తరమం దేడుదినంబులను కూడదు- ఇది గ్రహణోత్పాతదోషమనఁబడును. (౧౪)—క్రూరగ్రహయుత నక్షత్రము ను ఈనక్షత్రమునకు ముందునక్షత్రంబును వెనుకటినక్షత్రంబును ఈమూఁడును శుభకర్మలయందు విడువఁదగినవి. ఇది క్రూరవిద్ధదోషము. (౧౫)—విషనాడీదోషము - ౫౦-౨౪-౩౦-౪౦-౧౪-౨౧-౩౦-౨౦-౩౨-౩౦-౨౦-౧౮-౨౧-౨౦-౧౪-౧౪-౧౦-౧౪-౫౬-౨౪-౨౦-౧౦-౧౦-౧౮-౧౬-౨౪-౩౦-అశ్విన్యాదులగు ౨౭ నక్షత్రములకుఁ గ్రమంబుగఁ జెప్పఁబడిన యిరువదియేడువిఘములసంఖ్యగల గడియలకుపైన నాలుగుగడియలు విషఘటికలుగావున వానిని వర్జింపవలయు. (౧౬)—గండాంతదోషము—అశ్విని రేవతులు -జ్యేష్ఠామూలలు-మఖాశ్లేషలు; ఈనక్షత్రముల మధ్యకాలములయందు ౯ గడియలును గండాంతమగును. అనగా జ్యేష్ఠ-రేవతి-ఆశ్లేష ఈనక్షత్రముల తుదయందు ౪ గడియలును, మూల-అశ్విని-మఖ ఈనక్షత్రముల ఆదియందు ౪ గడియలును నక్షత్రగండాంతములగును. వృశ్చిక మీన కర్కాటకరాసుల తుదయం దరగడియయు, ధను-ర్మేష-సింహరాసుల యాదియం దరగడియయు రాశి గండాంతమగును. శుద్ధపాడ్యమి మొదలైదేసితిథులు క్రమంబుగ-నంద-భద్ర-జయ-రిక్త-పూర్ణ అనుసంజ్ఞగలవై యుండు నందు నందతిథులయాదియందు ౨ గడియలును తిథి గండాంతములనఁబడును. (౧౭)—వివాహాదిశుభముహూర్తములలో లగ్నసప్తమములును వానినవాంశలును తదధిపతులచేఁ జూడబడినను కూడబడినను లేక తదధిపతులు స్వోచ్చమూలత్రికోణ స్వక్షేత్ర మిత్రక్షేత్ర శుభక్షేత్రములయందున్నను శుభకరము. అట్లు లేకుండిన ఉదయాస్తశుద్ధి దోషమనఁబడును. (౧౮)—అకాలగర్జిత వృష్టిదోషము. (౧౯) గణితశాస్త్రమునుసారముగ దోషతరములుగా నేర్పరచబడిన వ్యతీపాత-వైధృతిదోషములు రెండు (౨౦-౨౧) ఇట్లిరువదియొక మహాదోషములుగలవు. ఇవి వివాహాదులయం దతినింద్యంబులు.

శ్లో. తల్లగ్నం చ శుభై స్త్రిభి ర్యుత మపి స్వోచ్చస్థితై స్స్వాలయ,
స్వాంశస్థైర్యది మిత్రగై ర్గుణశతై ర్లగ్నం చ పంచేష్టికం।
క్రూరేషు త్రిభవారిగేషు యదివా వర్గోత్తమాంశాన్వితం,
లగ్నం దోషవిదూషితం యదితథా మృత్యుప్రదం స్యాత్తయోః॥

తా. వివాహాదిలగ్నము స్వకీయోచ్చస్థాన, స్వక్షేత్ర, స్వాంశ, మిత్రక్షేత్ర, మిత్రనవాంశములయందున్న మూఁడుశుభగ్రహములతోఁగూడి, పంచేష్టికబలయుక్తమై, ౩-౬-౧౧- ఈస్థానములయందుఁ బాపగ్రహములుగలదై వర్గోత్తమాంశసహితమై యత్యంతాధికబలముగలదై యున్నను పూర్వము చెప్పఁబడిన యేకవింశతి మహాదోషములలో నొకదానిచే దూషితమైనయెడ వివాహాదులయందు మృత్యుప్రదంబగును.



శ్లో. స్వోచ్చస్థానగతో వివాహసమయే మూలత్రికోణస్థిత
స్స్వక్షేత్రేయది సంస్థిత శ్చ బలవా న్మిత్రాలయస్థోపివా।
ద్యూనాఖ్యం చ విసృజ్య కేంద్రమితర త్కేంద్రత్రికోణస్థిత
స్సౌమ్యో వా గురు రేవవా సురగురు ర్హంత్యేవ దోషార్బుదం॥

తా. వివాహసమయంబున బుధ గురు శుక్రులలో నొకరు స్వోచ్చమూలత్రికోణ- మిత్రక్షేత్ర-స్వక్షేత్రములయందైనను- లగ్నమందైనను, ౪-౫-౯-౧౦ ఈస్థానములయందైననుండినని -యేకవింశతిమహాదోషములుతప్ప నితరములగు నెన్నిదోషములుండినను నశించును.

శ్లో. క్రూరష్షష్ఠభవత్రిగోయది బలీ హంత్యాశుదోషాయుతం
లగ్నేశ శ్చ బలీ యథోక్త గృహగో లగ్నం చ పంచేష్టికం।
రాత్రౌ చేన్నిశాకరో యది బలీ చైకాదశస్థోపివా
లగ్నైకాదశగో రవిస్తు సకలా న్దోషా న్నిహంతిస్ఫుటం॥

తా. బలయుక్తుఁడగుపాపగ్రహము ౩-౬-౧౧ ఈస్థానములయందున్నను, బలవంతుఁడైన లగ్నాధిపతి లగ్నమునందైనను ౪-౫-౯-౧౦-౧౧ ఈస్థానములయందైనను- ఉండినను, లగ్నము పంచేష్టికబలయుక్తమైయుండినను ఏకవింశతి మహాదోషములులేనియెడ పదివేలదోషములైనను నాశమునొందును. ఏకాదశమందు బలయుక్తుఁడైయున్న చంద్రుఁడు, రాత్రిలగ్నమునందలి పదివేలదోషములను, లగ్నమునకు ౧౧వ యింటనున్న సూర్యుఁడు పగటిలగ్నమందలి సకలదోషములను నశింపజేయును.

## నూతనవధూప్రవేశము.

శ్లో. వివాహమారభ్య వధూప్రవేశో యుగ్మే దినే షోడశవాసరాంతే।
తదూర్ధ్వమబ్దేయుజిపంచమే వా శస్తస్తదూర్ధ్వం విషమే సమేవా।

తా. వివాహమైన దినము మొదలు పదియాఱు దినములలోపల సరిదినములయందు పంచాంగశుద్ధిలేకపోయినను నూతనవధూప్రవేశము జరిగింపవచ్చును; ఆపైని యాఱు దినంబు లతిక్రమించినయెడ సరిసంవత్సరంబునను, ఐదవ సంవత్సరంబునను, అవియు గడచినయెడ సరిసంవత్సరమునందైనను బేసిసంవత్సరమునందైనను శుభదినంబున నూతన వధూప్రవేశము కావచ్చును.

## వధూప్రవేశమునకు నక్షత్రవారాదులు.

శ్లో. సిహోరాంశుప్రసూత్తరాదితిగురు స్త్వష్టానురాధాశ్వినీ,
శక్రాహస్కరవాయువారుణ హరిత్వాష్ట్రేష్వు శస్తేతిథౌ।

కుంభాజాళిగతేతువా ఖరకరే ప్రాప్తోదయే భార్గవే,
జీవేచైవ ముదీరితో నవవధూ సద్మప్రవేశశ్శుభః ॥

తా. మృగశిర-ధనిష్ఠ-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-పునర్వసు - పుష్యమి-రోహిణి-అనూరాధ-అశ్విని-జ్యేష్ఠ-హస్త- స్వాతి-శతభిషము-శ్రవణము-చిత్త ఈ నక్షత్రములయందును, మంచితిథులయందును, సూర్యుడు- కుంభ- మేష - వృశ్చికరాసులను పొందియుండునపుడును, గురుశుక్రమౌఢ్యములు లేనప్పుడును, నూతనవధూగృహప్రవేశము జరిగింపవలయును.

ఇతి శ్రీమానవచంద్రికాయాం, నిషేకాది సంస్కార-తన్ముహూర్త-
సాముద్రికాదికథనం నామ
పంచమోఽధ్యాయః

---

షష్ఠాధ్యాయము.

# లౌకికకార్యముహూర్తప్రకరణము.

వాపీకూపతటాకాది నిర్మాణము.

శ్లో. అనూరాధామఖాహస్తరేవతీ షూత్తరాత్రయే ।
రోహిణీయుగళేపుష్యే ధనిష్ఠాద్వితయే తథా ।
పూర్వాషాఢాభిధేచైవ శుభే మాసి శుభే దినే ।
వాపీకూపతటాకానా మారంభః కథితో బుధైః ॥

తా. అనూరాధ-మఖ - హస్త - రేవతి- ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-రోహిణి - పుష్యమి - ధనిష్ఠ-శతభిషము-పూర్వాషాఢ ఈనక్షత్రములయందును, శుభమాస దినములయందును, నడబావి, నూయి-చెరువు లోనగువానిని నిర్మింపవలయును.

వృక్షలతాదిరోపణము.

శ్లో. హస్తచిత్రోత్తరామూలేఽనురాధా రేవతీద్వయే ।
విశాఖా రోహిణీపుష్యే స్వారామోప్తి ర్మృగే శతే ॥

తా. హస్త, చిత్త, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, అనూరాధ, రేవతి, అశ్విని, విశాఖ, రోహిణి, పుష్యమి, మృగశిర, శతభిషము, ఈనక్షత్రములయందు నానావిధవృక్షములను స్థాపించవలయును.



వృక్షరోపణమంత్రము.

శ్లో. ఓం వసుధేతి చ శీతేతి పుణ్యదేతి ధరేతి చ ।
నమస్తే సుభగే! దేవి! ద్రుమోఽయం వర్ధతాం మితి ॥

తా. భూమిని త్రవ్వి ఈమంత్రమునుచదివి వృక్షములను స్థాపించవలయు.

పశువులంగొనుట, అమ్ముట.

శ్లో. విశాఖా రేవతీపుష్యే ధనిష్ఠాశతభేఽశ్విభే ।
హస్తే పునర్వసౌ జ్యేష్ఠే పశూనాం క్రయవిక్రయౌ ॥

తా. విశాఖ, రేవతి, పుష్యమి, ధనిష్ఠ, శతభిషము, అశ్విని, హస్త, పునర్వసు, జ్యేష్ఠ, ఈనక్షత్రములయందు పశువులను గొనుటను, అమ్ముటను చేయవలయు.

సర్వవస్తువిక్రయము.

శ్లో. విశాఖాకృత్తికాశ్లేషా భరణీపూర్వికాత్రయం ।
విక్రయస్సత్తిథావేషు కర్తవ్యో న క్రయశ్శుభః ॥

తా. విశాఖ - కృత్తిక - ఆశ్లేష - భరణి - పుబ్బ - పూర్వాషాఢ - పూర్వాభాద్ర - ఈనక్షత్రములుగల శుభదినంబున వస్తువులను విక్రయించిన శుభకరము. వస్తువులను కొనఁగూడదు.

సర్వవస్తుక్రయము.

శ్లో. శతతారాశ్వినీచిత్రా శ్రవణస్వాతిభేషు చ ।
రేవత్యాం చ క్రయశ్శ్రేష్ఠో విక్రయో న కదాచన ॥

తా. శతభిషము, అశ్విని, చిత్త, శ్రవణము, స్వాతి, రేవతి, ఈనక్షత్రములయందు వస్తువులను కొనవలయు, అమ్మగూడదు.

గృహక్షేత్రాదిభూమి క్రయవిక్రయములు.

శ్లో. జీవే శుక్రే చ నందాసు పూర్ణాయాం మూలభే మృగే ।
పూర్వాశ్లేషామఘాంత్యే చ విశాఖాద్వితయే తథా ।
పునర్భే మునిభిః ప్రోక్తం క్రయవిక్రయణం బుధః ॥

తా. నందతిథులయందును, పూర్ణతిథులయందును, గురుశుక్రవారములయందును మూల మృగశిర-పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర-ఆశ్లేష-మఖ-రేవతి-విశాఖ-అనూరాధ-పునర్వసు యీనక్షత్రములయందును భూమిని అమ్ముట - కొనుట శుభకరము.

## వాణిజ్యము. (వర్తకము)

శ్లో. అనూరాధోత్తరాపుష్యే రేవతీరోహిణీమృగే ।
హస్తచిత్రాశ్వి భే కుర్యా ద్వాణిజ్యం దివసే శుభే ॥

తా. అనూరాధ-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-పుష్యమి-రేవతి-రోహిణి-మృగశిర-హస్త-చిత్త-అశ్విని యీనక్షత్రములయందు శుభదినంబున వర్తకము నారంభించవలయు.

## ద్రవ్యప్రయోగము.

శ్లో. శ్రవణాదిత్రిభేచిత్రా చతుష్కే రేవతీద్వయే ।
పునర్వసు మృగే పుష్యే శుభో ద్రవ్యప్రయోగకః ॥

తా. శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-చిత్త-స్వాతి-విశాఖ-అనూరాధ-రేవతి-అశ్విని-పునర్వసు-మృగశిర-పుష్యమి-యీనక్షత్రములయందు ద్రవ్యమునిచ్చుట శుభకరము.

## ఋణగ్రహణనిషేధము.

శ్లో. సంక్రాంతౌ వృద్ధియోగే తు హస్తర్క్షే రవిభౌమయోః ।
నచగ్రాహ్యమృణంయస్మా త్తద్వంశే తత్థిరం భవేత్ ।
ఋణచ్ఛేదం కుజే కుర్యా ద్ధనం దేయం నవా బుధే ॥

తా. సూర్యసంక్రమణ దినములయందును, వృద్ధియోగమునందును, హస్తానక్షత్రమునందును, ఆది - మంగళవారములయందును, అప్పుతీయగూడదు. తీసినయెడల ఆ అప్పు ఆవంశమునకు స్థిరముగనుండును. మంగళవారమునందు అప్పుతీర్చవలయు. బుధవారమునందు ద్రవ్యమునియ్యఁగూడదు.

## ధాన్యవిక్రయము.

శ్లో. రోహిణ్యాం విక్రయోఽన్నస్య ధనిష్ఠాశతభోత్తరే ॥

తా. రోహిణి-ధనిష్ఠ-శతభిషము- ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర యీనక్షత్రములయందు అన్నమునకుపయోగించెడి ధాన్యములను అమ్మిన మంచిది.

## హలప్రవాహము. (మడకదున్నుట)

శ్లో. పునర్వసుద్వయేమూలే త్ర్యుత్తరేరోహిణీద్వయే ।
హస్తత్రయేఽనురాధాయాం రేవత్యాం శ్రవణత్రయే ॥
తిథౌ వారే శుభేఽశ్విన్యాం హలప్రవహణం శుభం ॥



తా. పునర్వసు - పుష్యమి -మూల - ఉత్తర - ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-రోహిణి - మృగశిర - హస్త - చిత్త - స్వాతి - అనూరాధ - రేవతి-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము - అశ్విని - యీనక్షత్రములయందును, శుభతిథులందును, శుభవారములందును మడకదున్నిన శుభకరము. హలచక్రము — సూర్యుఁడున్న నక్షత్రము మొదలుకొని మూఁడునక్షత్రములు అశుభకరము. తరువాత ఎనిమిదినక్షత్రములు శుభకరములు; తరువాత తొమ్మిదినక్షత్రములు అశుభకరములు; ఆవల యెనిమిదినక్షత్రములు శుభకరములు

## బీజోప్తి. (విత్తనములుచల్లుట)

శ్లో. హస్తత్రయేమఖాపుష్యే త్ర్యుత్తరే రోహిణీద్వయే ।
ధనిష్ఠారేవతీయుగ్మే తథామూలానురాధయోః ।
శుభేవారేతిథౌశ్రేష్ఠా బీజోప్తి స్త్వథరాహుభాత్ ।
అష్టాగ్నీందుత్రయంచైక త్రయేందుత్రిచతుష్టయం ।
అసచ్ఛుభంక్రమాత్ జ్ఞేయం దినర్క్షంఫణిచక్రగం ॥

తా. హస్త - చిత్త - స్వాతి - మఖ - పుష్యమి - ఉత్తర - ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర - రోహిణి - పునర్వసు - ధనిష్ఠ - రేవతి - అశ్విని - మూల - అనూరాధ యీనక్షత్రములయందును శుభతిథివారములయందును విత్తనములుచల్లిన శుభకరము. రాహువున్న నక్షత్రము మొదలుకొని ఎనిమిదినక్షత్రములు అశుభములు. తరువాత మూఁడునక్షత్రములు శుభములు. ఆవల నొకనక్షత్రము అశుభము; తరువాత మూఁడు నక్షత్రములు శుభములు; పిదప నొకనక్షత్రము అశుభము; తరువాత మూఁడునక్షత్రములు శుభములు; ఆవలనొకనక్షత్రము అశుభము; తరువాత మూఁడునక్షత్రములు శుభములు; ఆవల నాలుగునక్షత్రములు అశుభములు.

## సస్యారోపణము. (పైరునాటుట)

శ్లో. హస్తత్రయోత్తరామూలే ధనిష్ఠారోహిణీమృగే ।
పుష్యేఽశ్విన్యనురాధాంత్యే మఘాసూం శుభవాసరే ।
త్యక్త్వా రిక్తాం శనిం భౌమం సస్యస్యాంకురరోపణం ॥

తా. హస్త - చిత్త - స్వాతి - ఉత్తర - మూల - ధనిష్ఠ - రోహిణి - మృగశిర - పుష్యమి - అశ్విని - అనూరాధ - రేవతి - మఖ యీనక్షత్రములయందు రిక్తతిథులు, శని భౌమ వారములుతప్ప తక్కిన శుభతిథి వారములయందును మొలకపైరు నాటిన శుభకరము.

ధాన్యచ్ఛేదనము.

శ్లో॥ పూర్వోత్తరామఘాశ్లేషా జ్యేష్ఠార్ద్రాశ్రవణద్వయే ।
భరణీస్వాతయేమూలే మృగేపుష్యేకరత్రయే ॥
ధాన్యచ్ఛేదశ్శుభా రిక్తాంహిత్వా భౌమశనైశ్చరౌ ॥

తా. పుబ్బ - పూర్వాషాఢ - పూర్వాభాద్ర - ఉత్తర - ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర - మఖ - ఆశ్లేష - జ్యేష్ఠ - ఆర్ద్ర - శ్రవణము - ధనిష్ఠ - భరణి - కృత్తిక - మూల - మృగశిర - పుష్యమి - హస్త - చిత్త - స్వాతి యీనక్షత్రములయందు రిక్తతిథులను శనిభౌమ వారములనువిడిచి తక్కినతిథివారములయందును పైరును కోయవలయు.

కణమర్దనము.

శ్లో॥ అనూరాధాశ్రవోమూలే రేవత్యాంచమఘాత్రిభే ।
జ్యేష్ఠాయాం చైవ రోహిణ్యాం శుభం స్యాత్కణమర్దనం ॥

తా. అనూరాధ-శ్రవణము-మూల-రేవతి-మఖ-పుబ్బ-ఉత్తర-జ్యేష్ఠ - రోహిణి ఈనక్షత్రములయందు కంకులుతాల్చిన శుభకరము.

ధాన్యక్షేపణము.

శ్లో॥ పునర్వసుమృగశీర్షేఽన్త్యేఽనురాధాశ్రవణత్రయే ।
హస్తత్రయేఽశ్వినీపుష్యే రోహిణ్యాముత్తరాత్రయే ॥
గురౌ శుక్రే రవీందోర్వా స్స తోక్షేస్థాదౌ ధాన్యరక్షణం ॥

తా. పునర్వసు-మృగశిర-రేవతి-అనూరాధ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-హస్త-చిత్త-స్వాతి-అశ్విని-రోహిణి-ఉత్తర-ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర ఈనక్షత్రములయందును, గురు-శుక్ర-ఆది-సోమవారములయందును, కణజము (బొట్ట) మొదలగువానిలో ధాన్యమును పోయుట శుభకరము.

ఔషధకరణము-తత్సేవనము.

శ్లో॥ హస్తత్రయేఽనురాధాయాం మూలే పుష్యే శ్రవస్త్రయే ।
మృగభే రేవతీయుగ్మే పునర్వసౌ విజన్మభే ॥
జ్ఞేందుశుక్రేజ్యసూర్యాణాం వాసరే సత్తిథావపి ।
ద్విస్వభావే శుభే లగ్నే శుద్ధే ద్యూనమృతివ్యయే ॥
భైషజ్యం శుభదం ప్రోక్తం యోగేచాయుష్మదాయినీ ॥



తా. హస్త-చిత్త-స్వాతి-అనూరాధ-మూల-పుష్యమి-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-మృగశిర-రేవతి-అశ్విని-పునర్వసు-జన్మనక్షత్రము, బుధ-సోమ-శుక్ర-గురు-ఆదివారములు వీనియందు,మిథున కన్యా ధనుర్మీనలగ్నములలో దేనియందైనను సప్తమాష్టమ ద్వాదశములు గ్రహవర్జితములై యుండఁగాను ఆయుష్మాన్నామ యోగమునందును ఔషధముచేయుట-భక్షించుట శుభకరము.

ప్రాయిచ్చ్వేయుట మొదలగునవి.

శ్లో॥ పూర్వార్ద్రారోహిణీపుష్యే ఉత్తరాత్రితయేఽశ్విభే ।
స్థితిర్మహానసస్యేష్టా గేహోపకరణైస్సహ ॥

తా. పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర-ఆర్ద్ర-రోహిణి- పుష్యమి - ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-అశ్విని ఈనక్షత్రములయందు గృహోపకరణములతోడ వంటయింటియందు క్రొత్తగా ప్రొయివేయుట, వంటచేయుట శుభకరము—సూర్యుఁడున్ననక్షత్రము మొదలు ౫ లక్ష్మీప్రదములు; ౫ ధనప్రదములు. ౫ దారిద్ర్యప్రదములు; ౫ త్రిప్పటచేయును; ౫ మరణమునిచ్చును; ౨ భూమినొసఁగును.

గృహాంగణమునందువేయఁదగిన వృక్షములు.

శ్లో॥ పున్నాగశ్చంపకోఽశోకః పిప్పలీ దాడిమీ శమీ ।
వకుళస్తిలకో ద్రాక్షా పిచుమందో మదో జయా ॥
నారికేళం తథా జాతీ పాటలా గేహమల్లికా ।
మల్లికాపూగబంధూకాః పనస స్సరసీరుహం ।
ఏతే గృహాంగణే వృక్షా ఆరోప్యా మంగళప్రదాః ॥

తా. సురపొన్న, సంపంగి, అశోకము, అశ్వత్థము, దానిమ్మ, జమ్మి, పొగడ, తిలకము, ద్రాక్షతీఁగె, వేప, కొబ్బరిచెట్టు, జాజి, పాదిరి, మల్లె, అడవిమల్లె, పోఁకమంకెన, పనస, తామర వీనిని ఇంటిముంగిటియందు పెట్టించిన శుభకరము.

గృహాంగణమునవేయఁదగని వృక్షములు.

శ్లో॥ మాతులుంగం స్నుహీ రంభా హారిద్రా చ మునిద్రుమః ।
ఏతే మోఖప్రదా గేహే సంజాతా రోపితా అపి ॥

తా. మాదీఫలవృక్షము, జెముడు, అరఁటి, పసుపు, అగసిచెట్టు, ఇవి గృహమున మొలిచినను, ఇంటివారు పైరుచేసినను అశుభకరము.

## ప్రయాణము.

శ్లో. పంచాంగశుద్ధకాలే చ చంద్రతారాబలాన్వితే ।
వారశూలాదిరహితే రాహుకాలాదివర్జితే ॥
ప్రయాణ మాహు ర్మనయో లగ్నే పంచకవర్జితే ॥

తా. పంచాంగశుద్ధి, చంద్రతారాబలములుగలిగి, వారశూల, రాహుకాలము మొదలగునవి లేక పంచకరహితం బగు లగ్నమున ప్రయాణముచేయవలయు.

## పంచాంగములు.

శ్లో. తిథి ర్వార శ్చ నక్షత్రం యోగః కరణ మేవ చ ।
పంచాంగసంజ్ఞాం లభతే తేషాం సంమేళనం సదా ॥

తా. తిథి-వారము-నక్షత్రము-యోగము-కరణము- ఈయైదునుచేరి పంచాంగము లనఁబడును.

## చంద్రబలము.

శ్లో. జన్మానలఋతౌసప్త దశమైకాదశేశుభః ।
అర్ధ్యష్టద్వాదశేకృష్ణే శుక్లేద్వినవపంచమే । .
యథామాతాసుతాన్ రక్షే త్తథారక్షతిచంద్రమాః ।

తా. చంద్రుఁడు జన్మ తృతీయ షష్ఠములయందును, సప్తమ దశమైకాదశముల యందు నుండిన శుభమునిచ్చును. కృష్ణపక్షమున ౪-౮-౧౨ స్థానములయందును, శుక్ల పక్షమున ద్వితీయ-పంచమ - నవమస్థానములయందును చంద్రుఁడుండిన శుభకరుఁడు.

## తారాబలము.

శ్లో. జన్మనక్షత్రమారభ్య నిత్యభాంతం చ గణ్యతే ।
నవభి శ్చ హరేద్భాగం నవతారాః ప్రకీర్తితాః ॥
జన్మ సంప ద్విప త్క్షేమ ప్రత్య క్సాధన నైధనం ।
మిత్రం పరమమైత్రం చ నవతారాః ప్రకీర్తితాః ॥

తా. జన్మనక్షత్రము మొదలుకొని నిత్యనక్షత్రమువరకు లెక్కించి తొమ్మిదిచే భాగించిన శేషము తారలగును; ౧ జన్మతార: ౨ సంపత్తార; ౩ విపత్తార; ౪ క్షేమ తార; ౫ ప్రత్యక్తార; ౬ సాధనతార; ౭ నైధనతార; ౮ మిత్రతార; ౯ పరమమైత్రతార.

శ్లో. జన్మభం దేహనాశాయ సంపత్సంపదపవ చ ।
విపచ్చ కార్యనాశాయ క్షేమం క్షేమకృతే భవేత్ ।



ప్రత్య క్చ కార్యనాశాయ సాధనం కార్యసాధనే ।
నైధనం నిధనేఽపి స్యా న్మిత్రం చ సుఖసంపదా ॥
మైత్రం చ పరమం సౌఖ్యే విద్యా త్తారాబలం క్రమాత్ ॥

తా. జన్మతార దేహనాశమును, సంపత్తార సంపదను, విపత్తార కార్యనాశమును, క్షేమతార క్షేమమును, ప్రత్యక్తార కార్యహానిని, సాధనతార కార్యసాధనమును, నైధనతార మరణమును, మిత్రతార సుఖసంపదలను, పరమమైత్రతార సౌఖ్యమును చేయును; జన్మతారయందు ఏడుగడియలును, విపత్తారయందు మూఁడుగడియలును, ప్రత్యక్-నైధనతారలయందు ఎనిమిదిగడియలును నిందితంబులు; మిగిలినవి శుభములు; ఈనిందితతారల దోషపరిహారమగుటకు, జన్మతారయందు శాకమును, విపత్తారయందు బెల్లమును-ప్రత్యక్తారయందు ఉప్పును, నైధనతారయందు నువ్వులతోఁగూడిన హిర ణ్యమును బ్రాహ్మణోత్తమునకు దానంబియ్యవలయు; విపత్ప్రత్యక్తారలయందు చంద్రుఁడు స్వోచ్చస్వక్షేత్రములయందుండిన సర్వకార్యములకు శుభముకలుగును.

శ్లో. యాత్రావివాహసీమంత మౌంజీబంధన భుక్తిషు ।
విద్యారంభే చ తారాయాః ప్రధానం బల మిందువత్ ॥

తా. ప్రయాణ వివాహ సీమంత ఉపనయన అన్నప్రాశన విద్యారంభముల యందు తారాబల చంద్రబలములు ముఖ్యముగఁ జూడఁదగినవి.

## పంచకము.

శ్లో. తిథివారోడుభిర్యుక్తం తత్కాలోదయమిశ్రితం ।
నవభి శ్చ హరే ద్భాగం శేషం పంచక మీరితం ॥

తా. తిథి వార నక్షత్ర తాత్కాలికలగ్నముల సంఖ్యను మొత్తముచేసి తొమ్మిదిచే భాగింపఁగా శేషము పంచకమనఁబడును. (౩-౫-౭-౯ మిగిలినయెడ పంచకర హితము. కార్యములయందు శుభకరము )

శ్లో. ఏకో మృత్యు ర్ద్వయం వహ్ని శ్చత్వారో రాజపంచకం ।
షట్చోర అష్ట రోగ స్స్యా దిత్యేత త్పంచకం స్మృతం ॥

తా. ౧ మిగిలిన మృత్యుపంచకము. ౨ అగ్నిపంచకము. ౪ రాజపంచకము. ౬ చోరపంచకము. ౮ రోగపంచకము ఇవి మంచివిగావు. (రాజదర్శనమునందు రాజపంచకమును, ప్రయాణమునందు చోరపంచకమును, గృహారంభమునందు రాజాగ్ని పంచకములను, ఉపనయన వివాహములయందు రోగమృత్యుపంచకములను వర్జింపవలయు. రాత్రియందు చోరరోగపంచకములను, పగటియందు రాజాగ్నిపంచకములను అర్ధరాత్రియందు మృత్యుపంచకమును వర్జింపవలయు.

—ప్రయాణమునకు - తిథులు - తారాశుద్ధి - నక్షత్రములు-వారశూల.—

శ్లో. తారాస్త్రిపంచసప్తాద్యా రిక్తామాపూర్ణిమాష్టమీ ।
శుక్లాద్యాద్వాదశీషష్ఠీ హిత్వా చంద్రబలేగమః ।
ధనిష్ఠా శ్రవణో హస్తోఽనురాధా రేవతీద్వయం ।
మృగః పునర్వసుః పుష్య శ్శ్రేష్ఠా న్యేతాని భాని చ ।
ప్రాచ్యాం యానే కుజే లాభో మందేంద్వో ర్దక్షిణే సుఖం ।
జ్ఞగుర్వోఃపశ్చిమేసిద్ధి శ్శుభం సౌమ్యే ఽర్క శుక్రయోః ।
దిక్శూలం పూర్వదిగ్భాగే జ్యేష్ఠాయాం శనిసోమయోః ।
పూర్వాభాద్రపదేయామ్యాం తథైవగురువాసరే ।
రవౌ శుక్రే చ రోహిణ్యాం పశ్చిమాయాం త్యజే ద్బుధః ।
ఉదీచ్యా ముత్తరాఫల్గున్యభిధే మంగళే బుధే ॥

తా. ౧-౩-౫-౭ తారలను, రిక్తతిథులను, అమవస, పున్నమ, అష్టమి, శుక్లపక్షపాడ్యమి-ద్వాదశి-షష్ఠి వీనినివిడిచి తక్కినతిథులయందు, చంద్రబలముగల దినములయందు యాత్రచేయవలయు—ధనిష్ఠ, శ్రవణము, హస్త, అనూరాధ, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మూల ఈనక్షత్రములు యాత్రకు ప్రశస్తములు—తూర్పుదిక్కునకు మంగళవారమునందును, దక్షిణపు దిక్కునకు శని సోమవారములయందును, పడమటిదిక్కునకు బుధ గురువారములయందును, ఉత్తరదిక్కునకు ఆది శుక్రవారములయందును యాత్రచేసిన శుభకరము—తూర్పునకు జ్యేష్ఠానక్షత్రము-శని సోమవారములు దిక్శూల. దక్షిణమునకు పూర్వాభాద్ర, గురువారములు దిక్శూల. పడమటికి రోహిణి, భాను శుక్రవారములు దిక్శూల. ఉత్తరమునకు ఉత్తర, మంగళ బుధవారములు దిక్శూల.

శ్లో. మేషసింహధనుస్సంస్థే యాత్రా శస్తాంశుమాలిని ।
కుంభనక్రాంగనాయుగ్మోక్షతౌలిస్థే తు మధ్యమా ।
కర్కాళిమీనగేఽర్కే తు యాత్రా దీర్ఘప్రవాసదా ॥

తా. సూర్యుఁడు, మేష, సింహ ధనుస్సులయందుండఁగా యాత్రచేయుటశుభము. కుంభ-మకర-కన్యా-మిథునములయందును, వృషభ తులలయందు నుండఁగా యాత్రచేయుట మధ్యమము. కటక-వృశ్చిక-మీనములయందుండఁగాఁ బ్రయాణము సేయుట అప్రశస్తమగుటచే సావకాశముగ నిల్లుచేరును.



ప్రయాణమునకు లగ్నములు.

శ్లో. చరలగ్నేచగంతవ్యం ద్విస్వభావేసదానృపైః ।
లగ్నేస్థిరేనగంతవ్యం యాత్రాయాం క్షేమమిచ్ఛతా ॥

తా. చరలగ్నము లగు మేష-కటక-తులా-మకర లగ్నములయందు మనుష్యులు ప్రయాణముచేయవలయు. ద్విస్వభావలగ్నము లగు, మిథున, కన్యా ధనుర్మీనములయందు రాజులు ప్రయాణముచేయవలయు. స్థిరలగ్నములగు వృషభ, సింహ, వృశ్చిక కుంభములయం దెవ్వరును ప్రయాణము చేయఁగూడదు.

లలాటయోగము.

శ్లో. లగ్నస్థో భాస్కరః ప్రాచ్యాం దిశియాతు ర్లలాటకః ।
ద్వాదశైకాదశే శుక్ర ఆగ్నేయ్యాం తు లలాటకః ।
దశమస్థః కుజో లగ్నా ద్యామ్యాయాం తు లలాటకః ।
నవమాష్టమగో రాహు ర్నైరృత్యాం తు లలాటకః ॥
లగ్నా త్సప్తమగ స్సౌరిః ప్రతీచ్యాం తు లలాటకః ॥
షట్పంచమగత శ్చంద్రో వాయవ్యాం తు లలాటకః ।
చతుర్థస్థానగ స్సౌమ్య ఉత్తరస్యాం లలాటకః ।
ద్విత్రిస్థానగతో జీవ ఈశాన్యాం తు లలాటకః ॥

తా. ప్రయాణ లగ్నమునందు సూర్యుఁడుండిన, తూర్పుదిక్కునకు లలాటయోగము; శుక్రుఁడు ప్రయాణలగ్నమునకు ఏకాదశ ద్వాదశములయందుండిన ఆగ్నేయమూలకును, అంగారకుఁడు దశమస్థానంబుననుండిన దక్షిణపు దిక్కునకును, రాహువు నవమాష్టముల యందుండిన నిరృతిమూలకును, శని సప్తమస్థానముననుండిన పడమటి దిక్కునకును, చంద్రుఁ డైదు ఆఱుస్థానముల యందుండిన వాయవ్యమూలకును, బుధుఁడు చతుర్థమందుండిన నుత్తరపుదిక్కునకును, గురుఁడు ద్వితీయ తృతీయములయందుండిన ఈశాన్యమూలకును లలాటయోగము; ఈయోగములయందు యాత్రకూడదు.

శ్లో. త్రికోణకేంద్రగాస్సౌమ్యాః క్రూరా స్త్ర్యాయారిగా యది ।
యాత్రాసిద్ధి ర్భవే ద్దృష్టే శవే రోదనవర్జితే ।

తా. శుభగ్రహములు ౧-౪-౫-౭-౯-౧౦ ఈస్థానములయందును, పాపగ్రహములు ౩-౬-౧౧ ఈస్థానములయందు నుండినను, రోదనములేకుండ పీనుఁగు ఎదురుగ వచ్చినను యాత్రకు మంచిది.

## యోగిని.

శ్లో. శతమఖేందుహుతాశనరక్షసాం యమజలేశసమీరణశూలినాం।
దివిభువిక్రమశఃపరివర్తతే సితతిథిప్రథమాదిషుయోగినీ॥

తా. శుద్ధపాడ్యమి మొదలు దశమివరకు క్రమముగ, తూర్పు, ఉత్తరము, ఆగ్నేయము, నిరృతి, దక్షిణము, పడమర, వాయవ్యము, ఈశాన్యము, ఆకాశము, భూమి యీదిక్కులయందు యోగిని యుండును; శుద్ధఏకాదశి మొదలు అమావాస్యవరకును పైప్రకారముండును; కావున యోగిని యున్నదిక్కునకు యాత్రచేయఁగూడదు.

## లగ్నత్యాజ్యములు.

శ్లో. అజవృషభధనుఃకన్యకాద్యాభుజంగో,
ఝషమకరకులీరేవృశ్చికాంతే చ రాహుః।
మిథునఘటతులానాం సింహమధ్యే తు గృధ్రి,
స్సకలమునిమతం స్యా త్సర్వకార్యేషు వర్జ్యం॥

తా. మేష-వృషభ-ధనుః-కన్యా లగ్నములయందు, లగ్నముదయించినది మొదలు అరగడియవరకు భుజంగమనెడి వర్జ్యకాలము; మీన-కర్కాటక-వృశ్చికములయందుఁ గడపట నరగడియ రాహువనెడి వర్జ్యకాలము; మిథున-కుంభ-తులా-సింహారాసులయందు నగముభాగమునందు గృధ్రియనెడి వర్జ్యకాలము కావున నీకాలములను సర్వకార్యములయందు వర్జింపవలయు.

## రాహుకాలములు. పగలు.

సూ॥ విధుసౌరిభృగూసు తజ్ఞజీవ భౌమార్క-వారేషు త్రిపాదత్రీణి వృద్ధిః॥

తా. సోమ-శని-శుక్ర-బుధ-గురు-మంగళ-ఆదివారములయందు క్రమముగ సోమవారమునందు ౩½ గడియ-శనివారమున ౭½. ఇట్లు క్రమవృద్ధిగా రాహుకాలముండును.

| వారములు. | ఘంట-మొ. | ఘం-వరకు. |
|---|---|---|
| ఆదివారము. | ౪½ | ౬ |
| సోమవారము. | ౭½ | ౯ |
| మంగళవారము. | ౩ | ౪½ |
| బుధవారము. | ౧౨ | ౧½ |
| గురువారము. | ౧½ | ౩ |
| శుక్రవారము. | ౧౦½ | ౧౨ |
| శనివారము. | ౯ | ౧౦½ |



## గౌరిచెప్పిన ముహూర్తములు.

| పగటిముహూర్తములు. | | | | | | | గంటలు. | | రాత్రిముహూర్తములు. | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆ | సో | మం | బు | గు | శు | శ | మొ | వరకు | ఆ | సో | మం | బు | గు | శు | శ | ఉ=ఉద్యోగ్యము. లా=లాభము. |
| ఉ | అ | రో | వి | ఉ | రో | వి | ౬ | ౭½ | శు | రో | జ్వ | లా | సు | అ | వి | వి=విషము. |
| లా | వి | ఉ | అ | వి | జ్వ | అ | ౭½ | ౯ | అ | లా | ఉ | రో | రో | జ్వ | ఉ | అ=అమృతము. |
| వి | ఉ | జ్వ | శు | జ్వ | అ | రో | ౯ | ౧౦½ | జ్వ | ఉ | క | వి | క | క | శు | శు=శుభము. ధ=ధనము. |
| ఆ | లా | లా | ఉ | లా | క | ఉ | ౧౦½ | ౧౨ | రో | ధ | లా | ఉ | లా | లా | అ | క=కలహము. |
| శు | జ్వ | అ | రో | అ | లా | శు | ౧౨ | ౧½ | క | రో | రో | శు | ఉ | శు | క | రో=[illegible]గము. |
| ధ | అ | ఉ | శు | వి | సు | లా | ౧½ | ౩ | లా | అ | లా | లా | జ్వ | ధ | రో | ఆ=ఆదాయము. |
| అ | ఆ | వి | ధ | క | ధ | ధ | ౩ | ౪½ | ఉ | వి | ఉ | ధ | లా | అ | అ | జ్వ=జ్వరము సు=సుఖము |
| వి | ధ | లా | అ | జ్వ | అ | లా | ౪½ | ౬ | రో | జ్వ | ధ | లా | ఉ | వి | లా | |

| ఈవారములయందు. | ఈనక్షత్రములుకూడిన అమృతయోగములు. | ఈనక్షత్రములు కూడిన మరణ యోగము. |
|---|---|---|
| ఆదివారము. | మూ-శ్ర-రే-హ-ఉఫ-రో-ఉషా-ఉభా. | అనూ-జ్యే-మ-వి-ధ. |
| సోమవారము. | మృ-స్వా-రే-పున-శ్ర. | మ-వి-కృ పూభా. ఉషా. |
| మంగళవారము. | రో-మూ-అశ్వి-ఉఫ-ఉషా-ఉభా. | శ-ఆర్ద్ర వి-పూభా. |
| బుధవారము. | పుబ్బ-పూషా-పూభా-కృ-ఉషా-ఉభా. | ధ-మూ-రే-అ హ. |
| గురువారము. | అశ్వి-పుష్య-స్వా-మ. | మ-రో-శ-ఆర్ద్ర-వి-ఉఫ. |
| శుక్రవారము. | మూ-హ-రే-అశ్వి-అనూ-స్వా-ఉఫ-ఉషా-ఉభా. | పు-రో-జ్యే శ్ర-అ-మ. |
| శనివారము. | మ, స్వా, కృ-రో-శత. | ఉ-హ-చి-ఉషా-పూర్భా-ఉభా-రే. |

## ప్రయాణమునందు శుభశకునములు.

శ్లో. నిజేష్టమిత్రాద్యనుయానలాభ స్సన్నాహసిద్ధి స్త్వనుకూలశబ్దః।
ప్రదక్షిణావేష్టకపోష్యబంధు పుత్రాదియుక్తాండజబంధహీనః॥

తా. యాత్రకువెడలునపుడు తన బంధు మిత్రులు కొంతదూరము వెంబడించి వచ్చుట, కావలసిన పనులు సిద్ధమగుట, అనుకూలశబ్దములువినుట, తనకంటె చిన్నవారైనను స్వజనులు తనకుఁ ప్రదక్షిణముగాఁదిరుగుట, కాకి-క్షేమకారి-సర్పము మొదలగునవి కట్టకుండా అనుకూలమగుట, ఇవి శుభకరములు. (మఱియు-కన్యపడుచులు, ముత్తయిదువ-భోగముది-పువ్వులు-ఫలములు-పసపు-కుంకుమ మొదలగు మంగళద్రవ్యములు మంగళవాద్యములు-పాలు-పెరుగు-జ్వాలాదీపములు-గాడిదెఅరచుట - జయశబ్దము-ఘంటాధ్వని-వేదఘోషము-అనుకూలమైనగాలి-అమృతగడియ సమీపించుట-జంటబ్రాహ్మణులు-గోవులు-ఏనుఁగులు-గుఱ్ఱములు-యోగ్యవాహనములు-చేఁపలు-పీనుఁగు-మాంసము-ఇవి యెదురుగగాని కుడిప్రక్కగగాని వచ్చుట వీనివలన ప్రయాణము నిర్విఘ్నముగా జరుగును.)

## ప్రయాణమునం దశుభశకునములు.

శ్లో. కుత్రగమిష్యసి ? గమనాత్కింఫల? మహమప్యాగమిష్యామి।
భుక్త్వాగచ్ఛేదానీం మాగచ్ఛ ! త్వత్ప్రయోజనంనస్యాత్ ॥
మార్గేబహవశ్చోరా స్సంతి వ్యాఘ్రాద్యుపద్రవా దుష్టాః।
రోగభయం తత్రాస్తీత్యాదివిరుద్ధాని వాక్యాని ॥
యాత్రాకాలే యైః కై రుక్తాని స్యుస్తదానగంతవ్యం।
వహ్నిం సధూమ మంధం విధవాం చ కుణిం చ తైలఘటం ॥

తా. ఎచ్చటికైన వెడలునపుడు ఇతరులెవరైనను, నీవెచ్చటికిబోవుచున్నావు? ఎందుకేగెదవు ? నేనునువచ్చెద కొంచెము నిలువుము నీవొక్కడ వేగజనదు- భుజించిపొమ్ము - ఇప్పుడేలపోయెదవు - పనికానేరదు - త్రోవలో దొంగలుండెదరు - పులులున్నవి - అచ్చట రోగభయమున్నది - అనునిట్టి విరుద్ధవాక్యములు పలికినను, ఇతరులు తుమ్మినను, పొగతోగూడిననిప్పు - గ్రుడ్డివాఁడు-విధవ - కుంటివాఁడు - నూనెకుండ- ఇవి యెదురుగవచ్చినను యాత్రకూడదు. (మఱియు--క్రొత్తకుండ - గొడ్డండ్లు - ఆయుధములు - ముక్కిడివాఁడు - బోడివాఁడు - సన్యాసి - జోగి - జంగము - నంబి - పండారము - ఒంటివిప్రుఁడు - ఏడ్చువాఁడు - దిగంబరుఁడు - ఇట్టివారెదురుగవచ్చుట, జారిపడుట, తలగుడ్డ క్రిందపడుట, గాలివానవచ్చుట, సొమ్ము మరచుట, వెదకినదిదొరకకపోవుట, బండిపడుట, తన్నులుతగులుట, దెబ్బపడుట, నొప్పిపట్టుట, గాయమగుట, రక్తమువచ్చుట, కష్టవార్తనువినుట, కాకి - పిల్లి - గరుడపక్షి - పాము ఇవి అడ్డముగాపోవుట, కోఁతులు - కోళ్ళు-పిల్లులు జగడమాడుట, ఇత్యాదు లనిష్టసూచకంబులు.)

## అపశకునశాంతి.

శ్లో. యద్యపశకునైర్భావి న్యనిష్టయోగే పురైవవిజ్ఞాతే।
భయశంకాంపరిహర్తుం భగవంతం ప్రార్థయే న్మనుజః ॥
స్నానం దానం హోమో జప పూజా తర్పణాదీని ॥

తా. అపశకునములు గలిగినయెడ భగవంతుం డగు శ్రీమన్నారాయణునిస్మరించి స్నాన దాన జప హోమ పూజాదులొనర్చిన అపశకున పీడ తొలఁగు.

## గృహనిర్మాణము.

చైత్ర వైశాఖ శ్రావణ కార్తిక మాఘ మాసములును, సూర్యుఁడుండెడి వృషభ, కటక, సింహ, కుంభ, మేష, తులా, వృశ్చిక, మకరరాసులును, వీనిలో స్థిరరాసులును, గృహనిర్మాణమునకుఁ ప్రశస్తములు; గురుశుక్ర మూఢములు శూన్యమాసము ఇవికూడవు; సూర్యుఁడు సింహరాశియందుండునపుడు పడమరదిక్కునందును, వృషభరాశియందుండునపుడు ఉత్తరదిక్కునందును, కుంభరాశియందుండునపుడు తూర్పుదిక్కునందును, వృశ్చికమునందుండునపుడు దక్షిణమునందును ద్వారమునేర్పఱచవలయు.—ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, చిత్త, రోహిణి, స్వాతి, మృగశిర, మూల, అశ్విని, హస్త, పుష్యమి, అనూరాధ, ఈనక్షత్రములు మంచివి. పరిఘయోగముయొక్క మొదటిసగభాగమును వైధృతిపాతములను సంపూర్ణముగను, గండాతి గండయోగముల మొదట ఆరుగడియలను, శూలయోగమునం దైదుగడియలను, వ్యాఘాతమునందు తొమ్మిదిగడియలను, తక్కిన నింద్యయోగములను, భద్రవాకరణమును గృహనిర్మాణమునందు వర్జింపవలయు—కేంద్ర కోణములయందు శుభగ్రహములును-౩-౬-౧౧ స్థానములయందు క్రూరగ్రహములును గలిగి అష్టమస్థానము పాపగ్రహవర్జితంబైయుండవలయు.

## గృహప్రవేశము.

శ్లో. నవ్యేగృహేమాధవమాఘయుగ్మేయాత్రానివృత్తావపిభూమిభర్తుః।
ప్రవేశనంద్వార్థ్యన్మృదుధ్రువర్క్షైర్లగ్నేస్థిరేచోపచయోదయేసతి ॥
జీర్ణేగృహేఽగ్న్యాదిభయాన్నవీనే స్యాద్వాసవేజ్యానిలభాంబుపేషు।
మాసేనభస్యూర్జయుగేప్రవేశోనమాఢ్యదోషోఽత్రసితేజ్యయోస్స్యాత్ ॥

తా. వైశాఖ మాఘ మాసములయందును, యాత్రచేసి వచ్చినదినమునందును, మృదు, ధ్రువనక్షత్రములయందును, స్థిరలగ్నములయందును, బలయుక్తలగ్నములయందును, నూతనగృహప్రవేశము చేయవలయు; ప్రాతయిండ్లలోనైనను అగ్నిమొదలగు వానివలన చెడి మరలఁగట్టబడిన యిండ్లలోనైనను ప్రవేశించుటకు జ్యేష్ఠ, పుష్యమి స్వాతి, పూర్వాషాఢ, ఈనక్షత్రములు మంచివి. శ్రావణ కార్తీక మార్గశిర మాసములు గురు శుక్ర మూఢములు కూడవు.

లగ్నశుద్ధిక్రమము.

శ్లో. నామ్ని చ ద్వాదశే శుద్ధి శ్శ్రాద్ధేచైకాదశేతథా ।
భోజనే దశమే శుద్ధి ర్నవమే చౌలకర్మణి ॥
ఉపనీతేఽష్టమేశుద్ధి ర్వివాహే సప్తమేతథా ।
షట్శుద్ధిర్నవవస్త్రేతు ప్రయాణేపంచమేతథా ॥
విద్యారంభేచతుశ్శుద్ధిః కృష్యారంభే త్రయస్తథా ।
గృహప్రవేశే ద్వే శుద్ధి ర్లగ్నశుద్ధి స్తు సంగమే ॥

తా. నామకరణలగ్నమునకు ద్వాదశశుద్ధియు, నాందీశ్రాద్ధమునకు ఏకాదశశుద్ధియు, అన్నప్రాశనమునకు దశమశుద్ధియు, చౌలమునకు నవమశుద్ధియు, ఉపనయనమునకు అష్టమశుద్ధియు, వివాహమునకు సప్తమశుద్ధియు, నూతనవస్త్రధారణమునకు షష్ఠశుద్ధియు, యాత్రకు పంచమశుద్ధియు, విద్యాభ్యాసమునకు చతుర్థశుద్ధియు, కృషికి తృతీయశుద్ధియు, గృహప్రవేశమునకు ద్వితీయశుద్ధియు, నిషేకమునకు లగ్నశుద్ధియు గలిగియుండవలయు.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం లౌకికకార్య ముహూర్తనిర్ణయ కథనంనామ షష్ఠోఽధ్యాయః.

---

సప్తమాధ్యాయము.

# గృహస్థధర్మములు.

శ్లో. సుఖార్థా స్సర్వభూతానాం మతా స్సర్వాః ప్రవృత్తయః ।
సుఖం చ న వినా ధర్మా త్తస్మా ద్ధర్మపరో భవేత్ ॥

తా. సకలజనులును సుఖముకొఱకు ప్రవర్తింతురు. అట్టిసుఖము ధర్మములేక గలుగదుగనుక మనుష్యుఁడు ధర్మపరుఁడు కావలెను.



శ్లో. గృహస్థః పాలయే ద్దారా న్విద్యా మభ్యాసయే త్సుతాన్ ।
గోపయే త్స్వజనా న్బంధూ నేష ధర్మ స్సనాతనః ॥

తా. గృహస్థుఁడు భార్యనుపోషించవలయు. పుత్రులను చదివించవలయు. స్వజనులను బంధువులను గాపాడవలయు. ఇది సనాతనధర్మము.

శ్లో. మాతరం పితరం చైవ సాక్షా త్ప్రత్యక్షదేవతాం ।
మత్వా గృహీ నిషేవేత సదా సర్వప్రయత్నతః ॥

తా. గృహస్థుఁడు తలిదండ్రులను సాక్షాత్తుగ ప్రత్యక్షదేవతలనిభావించి సర్వకాల సర్వావస్థలయందు వారికిఁ బ్రీతికరము లగుకార్యములనొనర్చుచు వారిని సేవించుచుండవలయు.

శ్లో. భ్రాతా జ్యేష్ఠ స్సమః పిత్రా భార్యా పుత్ర స్స్వకా తనుః ।
ఛాయా స్వదాసవర్గ శ్చ దుహితా కృపణంపరం ॥
తస్మా దేతై రధిక్షిప్త స్సహేతా సంజ్వర స్సదా ॥

తా. పురుషునకు, అన్న తండ్రితోసమానుఁడు. పెండ్లాము – కుమారుఁడు – కూఁతురు వీరు తనశరీరమై మిక్కిలి ప్రేమాస్పదులైనవారు. పరిచారకసమూహము తననీడతోసమానము; కావున వీరిచేత తాను అవమానింపఁబడినను పరితాపమునొందక ఓర్చుకొని దయాళుఁడై యుండవలయు.

శ్లో. అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన ।
న చేమం దేహ మాశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్ ॥

తా. అతివాదములను సహింపవలయు. ఎవనినిగాని అవమానింపఁగూడదు. ప్రతిమనుష్యుఁడును ఎవ్వరితోడను వైరముసేయక పరోపకారముసేయుచుండవలయు

—యుగచతుష్టయసుకరపురుషార్థహేతు ధర్మనిరూపణము.—

శ్లో. తపఃపరం కృతయుగే త్రేతాయాం జ్ఞాన ముచ్యతే ।
ద్వాపరే యజ్ఞ మిత్యాహు ర్దాన మేవ కలౌయుగే ॥

తా. కృతయుగమునందు తపస్సును (అనగా ఉపవాసాదులవలన శరీరమును శోషింపఁజేయుట), త్రేతాయుగమున జ్ఞానంబును, ద్వాపరమునందు యజ్ఞంబును, కలియుగంబున దానమును మిక్కిలి ముఖ్యంబులు.

శ్లో. త్యజే ద్దేశం కృతయుగే త్రేతాయాం గ్రామ ముత్సృజేత్ ।
ద్వాపరే కుల మేకం తు కర్తారం తు కలౌయుగే ॥

తా. కృతయుగమునందు పతితుఁడుండిన దేశమును, త్రేతాయుగమునం దట్టి గ్రామమును, ద్వాపరమునం దట్టికులమును, కలియుగంబున పతితుఁడైనవానిని విడువవలయు.

శ్లో. కృతే సంభాషణాదేవ త్రేతాయాం స్పర్శనేన చ।
ద్వాపరే త్వన్నమాదాయ కలౌ పతతి కర్మణా॥

తా. కృతయుగమునందు పతితునితో సంభాషించుటవలనను, త్రేతయందు వానిని తాఁకుటవలనను, ద్వాపరమునందు పతితుని అన్నమును తినుటవలనను, కలియుగంబున స్వయముగ పాపకర్మముల నొనర్చుటవలనను పతితుఁడగును.

శ్లో. కృతే తత్క్షణికశ్శాప స్త్రేతాయాం దశభి ర్దినైః।
ద్వాపరే చైకమాసేన కలౌ సంవత్సరేణ తు॥

తా. కృతయుగంబున శాపము తత్క్షణమునను, త్రేతయందు పదిదినములకును, ద్వాపరంబున ఒకమాసమునకును, కలియుగమునం దొకసంవత్సరమునకును ఫలించును.

శ్లో. అభిగమ్య కృతే దానం త్రేతాస్వాహూయ దీయతే।
ద్వాపరే యాచమానాయ సేవయా దీయతే కలౌ॥

తా. కృతయుగమునందు దాతలు పరిగ్రహీత లున్నచోటికి బోయియు, త్రేతయందు వారిని బిలిపించియు, ద్వాపరమునందు యాచించినవారికిని, కలియుగంబున కొలువుగొల్చినవారికిని దానమొసంగుదురు.

శ్లో. అభిగమ్యోత్తమం దాన మాహూయైవ తు మధ్యమం।
అధమం యాచమానాయ సేవాదానం తు నిష్ఫలం॥

తా. పరిగ్రహీతలదగ్గరకుబోయి యిచ్చుట యుత్తమము. పిలిపించియిచ్చుట మధ్యమము. యాచించువానికిచ్చుట అధమము. కొలువుగొల్చినవానికిచ్చుట నిష్ఫలము

అనధీతబ్రాహ్మణస్వరూపము.

శ్లో. యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః।
బ్రాహ్మణ స్త్వనధీయాన స్త్రయ స్తే నామధారకాః॥
గ్రామస్థానం యథాశూన్యం యథా కూప స్తు నిర్జలః।
యథా హుత మనగ్నౌ చ అమంత్రబ్రాహ్మణా స్తథా।
యథా షండో௨ఫలః స్త్రీషు యథా గౌ రూషరా௨ఫలా।
యథా చాజ్ఞే௨ఫలం దానం తథా విప్రో௨నృచో௨ఫలః॥



తా. కొయ్యతోఁజేయబడిన యేనుఁగు, చర్మముతోఁజేయబడిన మృగము, వేదముచదువని బ్రాహ్మణుఁడు వీరుముగ్గురును పేరునుమాత్రము వహించినవారు. జనశూన్యస్థలము గ్రామమనియు, జలములేనిది బావియనియు, పెలిమిడియందు వేయుట హోమమనియుఁ జెప్పఁబడినట్లే వేదముచదువనివారు బ్రాహ్మణులనఁబడుచున్నారు. నపుంసకుఁడు స్త్రీలయందు నిరర్థకుఁడగునట్లును, చౌటిభూమియందు ఫలించనట్లును మూర్ఖులకిచ్చిన దానము నిష్ఫలమగునట్లును వేదముజదువని విప్రుఁడు వ్యర్థుఁడగును.

కర్మచండాలలక్షణము.

శ్లో. న కార్య మావసథ్యేన నాగ్నిహోత్రేణ వా పునః।
స భవే త్కర్మచండాలో య స్తు ధర్మపరాఙ్ముఖః॥

తా. అగ్నిచేతను, అగ్నిహోత్రాదికర్మలచేతను, ఈలోకమున ఫలములేదు, పరలోకమున ఫలముకలదో లేదో ఎవరెఱుగును అని వేదోక్తకర్మముల నాచరింపనివాఁడు కర్మచండాలుఁడగును.

అతిథినిరూపణము.

శ్లో. ఇష్టో వా యది వా ద్వేష్యో మూర్ఖః పండిత ఏవ వా।
సంప్రాప్తో వైశ్వదేవాంతే సో௨తిథి స్స్వర్గసంక్రమః।
న పృచ్ఛే ద్గోత్రచరణే న స్వాధ్యాయం శ్రుతం తథా॥
హృదయే కల్పయే ద్దేవం సర్వదేవమయో హి సః॥

తా. వైశ్వదేవాంతమున వచ్చిన అతిథి ప్రియుఁడైనను. శత్రువైనను, మూర్ఖుఁడైనను, ప్రాజ్ఞుఁడైనను – వానికి అర్ఘ్యాసనాదు లొసంగి పూజించి ఆతిథ్యంబొసంగిన స్వర్గము లభించును; గృహస్థుఁడు సర్వదేవస్వరూపుఁ డగుఅతిథిని, గోత్రము–ఆచారము శాఖ–శాస్త్రము–మొదలగువాని నడుగక మనంబున దేవునిగ భావించవలయు.

శ్లో. దద్యా చ్చ భిక్షాత్రితయం పరివ్రాడ్బ్రహ్మచారిణాం।
ఇచ్ఛయా చ తతో విద్వాన్ విభవే సత్యవారితం॥

తా. పేదలు – సన్యాసులు – బ్రహ్మచారులు వచ్చినయెడల ముగ్గురికైన యథాశక్తి భిక్షపెట్టవలయు. కలిగియుండిన లేదనకుండ పెట్టవలయు.

శ్లో. అకృత్వా వైశ్వదేవం తు భుంజతే యే ద్విజాధమాః।
సర్వే తే నిష్ఫలా జ్ఞేయాః పతంతి నరకే௨శుచౌ॥
వైశ్వదేవవిహీనా యే ఆతిథ్యేన బహిష్కృతాః।
సర్వే తే నరకం యాంతి కాకయోనిం వ్రజంతి చ॥

తా. వైశ్వదేవము చేయక భుజించిన బ్రాహ్మణులు అధములును నిర్భాగ్యులునై యశుచియగు నరకమున బడుదురు. మఱి వైశ్వదేవము, అతిథి సత్కారము లేనివారు నరకముల ననుభవించి కాకిజన్మ మెత్తుదురు.

కర్మకృల్లక్షణము

శ్లో. పితృదేవమనుష్యాణాం దీనానాం చ తపస్వినాం।
గురుమాతృపితౄణాం చ సంవిభాగీహి కర్మకృత్ ॥

తా. పితృదేవతలకు, దేవతలకు, మనుష్యులకు, దీనులకు, యతులకు, గురువులకు, తల్లిదండ్రులకు, ద్రవ్యములు వినియోగించువాడు నిత్యనైమిత్తికకామ్యకర్మంబుల లెస్సగాజేయువాడగును.

గృహస్థమహత్త్వకారకములు.

శ్లో. సుధా నవ గృహస్థస్యేషద్వ్యయాని నవైవ చ।
నవ కర్మాణి తస్యైవ వికర్మాణి తథా నవ॥
ప్రచ్ఛన్నాని నవాన్యాని ప్రకాశ్యాని తథా నవ।
సఫలాని నవాన్యాని నిష్ఫలాని నవైవ తు॥
అదేయాని నవాన్యాని వస్తుజాతాని సర్వదా।
నవకా నవనిర్దిష్టా గృహస్థోన్నతికారకాః॥

తా. గృహస్థునకు సుధలు తొమ్మిది. ఈషద్వ్యయములు తొమ్మిది. కర్మములు తొమ్మిది. వికర్మములు తొమ్మిది. ప్రచ్ఛన్నములు తొమ్మిది. ప్రకాశ్యములు తొమ్మిది. సఫలములు తొమ్మిది. నిష్ఫలంబులు తొమ్మిది. ఇయ్యదగనివి తొమ్మిది. ఇట్లు తొమ్మిదితొమ్మిదులు నెఱింగి నడిచినగృహస్థున కౌన్నత్యంబు గలుగును.

నవసుధలు.

శ్లో. సుధావస్తూని వక్ష్యామి శిష్టే చ గృహ మాగతే।
మన శ్చక్షు ర్ముఖం వాచం సౌమ్యం దద్యా చ్చతుష్టయం॥
అభ్యుత్థాన మిహాగచ్ఛ పూర్వాలాపః ప్రియాన్వితః।
ఉపాసన మనువ్రజ్యా కార్యా ణ్యేతాని యత్నతః॥

తా. శిష్టుండు తనయింటికి వచ్చినప్పుడు చేసెడి మధురోపచారంబులు సుధలనంబడు; అవియెయ్యవియనగా—మనను, నేత్రము, ముఖము, వాక్కు ఈ నాలుగును సౌమ్యంబులుగానుండుట, అభిముఖముగా లేచుట, ఇందురమ్మని పలుకుట, ప్రియముగా సంభాషించుట, ఉపచారము చేయుట, వెంటనరుగుట అనునివి తొమ్మిది.



నవైషద్వ్యయములు.

శ్లో. ఈషద్వ్యయాని తు నవ భూమి రాప స్తృణాని చ।
పాదశౌచం తథాభ్యంగ ఆసనం శయనం తథా॥
కించిద్రాత్రౌ యథాశక్తి నాస్యానశ్నన్ గృహే వసేత్।
మృజ్జలం చార్థినే దేయ మేతాన్యపి సతాం గృహే॥

తా. ఈషద్వ్యయములనగా స్వల్పవ్యయములు. అవియు తొమ్మిది. తన యింటికివచ్చిన శిష్టునకు సమర్పించునవి. భూమి, జలము, తృణములు, పాదప్రక్షాళనోదకము, అభ్యంగము, ఆసనము, శయనము, గృహస్థునియింట భోజనము లేనివాడు రాత్రియుండరాదుగాన యథాశక్తిగా భోజనంబిడుట, ఉదకము, ఇవి ఈషద్వ్యయములు; ఇవి సత్పురుషులయింటం దప్పనివి.

నవకర్మములు.

శ్లో. సంధ్యా స్నానం జపో హోమ స్స్వాధ్యాయ స్తర్పణం బలిః।
దేవార్చా వైశ్వదేవం చ నవకర్మాణి సర్వదా॥

తా. సంధ్యావందనము-స్నానము- జపము- హోమము-స్వాధ్యాయము-తర్పణము-బలి- దేవతార్చనము- వైశ్వదేవము అనునీతొమ్మిది సత్కర్మంబులు.

నవవికర్మములు.

శ్లో. అనృతం పారదార్యం చ తథా భక్ష్యస్య భక్షణం।
అగమ్యాగమనం చైవ హింసా స్తేయం తథైవ చ॥
అశ్రౌతధర్మాచరణం మిత్రధర్మబహిష్కృతిః।
పారుష్యం చ నవైతాని వికర్మాణీతి వర్జయేత్॥

తా. అసత్యము- పరస్త్రీగమనము- అభక్ష్యభక్షణము- అగమ్యాగమనము- హింస- చౌర్యము - వేదోక్తధర్మముల నాచరింపకుండుట - మిత్రధర్మము విడుచుట పరుషతనము ఈతొమ్మిదియు వికర్మములు వీనిని విడువవలయు.

శ్లో. గీతనృత్యే కృషి స్సేవా వాణిజ్యం లవణక్రియా।
ద్యూతచర్మాయుధానాం చ ప్రశంసా స్యా ద్వికర్మ చ॥

తా. పాడుట-ఆడుట- కృషి-సేవ- బేరము-ఉప్పుపని- జూదము- తోలుపని- ఆయుధకరణము, ఇవియు వికర్మంబులుగావున వీనినిగూడ విడువవలయు.

నవగోప్యములు.

శ్లో. ఆయు ర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రో మైథున ఘౌషధం।
పాపకర్మావమాన శ్చ ధర్మో గోప్యాని యత్నతః॥

తా. ఆయుర్దాయము, ధనము, గృహచ్ఛిద్రము, మంత్రము, సురతము, ఔషధము, ఒకనిపాపము, అవమానము, తాఁజేసిన ధర్మము వీనిని బ్రకాశపరచకూడదు.

నవప్రకాశ్యములు.

శ్లో. అగోప్య మృణశుద్ధి శ్చ దాయాదః క్రయవిక్రయౌ ।
కన్యాదానం వృషోత్సర్గో రహః పాపం జుగుప్సితం ॥

తా. ఋణము చేయుట- ఋణము తీర్చుట- దాయాదుఁడు- వస్తువులగొనుట- అమ్ముట- కన్యాదానము- వృషోత్సర్గము - రహస్యము- నిందితపాపము ఇవి ప్రకాశములు కావలయు.

నవసఫలంబులు.

శ్లో. మాతాపిత్రో ర్గురౌ మిత్రే వినీతే చోపకారిణి ।
దీనానాథవిశిష్టేషు దత్తం చ సఫలం భవేత్ ॥

తా. తల్లి-తండ్రి-గురువు- మిత్రుఁడు - అణకువగలవాఁడు - ఉపకారము చేసినవాఁడు-దీనుఁడు-అనాథజనుఁడు-శిష్టుఁడు-ఇట్టివారల కిచ్చెడి దానములు-సఫలంబులు.

నవనిష్ఫలంబులు.

శ్లో. ధూర్తే వందిని మల్లే చ కువైద్యే కితవే శఠే ।
చేట చారణ చోరేషు దత్తం భవతి నిష్ఫలం ॥

తా. ధూర్తుఁడు, స్తుతిపాఠకుఁడు, జెట్టి, దుష్టవైద్యుఁడు, జూదరి, శఠుఁడు, కుంటెనగాడు, చారులు, దొంగ, ఇట్టివారికిచ్చినదానములు నిష్ఫలములు.

అదేయములు.

శ్లో. సామాన్యం యాచితం న్యాస ఆధి ర్దారా సుహృద్ధనం ।
భయార్జితం చ నిక్షేప స్సర్వస్వం చాన్వయే సతి ॥
ఆపత్స్వపి న దేయాని నవవస్తూని సర్వదా ।
యో దదాతి స మూఢాత్మా ప్రాయశ్చిత్తీయతే నరః ॥

తా. సామాన్య ద్రవ్యము, ఎరవుసొమ్ము, దాచిపెట్టినది, కుదువయుంచినది, పెండ్లాము, మిత్రధనము, భయహేతువైనది, నమ్మకముమీఁద నొకఁడు తనయొద్దనుంచినది, వంశమువారుండఁగా సర్వధనము, ఇట్టిధనమును ఆపత్కాలమునందైనను దానము చేయఁగూడదు. దానము చేయుమూఢుఁడు ప్రాయశ్చిత్తార్హుఁడగును.

శ్లో. నవనవకవేత్తార మనుష్ఠానపరం నరం ।
ఇహలోకే పరత్రాపి శ్రీ శ్చ తం నైవ ముంచతి ॥



తా. పైఁజెప్పబడిన తొమ్మిది తొమ్మిదులనెఱింగి ప్రవర్తించు వానికి ఇహలోకమునందును పరలోకమునందును లక్ష్మి యభివృద్ధియగును.

శ్లో. షట్కర్మసహితో విప్రఃపి కృషికర్మ చ కారయేత్ ॥

తా. యజనాదిషట్కర్మ నిరతుఁడగు విప్రుఁడు, ఆపత్కాలమున (అనఁగా జీవనము జరుగనియప్పుడు) శూద్రులచే కృషికర్మము చేయించవలయు.

—కృషియందు వర్జనీయ, యోజ్య బలీవర్ద నిరూపణము.—

శ్లో. క్షుధితం తృషితం శ్రాంతం బలీవర్దం న యోజయేత్ ।
హీనాంగం వ్యాధితం క్లీబం వృషం విప్రో న వాహయేత్ ॥

తా. కృషికర్మయందు- ఆఁకలిగొన్నది-దప్పిగొన్నది-అలసినది-కుంటిది- తెవులుగొన్నది - మగతనములేనిదియైన యెద్దును బ్రాహ్మణుఁడు ఉపయోగింపఁగూడదు.

శ్లో. స్థిరాంగం నీరుజం తృప్తం సునర్దం షండవర్జితం ।
వాహయే ద్దివసస్యార్థం పశ్చా త్స్నానం సమాచరేత్ ॥

తా. దృఢావయవములు గలదియు, వ్యాధిలేనిదియు, మేఁతమేసి తృప్తిజెందినదియు, బలిసి ఱంకెలువేయునదియు, మగతనముకలదియు నగునెద్దుచే రెండుజాములు దున్ని తరువాత స్నానము చేయించవలయు.

బలీవర్దస్నానానంతరకర్తవ్యవిధి.

శ్లో. జప్యం దేవార్చనం హోమం స్వాధ్యాయం చైవ మభ్యసేత్ ।
ఏకద్విత్రిచతుర్విప్రాన్ భోజయే త్స్నాతకాన్ ద్విజః ॥

తా. ఈదోషముతొలఁగుటకై బ్రాహ్మణుండు తనశక్తికొలఁది, జపము, దేవపూజ, హోమము, వేదపారాయణము వీనిలో దేనినేని చేసి, ఒకరిద్దరు ముగ్గురు నలుగురు * స్నాతకులను భుజింప జేయవలయు.

కర్షకపాపనిరూపణము.

శ్లో. సంవత్సరేణ యత్పాపం మత్స్యఘాతీ సమాప్నుయాత్ ।
అయోముఖేన కాష్ఠేన తదేకాహేన లాంగలీ ॥

తా. సంవత్సరమువఱకు చేఁపలనుపట్టెడివాఁ డెంతపాపమును జెందునో, ఇనుపకఱ్ఱువేసిన నాగటితో నొక్కరోజు దున్నినయెడల అంతపాపమును జెందును.

---

* సంతతికొఱకు పెండ్లి చేసికొనుటకు ద్రవ్యమార్జించువాఁడును, యజ్ఞమునందు ద్రవ్యమునంతయు దక్షిణగా నొసంగి దరిద్రుఁడై సొమ్మపేక్షించువాడును, తెరువరియు, యజ్ఞము చేయుటకు ద్రవ్యమును యాచించువాఁడును, గురువును తల్లిదండ్రులను బోషింప ధనమార్జించువాఁడును, వేదము చదువు నెరవేర్చుకొన గోరువాఁడును, రోగియు స్నాతకు లనఁబడుదురు.

శ్లో. పాశకో మత్స్యఘాతీ చ వ్యాధ శ్శాకునిక స్తథా ।
అదాతా కర్షక శ్చైవ సర్వేతే సమభాగినః ॥

తా. వలపన్ని మృగములఁబట్టెడువాఁడును, చేఁపలను పట్టెడివాఁడును, కిరాతుఁడును, పిట్టలజంపువాఁడును, కృషి యొనర్చి కళ్లముదగ్గరకు వచ్చినవారికి పెట్టనివాఁడును తుల్యమైనపాపమును బొందుదురు.

శ్లో. యో న దద్యా ద్ద్విజాతిభ్యో రాశిమూల ముపాగతః ।
స చోర స్స చ పాపిష్ఠో బ్రహ్మఘ్నం తం వినిర్దిశేత్ ॥

తా. కళ్లమునందు బ్రాహ్మణులకు ధాన్యముపెట్టనివాఁడు దొంగయనియు, పాపిష్ఠుఁడనియు, బ్రహ్మహత్యచేసినవాఁడనియుఁ జెప్పఁబడును.

పాపనివృత్త్యుపాయము.

శ్లో. వృక్షాం ఛిత్వా మహీం భిత్వా హత్వా తు క్రిమికీటకాన్ ।
కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతే ॥

తా. పొలముదున్నెడువాఁడు, చెట్లనుగొట్టుటవలనను, నేలనుపగులఁగొట్టుటవలనను, చీమలను పురుగులను చంపుటవలనను-గలిగినపాపములను, కళ్లముదగ్గరకువచ్చి యాచించినవారికి ధాన్యదానముచేయుటవలనఁ దొలఁగింపఁజేసికొనవలయు.

శ్లో. రాజ్ఞే దత్వా తు షడ్భాగం దేవానాం చైకవింశకం ।
త్రింశద్భాగం బ్రాహ్మణానాం కృషిం కుర్వ న్న దోషభాక్ ॥

తా. వ్యవసాయము చేయువాఁడు రాజునకు ఆఱవపాలును, దేవతలకు ఇరువది యొకటవభాగమును, బ్రాహ్మణులకు ముప్పదియవభాగమును, ఇచ్చిన దోషములు తొలఁగును.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం గృహస్థధర్మ కథనన్నామ
సప్తమోఽధ్యాయః.

## అష్టమాధ్యాయము.

# ద్రవ్యశుద్ధిప్రకరణము.



### తైలక్షీరాదిశుద్ధి.

శ్లో. స్నేహే వా గోరసే వాపి తత్ర శుద్ధిః కథం భవేత్ ।
అల్పం పరిత్యజే త్తత్ర స్నేహస్య పచనేన చ ।
అనలజ్వాలయా శుద్ధి ర్గోరసస్య విధీయతే ॥



తా. నేయి-ఆవుపాలు- వీనిని కుక్కలుమొదలగునవి తాఁకినయెడల కొంచెము గనుండిన పరిత్యజింపవలయు. విశేషముగానుండిన నేయికాఁచుటచేతను, పాలు నిప్పుమంటయందు తాఁకించుటచేతను శుద్ధియగును.

### స్రుక్స్రువాదిశుద్ధి.

శ్లో. దారవాణాం తు పాత్రాణాం తక్షణా చ్ఛుద్ధి రిష్యతే ।
భస్మనా శుద్ధ్యతే కాంస్యం తామ్ర మమ్లేన శుద్ధ్యతి ॥

తా. కొయ్యవస్తువులు చెక్కుటవలన శుద్ధియగును. కంచు బూడిదెచేతను, రాగి - పులుసుచేతను శుద్ధియగును.

శ్లో. గవాఘ్రాతాని కాంస్యాని శ్వకాకోపహతాని చ ।
శుద్ధ్యంతి దశభిః క్షారైః శూద్రోచ్ఛిష్టాని యాని చ ॥

తా. కంచును ఆవుమూర్కొనినను, శూద్రుఁడెంగిలిచేసినను, కుక్కలు, కాకులు, తాఁకినను. పదిమార్లు బూడిదెతోఁదోమిన పవిత్రమగును.

శ్లో. గండూషం పాదశౌచం చ కృత్వా వై కాంస్యభాజనే ।
షణ్మాసా న్నిక్షిపే ద్భూమా వుద్ధృత్య పున రాహరేత్ ।
ఆయసే ష్వాయసానాం చ సీసస్యా గ్నౌ విశోధనమ్ ॥

తా. కంచుపాత్రమున ఆచమనముచేసినను కాళ్లుగడిగినను, ఆరుమాసములు నేలలోఁ పాతిపెట్టి మరలయెత్తి వాడికొనవలయు. ఇనుపవస్తువులు ఇనుపపనిముట్లతో నొఱయుటచేతను, సీసము అగ్నిని తాఁకించుటచేతను పరిశుద్ధములగును.

### వ్యభిచారస్త్రీశుద్ధి - నదీశుద్ధి.

శ్లో. రజసా శుద్ధ్యతే నారీ వికలం యా న గచ్ఛతి ।
నదీ వేగేన శుద్ధ్యేత లేపో యది న దృశ్యతే ॥

తా. వ్యభిచరించినస్త్రీ గర్భమునుధరించకుండిన తిరుగా రజోదర్శనమువలన శుద్ధినొందును. ఏఱు ప్రవాహవేగముచేత కలఁకపోయినతోడనే శుద్ధియగును.

### వాపీకూపాదిశుద్ధి.

శ్లో. వాపీకూపతటాకేషు దూషితేషు కథంచన ।
ఉద్ధృత్య వై కుంభశతం పంచగవ్యేన శుద్ధ్యతి ॥

తా. నడబావులు, నూతులు, చెరువులు, ఇవి యపవిత్రతనొందిన నూఱుకుంభములనీళ్లతోడిపారబోసి పంచగవ్యముచల్లిన పరిశుద్ధములగును.

### గజదంతాదిశుద్ధి.

శ్లో. దంత మస్థి తథా శృంగం రౌప్యసౌవర్ణ భాజనం।
మణిపాత్రాణి శంఖశ్చ త్యేతాన్ ప్రక్షాళయే జ్జలైః॥

తా. దంతములు, ఎముకలు, కొమ్ములు, వెండి, బంగారు, రత్నములు, వీనితోఁ జేయఁబడినవస్తువులును, శంఖమును నీటితోఁగడిగిన శుద్ధములగును.

### పాషాణమృణ్మయపాత్రశుద్ధి.

శ్లో. పాషాణే తు పునర్ఘర్ష శ్శుద్ధి రేషా హ్యుదాహృతా।
మృణ్మయే దహనా చ్ఛుద్ధి ర్ధాన్యం వై మార్జనాదపి॥

తా. రాతిమరిగెలు మరియొకరాతితో రాచికడిగిన శుద్ధమగును. మట్టికుండలు కాల్చుటచేతను, ధాన్యము నీళ్లు చల్లుటచేతను శుద్ధమగును.

### వేణ్వాదిశుద్ధి.

శ్లో. వేణువల్కలచీరాణాం క్షౌమకార్పాసవాససాం।
ఔర్ణనేత్రపటానాం చ ప్రోక్షణా చ్ఛుద్ధి రిష్యతే॥

తా. వెదురుచాఁపలు మొదలగునవియు, నారచీరెలు తెల్లపట్టుబట్టలు - దూదిబట్టలు- కంబళి- భుజపత్రచర్మములు ఇవి- ఉదకము చల్లుటచే శుద్ధియగును.

### సతూలశయ్యాదిశుద్ధి.

శ్లో. తూలికాద్యుపధానాని రక్తవస్త్రాదికాని చ।
శోషయిత్వా తపేనైవ ప్రోక్షణా చ్ఛుద్ధితా మియాత్॥

తా. దూదిమెత్తలు- తలగడలు- రంగుబట్టలు, మొదలయినవి, ఎండవేసినపిమ్మట నీళ్ళుచల్లిన శుద్ధికలుగును.

### మార్జారమక్షికాదిస్పర్శమునందుశుద్ధి.

శ్లో. మార్జార మక్షికా కీట పతంగ క్రిమి దర్దురాః।
మేధ్యామేధ్యం స్పృశంతోపి నోచ్ఛిష్టం మను రబ్రవీత్॥

తా. పిల్లులు, ఈఁగలు, పురుగులు, పిట్టలు, కప్పలు ఇవి యపవిత్రములను తాఁకి పవిత్రములను తాఁకినయెడల ఎంగిలిలేదు.

### భూమిస్పృష్టోదకస్పర్శమునందు శుద్ధి.

శ్లో. మహీం స్పృష్ట్వా గతం తోయం యాశ్చాన్యోన్యస్య విప్రుషః।
భుక్తోచ్ఛిష్టం తథా స్నేహం నోచ్ఛిష్టం మను రబ్రవీత్॥



తా. పాదప్రక్షాళనము మొదలగుపనులవలన క్రిందబడివచ్చిననీరును తాఁకినను, ఒకరొకరి నోటితుంపురులు పైనబడినను, భోజనానంతరము చేతులుకడిగినపిదప చమురంటుకొనియున్నను ఎంగిలిలేదు.

### తాంబూలాదిశుద్ధి.

శ్లో. తాంబూలేక్షుఫలేచైవ భుక్తస్నేహానులేపనే।
మధుపర్కే చ సోమే చ నోచ్ఛిష్టం ధర్మతో విదుః॥

తా. తాంబూలము, చెఱకు, పండ్లు, పెండ్లికాలమునందు తినఁబడు పెరుగుమొదలైనవి, యజ్ఞమున పానముచేయఁబడు సోమరసము, భుజించికడిగికొనిన తరువాత అంటుకొనిన చమురు వీనియందు ఎంగిలిలేదు.

### ముఖాదిగతధారాదిశుద్ధి.

శ్లో. అదుష్టా స్సంతతా ధారా వాతోద్ధూతా శ్చ రేణవః।
స్త్రియో వృద్ధా శ్చ బాలా శ్చ న దుష్యంతి కదాచన॥

తా. కమండలుమొదలగు నుదకపాత్రములనుండి యెడతెగనిధారగాపడెడు నుదకంబును, గాలికెగిరినదుమ్మును, స్త్రీలు, వృద్ధులు, బాలురును ఎప్పటికిని అశుచిలేనివారు.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం, ద్రవ్యశుద్ధికథనంనామ
అష్టమోఽధ్యాయః.

---

## నవమాధ్యాయము.

# ఆశ్రమధర్మసంగ్రహప్రకరణము.

శ్లో. జాతమాత్ర శ్శిశు స్తావ ద్యావదష్టౌ సమా వయః।
న హి గర్భసమో జ్ఞేయ శ్శక్తిమాత్రప్రదర్శకః॥

తా. శిశువు పుట్టినదిమొదలుకొని ఎనిమిదిసంవత్సరముల వయస్సువఱకును గర్భస్థశిశువువంటివాఁడు; వీనియందు తెలివిగలుగు యోగ్యతమాత్రము కనబడునుగాని, ధర్మాధర్మంబుల నెఱుంగుశక్తియుండదు.

శ్లో. భక్ష్యాభక్ష్యే తథా ఽపేయే వాచ్యావాచ్యే తథానృతే।
అస్మిన్ బాలే న దోష స్స్యా త్సయావ న్నోపనీయతే॥

తా. అశిశువు ఉపనయనసంస్కారమును జెందువఱకు భక్షింపఁదగినవానినైనను భక్షింపఁదగనివానినైనను భక్షించినను, త్రాగయోగ్యములుగాని మద్యాదులను త్రాగినను, చెప్పఁదగినవానినిగాని చెప్పరానివానినిగాని చెప్పినను, అబద్ధములాడినను పాపముకలుగదు.

శ్లో. ఉపనీతే తు దోషోఽస్తి క్రియమాణే విగర్హితే ।
అప్రాప్తవ్యవహారోఽసౌ బాల షోడశవార్షికః ॥

తా. ఉపనయనంబయినపిమ్మట శాస్త్రవిరుద్ధకార్యములనొనర్చినయెడ పాపముకలుగును; ఇది ధర్మాధర్మంబులఁ దెలిసికొనుటకు మాత్రమే తగినకాలము. పదియాఱేండ్లవయస్సుకమునుపు బాలుండనఁబడును, కావున వ్యవహారమునకుపయోగింపఁడు.

శ్లో. అనాశ్రమీ న తిష్ఠేత దినమేక మపి ద్విజః ।
ఆశ్రమేణ వినా తిష్ఠన్ ప్రాయశ్చిత్తీయతే హి సః ॥

తా. బ్రహ్మక్షత్రియ వైశ్య లొక్కరుదినమైనను ఆశ్రమంబులేక యుండఁగూడదు. అట్లుండినవాఁడు ప్రాయశ్చిత్తమున కర్హుండగును.

శ్లో. జపే హోమే తథా దానే స్వాధ్యాయే చ రత స్సదా ।
నాసౌ ఫల మవాప్నోతి కుర్వాణో ప్యాశ్రమాద్చ్యుతే ॥

తా. ఆశ్రమమును విడిచిపెట్టి జప హోమ దాన స్వాధ్యాయంబుల నాసక్తితోఁజేసినను వానిఫలంబులను జెందఁడు.

శ్లో. ఋషీణా మానులోమ్యం హి ప్రాతిలోమ్యం న విద్యతే ।
ప్రతిలోమేన యో యాతి న తస్మా న్నాయ్యయహ్యాత్తమః ॥

తా. ఋషులు - బ్రహ్మచారి గృహస్థాది ధర్మంబుల వరుసగజేయుదురుగాని తలక్రిందుగఁజేయరు, అనఁగా పైపైయాశ్రమంబుల నొందుదురుగాని క్రిందియాశ్రమంబులను జెందరు. అట్లు క్రిందియాశ్రమంబునకు వచ్చువాఁడు న్యాయపథమును తప్పినవాఁడగును.

శ్లో. మేఖలాజినదండై శ్చ బ్రహ్మచారీతి గీయతే ।
వేదాదిభి ర్గృహస్థ శ్చ నఖలోమై ర్వనాశ్రమీ ॥
త్రిదండేన యతి శ్చైవ లక్షణాని పృథక్పృథక్ ।
యస్యైతల్లక్షణం నాస్తి ప్రాయశ్చిత్తీ హ్యనాశ్రమీ ॥

తా. మొలత్రాడు-కృష్ణాజినము- దండము మొదలగుచిహ్నములచే బ్రహ్మచారియనఁబడును. వేదమునావర్తించుట, వేదవిహితకర్మలననుష్ఠించుట మొదలగువానివలన



గృహస్థుండనఁబడును-గోళ్లను వెండ్రుకలను బెంచుట మొదలగు చిహ్నములచే వానప్రస్థుండనఁబడును. త్రిదండకాషాయాదిధారణముచే యతియనఁబడును. ఇవి నాలుగాశ్రమంబులకు వేర్వేఱుగలక్షణంబులు; ఇవిలేనివాఁడు ఆశ్రమరహితుఁడగును గావున ప్రాయశ్చిత్తమున కర్హుండగును.

శ్లో. ఉదయాస్తమయం యావ న్నాతిప్రక్షణికో భవేత్ ।
నిత్యనైమిత్తికై ర్యుక్తః కామ్యై శ్చాన్యై రగర్హితైః ॥

తా. సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయమువఱకు నూరకయుండఁగూడదు. నిత్యనైమిత్తికకర్మంబులను- అనిషిద్ధంబు లగు కామ్యాదికర్మంబులను జేయుచుండవలయు.

శ్లో. స్వకం కర్మ పరిత్యజ్య తదన్య త్కురుతే ద్విజః ।
అజ్ఞానా దథవా లోభా త్స తేన పతితో భవేత్ ॥

తా. ద్విజాతిని ఎఱుంగమిచేగాని, లోభముచేగాని వర్ణాశ్రమధర్మమునువిడిచి మఱియొకదాని నవలంబించువాఁడు పతితుండగును.

శ్లో. ఉషఃకాలే చ సంప్రాప్తే శౌచంకృత్వా యథార్హవత్ ।
తత స్స్నానం ప్రకుర్వీత దంతధావనపూర్వకం ॥

తా. ఆఱుగడియలరాత్రి మిగిలియుండుకాలము ఉషఃకాలము; అప్పుడులేచి శౌచకృత్యములం దీర్చికొని దంతధావనము చేసికొని స్నానముసేయవలయు.

శ్లో. అత్యంతమలినః కాయో నవచ్ఛిద్ర సమన్వితః ।
స్రవత్యేవ దివారాత్రం ప్రాతస్స్నానం విశోధనం ॥

తా. ఈమనుష్యశరీరము మిక్కిలిమలినమైనది; రెండుకన్నులు, ముక్కురంధ్రములు, చెవులు, నోరు, గుదము, ఉపస్థము, అనెడితొమ్మిదిరంధ్రములతోఁగూడియున్నది; వీనినుండి రాత్రింబగళ్లు మలముగారుచుండును గావున ప్రాతఃకాలస్నానము వానినెల్ల శోధించును.

శ్లో. క్లిద్యంతి హి ప్రసుప్తస్య ఇంద్రియాణి క్షరంతి చ।
అంగాని సమతాం గచ్ఛం త్యుత్తమా న్యధమై స్సహ ॥

తా. నిద్రబోయినవాని కింద్రియములు ద్రవించి నీరుగారును. ఉత్తమము లగు నవయవములుకూడ అధమావయవములతో సరిపోలియుండును.

శ్లో. గుణా దశ స్నానపరస్య సాధో రూపం చ తేజ శ్చ బలం చ శౌచం।
ఆయుష్య మారోగ్య మలోలుపత్వం దుస్స్వప్ననాశం చ మతి శ్చ మేధా॥

తా. స్నానాభ్యాసముజేసెడి సత్పురుషునకు రూపము, తేజస్సు, బలము, శుచిత్వము, ఆయుర్వృద్ధి, ఆరోగ్యము, స్థైర్యము, దుస్స్వప్ననాశము బుద్ధి, ధారణాశక్తి అనెడి పదిగుణములు గలుగును.

శ్లో. స్నానా దనంతరం తావ దుపస్పర్శనముచ్యతే ॥

తా. స్నానముచేసినపిదప కుడిచేత నుదకమునుదీసికొని మూఁడుమాఱులు ఆచమనంబు సేయవలయు.

శ్లో. మార్జనం జలమధ్యే తు ప్రాణాయామ స్తతఃస్మృతః ।
ఉపస్థానం తతః పశ్చా ద్గాయత్రీజప ఉచ్యతే ॥

తా. జలములో మార్జనముచేసికొనుట, పిమ్మటఁ బ్రాణాయామము, పిదప ఉపస్థానంబును, అటుపిమ్మట గాయత్రీమంత్రజపంబును జేయవలయు.

శ్లో. అస్నాతాశీ మలం భుంక్తే అజపీ పూయశోణితే ।
అహుతాశీ క్రిమీన్ భుంక్తే హ్యదత్వా మృత మశ్నుతే ॥

తా. స్నానములేక భుజించుట మలమును దినినట్లగును. జపములేక భక్షించుట చీమురక్తమును గుడిచినట్లగును. హోమములేకతినుట పురుగులదినినట్లగును. దానము చేయక తినుట పీనుఁగుల దినినట్లగును.

శ్లో. సంధ్యాహీనో ఽశుచి ర్నిత్య మనర్హ స్సర్వకర్మసు ।
యదన్య త్కురుతే కర్మ న తస్య ఫలభాగ్భవేత్ ॥

తా. సంధ్యావందనము నాచరింపనివాఁ డశుచియై యేకర్మంబునకును అర్హుండు గాఁడు, దీనినివిడిచి యేకర్మంబునొనర్చినను సఫలంబుకాదు.

శ్లో. యో న సంధ్యా ముపాసీత బ్రాహ్మణో హి విశేషతః ।
జీవన్నేవ స శూద్ర స్స్యా న్మృత శ్శ్వాచాభిజాయతే ॥

తా. సంధ్యావందనము నాచరింపనివాఁడు బ్రతికినంతకాలము శూద్రుండై మరణించినవెనుక కుక్కయైపుట్టును. బ్రాహ్మణున కీదోషము విశేషముగ గలుగును.

శ్లో. దేవకార్యం తతఃపశ్చా త్కుర్యా న్మంగళవీక్షణం ॥

తా. పిమ్మట దేవకార్యమునొనర్చి తరువాత మంగళ ద్రవ్యములఁజూడవలయు

శ్లో. దేవకార్యం చ పూర్వాహ్ణే మనుష్యాణాం మధ్యందినే ।
పితౄణా మపరాహ్ణే తు కుర్యా దేత న్నియంత్రితః ॥

తా. పూర్వాహ్ణంబున దేవకార్యంబును, మధ్యాహ్నంబున మనుష్యకార్యంబును అపరాహ్ణంబునఁ బితృకార్యంబును నియమంబుగ నాచరింపవలయు.



శ్లో. విపర్యయే తు తత్సర్వం నంధ్యాస్త్రీమైథునంయథా ॥

తా. పూర్వోక్తక్రమమునుతప్పి చేసినయెడ గొడ్రాలితోడి సంగమమువలె వ్యర్థమగును.

శ్లో. మాతా పితా గురు ర్భార్యా ప్రజా దీన స్సమాశ్రితః ।
అభ్యాగతో ఽతిథి శ్చాపి పోష్యవర్గ ఉదాహృతః ॥

తా. తల్లి - తండ్రి-గురువు - భార్య-సంతానములు-తన్నాశ్రయించియున్న దీనుఁడు-అభ్యాగతుఁడు-అతిథి (అగ్ని) వీరందఱును పోష్యవర్గమనఁబడుదురు.

శ్లో. భరణం పోష్యవర్గస్య ప్రశస్తం స్వర్గసాధనం ।
నరకః పీడనే యస్మా త్తస్మా ద్యత్నేన తం భరేత్ ॥

తా. పోష్యవర్గమును భరించుట ప్రశస్తమయిన స్వర్గసాధనమగును. పోష్యవర్గమునకుఁ బీడగలుగజేసినయెడ నరకముగలుగునుగావున పోష్యవర్గమును బ్రయత్నముతో భరింపవలయు.

శ్లో. స జీవతి యపస్త్వైకో బహుభి శ్చోపజీవ్యతే ।
జీవంతో ఽపి మృతా స్త్వన్యే పురుషా స్స్వోదరంభరాః ॥

తా. ఒక్కఁడెవ్వఁ డనేకులఁ బోషించునో వాఁడే బ్రతికియుండువాఁడు. తమ యుదరమునుమాత్రము పోషించుకొనువారు బ్రతికియున్నను చచ్చినవారలేయగుదురు.

శ్లో. జ్ఞాతి ర్బంధుజనః క్షీణ స్తథానాథ స్సమాశ్రితః ।
అన్యోఽపి ధనయుక్తస్య పోష్యవర్గ ఉదాహృతః ॥

తా. జ్ఞాతి - బంధుజనుఁడు - ధనహీనుఁడు - ఆశ్రయించిన అనాథజనుఁడు-ఇతరుఁడు వీరందఱును ధనవంతునికి పోష్యవర్గ మనంబడుదురు.

శ్లో. స జీవతి గుణా యస్య యస్య ధర్మస్సజీవతి ।
బహ్వర్థే జీవితం యస్య కుటుంబార్థే తథా పునః ॥

తా. సుగుణములు గలవాఁడును, ధర్మముచేయువాఁడును, అనేకులను పోషించుటకును కుటుంబమును భరించుటకును బ్రతుకువాఁడును బ్రతికియున్నవాఁడగును.

శ్లో. దీనానాథవిశిష్టేభ్యో దాతవ్యం భూతి మిచ్ఛతా ।
అదత్తదోషా జ్జాయంతే పరభాగ్యోపజీవినః ॥

తా. సంపదనుకోరువాఁడు దీనులు అనాథులు శిష్టులు నగువారలకు దానము చేయుచుండవలయు. దానముచేయకుండుటవలన పరునిభాగ్యమువలనఁ బ్రతికెడి దరిద్రులై పుట్టుదురు.

శ్లో. దమో లజ్జా దయా క్షాంతి శ్శ్రద్ధా త్యాగః కృతజ్ఞతా ।
ఏతే యస్య గుణా స్సంతి గృహస్థో ముఖ్యఉచ్యతే ॥

తా. ఇంద్రియనిగ్రహము, నిందితకార్యములఁజేయుటకు సిగ్గు, కనికరము, ఓర్పు శ్రద్ధ, త్యాగము, ఇతరుఁడు దనకుచేసిన యుపకారమును మఱువకుండుట, ఈగుణములుగలగృహస్థుఁడు ముఖ్యుఁడనఁబడును.

శ్లో. సంవిభాగం తతః కృత్వా గృహస్థ శ్శేషభు గ్భవేత్ ॥

తా. కావున గృహస్థుండు తమతోడివారికి దనయాహారమును పంచియిచ్చి మిగిలినదానిని భుజింపవలయు.

ప్రాణాహుతి, పరిషేచనక్రమము.

సూ. అథాతః ప్రాణాహుతికల్పో వ్యాహృతిభి ర్గాయత్ర్యాభిమంత్ర్య "ఋతంత్వాసత్యేన పరిషించామీ" తి సాయం, "సత్యం త్వర్తేన పరిషించామీ" తి ప్రాత రితి.

తా. అన్నమును గాయత్రీ మంత్రవ్యాహృతులచే అభిమంత్రించి, సూత్రోక్త ప్రకారము, ప్రాతస్సాయంకాలములందు, పరిషేచనముచేసి, ప్రాణాహుతికల్పనపూర్వకముగ, భుజింపవలయు.

సూ. తత స్తృప్త స్సన్ "అమృతాభిధానమసీ" త్యపఃపీత్వా తస్మాద్దేశా న్మనాగపసృత్య విధివ దాచామేత్.

తా. అనంతరము తృప్తుఁడై, "అమృతాభిధానమసి" అనుమంత్రమునుచ్చరించి తీర్థముపుచ్చుకొని, అచ్చటినుండిలేచి కొంచెముదూరముపోయి విధివత్తుగ ఆచమనము సేయవలయు.

శ్లో. ప్రదోషపశ్చిమౌయామౌ వేదాభ్యాసరతో నయేత్ ।
యామద్వయం శయానోహి బ్రహ్మభూయాయ కల్పతే ॥

తా. రాత్రి మొదటిజామును తుదిజామును వేదాభ్యాసముతోఁగడుపవలయు. రెండుజాములు నిద్రించవలయు; ఇట్లుసేయువాఁడు బ్రహ్మప్రాప్తికి నుపయోగించును.

శ్లో. యో ఽనధీత్య ద్విజో వేదా నన్యత్ర కురుతే శ్రమం ।
స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః ।
యో ఽధీత్య విధివ ద్వేదం వేదార్థం న విచారయేత్ ।
స సాన్వయ శ్శూద్రసమః పాత్రతాం న ప్రపద్యతే ॥



తా. వేదాధ్యయనముసేయక, ఇతరశాస్త్రములనభ్యసించుద్విజుఁడు బ్రదికియున్నప్పుడే తనవంశమువారితోఁగూడ శూద్రత్వమును శీఘ్రముగ బొందును. విధివత్తుగ వేదాధ్యయనముసేసి, వేదార్థముతెలియంగని ద్విజుఁడును, వంశమువారితోఁగూడ శూద్రతుల్యుఁడై, అపాత్రత్వము నొందును.

నారదః— పుస్తకప్రత్యయాధీతం నాధీతం గురుసన్నిధౌ ।
భ్రాజతే న సభామధ్యే జారగర్భఇవ స్త్రియాః ॥

తా. గురువునొద్ద అధ్యయనముసేయక, పుస్తకమునుచూచి అధ్యయనముచేసిన జారునివలన స్త్రీకి గలిగినగర్భమువలె, నిరర్థకంబై సభానష్టంబగును.

శ్లో. యథైవాత్మా పర స్తద్వ ద్ద్రష్టవ్య స్సుఖ మిచ్ఛతా ।
సుఖదుఃఖాని తుల్యాని యథాత్మని తథాపరే ॥

తా. మేలునుగోరువాఁడు తానెట్టివాఁడో ఇతరుఁడును అట్టివాఁడేయని తలంపవలయును. తనయందువలెనే యితరునియందును సుఖదుఃఖంబులు సరిగానుండును.

శ్లో. సుఖం వా యది వా దుఃఖం యత్కించి త్క్రియతే పరే ।
తత్కృతం తు పునః పశ్చా త్సర్వ మాత్మని సంభవేత్ ॥

తా. తాను ఇతరునికి సుఖమునుగాని దుఃఖమును గాని కలుగఁజేసినయెడ తాఁజేసినదంతయు నటుపిమ్మట దనకు తటస్థించును.

శ్లో. న క్లేశేన వినా ద్రవ్యం ద్రవ్యహీనే కుతఃక్రియా ।
క్రియాహీనే కుతో ధర్మో ధర్మహీనే కుత స్సుఖం ।
సుఖం వాంఛతి య స్సర్వ స్తస్య క్లేశః ఫలప్రదః ॥

తా. ప్రయాసములేక ధనములభింపదు. ధనములేనియెడ సత్కర్మంబు నడువదు. సత్కర్మంబులేనియెడ ధర్మముకలుగదు. ధర్మములేక సుఖము లభింపదు. అట్టిసుఖము ప్రయాసమువలన సిద్ధించును కావున కార్యములందు బాగుగ గష్టించవలయు.

శ్లో. దానం చ విధినా ప్రోక్తం కాలే పాత్రే గుణాన్వితే ।
సమ మబ్రాహ్మణే దానం ద్విగుణం బ్రాహ్మణబ్రువే ।
సహస్రగుణ మాచార్యే అనంతం వేదపారగే ॥

తా. తగినకాలమునందు గుణవంతుఁడును సత్పాత్రమునగువానికి దానముచేయుట విధ్యుక్తము. బ్రాహ్మణుఁడుగానివానికిచ్చుట సాధారణము. జాతిబ్రాహ్మణునికి దానముచేయుట దానికి రెండింతలఫలముగలది. ఆచార్యలక్షణముగలవానికి సత్కరించుట సహస్రగుణఫలముగలది. వేదము సంపూర్ణముగాఁజదివి తెలిసికొనినవానికి దానముచేసిన అనంతఫలము గలుగును.

శ్లో. విధిహీనే తథాపాత్రే యో దదాతి ప్రతిగ్రహం।
న కేవలం హితం దద్యా ద్విశేష మనునశ్యతి॥

తా. విధ్యుక్తముగాని పాత్రమునకు జేయుదానము దానముకానేరదు. తనపుణ్యమునుగూడ జెఱుచును.

శ్లో. వ్యసనాధికవిప్రేషు ధనాఢ్యేషు కదాచన।
ఏవ మన్విష్య దాతవ్యం సర్వదానే ష్వయం విధిః॥

తా. జూదము మొదలగు వ్యసనముగల బ్రాహ్మణులకును, ధనాఢ్యులగువారికిని దానమెప్పుడును జేయగూడదు, కావున జక్కఁగవెదకి దానముచేయవలయు, అన్ని దానములయందు నిదియే విధి.

శ్లో. మాతాపితృవిహీనం హి సంస్కారోద్వాహనాదిభిః।
యస్థాపయతి తస్యేహ పుణ్యసంఖ్యా న విద్యతే॥

తా. తల్లి దండ్రులు లేనివానికి ఉపనయన వివాహాదిసంస్కారములు చేయించి స్థాపించినవారి పుణ్యము గణింప శక్యముగాదు.

శ్లో. గృహాశ్రమాత్పరో నాస్తి భార్యా యదివశానుగా।
తదా ధర్మార్థకామాఖ్యం త్రివర్గఫల మశ్నుతే॥

తా. భార్య స్వాధీనురాలుగనుండిన గృహస్థాశ్రమమునకంటె నెక్కుడదేదియు లేదు. అప్పుడు ధర్మ అర్థ కామంబులనెడి మూఁడు పురుషార్థంబులనొందును.

శ్లో. దుఃఖాగిరః కలిర్భేద శ్ఛిద్రపీడా పరస్పరం।
ప్రతికూలకళత్రస్య ద్విదారస్య విశేషతః॥

తా. ప్రతికూలభార్యగలవానికి దుఃఖకరము లగు పలుకులు-కలహము-పోరుపు-గృహచ్ఛిద్రములవలన పరస్పరము పీడయుగలుగును. ఇవి ఇద్దరుభార్యలుగలవానికి విశేషముగ గలుగును.

శ్లో. రూపౌదార్యసమాయుక్తా విశాలకులసంభవా।
ధర్మపత్నీ సమాఖ్యాతా నిర్దోషా యది సా భవేత్।
దోషే సతి సదోషా స్యా దన్యథాన్యా గుణాన్వితా॥

తా. సౌందర్యము ఔదార్యము గలదై సద్వంశంబున జనించి నిర్దోషురాలగునది ధర్మపత్ని అనఁబడును, పెనిమిటి సదోషుండయినచో తానును సదోషురాలగునదియు నట్లుగానిచో గుణవతియగునదియు గేవలభార్య యనఁబడును.

శ్లో. సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ।
యస్మిన్నేతత్కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువం॥



తా. ఏకులంబుననైనను, భార్యవలన భర్తయు, భర్తవలన భార్యయు సంతోషించుచు ప్రేమాతిశయంబులుగల్గి వర్తింతురో వారియందెల్లప్పుడు మంగళం బావహించియుండును.

స్త్రీరక్షణక్రమము.

శ్లో. పతి ర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే।
జాయాయా స్తద్ధి జాయాత్వం య దస్యాం జాయతే పునః॥

తా. భర్త శుక్లరూపముచే భార్యయందుఁ బ్రవేశించి గర్భస్థుఁడై పుత్రరూపముగఁ బుట్టుచున్నాఁడు, దానంజేసి భార్యకు "జాయ" అనుపేరుగలిగె.

శ్లో. యాదృశం భజతే హి స్త్రీ సుతం సూతే తథావిధం।
తస్మా త్ప్రజావిశుద్ధ్యర్థం స్త్రియం రక్షే త్ప్రయత్నతః॥

తా. స్త్రీ ఎటువంటి పురుషునిబొందునో అటువంటి పుత్రునిగనును కావున సంతానపరిశుద్ధికొఱకు, భార్యను పరపురుషసాంగత్యమును జెందనీయక కాపాడుచుండవలయు.

శ్లో. న కశ్చిద్యోషిత శ్శక్తః ప్రసహ్య పరిరక్షితుం।
ఏతై రుపాయయోగై స్తు శక్యా స్తాః పరిరక్షితుం॥
అర్థస్యసంగ్రహే చైవ వ్యయే చైతా నియోజయేత్।
శౌచే ధర్మేఽన్నపక్త్యాం చ పారిణీయస్య రక్షణే॥

తా స్త్రీలను నిర్బంధించి కాపాడుటకెవ్వఁడును శక్తుండుగానేరఁడు; కావున ద్రవ్యమునుదాచుట, కర్చుచేయుట, గృహభాండాదుల శుద్ధిచేయుట, అగ్నిశుశ్రూష, వంటచేయుట, గృహోపకరణములరక్షించుట అనునీ యుపాయయోగములచే కార్యములయందు వారిని నియోగించి హితోపదేశములచేత మంచిమార్గమునఁ ద్రొప్పించి కాపాడవలయు.

శ్లో. అదుష్టాం వినతాం భార్యాం యౌవనే యః పరిత్యజేత్।
స సప్తజన్మ భవేత్ స్త్రీత్వం వైధవ్యం చ పునఃపునః॥

తా. దుష్టురాలుకానిదియు అడకువగలదియు నగుభార్యను యౌవనకాలంబున విడిచిపెట్టినవాఁడు ఏడుజన్మములవఱకు స్త్రీగాపుట్టి పలుమారు వైధవ్యము జెందును.

శ్లో. అనుకూలా మవాగ్దుష్టాం దక్షాం సాధ్వీం ప్రజావతీం।
త్యజన్ భార్యా మవధ్యాప్యో రాజదండేన భూయసా॥

తా. అనుకూలురాలును, నోటిగర్వములేనిదియు, దానపూర్వకముగ లభించినదియు, పతివ్రతయు, సంతానముగలదియు నగు భార్యను అన్యస్త్రీలోలుఁడై విడిచినవాఁడు అధికముగ రాజదండనకుఁబాత్రుఁడగును.

శ్లో. స్వదారాన్ త్యజతో మోహా న్నరస్యాన్యాయమోచినః ।
ధర్మవంశపరిత్యక్తు ర్నిష్కృతి ర్న విధీయతే ॥

తా. పరస్త్రీసంగమ చౌర్య ద్యూత మద్యపానాద్యాసక్తిగలవాఁడై, త్రివర్గఫలమున కాధారభూతురా లగు నిజభార్యను అక్రమముగా విడిచినవాఁడు ధర్మవంశమును విడిచినవాఁడు గావున నట్టి పురుషాధమునకుఁబ్రాయశ్చిత్తమే లేదు.

శ్లో. ఆజ్ఞాసంపాదినీం దక్షాం వీరసూం ప్రియవాదినీం ।
త్యజన్ దాప్య స్తృతీయాంశ మద్రవ్యో భరణం స్త్రియాః ॥

తా. పతియాజ్ఞనుజరుపునదియు, సమర్థురాలును, పరాక్రమవంతులఁగనునదియు ప్రియవాక్యములు గలదియు నగు భార్యను వదలినయెడల పురుషుం డామెకు తన ఆస్తియందలి మూఁడవపాలును, ద్రవ్యములేనివాఁడు భరణమును, ఇయ్యవలయు.

శ్లో. స్త్రీణాం నాస్తి పరిత్యాగో బ్రహ్మహత్యాదిభి ర్వినా ।
తత్రాపి గృహమధ్యే తు ప్రాయశ్చిత్తాని కారయేత్ ॥
పరిత్యక్తా చరే త్పాపం బహ్వల్పం వా పి కించన ।
తత్పాపం శతధాభూత్వా బాంధవా ననుగచ్ఛతి ॥
యావంతి నారీరోమాణి తత్ప్రసూతికులేషు చ ।
తావద్వర్ష సహస్రాణి పరిత్యాగా త్పపచ్యతే ॥
కుంభీపాకే మహాఘోరే జ్ఞాతయః పాపకర్మిణః ।
వసంతి స్త్రీపరిత్యాగా ద్యావదాభూతసంప్లవః ॥

తా. బ్రహ్మహత్యాది ఘోరపాతకంబులఁ జేసిననే తప్ప ఇతరస్వల్పపాతకముల జేసినమాత్రమున స్త్రీలను పరిత్యజింపఁగూడదు; అప్పుడును ప్రమాదముచే నింటిలోపల జరిగినయెడ ప్రాయశ్చిత్తముచేయవలయు; అజ్ఞానముచేఁ బరిత్యజించినయెడ ఆ స్త్రీ చేయునట్టి స్వల్పపాపమైనను అత్యధికముగాఁ బెఱిగి, ఆస్త్రీ శరీరమున నెన్నిరోమములుండునో అన్నివేలసంవత్సరములు ఆస్త్రీ వంశమువారిని బంధువులను జెందును; స్త్రీ పరిత్యాగము చేసినవాఁడును, వానిజ్ఞాతులును మహాఘోరం బగు కుంభీపాకనరకంబున ననేకవర్షంబులు పడియుందురు.

శ్లో. పితృమాతృపరిత్యాగీ సుహృజ్జనసుతత్యజః ।
అసిపత్రవనంచైవ చండాలానాంశతం వ్రజేత్ ॥



తా, తండ్రి, తల్లి, బిడ్డలు, మిత్రులు, వీరిని విడుచువాఁడు అసిపత్రనరకంబునఁబడి నూఱుపర్యాయములు చండాలజన్మము నొందుచుండును.

శ్లో. నాశ్నీయా ద్భార్యయాసార్థం నైనా మీక్షేత చాశ్నతీం ।
క్షువతీం జృంభమాణాం వా నచాసీనాం యథాసుఖం ॥
నాంజయంతీం స్వకేనేత్రే నచాభ్యక్తా మనావృతాం ।
న పశ్యే త్ప్రసవంతీం చ తేజస్కామో ద్విజోత్తమః ॥

తా. పురుషుఁ డేకకాలంబున, భార్యతోఁగూడ గూర్చుని భుజింపఁగూడదు; భార్య భుజించునపుడును, తుమ్మునపుడును, ఆవులించునపుడును, కాటుక పెట్టుకొనునపుడును, అభ్యంగము చేసికొనునపుడును, వస్త్రహీనురాలై యుండునపుడును, ప్రసవించునపుడును తేజస్కాముఁడగు ద్విజుఁడు చూడఁగూడదు.

శ్లో. నాన్న మద్యా దేకవాసా న నగ్న స్స్నాన మాచరేత్ ।
న మూత్రం పథి కుర్వీత న భస్మని న గోవ్రజే ॥

తా. ఏకవస్త్రమునుధరించి భుజింపఁగూడదు. వస్త్రహీనుఁడై స్నానముచేయఁగూడదు. మార్గమునందును, భస్మమునందును, గోసమూహమునందును మూత్రవిసర్జనము చేయఁగూడదు.

శ్లో. ఉపానహౌ చ వాస శ్చ ధృత మన్యై ర్న ధారయేత్ ।
ఉపవీత మలంకారం స్రజం కరక మేవ చ ॥

తా. ఇతరునియొక్క పాదరక్షలను, వస్త్రమును, యజ్ఞోపవీతమును, ఆభరణములను, పుష్పమాలను, ఉదకపాత్రమును, (పరునివాహనమును, పరునిభార్యను) అనుభవించినయెడల సంపదతొలఁగును

శ్లో. లోష్టమర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీ చ యో నరః ।
సవినాశం వ్రజ త్యాశు సూచకో ఽశుచి రేవ చ ॥

తా. వ్యర్థముగ మట్టిపెళ్లనునలుపుట, గడ్డిపోచలనుత్రుంచుట, నఖములఁగొఱుకుట, కొండెములఁజెప్పుట, అనాచారము ఈకృత్యములఁజేయుటవలన చేటుగలుగును

శ్లో. నాక్షైః క్రీడే త్కదాచి త్తు స్వయం నోపానహౌ హరేత్ ।
శయనస్థో న భుంజీత న పాణిస్థం న చాసనే ।
ఆర్ద్రపాద స్తు భుంజానో దీర్ఘమాయు రవాప్నుయాత్ ॥

తా. ఒకానొకప్పుడును పాచికలు మొదలగువానిచే జూదమాడఁగూడదు. చెప్పులను చేతపట్టుకొని పోఁగూడదు; పడకమీఁదనుండియు, కేవలహస్తమునందునిడికొ

నియు, పీటమీఁదనునిచికొనియు భుజింపఁగూడదు. కాళ్ళుతడియారక మునుపు భుజించుచుండిన దీర్ఘాయుష్యముగలుగును.

శ్లో. పరాన్నేన తు భుక్తేన మైథునం యోఽధిగచ్ఛతి ।
యస్యాన్నం తస్య తే పుత్రా అన్నా చ్ఛుక్లం ప్రవర్తతే ॥

తా. ఎల్లప్పుడు పరాన్నముచే జీవించుచు భార్యాసంగమ మొనర్చినపుడు జనించినపుత్రుఁడు అన్నప్రదాతయొక్క పుత్రుఁడనఁబడును; అన్నముచే శుక్లముజనించును గావున నిట్లూహించనది.

కలియుగనిషిద్ధకృత్యములు.

శ్లో. ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధం తథా ।
కలౌ పంచ న కుర్వీత భ్రాతృజాయాం కమండలుం ॥

తా. పెండ్లియైనకన్యకకు మరల పెండ్లియు, జ్యేష్ఠునికి అధికభాగంబును, యజ్ఞమునందు గోవధంబును, దేవరునివలన సంతానోత్పత్తియు, సన్యాసస్వీకారంబు నీయైదుకార్యంబులును గలియుగంబునఁజేయఁగూడదు.

మహాపాతకనిర్ణయము.

శ్లో. బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః ।
మహాంతి పాతకా న్యాహు స్సంసర్గ శ్చాపి తై స్సహ ॥
ఏతే పతంతి సర్వేషు నరకే ష్వనుపూర్వశః ॥

తా. బ్రాహ్మణహత్య, సురాపానము, సువర్ణచౌర్యము, గురుభార్యాగమనము ఈనాలుగును మహాపాతకములు. ఈమహాపాతకములొనర్చినవారి సంసర్గము అయిదవ మహాపాతకము; ఇవిచేసినవారు నరకములందుఁబడుదురు.

జాతిభ్రంశకరములు.

శ్లో. యస్య కాయగతం బ్రహ్మ మద్యే నాప్లావ్యతే సకృత్ ।
తస్య వ్యపైతి బ్రాహ్మణ్యం శూద్రత్వం చ స గచ్ఛతి ॥
బ్రాహ్మణస్య రుజఃకృత్యా ఘ్రాతి రఘ్రేయమద్యయోః ।
జైహ్మ్యం చ మైథునం పుంసి జాతిభ్రంశకరం మతం ॥

తా. బ్రాహ్మణుఁడొక్కసారియైనను మద్యమునుపానముచేసిన యెడ నతనికి బ్రాహ్మణ్యముపోయి శూద్రత్వముగలుగును. బ్రాహ్మణునికి బాధగలుగఁజేయుట, ఉల్లిగడ్డలు మొదలగువానిని, మద్యమును ఆఘ్రాణించుట, కుటిలత్వము, పక్వాది మైథునము వీనివలనను జాతిభ్రంశము గలుగును.



మద్యపాన, మాంసభక్షణనింద.

శ్లో. ఆహితాగ్ని స్తు యో విప్రో మద్యమాంసాని భక్షయేత్ ।
కాలకూపీకృష్ణసర్పో జాయతే బ్రహ్మరాక్షసః ॥

తా. శ్రౌతాగ్నిగలిగి సదాచారసంపన్నుఁ డగు బ్రాహ్మణుఁడు మద్యమాంసాదుల భక్షించినయెడ నల్లనికృష్ణసర్పముగను బ్రహ్మరాక్షసుఁడుగను జనించును.

శ్లో. ఆహితాగ్ని స్తు యో విప్ర శ్శూద్రాన్నాని చ భుంజతే ।
పంచ తస్య ప్రణశ్యంతి ఆత్మా బ్రహ్మ త్రయోఽగ్నయః ॥

తా. శ్రౌతాగ్నిగల బ్రాహ్మణుఁడు శూద్రాన్నమును భుజించినయెడ వాని స్వరూపము-వేదము-మూఁడు అగ్నులు ఈయైదును నశించిపోవును.

శ్లో. వైకల్యం ధరణీపాత మయథోచితజల్పనం ।
సన్నిపాతస్య చిహ్నాని మద్యం సర్వాణి దర్శయేత్ ॥

తా. మద్యపానముచేయువానికి సన్నిపాతరోగికివలె శరీరవైకల్యము, భూమియందుదొర్లుట, అప్రస్తుతము లగు అతిప్రలాపములు మొదలగుదుర్గుణములు కలుగును.

శ్లో. ఏకత శ్చతురో వేదా బ్రహ్మచర్యం తథైకతః ।
ఏకత స్సర్వపాపాని మద్యపానం తథైకతః ॥

తా. బ్రహ్మచర్య మొక్కటియే చతుర్వేదములకు సరిపోలియుండును; మద్యపాన మొక్కటియే సకలపాపములతో సరిపోలును.

శ్లో. మద్యపస్య కుతస్సత్యం దయా మాంసాశినః కుతః ।
కామిన శ్చ కుతో విద్యా నిర్ధనస్య కుతస్సుఖం ॥

తా. మద్యపానము చేయువానికి సత్యమెక్కడిది? మాంసముదినువానికి దయ యెక్కడిది? కాముకునికి విద్యయెక్కడిది? ధనహీనునికి సుఖమెక్కడిది?

శ్లో. మత్తో హినస్తి సర్వం మిథ్యాప్రలపతి హి వికలయా బుద్ధ్యా ।
మాతర మపి కామయతే సావజ్ఞం మద్యపానమత్తస్సన్ ॥

తా. మద్యపానముచేసినవాఁడు మదించి సకలమును హింసించును. బుద్ధివైకల్యముచే తారుమారుగమాటలాడును మద్యపానమత్తుఁడై యవజ్ఞతచేఁదల్లినైనఁగామించును.

శ్లో. చిత్తే భ్రాంతి ర్జాయతే మద్యపానా ద్భ్రాంతే చిత్తే పాపచర్యాముపైతి।
పాపంకృత్వా దుర్గతింయాంతిమూఢా స్తస్మా న్మద్యం నైవపేయంనపేయం॥

తా. మద్యపానమువలన చిత్తమునకు భ్రమముకలుగును; ఆచిత్తభ్రమమువలన పాపకార్యముల నొనర్చును; అట్టి పాపకృత్యమువలన మూఢుఁడై నరకమును బొందెదరు; కావున నెంతమాత్రము మద్యమును త్రాగఁగూడదు.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం, ఆశ్రమధర్మాది సంగ్రహకథనం నామ నవమోఽధ్యాయః.

---

దశమాధ్యాయము.

## సామాన్యనీతి.

శ్లో. కులీనైస్సహ సంపర్కం పండితైస్సహ మిత్రతాం ।
జ్ఞాతిభిశ్చ సమం మేళం కుర్వాణో న వినశ్యతి ॥

తా. మంచివంశమునఁబుట్టినవారితో సహవాసము; విద్వాంసులతో మైత్రి, దాయాదులతో కలయిక ఇవిగలవాఁడు మేలునుపొందును.

శ్లో. ఆపదర్థం ధనం రక్షేద్దారాన్ రక్షేద్ధనైరపి ।
ఆత్మానం సతతం రక్షేద్దారైరపి ధనైరపి ॥

తా. ఆపదలు తొలంగుటకు ధనమును, ఆధనముచే భార్యను, ధన భార్యల రెండిటిచేఁ దనను ఎల్లప్పుడును కాపాడికొనవలయు.

శ్లో. కుదేశం చ కువృత్తిం చ కుభార్యాం కునదీం తథా ।
కుద్రవ్యం చ కుభోజ్యం చ వర్జయేత్తు విచక్షణః ॥

తా. నిందితదేశమును, నిందితవ్యాపారమును, కుత్సితురాలగు భార్యను, వేశ్యను, నిందితద్రవ్యమును, నిందితభోజనమును బుద్ధిమంతుఁడగువాఁడు వర్జింపవలయు.

శ్లో. ఋణశేషోఽగ్నిశేషశ్చ వ్యాధిశేషస్తథైవ చ ।
పునశ్చ వర్ధతే యస్మాత్తస్మాచ్ఛేషం న కారయేత్ ॥

తా. ఋణమును, అగ్నిని, వ్యాధిని నిశ్శేషముగఁబోగొట్టవలయు; ఏలయనఁగా- కొంచెము మిగిల్చినయెడ అభివృద్ధియై చెరుపును గలుగఁజేయును.

శ్లో. చింతా జ్వరో మనుష్యాణాం వస్త్రాణా మాతపో జ్వరః ।
అసౌభాగ్యం జ్వరః స్త్రీణా మశ్వానాం మైథునం జ్వరం ॥



తా. మనుష్యులకు చింతవలనను, వస్త్రములకు ఎండవలనను, స్త్రీలకు సౌభాగ్యములేమివలనను, గుఱ్ఱంబులకు మైథునమువలనను శరీరదౌర్బల్యముగలుగును.

శ్లో. అతిదర్పే హతా లంకా అతిమానే చ కౌరవాః ।
అతిదానే బలి ర్బద్ధ స్సర్వమత్యంతగర్హితం ॥

తా. అతిదర్పము (రావణునిక్రొవ్వు) వలన లంకాపట్టణము హతమయ్యె. అతిగర్వమువలన కౌరవులుహతులైరి. అతిదానమువలన బలిచక్రవర్తి బద్ధుండయ్యె గావున నన్నిటియందును అతిని వర్జించవలయు.

శ్లో. యో ధ్రువాణి పరిత్యజ్య అధ్రువం పరిషేవతే ।
ధ్రువాణి తస్య నశ్యంతి అధ్రువం నష్టమేవ చ ॥

తా. స్థిరకార్యములవదలి అస్థిరకార్యంబుల నవలంబించినవానికి, స్థిరాస్థిర కార్యంబులు రెండును జెడును గావున స్థిరకార్యంబులనే చేయవలయు.

శ్లో. సింహాదేకం బకాదేకం షట్శునస్త్రీణిగర్దభాత్ ।
వాయసాచ్చ చతుశ్శిక్షేచ్చత్వారి కుక్కుటాదపి ॥

తా. సింహమువలన నొకగుణమును, కొంగవలననొకటిని, కుక్కవలన ఆఱును, గాడిదవలనమూఁడును, కాకి కోడి వీనివలన నాలుగు గుణంబులును అభ్యసింపవలయు.

శ్లో. ప్రభూతమల్పకార్యం వా యో నరః కర్తుమిచ్ఛతి ।
సర్వారంభేణ తత్కార్యా త్సింహాదేకం ప్రకీర్తితం ॥

తా. గొప్పపనినైనను - కొద్దిపనినైనను - చేయఁదలంచినవాఁడు, ఫలముగలుగుపఱకు చేయవలయు. ఈగుణము సింహమువలన గ్రహింపఁదగినది.

శ్లో. సర్వేంద్రియాణి సంయమ్య బకవత్పతితో జనః ।
కాలదేశోపపన్నాని సర్వకార్యాణి సాధయేత్ ॥

తా. ఒకకార్యమునందు ప్రవర్తించినవాఁడు, సర్వేంద్రియములబంధించి కొంగవలెనె కాచినయెడ, కాల దేశ ప్రాప్తము లగు కార్యముల సాధింపవచ్చును.

శ్లో. బహ్వాశీ స్వల్పసంతుష్ట స్సునిద్ర శ్శీఘ్రచేతనః ।
ప్రభుభక్తశ్చ శూరశ్చ జ్ఞాతవ్యా ష్షట్శునో గుణాః ॥

తా. అన్నమును ఎక్కువగభుజించుట, అల్పసంతుష్టి, మంచినిద్ర, శీఘ్రముగ తెలివిదెచ్చుకొనుట, యజమానునియందు విశ్వాసము, శౌర్యము అనునీయాఱుగుణంబులు కుక్కవలన గ్రహింపఁదగినవి.

శ్లో. అవిశ్రామం వహే ద్భారం శీతోష్ణం చ న విందతి ।
ససంతోష స్తథా నిత్యం త్రీణి శిక్షేత గర్దభాత్ ॥

తా. ఎల్లప్పుడు భారమునువహించుట, శీతోష్ణసహనము, సదాసంతోషము గలిగియుండుట, ఈమూఁడును గాడిదెవలన గ్రహింపవలయు.

శ్లో. గూఢమైథునధర్మం చ కాలేకాలే చ సంగ్రహం ।
అప్రమాద మనాలస్యం చతు శ్శిక్షేత వాయసాత్ ॥

తా. రహస్యస్థలమున స్త్రీసంభోగముచేయుట, తగినకాలములయందు తగిన పదార్థములసంగ్రహించుట, జాగ్రత్త, ఆలస్యములేమి ఈనాలుగును కాకివలన గ్రహింపఁదగినవి.

శ్లో. యుద్ధం చ ప్రాతరుత్థానం భోజనం సహబంధుభిః ।
స్త్రియ మాపద్గతాం రక్షే చ్చతు శ్శిక్షేత కుక్కుటాత్ ॥

తా. యుద్ధంబొనర్చుట, ప్రాతఃకాలమునలేచుట, బంధువులతోఁగూడభుజించుట, ఆపదనుజెందినస్త్రీనిరక్షించుట ఈనాలుగును కోడివలన గ్రహింపఁదగినది.

శ్లో. ఆపదాం కథితః పంథా ఇంద్రియాణా మసంయమః ।
తజ్జయ స్సంపదాంమార్గో యేనేష్టం తేన గమ్యతాం ॥

తా. చక్షురాదీంద్రియములను వాని యిచ్చవచ్చినట్లు పోనిచ్చుట ఆపదలకుఁ గారణము; ఆయింద్రియములను స్వాధీనపఱచికొనుట సంపదలకుగారణంబుగావున నీరెంటియందేదియిష్టమో దానిని పురుషుం డవలంబించవలయు.

శ్లో. న చ విద్యాసమో బంధు ర్న చ వ్యాధిసమో రిపుః ।
నచాపత్యసమ స్స్నేహో న చ దైవాత్పరంబలం ॥

తా. విద్యతోసమాన మగుబంధువు, రోగముతో సమాన మగుశత్రువు, పుత్రునివంటిస్నేహితుఁడు, దైవబలముతోఁదుల్యమైనబలమును లేదు.

శ్లో. ఘృతకుంభసమానారీ తప్తాంగారసమఃపుమాన్ ।
తస్మా ద్ఘృతం చ వహ్నిం చ నైకత్ర స్థాపయే ద్బుధః ॥

తా. స్త్రీ నేతికుండతో సమానురాలు. అగ్నితోసమానుఁడు పురుషుఁడు-కావున బుద్ధిమంతుఁడగువాఁడు ఇరువుర నొక్కచోట నుంచదగదు.

శ్లో. జీర్ణ మన్నం ప్రశంసీయా ద్భార్యాం చ గతయౌవనాం ।
రణాత్ప్రత్యాగతంశూరం సస్యం చ గృహమాగతం ॥



తా. జీర్ణించినతరువాత అన్నమును, యౌవనముదాటినతరువాత భార్యను, యుద్ధముచేసివచ్చినతరువాత శూరుని, పండి యింటికివచ్చిన తరువాత సస్యమును ప్రశంసించవలయు.

శ్లో. అసంభావ్యం న వక్తవ్యం ప్రత్యక్షమపి దృశ్యతే ।
శిలా తరతి పానీయం గీతం గాయతి వానరః ॥

తా. ఱాయి నీళ్లను దాఁటుచున్నదనియు, కోఁతి పాటపాడుచున్నదనియు, నిట్లు ఊహింపఁదగనియర్థమును పలుకఁగూడదు.

శ్లో. పరోక్షే కార్యహంతారం ప్రత్యక్షే ప్రియవాదినం ।
వర్జయే త్తాదృశం మిత్రం విషకుంభం పయోముఖం ॥

తా. ప్రత్యక్షమున ప్రియవాక్యములబలికి, పరోక్షమునఁ గార్యహానిసేయుమిత్రుని, అడుగునవిషము-పైనపాలునిండించిన ఘటమునువలెఁ బరిత్యజింపవలయు.

శ్లో. పరదారాన్ పరద్రవ్యం పరీవాదం పరస్య చ ।
పరీహాసం గురోఃస్థానే చాపల్యం చ వివర్జయేత్ ॥

తా. పరస్త్రీ పరద్రవ్యముల నాశించుటను, పరునియొక్క అపవాదమును, గురువునొద్ద పరిహాసంబును, చపలత్వమును వర్జింపవలయు.

శ్లో. లుబ్ధ మర్థేన గృహ్ణీయా త్క్రుద్ధ మంజలికర్మణా ।
మూర్ఖం ఛందానువృత్తేన తథా తథ్యేన పండితం ॥

తా. లుబ్ధుని ధనముచేతను, కోపగించినవాని నమస్కారముచేతను, మూర్ఖుని వానియిష్టము ననుసరించుటచేతను, పండితుని సత్యవాక్యములచేతను స్వాధీనపరచికొనవలయు.

శ్లో. అర్థనాశం మనస్తాపం గృహే దుశ్చరితాని చ ।
వంచనం చాపమానం చ మతిమా న్న ప్రకాశయేత్ ॥

తా. ద్రవ్యనాశము, మనస్తాపము, గృహచ్ఛిద్రములు, వంచనము, అవమానము వీనిని బుద్ధిమంతుఁడగువాఁడు ప్రకాశపరచజనదు.

శ్లో. ధనధాన్యప్రయోగేషు తథా విద్యాగమేషు చ ।
ఆహారే వ్యవహారే చ త్యక్తలజ్జ స్సదాభవేత్ ॥

తా. ధన ధాన్యముల సంగ్రహించుటయందును, విద్యనభ్యసించుటయందును, ఆహారమునందును, వ్యవహారమునందును లజ్జను వదలవలయు.

శ్లో. ధనిన శ్శ్రోత్రియో రాజా నదీ వైద్య స్తు పంచమః ।
పంచ యత్ర న విద్యంతే తత్ర వాసం న కారయేత్ ॥

తా. ధనవంతుఁడు, శ్రోత్రియుఁడు, పరిపాలించెడిరాజు, నది, వైద్యుఁడు, ఈయైదుగురు లేనిచోట నివసింపఁగూడదు.

శ్లో. యస్మిన్ దేశే న సన్మానం న ప్రీతి ర్న చ బాంధవాః ।
న చ విద్యాగమః కశ్చి త్తం దేశం పరివర్జయేత్ ॥

తా. సన్మానము, ప్రీతి, బంధువులు, విద్య ఇవి లేనిదేశమున నివసింపఁగూడదు.

శ్లో. మనసా చింతితం కర్మ వచసా న ప్రకాశయేత్ ।
అన్యలక్షితకార్యస్య యత స్సిద్ధి ర్న జాయతే ॥

తా. మనస్సున ఆలోచించిన కార్యమును వాక్కుచేఁజెప్పఁగూడదు; చెప్పిన యెడల ఇతరుఁ డది తెలిసికొనుటచే కార్యము సిద్ధింపదు.

శ్లో. మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః ।
న శోభతే సభామధ్యే హంసమధ్యే బకో యథా ॥

తా. పుత్రునికి విద్యాభ్యాసముజేయింపని తలిదండ్రులు శత్రువులు. విద్యలేనివాఁడు "హంసలనడుమ కొంగవలె," సభయందుఁ బ్రకాశింపఁడు; కావున తలిదండ్రు లవశ్యము కుమారునికి విద్యాభ్యాసము చేయించవలెను.

శ్లో. లాలయే త్పంచవర్షాణి దశవర్షాణి తాడయేత్ ।
ప్రాప్తే తు షోడశే వర్షే పుత్రం మిత్రవ దాచరేత్ ॥

తా. కుమారుని ఐదుసంవత్సరములవఱకు లాలించవలయు. తరువాత పదిసంవత్సరములు శిక్షాపూర్వకముగ విద్యను నేర్పవలయు. పదియాఱవసంవత్సరము మొదలుకొని మిత్రునివలెభావించి హితము సెప్పుచుండవలయు.

శ్లో. లాలనే బహవో దోషా స్తాడనే బహవో గుణాః ।
తస్మా త్పుత్రం చ శిష్యం చ తాడయే న్న తు లాలయేత్ ॥

తా. లాలించుటవలన బహుదోషంబులును, శిక్షించుటవలన ననేకసుగుణంబులును గలుగునుగావున, పుత్రుని శిష్యుని లాలింపఁజనదు.

శ్లో. విషాద ప్యమృతం గ్రాహ్య మమేధ్యాదపి కాంచనం ।
నీచా ద ప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి ॥

తా. అమృతము విషములోఁబడినను, స్వర్ణము అమేధ్యములోఁబడినను, విద్య-నీచునియందుండినను, ఉత్తమస్త్రీ-దుర్వంశజనితురాలైనను గ్రహింపఁదగును.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం, సామాన్యనీతి కథనన్నామ
దశమోఽధ్యాయః.

---

*

ఏకాదశాధ్యాయము.

# ఆశౌచప్రకరణము.

---

## ఆశౌచస్వరూపము.

స్మృతిచంద్రికాయాం. వా.—సపిండాదిజననే మరణేవాసతి యదప్రాయత్యం దానాదికర్మస్వయోగ్యతాపాదకం పాపవిశేషాత్మకం వా తదాశౌచశబ్దేన బోధ్యతే ॥

తా. జ్ఞాతులు మొదలగువారి జనన మరణములవలన గలిగెడిమైలగాని, దానాదికర్మంబులయందు అనర్హత్వమును సూచించెడి పాపవిశేషంబుగాని, ఆశౌచమనబడును

## ఆశౌచ వర్జనీయకృత్యము.

శ్లో. ఆశౌచే వర్జయే త్కర్మ నిత్యనైమిత్తికాదికం ।
ఆశౌచిన స్తథా స్పర్శం స్పృష్ట్వా స్నానేన శుద్ధ్యతి ॥

తా. ఆశౌచమునందు నిత్యనైమిత్తికాదిక్రియలను చేయకూడదు, ఇతరులను తాఁకకూడదు; ఆశౌచముగలవారిని తాఁకినవారు స్నానముచేఁ బరిశుద్ధు లగుదురు.

## అశౌచభేదములు.

వా. త చ్చాశౌచం ద్వివిధం, జాతకం మృతకం చేతి ॥

తా. అట్టిఆశౌచము, జాతాశౌచము, (పురుడు) మృతాశౌచము (సూతకము అని రెండు తెఱఁగులు.

వా. తత్ర ప్రథమం స్రావ పాత ప్రసూతి భేదేన త్రివిధం ॥

తా. స్రావాశౌచము - పాతాశౌచము - ప్రసూత్యాశౌచము అను జాతాశౌచము మూఁడువిధంబులు.

శ్లో. ఆచతుర్థా ద్భవే త్స్రావః పాతః పంచమషష్ఠయోః ।
అతఊర్ధ్వం ప్రసూతి స్స్యా ద్దశాహం సూతకం భవేత్ ॥

తా. గర్భిణీస్త్రీకి నాలుగు మాసముల లోపల గర్భము పోయినయెడ స్రావమనఁబడును; ౫వ ౬వ మాసమునందు పోయినయెడల పాత మనబడును; ౭వ మాసము మొదలుకొని ప్రసవ మనఁబడును.

శ్లో. స్రావే మాతు స్త్రిరాత్రం స్యా త్సపిండాశౌచవర్జనం ।
పాతే మాతు ర్యథామాసం పిత్రాదీనాం దినత్రయం ॥

తా. మూఁడునెలలలోపల గర్భస్రావముగలిగిన, మూఁడుదినములును నాలుగవనెలయందు గలిగిన - నాలుగుదినములును తల్లికి ఆశౌచము. తండ్రికి స్నానమమాత్రము. నాలవమాసమున కఠినముగ స్రావమైనయెడ తండ్రికి మూఁడుదినములును, సహోదరభార్యలకు స్నానమమాత్రము. జ్ఞాతుల కేమియులేదు. మృదుస్రావమైనయెడ-తండ్రి-సోదరులు వీరలకు స్నానముమాత్రము చెప్పఁబడినది. గర్భపాతసమయమున నెన్నిమాసములో అన్నిదినములు తల్లికిని, తండ్రికి సోదరులకు జ్ఞాతులకు మూఁడుదినములును ఆశౌచము. గ్రామాంతరమునందు గర్భపాతము గలిగినయెడ తండ్రి మొదలగువారికి స్నానముమాత్రము.

సపిండాదుల జాతాశౌచనిర్ణయము.

శ్లో. ప్రసూతౌ తు సపిండానాం పూర్ణాశౌచ ముదీరితం ।
ఏకోదకానాం త్రిదినం సగోత్రాణాం న కించన ।
స్త్రీపుంసప్రసవే మాతు ర్మాసవింశత్యహఃక్రమాత్ ।
అస్పృశ్యత్వం తు నైవాస్తి సూతకే సూతికాం వినా ।
శావాశౌచేతు సర్వేషా మస్పృశ్యత్వం సదా భవేత్ ।
సూతకీ మృతకీ చైవ న స్పృశేతాం పరస్పరం ॥

తా. జాతాశౌచము సపిండులకు (జ్ఞాతులకు) పదిదినములును, ఏకోదకులకు మూఁడుదినములును, ఆశౌచము. సగోత్రులకు ఆశౌచములేదు. స్త్రీని ప్రసవించినపుడు తల్లికొకమాసమును, పుత్రుని బ్రసవించినపుడు ఇరువదిదినములును ఆశౌచము కావున ఆలోపల నగ్నికర్మములఁజేయఁజనదు. పురిటియందు, ప్రసవించినస్త్రీనిదప్ప ఆశౌచముగలవారిని ఇతరులఁ తాఁకినను దోషములేదు. (పుత్రుఁడుజనించినవెనుక సచేలస్నానముచేయువఱకు తండ్రిని తాఁకకూడదు.) ప్రసవించినస్త్రీకి దగ్గరకుగూడ పోఁదగని అత్యంతాశౌచము పదిదినములు. మృతాశౌచముగలవారిని తాఁకగూడదు. సూతకము గలవాఁడును పురుడుగలవాఁడును ఒకరికొకరు తాఁకగూడదు.

సపిండాదిస్వరూపము.

వా. పితృపితామహ ప్రపితామహాదయ స్సప్త పూర్వాః పురుషాః, పుత్రపౌత్రాదయ స్సప్త పరాః పురుషా స్సపిండా ఇత్యుచ్యంతే। సంతానభేదేపి యతః ప్రభృతి ద్వౌ వా బహవో వా సంతానాః ప్రవృత్తా స్స కూటస్థః । కూటస్థప్రభృతిగణితా నానా సంతానవర్తినోప్యేకగోత్రానుప్రవిష్టా స్సప్తపూరుషాః పరస్పరం సపిండాః ॥ అష్టమప్రభృతి చతుర్దశపర్యంతా ఏకగోత్రానుప్రవిష్టా స్సమానోదకాః । పంచదశప్రభృతి ఏకవింశతిపర్యంతా స్సగోత్రాః ॥



తా. ఒకపురుషునికి ఇద్దరుగాని బహుమందిగాని జనించినయెడ వారిపరంపరకు ఆపురుషుఁడు కూటస్థుఁడగును; అట్టికూటస్థుఁడు మొదలుకొని పుత్రపౌత్రాదిక్రమమున నేడుగురివఱకును, పితృపితామహాదిక్రమముగ నేడుగురివఱకును పరస్పరము సపిండులనఁబడుదురు. ఎనిమిదవపురుషుఁడు మొదలుకొని పదునాలుగవపురుషునివఱకు సమానోదకు లనఁబడుదురు. ఆటుపిమ్మట ఇరువదియొకపురుషునివఱకు సగోత్రులు.

వా. అనూఢా స్త్రియ స్తు కూటస్థప్రభృతి త్రిపూరుష పర్యంతా స్సపిండాః । తత స్త్రిపూరుషపర్యంతా స్సమానోదకాః । సప్తమప్రభృతి సగోత్రాః ॥

తా. పెండ్లికాని స్త్రీలు కూటస్థుఁడాదిగాఁగల ముగ్గురివఱకును సపిండ లనఁబడుదురు. నాలవవాఁడు మొదలుకొని ముగ్గురివఱకును సమానోదకులు. ఆవల సగోత్రులు.

చాతుర్వర్ణ్యాశౌచనిర్ణయము.

వా. బ్రాహ్మణస్య సపిండానాం జననమరణయో ర్దశాహమాశౌచం, ద్వాదశాహం రాజన్యస్య, పంచదశాహం వైశ్యస్య, మాసం శూద్రస్య ॥

తా. సపిండులలో జనన మరణాశౌచములు వచ్చినప్పుడు బ్రాహ్మణులు పదిదినములును, క్షత్రియులు ౧౨ దినములును, వైశ్యులు ౧౫ దినములును, శూద్రులు ౩౦ దినములును ఆశౌచము నవలంబింపవలయు.

పితృగృహమున పుత్రిక ప్రసవించునపుడు.

వా. పితృగృహే పుత్రికా ప్రసూతాచే న్మాతా పితృ భ్రాతౄణాం త్రిరాత్రం । జ్ఞాతీనా మేకరాత్రం ॥

తా. పితృగృహంబున బుత్రిక పుత్రుని ప్రసవించినయెడల తల్లి తండ్రి అన్నదమ్ములు వీరికి మూఁడుదినములును, వారిజ్ఞాతుల కొక్కదినంబును ఆశౌచము. ఇతరగృహమునందు బ్రసవించినయెడ గర్భిణియొక్క తలిదండ్రులకులేదు. ఇతరగృహమునందు బ్రసవించినపుడు పురిటికయ్యెడి వెచ్చమును తండ్రియొసంగినయెడ మూఁడుదినములు ఆశౌచముకలదు.

వా. కన్యాజననే తు పక్షిణ్యాశౌచం । కిమపినాస్తీతి కేచిత్ ॥

తా, స్త్రీప్రజనుగనినయెడల ఒకటిన్నరదినము-అదియు లేదని కొందరు.

దూరశ్రుతిజాతాశౌచము.

వా. దూరవృత్తం పుత్రజననం జ్ఞాతిజననం వా దశాహమధ్యేశ్రుతం చే ద్దశాహశేషేణైవ శుద్ధిః । దశాహాదూర్ధ్వం శ్రుతం చే త్పితుస్సచేలస్నానమాత్రం । భార్యాణాం జ్ఞాతీనాం కిమపి నాస్తి । సమానోదకానాంతు త్రిరాత్రమధ్యే జననశ్రవణే త్రిరాత్రశేషేణ శుద్ధిః । తదూర్ధ్వం శ్రవణే కిమపి నాస్తి ॥

తా. పుత్రజననమునుగాని జ్ఞాతిజననమునుగాని పరదేశమునందుండి పదిదినములలోపల వినినయెడల అందు శేషించినదినములకు పురుడుపట్టవలెను. పదిదినములకు మీఁద వినినయెడ తండ్రికి సచేలస్నానముమాత్రము. అతనిభార్యలకు జ్ఞాతులకును అదియు బనిలేదు. ఏకోదకులు మూఁడుదినములలోపల వినినయెడ అందు శేషించిన దినములకు మాత్రము ఆశౌచముపట్టవలెను. అటుపిమ్మట వినినయెడ ఆశౌచమే లేదు.

శిశుమరణమునందు.

వా. జాతస్య శిశో ర్నాభిచ్ఛేదాత్పూర్వం మరణే మాతు ర్దశరాత్రం జాతాశౌచం । పిత్రాదీనాం సర్వేషాం త్రిరాత్రం జాతాశౌచం దశరాత్రం వా । మృతకాశౌచం తు స్నానమాత్రా న్నివర్తతే ॥ నాభిచ్ఛేదాదూర్ధ్వం మరణే మాతా పితృ భార్యాణాం జన్మదినాహశేషపర్యంతం మృతకాశౌచం । జ్ఞాతీనాం దశరాత్రం జాతాశౌచమేవ ॥

తా. నాభిచ్ఛేదనమునకు బూర్వము శిశువు మృతిబొందినయెడ తల్లికి పదిదినములు పురుడుగలదు. పితృసోదరజ్ఞాతులకు మూఁడుదినములు జాతాశౌచము. పదిదినములని కొందఱువచించిరి. మరణాశౌచము స్నానముతోనే నివర్తించును. నాభిచ్ఛేదనానంతరము పదిదినములలోపల నేదినమునందు శిశువుమరణించినను శేషించిన దినములకు మాత్రము తలిదండ్రులకు సోదరులకు మరణాశౌచమున్నది. జ్ఞాతులకు పదిదినములు జాతాశౌచము. మృతకాశౌచము స్నానముతో వదలును.

వా. మృతప్రసవే మాతు ర్దశరాత్రం మృతకాశౌచం । పిత్రాదీనాం సర్వేషాం దశరాత్రం జాతాశౌచమేవ ॥



తా. మృతశిశుజననమునందు పదిదినములు తల్లికి సూతకము. పిత్రాదిజ్ఞాతులకు జాతాశౌచము మాత్రము పదిదినములుండును. మృతాశౌచము స్నానముచేదొలఁగును.

ద్రావిడులలో.

వా. ద్రావిడానాం తు కన్యాజననే మాతా పితృభ్రాతౄణాం పితృవ్యతత్పుత్రయోః పితామహతద్భ్రాత్రో శ్చాశౌచం అన్యేషాం కిమపినాస్తి । పితృవ్యో భిన్నోదర శ్చే త్తస్యైవాశౌచం । తత్పుత్రస్యాశౌచం నాస్తి । సూతికాయాస్స్త్రీప్రసవే చత్వారింశద్దినాన్యాశౌచం । పుంప్రసవే మాసమాశౌచం ॥

తా. ద్రావిడులకు స్త్రీసంతానము గలిగినపుడు తల్లి, తండ్రి, అన్నదమ్ములు, పినతండ్రి, వారిపుత్రులు, తాతలు, పినతాతలు, వీరలకుఁదప్ప నితరులకు జాతాశౌచములేదు. భిన్నోదరుఁడగు పినతండ్రియొక్క కొడుకులకును ఆశౌచములేదు. స్త్రీప్రసవమునందు నలువదిదినములును, పుంప్రసవమునందు ముప్పదిదినములును తల్లికి జాతాశౌచము.

వా. పితృగృహే పుత్రీప్రసూతా చే త్తన్మాతాపిత్రో స్త్రిరాత్రం తద్భ్రాతు రేకరాత్రం । జ్ఞాతీనాం కిమపి నాస్తి ॥

తా. తండ్రియింట బ్రసవించినయెడ తలిదండ్రులకు మూఁడుదినములును, అన్నదమ్ములకొకదినంబును ఆశౌచముగలదు; జ్ఞాతులకేమియులేదు.

వా. దశాహమధ్యే శిశుమరణే మాతాపిత్రో ర్దశాహశేషపర్యంతం మృతకాశౌచం । భ్రాతు ర్జాతాశౌచమేవ । దశమదినే శిశుమరణే మాతాపిత్రో ర్దశాహాదూర్ధ్వం ద్విరాత్రం । తస్మిన్నేవదినే అష్టమయామే శిశుమరణే త్రిరాత్రం । అన్యత్సర్వం సమానం ॥

తా. పదిదినములలోపల శిశువు మరణించినయెడ పుట్టినదినము మొదలుకొని పదిదినములవఱకు తలిదండ్రులకు మృతాశౌచము; అన్నదమ్ములకు పురుడుమాత్రము కలదు. పదియవనాఁడు శిశువుమరణించినయెడ పిదప రెండుదినములాశౌచముపట్టవలయు. పదియవదినమునం దెనిమిదవజామున శిశువు మరణించినయెడ మూఁడుదినములాశౌచము; మిగిలినదంతయు సమానము.

అనుపనీతమరణమున.

శ్లో. అర్వాగుపనయా త్పిత్రో ర్భ్రాతౄణాం చ దినత్రయం ।
అర్వాగ్దంతోద్గమా చ్చౌలా త్తథోపనయనాత్క్రమాత్ ।

సద్యో దినం త్రిరాత్రం చ సపిండానాం ప్రకీర్తితం ।
దహనే తు త్రిరాత్రం స్యా దాశౌచ మపి గోత్రిణాం ।
అజాతదంతదహనే త్యాగేచైకాహ ముచ్యతే ।
అతిక్రాంతం తూపనయా దర్వా జ్ఞాన్యైవ కస్యచిత్ ॥

తా. ఉపనయనముకాకమునుపు బాలుఁడు మరణించినయెడ- మాతా పితృ భ్రాతృవులకు, జ్ఞాతులకు, మూఁడుదినములు ఆశౌచము; దంతములురాకమునుపు శిశువు మరణించినయెడ జ్ఞాతులకుస్నానముతోసరి. పుట్టువెండ్రుకలుతీయకముందైన యెడ నొకదినము. ఉపనయనముకాకముందైనయెడల మూఁడుదినములును జ్ఞాతులకాశౌచముగలదు. అనుపనీత మృతశిశువును దహనముచేసినపక్షమున మూఁడుదినములును, పండ్లురాకమునుపు దహనముతుగాని త్యాగమునుగాని చేసినపుడు ఒక్కదినమును జ్ఞాతులకాశౌచము. అనుపనీతమరణమునందు, కాలాంతరాశౌచము-పిత్రాదిజ్ఞాతులకందఱకు లేనేలేదు. అనుపనీతునికి దహనాదిసంస్కారములను దేశాచారము ననుసరించి చేయవలయు.

కన్యామరణమున.

శ్లో. అనూఢాయా మృతౌ పిత్రో ర్భ్రాతౄణాం చ దినత్రయం
దిన మాదంతజననాదితి ధర్మవిదో విదుః ।
జ్ఞాతీనాం స్నాన మాచౌలా దావాగ్దానా ద్దినం భవేత్ ।
వాగ్దానే తు త్రిరాత్రం స్యా త్పితృభర్తృకులద్వయోః ।
అనూఢా చే ద్రజఃపశ్యే ద్దశాహం తన్మృతౌ భవేత్ ॥

తా. పెండ్లిగానికన్యక మరణించినపుడు మాతాపితృ భ్రాతలకు మూఁడుదినములాశౌచము. దంతములు రాకముందైనయెడ నొక్కదినంబని కొందఱుపచించిరి. దంతములు వచ్చినతరువాత చౌలకర్మకాకమునుపు మరణించినయెడ జ్ఞాతులకు స్నానముతోసరి. చౌలకర్మఅయినది మొదలుకొనిగాని, మూఁడవసంవత్సరము మొదలుకొని గాని వాగ్దానములోపల మరణించెనేని జ్ఞాతులకొక్కదినంబును, వాగ్దానము మొదలు వివాహములోపల మరణించెనేని, తండ్రివంకవారికిని పెనిమిటివంకవారికిని మూఁడుదినములాశౌచము. పెండ్లికాకమునుపు రజస్వలయై మరణించినయెడల నందరికిని పదిదినములాశౌచము.

ఉపనీత మృతాశౌచము.

శ్లో. ఉపనీతమృతౌపూర్ణం సర్వేషాం మృతకం భవేత్ ।
ఏకోదకానాం త్రిదినం సగోత్రాణాం తు మజ్జనం ॥



తా. ఉపనీతుఁడు మరణించినయెడ పిత్రాదులకు సపిండులకు సంపూర్ణాశౌచము. సమానోదకులకు మూఁడుదినములు సూతకము, సగోత్రులకు స్నానముతోసరి. (అనుపనీతుఁడు మరణించినపుడును వివాహముకానికన్యక మరణించినపుడును, వివాహముకానివారు మరణించినపుడును సమానోదకులకు స్నానముతోసరి.)

మాతామహ్యాదిమరణమున.

వా. మాతామహీ మాతామహ మాతృష్వసృ మాతుల మాతులానీ దౌహిత్ర భాగినేయానాం సన్నిధానమరణే త్రిరాత్రం। అసన్నిధానే పక్షిణీ ॥

తా. తల్లితల్లి, తల్లితండ్రి, పినతల్లి, పెదతల్లి, మేనమామ, అతనిపెండ్లాము, కూఁతురికొడుకు, మేనల్లుఁడు, వీరు మరణించినపుడు మూఁడుదినములు. దేశాంతరమునందుండి వినినయెడల ౧౺ దినము సూతకము.

శ్వశ్రూ శ్వశురమరణమున.

వా. శ్వశ్రూశ్వశురయోస్సన్నిధానే జీవద్భార్యస్య జామాతు స్త్రిరాత్రం, అసన్నిధానే పక్షిణీ । మృతభార్యస్యజామాతు స్సన్నిధానేప్యేకరాత్రం । భార్యాసంతతౌ స్థితాయాం తు త్రిరాత్రం ॥

తా. భార్యయుండునపుడు అత్తమామలు మరణించినయెడ మూఁడుదినములు; దేశాంతరమునవినినయెడల ౧౺ దినము, అత్తమామలు సమీపమునందు మరణించినపుడు అపత్నీకునకు ఒక్కరాత్రిసూతకము. భార్యయున్నను లేకున్నను సంతానముండినయెడల మూఁడుదినములు సూతకము.

ఆచార్యాదిమరణమున.

వా. ఆచార్య తత్పుత్రతత్పత్నీనాం మరణే సన్నిధానే త్రిరాత్రం, అసన్నిధానే పక్షిణీ । శిష్యస్య సన్నిధానమరణే ఆచార్యాదీనామప్యేవమేవ ॥

తా. గురువు - గురుపుత్రుఁడు - గురుభార్య వీరలు మరణించినపుడు శిష్యునకు మూఁడుదినములు సూతకము; దేశాంతరమున వినినయెడ ౧౺ దినము. శిష్యునిమరణమునందు ఆచార్యాదులకును పైప్రకారమే సూతకము.

పుత్రీ మరణమున.

వా. వివాహాదూర్ధ్వం పితృగృహే పుత్రీమరణే మాతాపితృ భ్రాతౄణా మనూఢభగినీనాం చ త్రిరాత్రం । జ్ఞాతీనా మేకరాత్రం

భ్రాతృపత్నీనాం స్నానమాత్రం॥ ద్రావిడానాం తు మాతాపిత్రో
స్త్రిరాత్రం, భ్రాతృభగినీనా మేకరాత్రం, జ్ఞాతీనాం కిమపి నాస్తి॥

తా. వివాహితస్త్రీ, తండ్రియింట మరణించినపుడు, తల్లి - తండ్రి- అన్నదమ్ము లు - పెండ్లికానిచెల్లెండ్రు వీరలకు మూఁడుదినములును, దాయాదులకు ఒకదినమును సూతకము. అన్నదమ్ముల భార్యలకు స్నానముతోసరి. ద్రావిడులలో తలిదండ్రులకు మూఁడుదినములు. అన్నదమ్ములకు చెల్లెండ్రకు నొక్కదినము. దాయాదుల కేమిలేదు.

వా. యది మాతాపితృభ్రాతరో విభక్తా భిన్నగృహవాసినశ్చే త్పితృ
గృహే మరణే పిత్రోరేవ త్రిరాత్రం। భ్రాతృగృహేచే ద్భ్రాతు
రేవ త్రిరాత్రం । జ్ఞాతిగృహేచే త్తేషామేకరాత్రం । అన్యత్రమ
రణే మాతా పితృభ్రాతౄణాం పక్షిణీ। జ్ఞాతీనాం కిమపి నాస్తి॥

తా. పితాపుత్రులు విభక్తులై వేర్వేరు గృహములం దుండినపుడు ఎవరియింట మరణించునో వారికి మూఁడుదినములు సూతకము. తక్కినవారికి ఒకదినము. జ్ఞాతుల యింట మరణించినపుడు పిత్రాదుల కొక్కదినము. జ్ఞాతులకు మూఁడుదినములు. అన్యగ్రామమున జరిగినయెడ మాతా పితృ భ్రాతలకు ౧½దినము. జ్ఞాతుల కేమియును లేదు

మాతాపితృమరణమున, దుహితకు.

వా. స్వగృహే పరగృహే వా మాతాపిత్రోర్మరణే పుత్ర్యా స్త్రిరాత్రం

తా. తలిదండ్రులు ఎక్కడమరణించినను కూఁతురికి మూఁడుదినములుసూతకము.

సహోదరమరణమున.

వా. భగినీగృహే భ్రాతృమరణే భగిన్యా స్త్రిరాత్రం పరగృహేపక్షిణీ।
గ్రామాంతరే ఏకరాత్రం॥

తా. సోదరమరణము చెల్లెలింట జరిగినపుడు చెల్లెలికి మూఁడుదినములు. ఇతర గృహంబున జరిగినయెడ చెల్లెలికి ౧½ దినము. దేశాంతరమునందైనయెడ నొక్కదినము.

స్యాలాదిమరణమునందు.

వా భగినీపతే స్తు స్వగృహే పరగృహే వా స్యాలమరణే ఏకరాత్రం।
స్యాలపుత్రమరణే ప్యేకరాత్రం॥

తా. భార్యయొక్క అన్నదమ్ముల మరణమునందును వారిపుత్రులమరణమునం దును, ఒక్కదినము సూతకము. గ్రామాంతరంబున జరిగినయెడ స్నానముతోసరి.

అనుపనీతభ్రాత్రాదిమరణమునందు

వా. అనుపనీతభ్రాతృమరణే సన్నిధానేఽపి భగిన్యా స్నానమాత్రం।
భ్రాతృపుత్రమరణే ప్యేవమేవ॥



తా. వడుగుకాని తమ్ముఁడు మేనల్లుఁడు వీరు ఏకగ్రామంబున మరణించినపుడు స్త్రీకి స్నానముతోసరి.

భగినీ మరణమునందు.

వా. భ్రాతృగృహే భగినీమరణే భ్రాతు స్త్రిరాత్రం। పరగృహే ప
క్షిణీ। గ్రామాంతరే ఏకరాత్రం।

తా. చెల్లెలిమరణము అన్నదమ్ములయింట జరిగినయెడ వారికి మూఁడుదినము లు. ఇతరునియింటజరిగిన ౧½ దినము. ఇతరదేశంబున జరిగిన నొక్కదినముఆశౌచము.

దత్తపుత్రమరణమునందు.

వా. దత్తపుత్రమరణే పూర్వాపరపిత్రో స్తత్పుత్రాణాం చ త్రిరాత్రం।
అసన్నిధానే త్వేకరాత్రం । పితృద్వయజ్ఞాతీనాం సన్నిధానేచైక
రాత్రం। అసన్నిధానే స్నానమాత్రం। అనుపనీత దత్తపుత్రమ
రణే తు సన్నిధానేఽపి స్నానమాత్రం । దత్తస్యపుత్రజననే మర
ణేవా ఉపనయనాత్పరమపి జనకవర్గస్యస్నానమాత్రం। దత్తస్యజ
నకపితృమరణేత్రిరాత్రం। ప్రతిగృహీతృపితృమరణే దశరాత్రం, త
స్మరణే ప్రతిగృహీతు రపి దశరాత్రం । యదిదత్తస్వీకారానంతరం
జాతఔరసపుత్ర స్సంస్కర్తా తదా దత్తస్య త్రిరాత్రమేవ॥

తా. అనుపనీత దత్తపుత్రమరణమునందు జనకతండ్రికి పెంపుడుతండ్రికి వాని పుత్రులకును మూఁడుదినములాశౌచము. దేశాంతరమునందైనయెడల నొకదినము; ఉభయజ్ఞాతులకు సమీపమునం దొక్కరాత్రి, దూరపుజ్ఞాతులకు స్నానముతోసరి. దత్తపుత్రుఁడు ఉపనయనముగాక సమీపమున మరణమునొందినను జ్ఞాతులకు స్నానముతోసరి; దత్తునకుఁ బుత్రుఁడుపుట్టినను ఉపనీతుఁడై మరణించినను జనకపితృసంబంధి జ్ఞాతులకు స్నానముతోసరి, జనకపితృమరణమునందు దత్తపుత్రునకు మూఁడుదినములు సూతకము. ఉపనీతుఁడగు దత్తుఁడుగాని ప్రతిగృహీతగాని మరణించినపుడు పరస్పరము పదిదినములాశౌచము. దత్తతజరిగినపిదప ఔరసపుత్రుఁడు కలిగి కర్మలనడుపుచుండునపుడు పితృమరణమునందు దత్తునకు మూఁడుదినములు సూతకము.

ఆత్మబంధ్వాదిమరణమునందు.

వా. ఆత్మబంధూనాం మాతృబంధూనాం పితృబంధూనాం చ మర
ణే సన్నిధానే పక్షిణీ। అసన్నిధానే త్వేకరాత్రం॥

తా. ఆత్మబంధువులు - పితృబంధువులు - మాతృబంధువులు - వీరలు దగ్గఱ మరణించినపుడు ౧½ దినము. దేశాంతరమునందు జరిగినయెడ ఒకదినము సూతకము.

సాపత్నీయమాతృవర్గమరణమునందు.

వా. సాపత్నీయ మాతృవర్గ మాతులాదే ర్మరణే సన్నిధానే ఏకరాత్రం। అసన్నిధానే స్నానమాత్రం ॥

తా. సవతితల్లిసహోదరులు మొదలగువారు మరణించినపుడు సమీపమునం దొకదినము. దేశాంతరమునందైనయెడ స్నానముతోసరి.

దత్తప్రతిగ్రహీతృవర్గ మాతులాది మరణమునందు.

వా. దత్తస్య ప్రతిగ్రహీతృవర్గస్య మాతులాదే ర్మరణే దత్తస్య సన్నిధానే ఏకరాత్రం; అసన్నిధానే స్నానమాత్రం; దత్తజనకవర్గస్య మాతులాదే ర్మరణే సన్నిధానే ఏకరాత్రం ॥

తా. పెంపుడుతల్లియొక్క అన్నదమ్ములు మొదలగువారు మరణించినపుడు దత్తపుత్రునకు సమీపమునందొకదినము, అన్యగ్రామమునందు స్నానముతోసరి. దత్తునకు జనకతల్లి యన్నదమ్ములుమరణించినపుడు ఒక్కదినము సూతకము. ఇతరగ్రామమునందు స్నానముతోసరి.

సపత్నీపుత్ర్యాదిమరణమునందు.

వా. సపత్నీపుత్రీమరణే సాపత్న్యమాతు రేకరాత్రం । మాతృసపత్నీమరణే సపత్నీపుత్ర్యా అప్యేకరాత్రం అసన్నిధానేస్నానమాత్రం ॥

తా. సవతికూతురు మరణించినపుడు సవతితల్లికి ఒకదినము. సవతితల్లిపోయినపుడు సవతికూతురికి ఒకదినము. దూరమునందైనయెడ స్నానముతోసరి.

అసపిండమరణమునందు.

వా. దౌహిత్రభాగినేయవ్యతిరిక్తానా మసపిండానాముపనయనాత్పూర్వంమరణే సన్నిధానేపి స్నానమాత్రం । దౌహిత్రభాగినేయయో స్తు ప్రాగుపనయనాన్మరణే పక్షిణీ। తదూర్ధ్వం త్రిరాత్రం చౌళాత్పూర్వం తు స్నానమాత్రం ॥

తా. దౌహిత్రుఁడు మేనల్లుఁడు వీరలుదక్క తక్కిన యనుపనీతులగు అసపిండులు సమీపమున మరణించిన స్నానముతోసరి. దౌహిత్రుఁడు, మేనల్లుఁడు, వీరు అనుపనీతులై మరణించినపుడు ౧½ దినము ఉపనీతులైనయెడ త్రిరాత్రము. చౌలముగాక మరణించినపుడు స్నానముతోసరి. అసపిండులు-ఏడుతరములలోపలి జ్ఞాతికానివారు.

వా. మాతృష్వస్రాదీనా మసపిండస్త్రీణాం వివాహాత్పూర్వం మరణే సన్నిధానేఽపి స్నానమాత్రం ॥



తా. అసపిండ లగు పిన్నతల్లిమొదలగు స్త్రీలు అవివాహితలై దగ్గరమరణించినను స్నానముతోసరి.

జామాతృమరణమునందు.

వా. జామాతృమరణే సన్నిధానే పక్షిణీ। అసన్నిధానేప్యేకరాత్రం, తస్యైవ స్వగృహే మరణే త్రిరాత్రం ॥

తా. అల్లునిమరణము సమీపమున జరిగిన ౧½ దినము, దూరమున జరిగిన నొకదినము. తనయింట మరణించినయెడ మామకు మూఁడుదినములు సూతకము.

వా. యోనిసంబంధేషు యే యే పురుషా స్తత్పత్నీనాం మరణే సన్నిధానేపి స్నానమాత్రం। మాతులాన్యాస్తు విశేష విధానా త్త్రిరాత్రం। యోనిసంబంధేషు యాస్త్రియ స్తద్భర్తృమరణేపి స్నానమాత్రం॥

తా. యోనిసంబంధముగలపురుషుల భార్యలయు, అట్టిస్త్రీల భర్తలయు మరణముగు స్నానముతోసరి. మేనమామభార్యమరణమందు మూఁడుదినములుండవలెను.

గురుశిష్యులకు.

వా. జప్యమంత్రోపదేష్టరిమృతే సన్నిధానే ఏకరాత్రం । అసన్నిధానే సజ్యోతిః, తచ్ఛిష్యమృతౌ తస్యాపి తథైవ ॥

తా. మంత్రోపదేశము నొసర్చిన గురువు సమీపమున మరణించినపుడు శిష్యున కొక్కరాత్రిసూతకము. దూరమునందైనయెడ విన్నది మొదలు దీపమును జూచువఱకు సూతకము. శిష్యుఁడు మరణించినప్పుడు గురువునకు నాప్రకారమేయగును.

వా. పరిణీతానాంస్త్రీణాం మాతాపితృ భ్రాతృ తత్పుత్రాన్వినా పితృవర్గ్యబంధుమరణే స్నానమాత్రమితి ధర్మప్రవృత్త్యనుసారిణ ఆంధ్రాదయః । ఇతరేతుపక్షిణ్యాదికమాచరంతి । ద్రావిడాస్తు-సర్వ సాధారణ్యేన పరిణీతాస్త్రియ స్తత్ప్రతియోగినశ్చ పక్షిణ్యాదికమాచరంతి ॥

తా. పెండ్లి అయినస్త్రీలు మాతాపితృభ్రాతృ తత్పుత్రులకుదప్ప తక్కినపితృవర్గబంధువులమరణమునందు స్నానమాత్రము నాచరింపవలయునని ధర్మప్రవృత్తియందు జెప్పఁబడినది; కొందఱు పక్షిణ్యాద్యాశౌచమునవలంబించుచున్నారు. ద్రావిడులలో విశేషముగా వివాహితస్త్రీలు వారిప్రతియోగినులును ఒకరికొకరు పక్షిణ్యాద్యాశౌచమును పట్టుచున్నారు.

## అతిక్రాంతాశౌచ నిరూపణము.

శ్లో. తత్రాదాశౌచ మాఖ్యాత మతిక్రాంతమనేకధా ।

తా. జ్ఞాతుల మరణకాలము నతిక్రమించి వినినపు డట్టిసూతకమనేకవిధములగు.

వా. జ్ఞాతీనాంమరణం దశాహమధ్యే శ్రుతంచే ద్దశాహ శేషేణశుద్ధిః । దశాహాదూర్ధ్వంతు మాసత్రయమధ్యేత్రిరాత్రం। తతష్షణ్మాసమధ్యేపక్షిణీ।తతస్సంవత్సరపర్యంత మేకరాత్రం సంవత్సరాదూర్ధ్వంతు స్నానమాత్రం । నవమాసాదూర్ధ్వంస్నానమాత్రమిత్యేకే ॥

తా. మరణించినదినము మొదలుకొని పదిదినములలోపల జ్ఞాతిమరణవృత్తాంతమునువినినయెడ శేషించినదినములయందు సూతకముపట్టవలెను. పదిదినములుగడిచిన వెనుక మూఁడునెలలలోపల వినినయెడ మూఁడుదినములును, అటుపైని ఆరునెలలలోపలవినినయెడ ౧౺ దినము, అటుతరువాత సంవత్సరము ముగియులోపల వినినయెడ నొకరాత్రియు సూతకము. సంవత్సరము అయినపిదప స్నానముతోసరి. మరణించిన తొమ్మిది మాసములకుపైన వినినయెడ స్నానమాత్రమని కొందఱు.

వా. త్రిరాత్రాశౌచినాంమరణం త్రిరాత్రమధ్యేశ్రుతంచే త్తచ్ఛేషేణ శుద్ధిః । త్రిరాత్రేఽతిక్రాంతే స్నానమాత్రం ॥

తా. త్రిరాత్రసూతకముగలవారుమూఁడుదినములలోపలవినినయెడల శేషించిన దినములయందుసూతకము. మూఁడుదినములుఅయినపిమ్మటవినినయెడ స్నానముతోసరి.

వా. పక్షిణ్యాశౌచినాం తు మరణం పక్షిణీమధ్యే శ్రుతంచే త్తచ్ఛేషేణశుద్ధిః । పక్షిణీకాలేఽతిక్రాంతేస్నానమాత్రం । యావజ్జీవం పక్షిణీత్యేకే ॥

తా. పక్షిణ్యాశౌచముగలవారు పక్షిణీమధ్యమున వినినయెడ మిగిలిన దినములందు సూతకము. అటుపిమ్మట వినినయెడ స్నానము. ఎప్పుడువిన్నను ౧౺ దినమని కొందఱు.

సూ. ఏకరాత్రాశౌచినా మేకరాత్రేఽతిక్రాంతే స్నానమాత్రం ॥

తా. ఏకరాత్రాశౌచముగలవారు, ఒకరాత్రిఅయినవెనుకవినినయెడ స్నానము.

వా. మాతాపితృవిషయే దత్తకన్యాయా దశాహాభ్యంతరే త్రిరాత్రం। తదూర్ధ్వంపక్షిణీతి ధర్మప్రవృత్త్యనుసారిణః. త్రిరాత్రేఽతిక్రాంతే స్నానమిత్యన్యే ॥



తా. వివాహితస్త్రీ తల్లిదండ్రుల మరణవార్తను ౧౦ దినములలోపలవినినయెడ మూఁడుదినములుసూతకము. అటుపిమ్మట వినినయెడ ౧౺ దినము అని ధర్మప్రవృత్తి. మరణించినపిమ్మట మూఁడుదినములకుపైన వినినయెడ స్నానముమాత్రమని కొందఱు.

వా. పుత్రికాభగినీభ్రాతృవిషయే తత్ప్రతియోగినాం దశాహాభ్యంతరేపక్షిణీ । తదూర్ధ్వమేకరాత్రమితి ధర్మప్రవృత్తిపక్షః । యావజ్జీవంపక్షిణీత్యపరః పక్షః । పక్షిణీకాలేతీతేస్నానమితితృతీయః ॥

తా. కూఁతురు-చెల్లెలు-అన్నదమ్ములు వీరు మరణించినపుడు వారిప్రతియోగినులకు పదిదినములలోపల పక్షిణ్యాశౌచము- అటుపిమ్మట వినినయెడ ఒక్కరాత్రియని ధర్మప్రవృత్తియందు జెప్పబడినది - ఎప్పుడువినినను పక్షిణియనికొందరు - పక్షిణ్యాశౌచము పట్టవలసినకాల మతిక్రమించినయెడస్నానముతోసరి అనిమఱికొందఱు సెప్పిరి.

## ప్రతియోగినులస్వరూపము.

శ్లో. మాతృష్వసృసుతాపుత్రౌ పితృష్వసృసుతస్త్రియా ।
స్వసా పితృవ్యపుత్రీ చ స్వస్రపుత్రీ పితృష్వసా ॥
భ్రాతృపుత్రీ చ దౌహిత్రీ పౌత్రీ తత్ప్రతియోగినా ।
స్త్రీపుంసౌ చ క్వచి త్ప్రోక్తే పక్షిణ్యాశౌచినౌ మిథః ॥

తా. పెద్దతల్లియొక్క పుత్రీపుత్రులును పిన్నతల్లియొక్క పుత్రీ పుత్రులును ఒకరికొకరు ప్రతియోగినులగుదురు; మేనత్తయొక్కపుత్రీపుత్రులును, మేనమామయొక్కపుత్రీపుత్రులును ఒకరికొకరు ప్రతియోగినులు, చెల్లెలికి-అక్క, అన్న, అక్కచెల్లెలు తమ్ముడు ప్రతియోగినులు; పినతండ్రికూఁతురికి పెదతండ్రిపుత్రీపుత్రులు ప్రతియోగినులు; మేనకోడలికి పినతల్లి మేనమామ వీరు ప్రతియోగినులు; మేనత్తకు, మేనల్లుఁడు మేనకోడలు వీరు ప్రతియోగినులు. భ్రాతృపుత్రికకు మేనత్త పినతండ్రి పెదతండ్రులు ప్రతియోగినులు; దౌహిత్రురాలికి తల్లితల్లి, తల్లితండ్రి ప్రతియోగినులు, మనుమరాలికి తండ్రితల్లి తాత వీరు ప్రతియోగిను లగుదురు; వీరలు మరణించినపుడు పరస్పరము ౧౺ దినము ఆశౌచముగలదు.

వా. పుత్రవిషయే చతుర్దశాహాదూర్ధ్వం సంవత్సరపర్యంతం త్రిరాత్రం తదూర్ధ్వం తు స్నానమాత్రం-ఏకరాత్రమితి కేచిద్వదంతి. అకృతక్రియే పుత్రే సంవత్సరాదూర్ధ్వమపి త్రిరాత్ర మస్తి ॥

తా. పుత్రుఁడు మరణించినపుడు ౧౦ దినములకుపైన సంవత్సరములోపల వినినయెడ తండ్రికి మూఁడుదినములాశౌచము; అటుపిమ్మట వినినయెడ స్నానమాత్రమని

కొందఱును, ఒకరాత్రియని మఱికొందఱును వచించిరి. పుత్రునికి పరలోకక్రియలు జరగనియెడ సంవత్సరానంతరముగూడ తండ్రికి మూఁడుదినములు సూతకము.

వా. సాపత్న్యమాతృమరణే సంవత్సరపర్యంతం త్రిరాత్రం సంవత్సరాదూర్ధ్వం యావజ్జీవం పక్షిణీ । తస్యా అకృతక్రియత్వే అనపత్యత్వే చ సంవత్సరాదర్వాగ్దశరాత్రం, తదూర్ధ్వం త్రిరాత్రం ఇదం చ సాపత్న్యమాతురాశౌచం త్రింశద్యోజన దేశవ్యవధానేఽపి భవతి ॥

తా. సవతితల్లి మరణించినపుడు ౧౦ దినములకుపైన సంవత్సరములోపల పుత్రునకు మూఁడుదినములాశౌచము; సంవత్సరమునకుపైన ఎప్పుడు వినినను పక్షిణ్యాశౌచము; సవతితల్లికి సంతానములేక పరలోకక్రియలు జరగకుండునపుడు సంవత్సరములోపల వినినను ౧౦ దినములును సంవత్సరమునకుపిమ్మట వినినయెడ మూఁడుదినములును ఆశౌచము. ఈసవతితల్లి ఆశౌచము ముప్పదియామడ దూరముననుండి వినినను కర్తలను విడువనేరదు.

వా. మాతాపిత్రోర్మరణే తయోరకృతక్రియత్వే చ యావజ్జీవం దశరాత్రం । కృతక్రియత్వే తు వింశతివర్షపర్యంతం దశరాత్రం । తదూర్ధ్వం తు త్రిరాత్రం । దశాహమధ్యే శ్రుతం చే త్తచ్ఛేషేణ శుద్ధిః ॥

తా. తల్లిదండ్రులు చనిపోయినపుడు వారికి ప్రేతక్రియలు జరగనియెడ తాను బ్రతికియుండుకాలములో నెప్పుడువినినను ౧౦ దినములాశౌచముకలదు. ప్రేతకృత్యములుజరిగినయెడ ఇరువది సంవత్సరములలోపల నెప్పుడువినినను పదిదినములు సూతకము; అటుపిమ్మట వినినయెడ మూఁడుదినములు; మరణించిన పదిదినములలోపల వినినయెడ మిగిలినదినములయందు మాత్రమే సూతకము.

## అనేకాశౌచ సన్నిపాతాశౌచ నిర్ణయము.

వా. సమయో స్సజాతీయయో శ్చాశౌచయోః పౌర్వాపర్యేణ సన్నిపాతే పూర్వాశౌచకాలేనైవ శుద్ధిః । విషమకాలయో స్సజాతీయయోరాశౌచయో స్సన్నిపాతే పూర్వం వా పరం వా యదధికకాలం తేనైవశుద్ధిః, అల్పమపి పూర్వాశౌచ ముత్తరాశౌచా ఘాధికకాలంచే దల్పేనైవ శుద్ధిః ॥



తా. సమానకాలముగలవియు, ఒక్కజాతిగలవియు నగు ఆశౌచములేకకాలంబున వచ్చినయెడ మొదటిదానినిమాత్ర మవలంబించవలయు. రెండవది అక్కఱలేదు. ఒక్కజాతిగల సూతకములే ఎచ్చుతక్కువ కాలము గలిగియుండిన, ఎక్కువకాలముగల సూతకమునుమాత్ర మవలంబించవలయు. మొదటవచ్చిన సూతకము కొంచెముకాలము గలదైనను, రెండవసూతకముయొక్క సగముకాలమునకు గొంచెమెక్కువకాలముగలిగియుండిన, మొదటవచ్చిన యల్పాశౌచమునే పట్టవలయు.

వా. విజాతీయయోర్యోగే సమేనవా ధికేనవా శావేన శుద్ధిః । సూతి రధికకాలా చే త్సూత్యాశౌచేన శుద్ధిః ॥

తా. జాత, మృత సూతకము లొక్కతూరి వచ్చినపుడు, మృతసూతకము సమానాధిక్యములుగలదైనను మృతసూతకమునే అవలంబించవలయు; జాతాశౌచ మధికకాలము గల్గియుండిన, జాతమునేపట్టవలయు.

వా. పూర్ణాశౌచస్య దశమదినే పునః పూర్ణాశౌచాంతరే ప్రాప్తే పూర్వస్మా త్పూర్ణాశౌచాదూర్ధ్వ ముత్తరాశౌచం దినద్వయం కుర్యాత్ । దశమదినస్యఅష్టమయామే సూర్యోదయాదర్వాగస్య స్మిన్ పూర్ణాశౌచేప్రాప్తే పూర్వస్మాదూర్ధ్వందినత్రయ ముత్తరాశౌచంకుర్యాత్ । మాతాపిత్ర్మరణాశౌచస్య ఆశౌచాంతరేణ యోగే పూర్వేణవా పరేణవా మాతాపిత్రాశౌచేన శుద్ధిః॥

తా. పూర్ణాశౌచముయొక్క పదియవదినంబున వేఱొక పూర్ణాశౌచముగలిగినయెడ, మొదటిదిపూర్తిఅయినవెనుక రెండవదానికి రెండుదినములు సూతకముపట్టవలయు; దశమదినాష్టమయామమునందు సూర్యోదయమునకు బూర్వమింకొకటికలిగినయెడ పిమ్మట రెండవదానికి మూఁడుదినములుపట్టవలయు. తలిదండ్రుల మరణాశౌచమధ్యమునందైనను, లేక వారిమరణమునకుముందైనను, వేఱొకసూతకము గలిగినయెడ మాతాపిత్రాశౌచమును మాత్రమే పట్టవలయు.

వా. దాహకస్య య ద్దహననిమిత్త మాశౌచం తస్యాశౌచాంతరేణయోగే దహనాశౌచేనశుద్ధిః ॥

తా. దహనముచేసినవానికి గలిగియుండు దహనసూతకమధ్యమున నింకొకసూతకముగలిగినయెడ మొదటిదానిచేతనే శుద్ధికలుగును.

వా. మాతాపిత్రోః పుత్రజన్మనిమిత్తాశౌచస్య ఆశౌచాంతరేణయోగే పుత్రజననాశౌచేనశుద్ధిః. పుత్రీజననేప్యేవమేవ. పితుః ప్రేతసం

స్కర్తృత్వే తు పూర్వేణవా పరేణవా ప్రేతాశౌచేనైవ పుత్ర జననాశౌచస్య నివృత్తిః। అసంస్కర్తృత్వే తు మృతాశౌచ మపి జననాశౌచేన శుధ్యతి। కేచిత్తు సంస్కర్తు రపి పుత్రజన నాశౌచమేవ ప్రబలమిత్యాహుః॥

తా. తల్లిదండ్రులకు బుత్రజననసంబంధ మగు పురుడు కలిగియుండునపుడు వేఱొకటివచ్చినయెడల మొదటిదానినిమాత్రమే అవలంబించవలయు; కూఁతురిజననమునందును పైప్రకారమే; తండ్రికిప్రేతసంస్కారము జేయునపుడుగాని అంతకుముందుగాని పుత్రజననాశౌచము గలిగినపుడు మృతసూతకమునుమాత్రమే అవలంబించవలయు; ప్రేతకృత్యములనొనర్చక ఆశౌచమునుమాత్రము పట్టియుండునపుడు పుత్రుఁడు గలిగినయెడ మొదటిదానినివిడిచి జాతాశౌచమునుపట్టవలయు; ప్రేతసంస్కారముల నొనర్చువానికిని పుత్రజననాశౌచము ప్రబలమని కొందఱు వచించెదరు.

వా. పితృమరణాశౌచమధ్యే మాతృమరణే పితు ర్దశాహాదూర్ధ్వం మాతుః పక్షిణీం కుర్యాత్। పితుస్సన్న్యాసే దుర్మరణే వా సపక్షిణీ। కింతు మాతృమరణాదారభ్య పూర్ణ మేవాశౌచంకుర్యాత్॥

తా. తండ్రిమరణించిన సూతకము గలిగియుండునపుడు తల్లిమరణముగలిగినయెడ, మొదటిసూతకముతీరినవెనుక రెండవదానికి ౧½దినము సూతకమునుపట్టవలయు. తండ్రి సన్న్యాసియై మరణించినను, దుర్మరణమునొందినను, సూతకముపట్టక మాతృమరణదినము మొదలు సంపూర్ణ సూతకముపట్టవలయు.

వా. మాతృమరణాశౌచమధ్యే పితృమరణే పితుః పూర్ణమేవాశౌచం కుర్యాత్। అనుగమనే తు దినాంతరమరణేఽపి మాతుః పక్షిణీనభవతి। కింతు తత్ర తంత్రేణైవ శుద్ధిః। అనుగమనంవినా దైవా న్మాతృమరణే పక్షిణీభవతి। సా చ దశమదినాత్ప్రాగేవ పితు ర్దశమదినే మాతృమరణే తు దినద్వయాధికం భవతి। అత్ర పక్షిణీమధ్యే దినద్వయమధ్యే చ పితు రేకాదశేఽహన్యేవ స్వతంత్రైకోద్దిష్టంకుర్యాత్। కర్తు స్తాత్కాలికీ శుద్ధిరస్తి॥

తా. తల్లిమరణసూతకము గలిగియుండునపుడు, తండ్రిమరణము జరిగినయెడ, మొదటిదానినివదలి రెండవదానిని సంపూర్ణముగ నవలంబించి తండ్రికిగ్రియలొనర్చి పిదప తల్లికి ౧½దినముసూతకముపట్టి క్రియలొనర్చవలయు; తల్లియనుగమనముచేసి తండ్రితోగూడ మృతినొందినను, ఇంకొకదినమునమృతినొందినను, ఈ ౧½దినముగూడ



అక్కరలేదు. తంత్రమువలన శుద్ధిగలుగును; పితృమరణమునం దనుగమనముచేయక, తొమ్మిది దినములలోపల దైవయోగమువలన తల్లి మృతినొందినయెడ, తండ్రికి గ్రియలొనర్చినవెనుక తల్లికి ౧½దినముసూతకముపట్టి క్రియలొనర్చవలయు; తండ్రిచనిన పదియవనాఁడు తల్లి మరణించినయెడ, రెండుదినములుపట్టవలయు, మాతృవిషయమై చెప్పిన రెండు విధులయందును, తాత్కాలిక శుద్ధిగలదు గనుక, తండ్రికి ఏకాదశాహమునందే ఏకోద్దిష్టమును స్వతంత్రముగనే చేయవచ్చును.

వా. పితృమరణాశౌచమధ్యే దేశాంతరగతిమాతృమరణశ్రవణే మాతరి కృతక్రియాయా ముభయో స్తంత్రేణ శుద్ధిః। అకృతక్రియాయాం తు పితృదశాహాదూర్ధ్వం మాతుః పక్షిణీం కుర్యాత్॥

తా. తండ్రిమరణసూతకము గలిగియుండునపుడు పరదేశమునందు తల్లిమరణము జరిగినట్టు తెలిసి, యాతల్లికిఁ బ్రేతక్రియలు జరిగియుండిన, రెంటికిని తంత్రమువలన శుద్ధిగలుగును. తల్లికి క్రియలుకాకుండినయెడ- తండ్రియొక్క పదిదినములు సూతకము తీరినవెనుక తల్లికి ౧½దినమునూతకముపట్టవలయు —తల్లిమరణసూతకము గలిగియుండునపుడు, పరదేశమునఁ దండ్రిమరణముజరిగినట్టు వినినయెడ నదిమొదలుకొని పదిదినములు తండ్రికి సూతకముపట్టవలయు.— తల్లిదండ్రులు పరదేశమున నేకకాలంబున మరణించిరని వినినయెడ రెంటికిని తంత్రమువలన శుద్ధిగలుగును,

వా. అతిక్రాంతవర్తమానయోస్సన్నిపాతే వర్తమానేనాతిక్రాంతస్య శుద్ధిః। అతిక్రాంతస్యకాలాధిక్యే త్వతిక్రాంతేనైవ వర్తమానస్య శుద్ధిః। ఏవందాహకస్యాతిక్రాంతాశౌచేనైవ వర్తమానస్య శుద్ధిః। మాతృవిషయేతు నాయంవిధిః। కింతుపూర్వోక్త మేవపూర్ణం॥

తా. అతిక్రాంత వర్తమానాశౌచము లేకకాలంబున గలిగినయెడ వానిలో నధికకాలముగలదాని నవలంబించవలయు, దాహకునకు అతిక్రాంతము సంభవించినయెడ, వర్తమానసూతకము పనిలేదు. తల్లిదండ్రులవిషయమై యట్లుగాక, పూర్వోక్త ప్రకార మాచరింపవలయు.

దేశాంతరమనఁగా— అరువదిఆమడ వ్యవధానముగలది అనికొందరును నలువదియనికొందరును, ముప్పదియనికొందరును వచించిరికావున దేనినైన గ్రహింపవచ్చును. (కొంచెము దూరముగలిగి మహానదులు పర్వతములు నడుమనున్నను దేశాంతర మనిపించుకొనదు.)

ఆత్మబంధువివరణము:— ఆత్మపితృష్వసుఃపుత్రాఆత్మమాతృష్వసుస్సుతాః। ఆత్మ మాతులపుత్రాశ్చ విజ్ఞేయా ఆత్మబాంధవాః॥

తా. మేనత్త, ఆమెపుత్రులు, పినతల్లి, పెదతల్లి, వారిపుత్రులు, మేనమామ ఆయనకొడుకు, వీరు ఆత్మబంధువులు.

పితృబంధువులు—పితుఃపితృష్వసుః పుత్రాః పితుర్మాతృష్వసుస్సుతాః ।
పితుర్మాతులపుత్రా శ్చ విజ్ఞేయాః పితృబాంధవాః ॥

తా. తండ్రి మేనత్త, ఆమెపుత్రులు, తండ్రిపిన్నతల్లి పెద్దతల్లులు, వారిపుత్రులు, తండ్రిమేనమామ, ఆయన కొడుకులు, వీరు పితృబంధువులు.

మాతృబంధువులు—తల్లిమేనత్త, ఆమెపుత్రులు, తల్లిపిన్నతల్లి పెదతల్లులు, వారిపుత్రులు, తల్లిమేనమామ, ఆతనికొడుకులు వీరు మాతృబంధువులు.

ఆశౌచానంతరకృత్యము.

వా. ఆశౌచాంతే సంగవే స్నాత్వా బ్రాహ్మణో హస్తాభ్యా ముదకం స్పృష్ట్వా శుధ్యతి। క్షత్రియో వాహన మాయుధం వా స్పృష్ట్వా శుధ్యతి। వైశ్యః ప్రతోదం రశ్మిం వా శూద్రో యష్టిమితి ॥

తా. సూతకదినములు గడచినవెనుక స్నానముచేసి యుదకమును స్పృశించుటచే బ్రాహ్మణుఁడును, వాహనమునుగాని ఆయుధమునుగాని తాఁకుటచే క్షత్రియుఁడును, కోలనుగాని త్రాడునుగాని తాఁకుటచే వైశ్యుఁడును, కఱ్ఱను దాఁకుటచే శూద్రుఁడును పరిశుద్ధులగుదురు.

శ్లో. ఆశౌచాంతే తు సంప్రాప్తే గోమయాది విలేపనైః ।
గృహశుద్ధి ర్విధాతవ్యా పుణ్యాహంచైవ వాచయేత్ ॥

తా. సూతకదినములు కడచినవెనుక గోమయాదులచే గృహమును శుద్ధిచేసి స్నానాదులచేఁబరిశుద్ధులై పుణ్యాహవాచనమును జరిగింపవలయు.

శ్రాద్ధకర్తృ నిరూపణము—పుత్రః పౌత్రః ప్రపౌత్రశ్చపుత్రికాపుత్రఏవ చ।
పత్నీ భ్రాతా చ తజ్జ శ్చ పితా మాతా స్నుషా తథా ॥
భగినీ భాగినేయ శ్చ సపిండో ధనహార్యపి ।
అసన్నిధానే పూర్వేషా ముత్తరే పిండదః స్మృతః ॥

తా. పుత్రుఁడు, పౌత్రుఁడు, ప్రపౌత్రుఁడు, దౌహిత్రుఁడు, భార్య, అన్నదమ్ముఁడు, వానికొడుకు, తండ్రి, తల్లి, కోడలు, చెల్లెలు, ఆమెకొడుకు, సపిండుఁడు, సొత్తునుపొందినవాఁడు, వీరలు, మరణించినవానికి శ్రాద్ధక్రియలయందు, ఒకరివెనుక నొకరు కర్తలగుదురు. (అనగా, చనిపోయినవానికి పుత్రుఁడులేకుండిన పౌత్రుఁడును, పౌత్రుఁడులేకుండిన ప్రపౌత్రుఁడును అనియీక్రమంబున నెరుంగునది.

ఇతి శ్రీమానవధర్మచంద్రికాయాం, ఆశౌచ నిరూపణాన్నామ
ఏకాదశోఽధ్యాయః

---

*

ద్వాదశాధ్యాయము.

# ఆయుర్వేద చికిత్సా సంగ్రహము

శ్లో. త్రివర్గసాధనం దేహ మగదం తత్భవే ద్యది ।
చికిత్సిత మవిజ్ఞాయ నరో రక్షితు మక్షమః ॥

శ్లో. అయి ! క్రియార్థంసులభంసమిత్కుశం, అపిస్వశక్త్యాతు తపఃప్రవర్తతే।
జలాన్యపిస్నానవిధిక్షమాణి, శరీర మాద్యంఖలు ధర్మసాధనం ॥

తా. శరీరము రోగరహితమగునేని తపోధ్యాన క్రియాదులచే ధర్మార్థకామమోక్షములను సాధింపవచ్చును; రోగసహితంబైనయెడల మనుజుఁడు సత్క్రియలఁజేయుట కసమర్థుఁడై పాపమునుబొందును; కావున పురుషార్థములఁగోరువాఁడు శరీరమును రోగపూరితము గానీయక ఆయుర్వేదమును బాగుగనెఱింగి చికిత్సలచే శరీరమును రక్షించుచుండవలయు.

సద్వైద్యప్రశంస.

శ్లో. గురోరధీతాఖిలవైద్యవిద్యః పీయూషపాణిః కుశలః క్రియాసు ।
గతస్పృహోధైర్యధరఃకృపాలు శ్శుద్ధోఽధికారీ భిషగీదృశస్స్యాత్ ॥

తా. శాస్త్రానుభవ లోకానుభవములుగలిగిన వైద్యశ్రేష్ఠుం డగునాచార్యునొద్ద వైద్యవిద్య నభ్యసించినవాఁడును, అమృతహస్తముగలవాఁడును, చికిత్సాదులయందు సమర్థుండును, ఆశారహితుండును, ధైర్యముగలవాఁడును, దయాస్వభావుఁడు నగునిట్టివైద్యుఁడు చికిత్సచేయుటకుఁ బరిశుద్ధుఁడైనయధికారియగును.

కువైద్యగర్హణము.— న ధాతో ర్విజ్ఞానంనచపరిచయోవైద్యకనయే
న రోగాణాంతత్త్వావగతి రపి నో వస్తుగుణధీః ।
తథాప్యేతే వైద్యాఇతి తరలయంతో జడజనా
నసూనృతోర్భృత్యాఇవ వసు హరన్తే గదజుషాం॥

తా. కొందరుమూఢులు నాడీపరీక్షాక్రమమును, వైద్యశాస్త్రమును, రోగతత్వమును, పదార్థగుణములను, ఎఱుంగక, వైద్యులనిపేరుపెట్టుకొని తెలియనివారినిభ్రమింపఁజేయుచు, మృత్యువునకుదూతలై రోగులప్రాణములను ధనమునుఅపహరింతురు.

శ్లో. మిథ్యౌషధైర్ఘ్నంతి మృషాకషాయై రసహ్యలేహ్యైరయథార్థతైలైః
వైద్యాఇమే వంచితరుగ్ణవర్గాః పిచండభాండంపరిపూరయంతి ॥

తా. కువైద్యులు శాస్త్రమునందుఁ జెప్పని యబద్ధపుమందులచేతను, అబద్ధపు కషాయములచేతను, అసహ్యము లగు లేహ్యములచేతను, అబద్ధపుతైలములచేతను చికిత్సలు సేసి రోగులను వంచించి పొట్టనిండించుకొనుచున్నారు, అయ్యో!

కువైద్యబహిష్కరణము.

శ్లో. య శ్శాస్త్రమనుపరిజ్ఞాయ చికిత్సామివనాటయేత్ ।
ఉపాచరతి తం త్యక్త్వా ద్భిషజం గరళోపమం ॥

తా. శాస్త్రము నెఱుంగక, తాఁజేయుచికిత్సలను శాస్త్రోక్తము లైనవానివలె నటింపఁజేయుచు రోగులకుఁ జికిత్సించు కువైద్యుఁడు విషతుల్యుఁడుగనుక వానినివిడువవలయు.

శ్లో. వైద్యరాజ నమస్తుభ్యం యమరాజసహోదర ।
యమ స్తు హరతి ప్రాణా న్వైద్యః ప్రాణా న్ధనాని చ ॥

తా. యమునితమ్ముఁడవగునో వైద్యుఁడా! యముఁడు ప్రాణమునుమాత్రము హరించును, నీవన్ననో ప్రాణములను ధనమును హరించెదవు, నీ కొక నమస్కారము.

నాడీపరీక్షాక్రమము.

శ్లో. నాడీజ్ఞానం వినా వైద్యో న లోకే పూజ్యతాం వ్రజేత్ ॥
అత శ్చాతిప్రయత్నేన శిక్షయే ద్బుద్ధిమా న్నరః ॥

తా. నాడిని తెలియనివైద్యుఁడు రోగముల నెఱుంగఁజాలఁడు ; కావుననట్టివాఁడు లోకమునఁబూజింపఁబడఁడు; అట్లగుటంజేసి బుద్ధిమంతుడగువాఁ డతిప్రయత్నముతో నాడి నభ్యసించవలయు.

శ్లో. స్థిరచిత్తః ప్రసన్నాత్మా మనసా చ విశారదః ।
స్పృశే దంగుళిభి ర్నాడీం జానీయా ద్దక్షిణే కరే ॥

తా. వైద్యుఁడు-చిత్తము నటునిటు బోనీయక, నిర్మలమనస్కుఁడై రోగియొక్క కుడిహస్తమున అంగుష్ఠమూలము (బ్రొటనవ్రేలి) క్రిందుగా తన తర్జనీ మధ్యమానామికాంగుళుల నునిచి నాడిని మనస్సుచే బాగుగ నెఱుంగవలయు.

నాడీపరీక్షాసమర్థుఁడు.

శ్లో పీతమద్య శ్చంచలాత్మా మలమూత్రాదివేగయుక్ ।
నాడీజ్ఞానే ఽసమర్థ స్స్యా ల్లోభాక్రాంత శ్చ కాముకః ॥

తా. మద్యపానము చేసినవాఁడును, చపలచిత్తుఁడును, మలమూత్రాది బాధగలవాఁడును, దురాశాపరుఁడును, కామాతురుఁడు నగు వైద్యుఁడు నాడి నెఱుంగఁజాలఁడు కావున వైద్యుఁడు పరిశుద్ధుఁడై స్థిరచిత్తము కలిగియుండవలెను.



వైద్య దూత శుభాశుభశకునము.

శ్లో. సమాహ్వానాయ వైద్యస్య గచ్ఛతో ఽశుభ మీరితం ।
వైద్యగేహే శుభం చైత ద్విపరీతం తు వైద్యకే ॥

తా. వైద్యునిబిలువఁబోవుదూతకు ద్వారమున అశుభశకునము మంచిది. వైద్యునిగృహము ప్రవేశించినపుడు వైద్యునియొక్క నిద్ర, కోప చింతా, కఠినభాషణ, రోదన, శ్రాద్ధ, దిగంబరత్వాది సమయములు గాక, శుభసమయ శకునములుగలిగిన, రోగికి ఆరోగ్యముగలుగును. చికిత్స చేయుటకై రోగియొద్దకుఁబోవువైద్యునకు, ఇల్లు వెడలునపుడు, తుమ్ములు-రోదనము - గద్ద-గుడ్లగూబ మొదలగుపక్షులధ్వనులు, కలహము-దుర్గంధవస్తువులు-కట్టెలు-బెల్లము-నల్లనిధాన్యములు-తైలాదులు- ఆయుధపాణులగుపురుషులు-అపానవాతము విడుచువాఁడు-అంధుఁడు- కుంటివాడు- మొండివాఁడు చండాలుఁడు- ఉన్నట్లుండి ఇండ్లు మేడలు ధ్వజములు నిల్లకడవలు ఇవివిరిగిపడుట- పాము-కోఁతి-ఉడుము-తొండ-పిల్లి ఇవి అడ్డముగాఁబోవుట, వైద్యునికి ద్వారబంధనాభిఘాతముగలుగుట మొదలగు అపశకునంబులు గాక- ఆవులు, బ్రాహ్మణులు, వేశ్య, కన్యపడుచు, బాలురు, రాజులు, గుఱ్ఱము, ఏనుఁగు, పెరుగు, మద్యము, మాంసము ఛత్రచామరాదులు, గానము ఇట్టిశుభశకునంబులుగలిగి, రోగియొక్క ఇల్లుప్రవేశించునప్పుడు ద్వారంబున శుభవస్తుదర్శనము గాకుండిన, రోగికి ఆరోగ్యము గలుగును.

దూతలక్షణము —శుక్లాంబరాః ఫలకరా దూతా శ్చ ప్రియవాదినః ।
అద్వితీయా శ్చ భక్తా శ్చ వైద్యాహ్వానే ప్రపూజితాః ॥

తా. తెల్లనివస్త్రములధరించినవారును, పండ్లు పుష్పములు మొదలగు వానిని హస్తముననుంచుకొనినవారును, మంచిమాటలాడెడివారును, తనతోకూడ ఎవ్వరును లేక ఒంటరిగవచ్చువారును, వైద్యునియందుభక్తిగలవారు నగు దూతలు వైద్యునిఁబిలుచుటకు దగినవారగలు. కుంటివాఁడు - గ్రుడ్డివాఁడు-ఆయుధపాణి- దండధరుఁడు-రోగి-రక్తమాల్యాంబరగంధానులేపనముగలవాఁడు-స్త్రీలు-ముసలివారు - తడివస్త్రమును ధరించినవారు-దూరమునుండి పిలుచువాఁడు- ముక్కును తాఁకుచుండువాఁడు- నఖదంతముల గొరుకువాఁడు-గడ్డమొపును మోసికొనినవాఁడు- నపుంసకులు-సన్యాసులు ఇట్టివారు వైద్యుని బిలచుట కనర్హులు.

నాడీస్థానములు.

శ్లో. నాడ్యో ఽష్టౌ స్థానే పాణి పాత్కంఠ నాసోపాంతసమాశ్రితాః ।
పాదయో ర్హస్తయో ర్ఘ్రాణమూలయోః కంఠమూలయోః ॥

తా. మనుష్యునకు నాడి తొమ్మిదిస్థానములయందుండును; అందు హస్తనాడి-బొటనవ్రేలిక్రిందుగ మణికట్టులయందును, పాదనాడి-చీలమండలక్రిందుగను, కంఠనాడి మెడకిరుప్రక్కలయందును, నాసానాడి-నాసికామూలములయందును ఉండును. జ్వరమును, అజీర్ణమును, వాత పిత్త శ్లేష్మప్రకోపమును, ఆమదోషమును హస్తనాడిని పట్టియు; జ్వరమువిడుచుటను, శరీరము తేలికగనుండుటను, ఆయుష్యమును పాదనాడినిపట్టియు; ఆగంతుకజ్వరమును, దప్పిని, ఆయాసమును, మైథునమును, భయము మొదలగువానిని కంఠనాడినిపట్టియు; చావును, బ్రతుకును, నేత్ర శిరః కర్ణముఖ రోగములను నాసికానాడినిపట్టియు చూడవలయు.

## వాతాదినాడీపరీక్ష.

శ్లో. వాతపిత్తానిలద్వంద్వ సన్నిపాతాదికాని చ ।
నాడీగత్యావిజానీ యా త్తతఃకుర్యా చ్చికిత్సితం ॥

తా. వాత-పిత్త-శ్లేష్మ-ద్వంద్వ-సన్నిపాతాదిరోగములను నాడీగమనమునుపట్టి తెలిసికొని వైద్యుఁడగువాఁడు చికిత్సచేయవలయు.— వాతనాడిగమనము వంకరగను పైత్యనాడి. చపలముగను, కఫనాడి స్థిరమై సూక్ష్మముగనునుండును. ఈనాడులు ప్రకోపించినపుడు తర్జనివ్రేలిక్రింద వేగముగఁగొట్టుచుండిన వాతప్రకోపమనియు, మధ్యమాంగుళిక్రింద వేగముగగొట్టిన-పిత్తప్రకోపమనియు, అనామికాంగుళిక్రింద వేగముగఁ గొట్టిన-శ్లేష్మప్రకోపమనియు, ద్వంద్వలక్షణములుగలిగినయెడల ద్వంద్వరోగమనియు, నానావిధలక్షణములుగలిగి దృశ్యాదృశ్యముగనుండిన సన్నిపాతమనియు నెఱుంగవలయు.—వాతాధిక్యమున నాడి పామువలె వంకరగను, మిక్కిలిప్రకోపించినపుడు-బిగించబడిన తంతివలెనునుండును.— పిత్తాధిక్యమున నాడి చపలమై కాకివలె నడుచును.—శ్లేష్మాధిక్యమున నాడి కప్పవలెను కొంగవలెను. మిక్కిలిప్రకోపించినపుడు కోడివలెను, హంసవలెను మెల్లగనడుచును. —వాతపిత్తద్వంద్వమున కప్పవలెను పామువలెను పలుమారు నాడినడుచును-వాతశ్లేష్మద్వంద్వమున రాయంచ, పాము వీని వలె నాడి నడుచును.— పిత్తశ్లేష్మద్వంద్వమున-నెమలి-కప్ప వీనివలె నాడి నడుచును.— మృత్యునాడి శిథిలమై మందమై నిలచినిలచియు, క్రమముగ నన్నినాడులు స్థానము దప్పియునడుచును.— అజీర్ణమునందు నాడి కఠినముగ నిండినట్టుగను నాడులుఅన్నియు కలిసి జడముగను నడుచును- నాడి ఉదయకాలమున ౧౦ ది గడియలకు లోగా శ్లేష్మగతిగలదై యుండును- పిదప ఇరువదిగడియలవఱకు పైత్యగమనముగలదియగును. అటుపిమ్మట సాయంకాలమువఱకు వాతగమనముగలదియగును. అర్ధరాత్రియందునాడి, పైత్యగమనము గలిగియుండును.



## వాతపిత్తశ్లేష్మ శరీరస్పర్శ వర్ణములు.

వాతరోగిశరీరము కొంచెమువేఁడిగను, నల్లగను, పిత్తరోగిశరీరము మిక్కిలిఉష్ణముగను, లేకమిక్కిలిశీతలముగను, పసుపువన్నెయు, లేక ఎరుపువన్నెయుగలిగియును, శ్లేష్మరోగిశరీరము కొంచెముశీతలముగను, తెల్లగను, ద్వంద్వరోగిశరీరము ద్వంద్వలక్షణములు గలిగియునుండును.

## వాతపైత్యశ్లేష్మరోగి స్వరభేదములు.

వాతరోగమున మాటలు సమముగను—పైత్యరోగమున ప్రలాపము నవ్వు వీనితోడను—శ్లేష్మరోగమున హీనస్వరముతోడను—ద్వంద్వరోగమున ద్వంద్వలక్షణములతోడను గూడియుండును.

## జిహ్వా పరీక్ష.

వాతాధిక్యముగలరోగి నాలుక, పసుపువన్నెయు ముండ్లును గలిగి పగిలినట్లుండును. పైత్యాధిక్యమున ఎరుపుకలసిన నలుపుగలదియగును. శ్లేష్మాధిక్యమున తెల్లగను దళముగను, ద్రవముగలదిగనునుండును.— సన్నిపాతాధిక్యమున నల్లగను-లేక-తెల్లగను- ముండ్లుబారియునుండును.

## మూత్రపరీక్ష.

అరుణోదయంబున రోగియొక్కమూత్రము మొదటిధారనువదలి మధ్యధారను ఒకగాజుపాత్రయందుఁబట్టుకొని యెండయందుంచి ఆమూత్రమందు గరికిపోచతో నొకనూనెబొట్టును వేసిచూచిన రోగసాధ్యాసాధ్యంబుల నెరుగవచ్చును.—

గాజుపాత్రయందుఁబట్టినమూత్రము- ఎరుపువన్నెగలిగియుండిన వాతరోగము. పసుపువన్నెగలిగియుండిన పైత్యరోగము. తెలుపువన్నె బరువుగలిగియుండిన శ్లేష్మరోగము అని తెలియవలయు. పొగవన్నె (లేక) ఎరుపువన్నెగలిగిన వాతరోగము, నురుగు ఎరుపుగలసిన తెలుపువన్నెగలిగిన వాతశ్లేష్మము, పసుపుగలిసిన తెలుపువన్నె నురుగు గలిగిన పిత్తశ్లేష్మము. సర్వలక్షణములుగలది త్రిదోషముఅని తెలియవలయు.

తైలబిందువు-మూత్రమునందంతట వ్యాపించిన-వాతరోగము. బుగ్గలుగలేచిన-పైత్యరోగము. చిన్నచిన్నబిందువులై ఆకారములఁదాల్చెనేని శ్లేష్మరోగము అని తెలియవలయు.— బిందువు మూత్రమున తేలక మునిగినయెడల రోగము అసాధ్యంబగును. మునుఁగక అంతటవ్యాపించిన సాధ్యము, పొడవుగా బుగ్గలుగాలేచిన కష్టసాధ్యము అగును.

మూత్రమునందువేసిన తైలబిందువు-ఛత్ర, చామర, పద్మ, శంఖ, వీణా, కుండల, దర్పణ, పీఠాద్యాకారములఁదాల్చిన రోగముసాధ్యంబగును. వృషభ, సింహ,

వరాహ, కూర్మ, సర్ప, వానర, వృశ్చిక, కుక్కుటాద్యాకారములను, శస్త్ర ఖడ్గ వజ్ర ముసలాద్యాయుధాకారములను దాల్చిన రోగి బ్రదుకఁడు.

మూత్రమందలి తైలబిందువు, తూర్పుప్రక్క విశేషవ్యాప్తిగలిగినమంచిది. దక్షిణమున విశేషవ్యాప్తిగలిగిన శీఘ్రకాలమునందు జచ్చును. పశ్చిమోత్తరములయందు వ్యాపించిన మాసమునకుపైన మరణించును. చింపులతోఁగూడి నిర్భృతిమూలను వాయవ్యమునను వ్యాపించిన నతిశీఘ్రముగమరణించును. మేఁడలు-హంసాదులతోఁగూడిన తటాకము-తోరణము-ఛత్రచామరాదులు వీనియాకారమును దాల్చిన-రోగమునివర్తించి చిరకాలముబ్రదుకును.

## రోగ అశుభ తిథి వార నక్షత్రములు.

భరణి-ఆర్ద్రి ఆశ్లేష-మఖ-పుబ్బ-స్వాతి-విశాఖ-మూల-పూర్వాషాఢ-శతభిషము పూర్వాభాద్ర-ఈనక్షత్రములును, ఆదివారము-మంగళవారము-శనివారము ఈవారములును, పాడ్యమి-చవితి-షష్ఠి-నవమి-ద్వాదశి ఈతిథులును ఒకటిగ కలసియుండు దినమున జ్వరము వచ్చినయెడ జీవించుట దుర్లభము.

## శుభాశుభనక్షత్రములు.

కృత్తిక-ఆశ్లేష ఈనక్షత్రములయందు వచ్చినజ్వరము ౯ రాత్రులును, రోహిణియందు ౩ రాత్రులును, మృగశిర-పునర్వసు-పుష్యమి-హస్త వీనియందు ౭ రాత్రులును, పుబ్బ-స్వాతి-శ్రవణము వీనియందు ౨ మాసములును, ఉత్తర-చిత్త-జ్యేష్ఠ-మూల-పూర్వాషాఢ-ధనిష్ఠ-వీనియందు ౧౫ రాత్రులును, విశాఖ-ఉత్తరాషాఢ-వీనియందు ౨౦ రాత్రులును, అనూరాధ-శతభిషము-రేవతి వీనియందు ౧౦ రాత్రులును, పూర్వాభాద్రయందు ౧౯ రాత్రులును, ఉత్తరాభాద్రయందు ౧౪ మాసమును, అశ్వినియందు ౧ రాత్రియు, పీడించును. భరణి, ఆర్ద్రి, మఖ ఈనక్షత్రములయందు జ్వరమువచ్చినయెడల మరణము గలుగును.

---

# జ్వరలక్షణములు చికిత్సలును.

వాతజ్వరమునందు—శరీరమున వేడిమి-గగుర్పాటు - నడుమున సత్త్వహీనత-శోష-వాంతి-శ్వాసము-దురద-మూత్రమున పసుపువన్నె - నోటియందు తియ్యఁదనము-ఆవులింతలు-ఒడలువిరుపు - అరుచి - మలమూత్రనిరోధంబును గలిగియుండును.

వాతజ్వరచికిత్స—తిప్పతీఁగ-కటుకరోహిణి-సొంటి - అగరుసొంటి. నేలవేము - దురదగొండివేరు-కచ్చూరములు-కరకవువ్వ-గంటుబారంగి-తామరగడ్డలు - వీనిని సరిపాళ్లుగజేర్చి ౮ వ పాలు మిగులునట్లు కషాయము కాఁచియిచ్చినయెడల వాతజ్వరములన్ని మానును.

—తెల్లసుగంధిపాలవేళ్లు - రేణుకవిత్తులు - దీపదార్షిఁ-పిప్పళ్లు - పెద్దసోపు-వీనినిసమభాగములుగజేర్చి కషాయముకాఁచి దానిలో బ్రాఁతబెల్లమునుగాని చక్కెరనుగానిచేర్చియిచ్చిన వాతజ్వరము మానును.

పిత్తజ్వరమువందు—తలనొప్పి, హస్తపాదములయందును శరీరమునందును, మంటలు-ఒడలుతిరుగుట- అరుచి-శరీరముఉష్ణముగను మూత్రము ఎఱ్ఱగను నుండుట-ముఖముఎండుట - అధికసంభాషణము-అగ్నిమాంద్యము-దుస్స్వప్నములు ఇవికలుగును.

పిత్తజ్వరచికిత్స—పర్పాటకము - సొంటి-రక్తచందనము - వట్టివేళ్లు వీనినిసమభాగములుగఁజేర్చికషాయముకాఁచియిచ్చినపిత్తజ్వరముమానును.

—పర్పాటకము- నేలవేము - అడ్డసరము - దురదగొండివేరు - కటుకరోహిణి- బ్రేంకణపువేళ్లు వీనినిసమభాగములుగగ్రహించి కషాయముకాఁచి చక్కెరజేర్చియిచ్చిన పిత్తజ్వరము మానును.

శ్లేష్మజ్వరమున—తలనొప్పి- ఒడలుమెఱుఁగుగలిగియుండుట- నోటియందు తియ్యఁదనము-తాపము-అగ్నిమాంద్యము-దగ్గు-రొంజు- గొంతుఎండుట- గొంతులోగుర్గురుమనుట- శరీరముపచ్చనగుట - అతిసారము కలుగును.

శ్లేష్మజ్వరచికిత్స—కరక తాండ్ర యుసిరికలు- తిప్పతీఁగె-కటుకరోహిణి-చేఁదుపొట్ల-అడ్డసరవుఆకు-కచ్చూరములు వీనిని సమభాగములుగఁ జేర్చి కషాయముకాఁచి తేనెగలిపియిచ్చిన శ్లేష్మజ్వరము మానును.

—సొంటి-చల్లపిల్లిగడ్డలు, నేలవేము, వాకుడు, వేఁపపట్ట, తిప్పతీఁగ, కచ్చూరములు, పిప్పళ్లు, వీనిని సమభాగములుగఁజేర్చి కషాయముకాచియిచ్చిన శ్లేష్మజ్వరముమానును.

వాతపిత్తజ్వరమునందు—తలనొప్పి, ముఖము గొంతు ఎండుట, భ్రమము, గగుర్పాటు, కీళ్ళనొప్పులు, మూర్ఛ, తాపము, దప్పి, ఆవులింతలు వాంతి ఇవికలుగును.

వాతపిత్తజ్వరచికిత్స—నేలవేము, పర్పాటకము, సొంటి, తిప్పతీగ,

తుంగగడ్డలు, వీనిని సమభాగములుగఁజేర్చి కషాయముఁకాఁచియిచ్చినవాతపిత్తజ్వరము మానును.

శ్లేష్మవాతజ్వరమునందు—కీళ్ళనొప్పులు, తలబరువు, తలనొప్పి, తాపము, దగ్గు, పీనసము, కండ్లనీరుగారుట, దేహముబంకగనుండుట, కొంచెముచేమటపట్టుట, వాంతి, సర్వావయవములయందు వేదనఇవికలుగును.

శ్లేష్మవాతజ్వరచికిత్స—సొంటి, తామరగడ్డలు, తిప్పతీఁగ, నేలములక, ఇవిసమభాగములువీని కషాయమువలన కఫవాతజ్వరముమానును.

—దశమూలములను, అనఁగా-ముయ్యాకుపొన్న, కోలపొన్న, చిన్నములక, పెద్దములక, పల్లేరు, మారేడు, తక్కలి, దుందిలము, నేలగుమ్ముడు, కలిగొట్టు వీనివేళ్ళను సమాంశములుగ జేర్చి కషాయముకాఁచి పిప్పలిచూర్ణమును జేర్చియిచ్చిన కఫవాతజ్వరము మానును.

పిత్తశ్లేష్మజ్వరమునందు—కునుకుపాట్లు, అరుచి, దగ్గు, తాపము, నోరుచేఁదుగనుండుట, కంఠమున కఫముకట్టుట, నోరు అంటుకొన్నట్లుండుట వాంతి, నిద్రలేమి, మూత్రము ఎఱ్ఱగ తెల్లగవచ్చుట, కన్నులకు నల్లగ పచ్చగ గన్పట్టుట ఇవికలుగును.

పిత్తశ్లేష్మజ్వరచికిత్స— సొంటి, చేఁదుపొట్ల, నేలవేము, దురదగొండి, వాకుడు, కొడిశవిత్తులు, శ్రీగంధము, గంటుబారంగి, కటుకరోహిణి, తుంగగడ్డలు, తిప్పతీఁగ వీనిని సమాంశములుగఁగూర్చి కషాయముకాఁచియిచ్చిన, పిత్తశ్లేష్మజ్వరము మానును.

—తిప్పతీఁగె, చేఁదుపొట్ల, కటుకరోహిణి, రక్తచందనము, అగరుసొంటి, చాగవేరు, వీనిని కషాయముకాచియిచ్చిన పిత్తశ్లేష్మజ్వరముమానును.

ఏకాహికజ్వరమునకు— అడ్డసరపుఆకు, కరక్కాయ, తానికాయ, ఉసిరికవరుగు, చేఁదుపొట్ల, వేఁపపట్ట, రేలగుజ్జు, ద్రాక్షపండు వీనిని కషాయమునిచి చక్కెర తేనెకలిపి యిచ్చిన ఏకాహికజ్వరము మానును.

మహాపాశుపతాస్త్రరసము— శుద్ధిచేసిన కఫరి ౧ పాలు, నేపాళములు ౧ పాలు, ఇంగిలీకము ౧ పాలు, ఉల్లిపాషాణము ౨ పాళ్లు, వీని నొకయామము నల్లయుమ్మెత్తాకురసంబున మెత్తగనూరి పెసరగింజలంత



మాత్రలుచేసి అల్లపురసముతో పూఁట కొకమాత్రయిచ్చిన, ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక జ్వరములు మానును.

త్ర్యాహికజ్వరమునకు—సొంటి, దనియాలు, వట్టివేళ్లు, తిప్పతీఁగ రక్తచందనము, తుంగగడ్డలు వీనినికషాయముకాఁచి చక్కెరకలిపియిచ్చిన త్ర్యాహికజ్వరము మానును.

చాతుర్థికజ్వరమునకు— సొంటి, కరకపిందెలు, ముయ్యాకుపొన్న, దేవదారుపట్ట, అడ్డసరపుఆకు ఉసిరికఒలుపు వీనిని కషాయముకాఁచిదించి తేనె శర్కర కలిపియిచ్చిన చాతుర్థికజ్వరముమానును.

అస్థిగతజ్వరమునకు—చేదుపొట్ల, కటుకరోహిణి, తుంగముస్తెలు, వెలుమసంధి, సొంటి, పాపరవేళ్లు ఇవి సమభాగములుగాఁగూర్చి కషాయముకాఁచియిచ్చిన అస్థిగతజ్వరము మానును.

రక్తగతజ్వరమునకు—తమలపాకులు, నేలగోలిమిడి, పెన్నేరుగడ్డ, చిత్రమూలము, పెద్దముత్తవపులగము, సొంటి, వస ఇవి సమభాగములుగాఁగూర్చి కషాయముకాఁచి యిచ్చిన రక్తగతజ్వరము మానును.

విషమజ్వరములకు—సొంటి, ఉసిరికఒలుపు, తుంగగడ్డలు, తిప్పతీఁగె, చిన్నములక వీనినికషాయముకాఁచి పిప్పలిచూర్ణము తేనె కలిపియిచ్చిన విషమజ్వరములు మానును.

శీతజ్వరములకు—సొంటి, దనియాలు, నేలవేము, చేఁదుపొట్ల, వేఁపచెక్క, అడ్డసరపుఆకు, కొడిసెవిత్తులు, ఆముదపువేళ్లు, కటుకరోహిణి, గంటుబారంగి, పర్పాటకము, రక్తచందనము, తుంగముస్తెలు, చిన్నములక, తామరతూండ్లు, తిప్పతీఁగె వీనిని కషాయముగాచియిచ్చిన, శీతజ్వరములన్ని మానును.

విషమశీతజ్వరములకు—దుంపరాష్ట్ర, నీలివేరు, వావిలిఆకు, పెద్దముత్తవపులగము, నాగముత్తవపులగము, చిన్నముత్తవపులగము, కోలపొన్న, నేలపొన్న, వస, సొంటి, వెలుమసంధి, ఇవి సమభాగములుగఁ జేర్చి కషాయముగాచి యిచ్చిన విషమశీతజ్వరము మానును.

విషూచిజ్వరమునకు, అగ్నికుమారరసము—రసము, గంధకము, వెలిగారము వీనినిశుద్ధిచేసి సమభాగములుగఁగూర్చి, 3 పాళ్ళునాభిని, 3 పాళ్లు

గవ్వలభస్మమును శంఖభస్మమును, ౪ పాళ్లు మిరియములపొడిని చేర్చి నిమ్మపండ్ల రసముచే మెత్తగనూరి రెండు గురిగింజలంత మాత్రలుచేసి యెండబెట్టి పూటకు ౧ మాత్రను తమలపాకు రసములో చాదియిచ్చి పిదప పుడిసెడు చన్నీళ్లను త్రాగించినయెడ విషూచిజ్వరములు, అరుచి, అజీర్ణము, సన్నిపాతము ఇవి మానును.

పురాణజ్వరములకు, మాలినీవసంతరసము—కఫరి ౨ పాళ్ళు మిరియాలు౧పాలు, వీనిని వేపచెక్కరసముతో మూడుదినములు మెత్తగ మర్దించి ఆఱుగురిగింజలయెత్తు మాత్రలుకట్టి జీలకఱ్ఱతోగాని పిప్పళ్లతోగాని యిచ్చినయెడ, పురాణజ్వరములు, జీర్ణజ్వరములు, అస్థిగత మాంసగతజ్వరములు, జ్వరాతిసారము మొదలగునవి యన్నియు మానును.

సర్వజ్వరములకు, స్వచ్ఛందభైరవము—రసము, నాభి, గంధకము ఇవి సమభాగములు, రసములోసగము జాజికాయ వీనిని కాటుకవలెనగునట్లు మర్దించి, పైవస్తువులకన్నిటికి సగము పిప్పలిచూర్ణమును జేర్చి తమలపాకులరసముపోసి మెత్తగమర్దించి రెండుగురిగింజలంత మాత్రలుచేసి తమలపాకుతోనైనను అల్లపు రసముతోనైనను ఇచ్చినయెడ, శీతజ్వరములు, సన్నిపాతము, విషూచి, విషమజ్వరము, పడిసెము, తలనొప్పి, అగ్నిమాంద్యము, వాంతి ఇవియన్నియు మానును.

జ్వరాంకుశము—రసము, గంధకము, నాభి, ఇవిసమభాగములు, ఉమ్మెత్తవిత్తులు ౩ పాళ్ళు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, ఇవి ౧౨ పాళ్లు వీనిని నిమ్మపండ్లరసముననైనను, అల్లపురసముననైనను ఒక్కొకయామము మెత్తగమర్దించి రెండుగురిగింజలంత మాత్రలుచేసి అల్లపురసముతో నిచ్చిన, తాపజ్వరము, చాతుర్థికాదిజ్వరములు, త్రిదోషజ్వరములు మొదలగునవి యన్నియు మానును.

సూతరాజీయము—రసము ౧౬ పాళ్లు, తామ్రభస్మము ౧౬ పాళ్లు, గంధకము ౪ పా, సైంధవలవణము ౪ పాళ్లు, వెలిగారము ౬ పాళ్ళు-వీనిని నిమ్మపండ్లరసమున మెత్తగమర్దించి యెండనెండించి అడ్డగయెత్తుమాత్రలు చేసి, తేనె పిప్పలితోగాని అల్లపురసముతోగాని సేవించినయెడ, పురాణజ్వర, కాసశ్వాసలు, శూలలు, గుల్మము, పాండువు, ఉదరరోగములుమానును.



జ్వరాతిసారములకు, మేఘనాదరసము,—తామ్రభస్మము౧పాలు కంచుభస్మము౧పాలు, వెండిభస్మము౧పాలు, వీనికి సమము గంధకము, వీనిని చిత్రమూలకషాయమున మెత్తగమర్దించి, బిళ్లగాతట్టి యెండించి,మూకుడునందు బెట్టి,చీలమన్ను పూసి పుటమువేసి,మరలచిత్రమూలకషాయముతో మర్దించి ౫ పుటములువేసి రెండుగురిగింజలంతను తమలపాకులో బెట్టి యిచ్చినయెడ, విషమజ్వరములు మానును.—సొంటి, అతివస,తుంగముస్తెలు, నేలవేము, కొడిసె, తిప్పతీగె వీనికషాయముతో పైయౌషధమును భక్షించినయెడ సకలజ్వరాతిసారములు, తరుణజ్వరము మొదలగు జ్వరములన్నియు మానును; దీనియందు పాలు అన్నము పథ్యము.

—సొంటి- కొతిమెర్లు- తుంగముస్తెలు - మారేడుపిందెలు వీనిని సమభాగములుగఁజేర్చి కషాయము పెట్టి యిచ్చిన జ్వరాతిసారములు-వాంతి-మూర్ఛ-దప్పి ఇవి మానును-

రక్తాతిసారమునకు—సొంటి- పిప్పలి- ఓమము- మునుఁగుదామెర-మారేడు-అతివస- విషబొద్ది- వేఁప, కొడిసెపాల- వీనిని కషాయముకాఁచి యిచ్చినయెడ- రక్తాతిసారము మానును.

చండభాసురసము—రసము౧ పాలు- గంధకము ౩ పా- తామ్రభస్మము ౩ పా- తాళకము ౮ పా, అభ్రకభస్మము౨ పా - మిరియాలుఅన్నిటికిసమము వీనిని చిత్రమూలరసమున మెత్తగమర్దించి గురిగింజలంత మాత్రలుచేసి నీడనెండించవలయు- దీనిని అల్లపురసముతోఁ బుచ్చుకొనిన సమస్తజ్వరములును సొంటి పిప్పలి మిరియాలతోఁబుచ్చుకొనిన కాసశ్వాసలును, తేనె పిప్పలితో క్షయరోగములును, జీలకఱ్ఱతో పాండురోగములును, వెల్లుల్లిరసముతో వాతవ్యాధులును, బెల్లము కరక్కాయతో-ఉదరరోగములును, పిప్పలి ఉష్ణోదకముకలిపియిచ్చిన అగ్నిమాంద్యమును, నేలదంతిరసముతో మలబద్ధకమును, తేనెతో ఱొమ్మునొప్పియు, కరక తాడి ఉసిరికలకషాయముతో మూలవ్యాధులును మానును.

—లవంగపట్ట ౧ పాలు, నాగకేసరములు ౨ పా, ఏలకులు౮ పా, మిరియాలు ౪ పా, పిప్పలి ౧౬ పా, సొంటి ౩౨ పా, పెన్నేరుగడ్డ ౬౮ పాళ్లు వీనినిచూర్ణముఁగొట్టి అంతటికిసమముగ చక్కెరగలిపి ఉష్ణోదకము

తోనిచ్చిన పురాణజ్వరములు- మూలవ్యాధి - అరుచి-పాండువు-గుల్మము ఎక్కిళ్లు-శ్వాసము మొదలగు ననేకరోగములు మానును.

సంజీవనీరసము.—ఇంగిలీకము, నాభి, పిప్పళ్లు, ఇవిసమభాగములు గాగూర్చి అల్లపురసమున నొకదినముమర్దించి పెసరగింజలంత మాత్రలు చేసి నీడనెండించి ఒకమాత్రనుచన్నీళ్లతోనిచ్చిన, తాపజ్వరాలుమానును. మఱియు విశేషమైన అనుపానములతోనొసంగిన సకలరోగములుపోవును.

తాళీశచూర్ణము—తాళీశపత్రిప౧, మిరియాలు ప ౨,సొంటిప ౪ పిప్పళ్లు వరాలు, వీనినిసమభాగములుగఁగూర్చి చూర్ణముగొట్టి, పిప్పళ్లకు ౮ దవభాగము శర్కరగలిపి రేపుమాపు పుచ్చుకొనిన-అరోచకము,దగ్గు, ఉబ్బసము, పురాణజ్వరములు, అగ్నిమాంద్యము,అతిసారములు-పాండువు పీనస-ముఖపాకము-మూఢవాతము- ఈరోగములు మానును.

తాళీశమాత్రలు—తాళిసపత్రి ప౧, మిరియాలు ప౧, చవ్యము ప౧,పిప్పళ్లుప౨ మోడి ప౨,సొంటి ప౩, లవంగపట్ట ప౧,లవంగపత్రి ప౧, ఏలకులుప౧,వట్టివేరుప౼,వీనిని దంచి వస్త్రగళితముచేసినచూర్ణము ౧పా, బెల్లం ౩పా, ఈరెండునుకలియనూరి ప్రొయ్యిమీఁదఁబెట్టి, రెండు మూఁడు పొంగులురానిచ్చి దించుకొని కలియపిసికి, చేతికి నెయ్యిచరుముకొని,రేఁగు పండంతవటకములుచేసి, రేపుమాపు పుచ్చుకొనిన వాతశ్లేష్మవాంతులు, గ్రహణి, పాండువు, హృద్రోగము, జ్వరపాండువు, గుల్మము, ఆనాహము ఇవి మానును దీనిని భోజనముఅయినతరువాత పుచ్చుకొనవలయు.

—చేఁదుపొట్ల, కరక తాడి యుసిరికలు, కటుకరోహిణి, నేలవేము, తిప్పతీఁగె, అగరుసొంటి, వీనిని కషాయముబెట్టియిచ్చిన త్రిదోషములు మానును.

సన్నిపాతజ్వరములకుతైలము:—ఇంగువ, సొంటి, పిప్పళ్లు, సైంధవలవణము, చెంగల్వకోష్టు, అతిమధురము, సదాపవిత్తులు, మనశ్శిల, మునగవేళ్లు, గంధము వీనిని నూనెలో వేసికాఁచి శరీరమునకు బట్టించిన, సన్నిపాతజ్వరములు మానును చలివేఁకులు మానును.

చలిజ్వరములకు—పిప్పళ్లనునూరిబెల్లముతోనిచ్చి వేఁడినీళ్లుత్రాగించవలయు.



—చిట్టాముట్టివేళ్ళు, నేలయుసిరికవేళ్ళు, సొంటి వీనిని కషాయము పెట్టి పిప్పలి ప్రతిపాకముబెట్టియిచ్చిన మూఁడుదినములలో చలిజ్వరము మానును.

—అడ్డసర పాకును, పిన్నపాపరఆకును పిట్టుబెట్టి పిప్పలి ప్రతిపాకముపెట్టియిచ్చిన చలివేఁకులు మానును.

—జీలకఱ్ఱ - సొంటి- మిరియాలు - పిప్పలి-వెల్లుల్లి, వీనిని కలకము నూరియిచ్చిన చలివేఁకులు మానును.

తైలము—ప్రొద్దుతిరుగుడువేరు, సొంటి, చెంగల్వకోష్టు, చాగవేళ్లు, లక్క, పసుపు, కటుకరోహిణి, అతిమధురము ఇవి దినుసుకు ప ౧¼ చొప్పునగూర్చి మెత్తగనూరి, నూనె ౨వళ్లు, మజ్జిగ ౧ పడి పోసికాఁచి తైలపాకమున దించికొని, వడియగట్టి శరీరమునకుపట్టించి మూఁడుదినములుండనిచ్చి నాలుగవనాఁడు స్నానముచేయవలయు. ఇట్లు నాలుగైదు పర్యాయములుచేసిన శీతజ్వరములు, దాహము, తాపజ్వరములు, మానును.

తైలము—ఊడుగువేరు చెక్క, నీలివేరు, వావిలివేరు, నల్ల ఉప్పి తెల్ల ఉప్పి వేళ్లపట్టలు,-పొడపత్ర, రేలవేరుపట్ట, పెన్నేరుగడ్డ, సుగంధిపాల, వస, ఉల్లి,ఈవ్రేళ్లనుపొడిగాదంచి నూనెకాఁగఁబెట్టి అందులో ఆపొడిని వేసి పొంగువచ్చినతరువాత దించికొని లోపలికి ఇచ్చి పైకిపట్టించిన చలివేఁకులు, సాధారణజ్వరములు మానును.

ఘృతము—చేఁదుపొట్ల, సుగంధిపాలవేళ్లు, తుంగముస్తెలు, అగరు సొంటి-కటుకరోహిణి-వట్టివేళ్లు, మంచిగంధము, పిప్పళ్ళు,ఇవి దినుసుకు ౧ పలము, నెయ్యి ౨ప, పాలు ప ౨. పెరుగుమీఁదినీళ్లు ప ౨, వీనిలో పైదినుసులపొడినికలిపి పక్వముగాకాఁచి వడియకట్టి, ఆనేతిలో ౪ పలము లు చక్కెర గలిపి పుచ్చుకొనిన,విషమజ్వరములు,అస్థిగతజ్వరాలు మాని దేహమునకు పుష్టికలుగును.

సర్వజ్వరములకు, కషాయములు—ముత్తవ పులగము, వేఁపవిత్తులు, నేలవేము, తిప్పతీఁగెవేళ్లు చిగుళ్లు, రేగటిములక, సొంటి వీనిని కషాయము గాచి ఇయ్యవలయు.

శీతజ్వరములకు మాత్రలు—తాళకము ౧ పాలు, సున్నపురా

ళ్లు ౨పా, వీనిని కలుబందపట్టులోబెట్టి పుటములో నుడికించి ఖల్వమున మర్దించి, నలగకుండినయెడ, కలబందమట్టను ఉడకబెట్టి దానిరసమున నూరి గురిగింజంతమాత్రను జీలకఱ్ఱ అనుపానముతో ఇయ్యవలయు.

సన్నిపాతాది విషమజ్వరములకు— పచ్చిపసువు, వేపాకు, పిప్పళ్ళు, మిరియాలు, తుంగముస్తెలు, వాయువిళంగాలు, వీనిని సమభాగములుగాగూర్చి ఆబోతుపంచితముననూరి, మాషమాత్ర ప్రమాణముగా మాత్రలుచేసి శీతజ్వరములయందు తేనె అనుపానముతోను, గ్రహణికి చల్లతోను, పైత్యములకు నవాతుతోను, స్త్రీలదోషములకు సొంటి పిప్పలి మిరియాలతోను ఇయ్యవలయు.

పైత్యపుమంటలకు—బుడ్డకాకరాకునుఆముదములోపొర్లించివేయించి కరకతాండ్రయుసిరికెలు,సొంటి పిప్పలి మిరియాలు ఇవి ఆకుకు సమభాగములుగాగూర్చి పొడిచేసి చక్కెరకలిపి భక్షింపవలయు; ఇచ్ఛాపథ్యము.

రాజశేఖరరసము— రసము తు ౧, గంధకము తు ౧, నాభి తు ౧, జాజికాయ తు ౪, అన్నిటికిసమము పిప్పళ్లు, వీనిని మర్దించి కరాటాన బెట్టి రెండుగురిగింజలయెత్తు అల్లపురసమునగాని, తమలపాకురసమునగాని, మిరియపుపొడితోగాని యిచ్చిన, సన్నిపాతజ్వరము, విషూచి, తలనొప్పి, అజీర్ణజ్వరము, మందాగ్ని ఇవిమానును. దాహమైనయెడ జీలకఱ్ఱ వేడినీళ్ళు ఇయ్యవలెను. పథ్యము, ఉలవగంజికాచి పోయవలయు.

జ్వరమాత్రలు— నాభి ౧వరాయెత్తు, వెలిగారము వ౧, నేపాళములు వ౮, ఇంగిలీకము వ౨, వీనిని నిమ్మపండ్లరసమున రెండుదినములు మర్దించి గురిగింజంతగుళికలుచేసి నీడనెండించి, కరాటానబెట్టుకొని ఒక్కొక మాత్రచొప్పున అల్లపురసమున ఇచ్చిన వాతజ్వరము మానును. దీనివలన, విరేచనముకూడ అగును.

ప్రతాపమార్తాండరసము—రసము౧పాలు, ఇంగిలీకము ౨పా, నేపాళములు ౬పా, వీనిని దంతిచెక్కరసాన జామునేపునూరి గురిగింజంత మాత్రచేసి, నీడనెండించి యొకమాత్రను బెల్లముతో నిచ్చిన, నాలుగుజాములకు జ్వరమువిడుచును.

ఉద్దండనామకరసము—రసగంధకములు రెండేసి మాడలయెత్తు,



సొంటి-పిప్పలి-మిరియాలు మూఁడు మాడల యెత్తు, దంతిచెక్కరసాన మర్దించి వరిగింజలంతమాత్రలుచేసి, ఒకమాత్రను తేనెతో ఇచ్చిన, తరుణజ్వరము జాముకువిడుచును. అల్లపురసముతోను పిప్పళ్లతోను ఇచ్చిన త్రిదోషములు మానును.

మదనసుందరరసము— రసగంధకములు సమభాగములు - కలువ తుంపరసమున మర్దించి వాలుకాయంత్రమున పుటముబెట్టితీసి, తిరుగా మర్దించి, నూవుగింజంత మాత్రలుచేసి తమలపాకురసమున ఇచ్చిన, ఉద్ధృతరోగములు మానును. పిప్పలి పంచదారలతో ఇచ్చిన శీతజ్వరము మానును. పిప్పలి సొంటిరసముతో ఇచ్చిన సన్నిపాతములు మానును.

భ్రమిసన్నికి—కరక్కాయ, పర్పాటకము, దేవదారు, దాసానిపువ్వు, త్రికటుకములు, రేలపండు, తానికాయ, వీనిని కషాయము పెట్టియిచ్చిన భ్రమిసన్ని మానును.

గండభేరుండరసము— ఇంగిలీకము వ ౨, నాభి వ ౧, కటుకరోహిణి వ ౮, వీనిని నీళ్లుపోసి మర్దించి గురిగింజంత గుటికలుచేసి చన్నీళ్లతో ఇచ్చిన శీతజ్వరములు మానును.

తరుణజ్వరగజకేసరి— గంధకము వ ౧, వెలిగారము వ ౧, రసము వ౧, నేపాళములు వ౬, వీనిని గుంటగలగరాకు రసమునమర్దించి నాలుగుజాములు తమలపాకురసానమర్దించి, పెసరగింజంతమాత్రలుచేసి ఇచ్చిన, పైత్యదాహము, శ్లేష్మవాతము, కడుపునొప్పి, గుల్మశూల ఇవి మానును, పథ్యము పెరుగన్నము.

బడబానలరసము— రసము ౧పాలు, గంధకము ౧పా, తాళకము ౧పా, మనశ్శిల ౧పా, వీనిని ఆకుజెముడుపాలున ఒక్కదినము మర్దించి నత్తగుల్లలనుదెచ్చి అందులోని కొమ్మపురుగులను సగముగా ఇరువదియొక్కటివేసి, నిమ్మపులుసున మూఁడుదినములు మర్దించి ముద్దచేసి, ఆవుచన్నువలె ఆఱు అంగుళాల నిడుపున మూసచేసి ఆముద్దను అందులోఁబెట్టి మూసి చీలచేసి యెండించి ఆమూసను సగమువఱకు నేలమీఁద కొయ్యవలె పాతి పైనయినుకబోసి నలువది యేరుపిడకలపుటముబెట్టి స్వాంగశీతలమున దీసి, అందలియౌషధమును చూర్ణమగునట్లు మర్దించి కరా

టాన పెట్టుకొని, పరీక్షింపవలసినయెడ, గిన్నెనిండుగనీళ్లుబోసి అందు గురిగింజంత ఔషధమునువేసి పైనమూసి నాలుగుజాములుండనిచ్చి తీసి చూచిన నీళ్లన్నియింకిపోవును. ఈ యౌషధమును అల్లపురసముతోఁగాని, చిత్రమూలకషాయముతోఁగాని, ఇచ్చిన, ౧౩ సన్నిపాతములుమానును. అనుపానవిశేషములచే ఇయ్యవలెను.

జ్వరముతోఁడి వెక్కిళ్లకు— నల్లతుమ్మఆకు, సొంటి, మిరియాలు, కరక్కాయ వీనినికషాయముకాచియిచ్చిన మానును.

పైత్యజ్వరవాంతికి—బిల్వవేరు, తిప్పతీఁగె, బొరుగులు, సొంటి, పెసలు, కొత్తమిల్లి, కరివేఁపాకుఈనెలు వీనినికషాయముకాచి ఇయ్యవలయు.

మఱియొకక్రియ— నారదపాకు, సొంటి, తులసి, రేగాకు, చేదుపొట్ల, తిప్పతీగె, ములకవేరు, అడ్డసరపాకు, విష్ణుక్రాంతము, జీలకఱ్ఱ, వీనినికషాయముపెట్టి యియ్యవలయు, నోరెండినయెడ కలబందను ఏడుమారులురుద్ది కడిగి బెల్లము కలిపియిచ్చిన తీరును.

అమోఘాస్త్రరసము— శుద్ధిచేసిన పాలతుత్తము ౧ పాలు, తాళకము ౩పా, రాతిసున్నము ౧పా, వీనిని కలబంద రసమున మర్దించి, కుక్కుటపుటమువేసి తీసి తిరుగా మర్దించి, అడ్డగయెత్తు తులసిరసముతో నిచ్చిన శీతజ్వరము మానును.

గరుడాస్త్రరసము— ఆరతికర్పూరము ౧పా, నాభి ౧పా, ఇంగిలీకము ౨పా, నేపాళములు ౪పా, వీనిని గుంటగలగరాకురసముననను, గజ్జెరాకురసముననను ఒకజాము మర్దించి, గురిగింజంతమాత్రలుచేసి, దేహప్రకృత్యనుగుణముగా అనుపానవిశేషములతో ఇయ్యవలయు.

తాళకమాత్రలు—తాళకము ౧పా, మిరియాలు ౧౫ పా, సున్నపురాళ్లు ౪పా, పాలతుత్తము మిక్కిలికొంచెము, వీనిని నిమ్మపండ్లరసమున నిరువదిదినములు మర్దించి, పుట్టమన్నుమూసకట్టి, ఆమూసలో పైయౌషధమునునిచి సందులేకుండా చీలమన్నువేసి, ఏరుపిడకలచే కుక్కుటపుటము బెట్టితీసి కలుబందరసమున మర్దించి. గురిగింజంతమాత్రలుచేసి రెండుపూటలు పుచ్చుకొనవలయు. పథ్యము - పగలు పచ్చిపెసరకట్టు, రాత్రిళ్లు ఆవుపాలు అన్నము. శీతజ్వరములు మానును.



సుధాకరరసము—రసకర్పూరము, గంధకము, లోహము, అభ్రకము, సొంటి, మిరియాలు, పిప్పళ్లు, అక్కలకఱ్ఱ, యష్టిమధుకము, లవంగాలు, జాపత్రి, నల్లజీలకఱ్ఱ, కస్తూరి, వీనిని సమభాగములుగఁగూర్చి మాచిపత్రిరసముతో నొకదినమును, పిల్లివేల్లరసముతో నొకదినమును, రేగటిములగవేళ్లరసముతో నొకదినమును, అడ్డసర రసముతో నొక దినంబును మర్దించి గురిగింజంత మాత్రలు చేసి, తేనెతోఁగాని - దేహప్రకృతినిబట్టి మఱిదేనితోఁగాని-ఇయ్యవలయు. పథ్యము- కందికట్టు-ఆవునేయి- వేడినీళ్లు పుచ్చుకొనవచ్చును. మజ్జిగ-పులుసు-వర్జ్యము. జ్వరములు, కాసాది కఫరోగములు మానును.

సర్వజ్వరములకు—శుద్ధిచేసిన గౌరీపాషాణము ౧ పా, మైలుతుత్తము ౧ పా, వీనిని నల్లయుమ్మెత్తపువ్వురసమున మర్దించి, గురిగింజంత మాత్రలుచేసి మేఁకపాలతోఁగాని, లేక దేహానుగుణముగ మరిదేనితోఁగాని ఇయ్యవలయును. పథ్యము మేఁకపాలు, పచ్చిపెసరకట్టు. సకల జ్వరములు మానును.

మఱియొకక్రియ—మణిశిల, నాభి, గరళము, వీనిని సమభాగములుగఁగూర్చి అల్లపురసముతోఁమర్దించి, గురిగింజంత మాత్రలుచేసి ఇయ్యవలయు. జ్వరములుమానును. చన్నీళ్లస్నానము. ఇచ్ఛాపథ్యము.

సన్నిపాతజ్వరలక్షణము—రాత్రిళ్ళు నిద్ర పట్టకయుండుట, కృశించుట, మూర్ఛగలుగుట, వాతప్రకోపము, శ్వాసకాసలు, విదాహముగలుగుట, దేహమున ఒకప్పుడు దాహము- శీతలము గలుగుట, తబ్బిబ్బులాడుట, దేహము చల్లనగుట, జ్వరము, చలి, దప్పి, ఒమ్మునమంట నొప్పి, తలనొప్పి, దేహముగగుర్పొడుచుట, నాలుకయెండి కృశించుట, కన్నులెఱ్ఱబారుట, ఏడ్చుట, భ్రమించుట, నవ్వుట, పాడుట మొదలగు లక్షణములు సన్నిపాతజ్వరమునందు గలుగును.

సన్నిపాత జ్వరములకు కషాయము—కరక్కాయలు, తానికాయలు, సొంటి, పిప్పలి, మిరియాలు, కటుకరోహిణి, గంటుభారంగి, నేలవేము-వేఁపపట్ట-తిప్పతీఁగె-తెల్లతెగడ-వస-అతివస-అడ్డసరము- తుంగగడ్డలు-దురదగొండి-పెద్దపాపర-సన్నరాష్ట్రము-నెల్లివరుగు-కచ్చూరములు - కొడిశ

విత్తులు-తామరగడ్డలు-చేదుపొట్ల-దేవదారు-పసుపు-మానిపసుపు- కలిగొట్టు-నల్లతుమికి-సరస్వతిఆకు-ములుగోరింట-వాకుడు- పెద్దములక వీనిని సమభాగములుగఁ గూర్చి కషాయముగాఁచియిచ్చిన, త్రయోదశ సన్నిపాతములు-శూలలు-కడుపుబ్బరము-శ్వాసము-వెక్కిళ్ళు - గళరోగము- అరుచి-కీళ్లుబిగపట్టుట మొదలగు రోగములు మానును.

కషాయము—విష్ణుక్రాంతము ఉలిమిరి, జిల్లేడు, చిత్రమూలము, పిప్పలిగడ్డ, ములగవేరు, నెల్లుల్లి, వీనినికషాయముగా చియిచ్చిన, త్రిదోష జ్వరములు మానును.

కషాయము—సొంటి, పిప్పలి, మిరియాలు, కటుకరోహిణి, సోమిందవేరు, పాపటవేళ్లు, కరక్కాయలు వీనిని కషాయము గాచియిచ్చిన దోషజ్వరతాపములు మానును.

చూర్ణము—కరకతాండ్రయుసిరికలు-చిత్రమూలము-అతివస-చిట్టాముదపువేరు-గ్రంథితగరము-వాయువిళంగాలు-పసుపు-మానిపసుపు - కోలపొన్న-నేలపొన్న-నేలములక-పెద్దములక-తామరగడ్డలు-అతిమధురము-గంటుభారంగి-మునగవిత్తులు-వస-కావిరాళ్లు-లవంగపట్ట-వట్టివేళ్లు- శ్రీగంధము-తెల్లకొడిశవిత్తులు-నల్లకొడిశవిత్తులు-ఓమము-తుంగగడ్డలు-నాగుదోసవిత్తులు-కానుగవేళ్లు-వేపవేరుపట్ట-తిప్పతీఁగ-కటుకరోహిణి-పర్పాటకము - దురదగొండి-సొంటి-పిప్పలి-మిరియాలు-మోడి- కచ్చూరములు-చాగవేళ్లు-లవఁగములు-లవంగపత్రి-జాపత్రి-తాళిశపత్రి-దేవదారు-చవ్యము-చేఁదుపొట్ల- దీపద్రాక్ష-అడ్డసరము-పెద్దపిల్లిపీచర-తేలుమణిచెట్టుసమూలము - వెదురుప్పు-తెల్లతామర-వీనిని సమాంశములుగగూర్చి చూర్ణముగొట్టి - దానికి సగము నేలవేముచూర్ణముకలిపి చన్నీళ్ళతో ఒకతులమెత్తుభక్షించినయెడ-బలిష్ఠము లగు వాతపిత్తశ్లేష్మజ్వరములు-ద్వంద్వ జ్వరములు- సకల విషమజ్వరములు-తంద్ర-భ్రమ-పీనసము-శ్వాసకాసములు-పాండురోగము - ఆమ్మునొప్పి మొదలగురోగములును కీళ్లనొప్పులును మానును.

సన్నిపాతభైరవరసము—పాదరసము ౧ పా, గంధకము ౧ పా, మండూరము ౧పా, అన్నిటికి సమమునాభి - వీనిని అల్లపురసము లవంగపట్ట కషాయము - మాదీఫలరసము - భంగిఆకురసము - గుంటగలగరాకురసము



వావిలిఆకురసము - ఈరసములలో నొక్కొకదినమున కొక్కొక రసమువంతునపోసి మెత్తగమర్దించి నాలుగు గురిగింజలంత మాత్రలుచేసి నీడనెండించి ఒక్కొకమాత్రవంతున పుచ్చుకొని చన్నీళ్ళుత్రాగిన సన్నిపాతములుమానును. పాలన్నమును చక్కెరను భక్షింపవచ్చును.

గండభేరుండరసము—పాదరసము-గంధకము - తామ్రభస్మము-అభ్రకభస్మము-లోహభస్మము-మైలుతుత్తము, పాలతుత్తము- ఉల్లిపాషాణము-తాళకము-గరళము - నాభి వీనిని సమభాగములుగగూర్చి - పెన్నేరుగడ్డరసమునఅయిదుదినములుమర్దించి-నిమ్మపండ్లరసమున ఏడుజాములునూరి-మినపగింజలంతమాత్రలుచేసి- అనుపానవిశేషములచేనిచ్చిన ౧౩ సన్నిపాతములు పురాణజ్వరములు అస్థిగతజ్వరములుమహాదోషములుమానును.

కాలకూటరసము—నాభి ౧౦ పా, రసము ౩పా, గంధకము ౫పా, మణిశిల౬పా, తామ్రభస్మము౪పా, వెలిగారము౬పా, తాళకము ౯ పా, చిత్రమూలము ౯పా, కరకతాండ్రయుసిరికలు ౧౦పా, సొంటి- పిప్పలి-మిరియాలు ౧౨పా, ఇంగువ౧పా, వస౧పా, వీనిని కల్వములోవేసి- అల్లము-చిత్రమూలము-నిమ్మపండ్లు- తెల్లగడ్డలు-బండిగురిగింజలు-కారుమునగ- జిల్లేడువేళ్లు-నాగేటిగడ్డలు-హంసపాదిఆకు-వావిలాకు-తమలపాకు-ఊడుగచెక్క-మునగవేళ్లు - వీనిలో నొక్కొకదానిచే నొక్కొకజామునూరి - తరువాత పంచమూలకషాయముతోను-పంచకోలకషాయముతోనుమెత్తగనూరి గురిగింజలంతమాత్రలుచేసి అల్లపురసముతో బుచ్చుకొనిన అసాధ్య సన్నిపాతములు- దోషములు - సమస్తజ్వరములుమానును. దీనికి పెరుగన్నము, తాంబూలము-చన్నీళ్లలోస్నానముచేయుట మొదలగునవి హితంబులు.

శీతాంశురసము—నేపాళమణిశిల ౧పా, తాళకము ౧పా, సొంటి-పిప్పలి-మిరియాలు ౨పా, వీనిని వేపచెక్కరసముతో మెత్తగనూరి గురిగింజలంతమాత్రలుచేసి, తేనె.కరక్కాయచూర్ణము-వేడినీళ్లు-అల్లపురసము వీనిలోదేనితోనైనను పుచ్చుకొనిన-చలిజ్వరములు, సన్నిపాతము,పాండువు, కామిల, గుల్మము,కాసశ్వాసములు, వాతరోగములు, కడుపుబ్బరములు, శూలలు, విషములు మొదలగునవి హరించును. వేపాకురసములో చాదిపైకిపట్టించిన - గజచర్మము,చర్మరోగములు, మండలకుష్టువు, నాలుకరోగ

ములు, నేత్రరోగములు, దంతరోగములునుపోవును. కర్ణరోగములకు జిల్లేడాకురసములోఁచాది చెవిలోఁపోయవలయు. నేత్రరోగములకు నిమ్మపండ్లరసములోఁచాది ఆవగింజంత కలికము వేయవలయు.

సమగరళతరుణార్కము——హారితాళము ౧ పా, ఇంగిలీకము౧పా, నాభి ౩పా, అన్నిటికి సమము కృష్ణసర్పగరళము వీనిని నిమ్మపండ్లరసమున మూఁడుదినములు మర్దించి, మాషప్రమాణ మాత్రలుచేసి నీడనెండించి నారికేళోదకములోఁకలిపి ఇయ్యవలయు. పథ్యము:—కర్పూర-చందనాదిశీతలోపచారముల జేయవలయు. నూనెతోఁ దలయంటి స్నానము చేయించవలయు. ఇచ్ఛాపథ్యము. సన్నిపాతములు మానును.

అమృతసంజీవనీరసము——ఇంగిలీకములోఁని రసము- నాభి-గంధకము ఇంగిలీకము-కటుకరోహిణి - వీనిని సమాంశములుగఁగూర్చి గుంటగలగరాకురసమున మూఁడుదినములు మర్దించి - మినపగింజంతమాత్రలుచేసి ఒకమాత్రచొప్పున అల్లపురసముతో ఇచ్చిన సన్నిపాతములు మానును-

సానందభైరవి——శుద్ధిచేసిననాభి, నేపాళములు, పాదరసము, ఇంగిలీకము, లవంగాలు, అమరసిలగంధకము, మిరియాలు, పిప్పళ్ళు, వెలిగారము వీనిని సమభాగములుగఁగూర్చి నిమ్మపండ్లరసముతో మూఁడుజాములు నవనీతమగునట్లుమర్దించి, మినపగింజలంత మాత్రలుచేసి అనుపానవిశేషములతో పుచ్చుకొనిన - చిరకాల జ్వరములు, మలబద్ధము, సన్నిపాతములు, అతిసారము మానును.

లంఘన క్రమము.

వాతజ్వరమునందు ఉపవాసంబును, పైత్యజ్వరమునందు లఘుభోజనంబును, శ్లేష్మజ్వరమునందు పలచనిగంజిని త్రాగించుటయు చేయించవలయు.

పథ్యద్రవ్యములు.

ఎన్ని యౌషధంబులు పుచ్చుకొనినను, పథ్యము చేయనియెడ నిష్ప్రయోజనము; కావున, పథ్యాపథ్యంబులనెఱింగి పథ్యం బొనర్చవలయు. పొట్లకాయ, లేఁతవంకాయలు, కాఁకరకాయలు, ముదురుగుమ్మడుకాయ, నల్లకాఁచికూర, చిర్రికూర కొయ్యదోఁటకూర, పొన్నగంటికూర, పెసరకట్టు, లేఁత అరఁటికాయలు, లఘుపదార్థములు, అరువదిదినములకు ఫలించినధాన్యము, ప్రాఁతవడ్లు - కాఁచిన పాలు ఇవి జ్వరితులకుఁ బథ్యంబులు.



అపథ్య పదార్థములు.

పచ్చిఆకుకూరలు ఉష్ణపదార్థములు, విదాహమును గలిగించువస్తువులు, పగటినిద్ర-స్నానము, అభ్యంగము, స్త్రీసేవ, సంచారము, కోపము ఇవి జ్వరితులకుదగవు.

## అతిసారరోగలక్షణము.

అతిసారము, వాతపిత్తశ్లేష్మ ద్వంద్వ సన్నిపాతములవలనను, భయశోకములవలనను ఆఱువిధములుగనుండును; వాతాతిసారమువలన మలము ఎఱ్ఱనై, నుఱుగుతోను బంకతోనుగూడి, వేఁడి-నొప్పి-శబ్దముగలిగియుండును. పైత్యమువలన, నల్లగ, పచ్చగ, ఎఱ్ఱగ, చిక్కగనుండి, కంపు-మంటగలిగి పసుపునీళ్లవలె వెడలును; ఇందు, దప్పి మూర్ఛ గలుగును. శ్లేష్మమువలన తెల్లగ, నల్లగ, దట్టముగానుండి నెత్తురుతోఁగూడి మెరువుగలిగి, యించుక నొప్పిగలిగి వెడలును; ఇందు దేహమునందు గురుత్వము, అరుచి గలుగును సన్నిపాతమువలన నన్నిలక్షణములు గలిగియుండును. భయశోకములవలనఁబుట్టిన యతిసారము, వాతాతిసార లక్షణంబులు గలిగియుండును. అతిసారము-ఆమమనియు, పక్వమనియు రెండువిధములు. ఆమాతిసారము నీటియందువేసిన మునుఁగును. పక్వాతిసారము తేలును. తేనె- మసిచమురు- పాలు- నీళ్లు- చీము వీనివలెనుండి నానావర్ణములు గలదై కంపుతోఁగూడియుండిన అసాధ్యము.

చికిత్స——సొంటి, కొత్తిమిర్లు, తుంగగడ్డలు, మారేడుపండు, కురువేరు వీనిని కషాయముపెట్టియిచ్చిన, ఆమాతిసారము మానును.

——తిప్పతీఁగె, నేలవేము, అతివస, సొంటి, తుంగగడ్డలు, కొడిశవిత్తులు, వీనిని కషాయముగాఁచియిచ్చిన- సర్వాతిసారములు, జ్వరాతిసారములు మానును.

——వాయువిళంగాలు, తుంగగడ్డలు, దేవదారు, అతివస, విషబొద్ది, మిరియాలు, కొడిశవిత్తులు, వీనిని కషాయముగాచియిచ్చిన-శోఫాతిసారములు మానును.

——నేరేడు, నెల్లి, మామిడి వీనిచిగుళ్ళరసములో నెయ్యి, తేనె కలిపియిచ్చిన రక్తాతిసారములు మానును.

—దానిమ్మఫలమునుగాని, చిగుళ్లనుగాని, మూటగట్టి పేడఁపూసి నిప్పులోఁబెట్టి యుడికినతరువాత రసమునుతీసి తేనెకలిపియిచ్చిన సకలాతిసారములు మానును.

—బొంతజెముడు పువ్వులను ఉల్లిగడ్డ నడుమబెట్టి, భక్షించిన, నెత్తురుబంకమానును. బాలులకు ౧ యు, పెద్దవారికి ౨ను ఇయ్యవలయు.

—ఆవాలు, జీలకఱ్ఱ వీనిని కొంచెమువెచ్చజేసి పొడిచేసి మంచి బెల్లము నెయ్యి వీనినికలిపియిచ్చిన, నెత్తురుబంక మానును.

శిశువుల- అతిసారములకు- జ్వరములకు— వట్టివేళ్లు - నేరేడు ఇగుళ్లు- మామిడిచిగుళ్లు-గుంత్రకొనలు ఇవి దినుసుకు వరామెత్తు చొప్పున నెండించి - ౮ ఆళాకుల నీళ్లుపోసి - ౧ ఆళాకుగాకాంచి వడిచికొని, తేనె అనుపానముతో తాగించిన-జ్వరములు-అతిసారములు-కక్కుట-మూర్ఛ-బడలిక మానును.

అతిసారములకుమాత్రలు— వెలిగారము, గంధకము, నల్లమందు, జాజికాయ, జీలకఱ్ఱ, వీనిని సరిపాలుగపొడిచేసి, ఇందుకు తుల్యముగ దానిమ్మవిత్తులనువేసి మర్దించి ముద్దచేసి దానిని దానిమ్మచిప్పలోనునిచి మూసి పైనగోధుమపిండి మెత్తి నిప్పులోపెట్టి యుడికించి చల్లారనిచ్చి తీసి ఖల్వమున మర్దించి సెనగగింజంత మాత్రలుచేసి పూటకు ౧-౨మాత్రలచొప్పన నిచ్చిన సర్వాతిసారములు మానును.

అభ్రకపంచామృతము— అభ్రకము, వంగము, నాగము,ఏలకులు కుంకుమపువ్వు, జాజికాయ, రససిందూరము ఇవి సమభాగములు, అన్నిటికి తుల్యముగ తిప్పసత్తు, ఇట్లన్నిటిని చేర్చి, తిప్పతీగె రసమున మర్దించి, గురిగింజంతమాత్రలుచేసి అనుపాన విశేషములతో నిచ్చిన, పైత్యాతిసారములు, వాంతులు మానును.

పథ్యాపథ్యములు.

అతిసారరోగులకు - జాజికాయ, చక్రవర్తికూర, పొట్లకాయ, మారేడుకాయ అరటిపండు, వెలగపండు, అరటిపువ్వు, కందికట్టు, ఇవిపథ్యములు— స్నానము,అభ్యంగము, తాంబూలము, అధిక జలపానము, స్త్రీసంగమము, శైత్యవస్తువులు, గుమ్మడికాయ, నువ్వులు, బచ్చలికూర, సొరకాయ, అనుములు, పిండివంటలు, మద్యము, మాంసము ఇవి అపథ్యంబులు.



# గ్రహణీరోగలక్షణము.

అతిసారము నివర్తించినపిమ్మట అపథ్యముచేయుటవలన వాతపిత్తశ్లేష్మంబులు దుష్టంబులై అగ్నిమాంద్యమునుగలుగజేసి గ్రహణీరోగమును కలుగజేయును. ఇందు అన్నము చక్కగా బక్వముగాక, మల రక్తముల తోగలిసి బద్ధకముసేయుచు ఆసనమున నొప్పికలుగజేయుచు, దుర్గంధయుక్తమై వెడలును. దప్పి, బలహీనత, ఆలస్యము మొదలగు లక్షణములు గలుగును. దీనికి అతిసారచికిత్సలనే చేయవలయు.

చికిత్స—సొంటి,చిత్రమూలము, మారేడుపండు, చవ్యము వీనిని చూర్ణముచేసి మజ్జిగలోఁగలిపి పుచ్చుకొనిన గ్రహణులు మానును.

—సొంటి,పిప్పలి, మిరియాలు, ఓమము,చిత్రమూలము, మోడి, ఇంగువ, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, పాదరలవణము, ఉప్పు వీనిని సమాంశములుగఁగూర్చి, మాదీఫలరసమునుగాని, దానిమ్మపండురసమునుగానిపోసి నూరి రేగుపండంత వటకములుచేసి నీడనెండించి పుచ్చుకొనిన అగ్నిమాంద్యముపోయి దీపనముపుట్టును.

గ్రహణీకవాటము—జాజికాయ, వెలిగారము, నల్ల యుమ్మెత్తవిత్తులు, నల్లమందు, బూరుగుబంక, అతివస, తుంగముస్తెలు, అంకుడువిత్తులు,విరజాజిపువ్వు,మారేడు,సొంటి,మెంతులు,మామిడివిత్తులు, వీనిని సమభాగములుగ గంజాయిఆకురసమున మూడుజాములుమర్దించి మినపగింజంతమాత్రలుచేసితేనెతోఁగానిఅరటిపువ్వురసముతోగాని ఇయ్యవలయు.

కపిత్థాష్టకచూర్ణము—వెలగపండు ౮పా, శర్కర ౬పా, దానిమ్మబెరడు, చింతపట్ట, మారేడుపిందెలు, ఆరెపువ్వు, పిప్పళ్లు, ఓమము, ఇవి ప్రత్యేకముగ ౧౪పా, జీలకఱ్ఱ-మిరియాలు- కొతిమెర్లు- మోడి - కురువేరు- సౌవర్చలవణము - ఓమము-ఏలకులు-లవంగపట్ట- నాగకేసరములు -సొంటి- చిత్రమూలము - ఇవిప్రత్యేకముగ ౪పా - వీనిని చూర్ణముచేసి వస్త్రగాళితముచేసియిచ్చిన - అతిసారము-గ్రహణి- గుల్మము- కంఠరోగము మొదలగునవి మానును.

—చింతచెక్కలబెరడుపొడి ౧సోల, మామిడిగింజలపప్పు ౧సో, కాచుపొడి ౪సో, బూరుగుబంక ౪సో, నూనె ౧ మానిక, ఈనూనె సలసలక్రాగుచుండ, పైపొడులన్నివేసి దించి చల్లారినవెనుక గంటెడు అరచేతిలో వేసికొని పుచ్చుకోవలయు. గ్రహణులు మానును.

—తుంగముస్తెలు ౧తు, వట్టివేళ్ళు ౧తు, సొంటి ౨తు, వెలగాకు ౧తు, వేఁచినజీలకఱ్ఱ ౧తు, ఓమము ౧తు, నేరేడుపువ్వు ౧తు, మామిడిచిగుళ్లు ౧తు, వీని కషాయములో వరిపేలాలుపోసి, పిప్పళ్లు-కొత్తిమిల్లివిత్తులు వీని అనుపానముతోనిచ్చిన పైత్యాతిసారములు, గ్రహణి,కడుపుబ్బరము, అరుచి, వాంతి మానును.

—రసము,గంధకము వీనిని సమభాగములుగగూర్చి, నిమ్మపండ్ల పులుసున నొకదినముమర్దించి మినపగింజంతమాత్రలుచేసి, మిరియపుపొడితోను నేయితోను పుచ్చుకొనిన గ్రహణులు మానును.

గ్రహణీగజకేసరీరసము—రసము, అభ్రకభస్మము, నాభి, ఇంగిలీకము,గంధకము, ఉక్కుభస్మము, వెలిగారము, ఉమ్మెత్తవిత్తులు, జాజికాయ,కరక్కాయలభస్మము, త్రికటుకములు, కోడిసెపాల, చిత్రమూలము, ఓమము, అతివస, మారేడుగుజ్జు, బూరుగుబంక, వెలగపండుగుజ్జు, గచ్చపలుకులు వీనిని సరిపాళ్లుగగూర్చి పొడిచేసి అంతటికి సమముగ నల్లమందునుకలిపి, ఉమ్మెత్తవేళ్లరసముతో నొక్కపగలు మర్దించి మిరియాలంత మాత్రలుచేసి, తేనెతోఁబుచ్చుకొనిన - అతిసారములు, గ్రహణులు, అజీర్ణము, గుల్మము, శూల, రక్తాతిసారము, జ్వరములుమానును. (అతిసార రోగమునకుఁజెప్పిన పథ్యాపథ్యంబులే దీనికిని ఆచరింపవలయు.)

---

## అర్శోరోగలక్షణము.

వాతపిత్తశ్లేష్మములు ప్రత్యేకముగగాని, ద్వంద్వ సన్నిపాత రక్తములవలనగాని దుష్టంబులై యగ్నిని నష్టపరచి గుదస్థానమున మాంసపు మొలకలజనింపజేయును. ఈరోగంబున, మలము పలచగ వెడలుట,బలహీనత,అగ్నిమాంద్యము,అరుచి, నడుము-తొడలు గజ్జలు వీనియందు శూల,



అన్నద్వేషము, జ్వరము మొదలగునవికలుగును. ఇది ఏకదోషజనితంబై గుదస్థానంబున వెలుపటి ముడతయందు మొలిచిన సుఖసాధ్యమగును.

చికిత్స—అడవికందగడ్డకు తడిగుడ్డచుట్టి పైనపేఁడను మన్నును మెత్తి, కుమ్ములోఁబెట్టి యుడికించి, ఆవనూనెను బెల్లమునుకలిపి కందతోఁగూడ నూరి భక్షించిన మూలవ్యాధులు మానును.

—సూకమెత్తు పటికారమునుపొడిచేసి, ముల్లంగిగడ్డనుచిప్పి ఆపొడిని పట్టించి, ఊడుగఆకురసమున ముంచి ఆసనమునకు ఆముదముచరిమి పైగడ్డను మూఁడుదినములెక్కించిన మొలలువీడిపడును. పథ్యము-ముల్లంగిగడ్డలలో గానుగపిండికలిపి భక్షించవలయు.

కషాయము—మినుములు జీడిగింజలు ఇవిదినుసుకు ౨వరాలెత్తు వేసి నలియగొట్టి, ౨వరాలెత్తు- చిత్రమూలవుకలిపి మేఁకపాలతో కషాయముగాఁచి పుచ్చుకొనిన మూలవ్యాధి మానును.

లేపనము—వెలిగారము,కంద, పసుపు, బెల్లము, చిత్రమూలము వీనిని పులికడుగుతోనూరి పూసిన ఎట్టిమూలవ్యాధులైనను మానును.

అర్శఃకుఠారము—నేపాళములు ౧తు, పాదరసము ౧తు, గంధకము ౨తు, వీనినిమర్దించి, చెన్నచెర్లగడ్డ౧తు, తెల్ల అడవికంద ౧తు, వీనినిచేర్చి తడిగుడ్డచుట్టి, చీలమన్ను ఇచ్చి, కుమ్ములోవేసియుడికించి, పైనచెప్పినదినుసులతోజేర్చిమర్దించి, నేయిపూసిన భాండముననునిచి పొయ్యిమీఁదఁబెట్టి ఆవిరివచ్చువఱకు వండి, సెనగగింజంత మాత్రలుచేసి నీడనెండించి,ఒక్కొకమాత్రనుపుచ్చుకొనిన-రక్తవాతము,మూలవ్యాధిమానును.

సూరణగుటికలు—కరకబెరడు, సొంటి పదేసిపలములు, మిరియాలు పిప్పళ్లు ఇవి రెండేసిపలములు, మోడిరప, చవ్యము౬ప, చిత్రమూలము౮ప,యవక్షారము౬ప, కందగడ్డ౧౬ప, జీడిగింజలు౧౬ప, వీనినిచూర్ణముజేసి బెల్లము మిశ్రముచేసి తానిగింజంతమాత్రలుచేసి పులిమజ్జిగతో నొక్కసంవత్సరము భక్షించిన మూలవ్యాధి మానును,

సూరణాదిచూర్ణము—ఊరకంద ౧౬ పా - జీడిగింజలు ౮ పా- సొంటి ౫పా- మిరియాలు - పిప్పళ్లు - జీలకఱ్ఱ ఇవి ఒక్కొకపాలు, బ్రహ్మమేడి ౨పా- యవక్షారము ౨పా, వీనినిచూర్ణముచేసి దీనికి రెండింతల బెల్ల

మును పాకముపట్టి- యిందులో ఆచూర్ణమువేసికలియబెట్టి తానికాయం తయుంటలుచేసి, తామ్రభస్మము ౧ చిన్నమెత్తు చేర్చుకొని అల్లపురసము తోఁగాని, నీళ్ళతోఁగాని- చల్లతోఁగాని పుచ్చుకొనిన మూలవ్యాధులు- గ్రహణి-గుల్మము- కుష్ఠువులు-భగందరము-మూత్ర దోషములు మానును.

బాహుశాలగుడము——కంద ౧౦ ప, వృద్ధదారు ౪ ప, కరకపిందెలు – వాయువిళంగాలు – చిత్రమూలము – మాల్కాంగణివిత్తులు – తుంగగడ్డలు – సొంటి – తెగడ- కచ్చూరములు-చేఁదుపుచ్చ- నేపాళపువేళ్లు-పల్లేరువేళ్లు ఇవి ప్రత్యేకము రెండేసికర్షములు, జీడిగింజలు ౪ ప, వీనిని బాగుగదంచి ౪తూములనీళ్ళుపోసి తూమెడుగకాఁచి, పైదినుసులకు మూఁడుపాళ్ళు బెల్లమును ఉదకమునందువేసి బాగుగపచనముచేసి, తరువాత, చిత్రమూలము, తెగడ, నేపాళపువేళ్లు, మాల్కాంగణివిత్తులు, ఇవి ప్రత్యేకము ఒక్కొకపలము, సొంటి-మిరియాలు-పిప్పళ్లు-ఏలకులు-ఉసిరికవరుగు-లవంగపట్ట- ఇవి ప్రత్యేకముగ మూఁడేసిపలములు, వీనిని చూర్ణముచేసి బెల్లపు పాకములోవేసి కలియబెట్టి చల్లారినపిదప, ౧౬ పలముల తేనెనుకలిపి, వటకములుచేసి భక్షించిన సకల మూలవ్యాధులును, గ్రహణి, పాండు, ప్రమేహ, గుల్మాదిరోగములును మానును.

కొడిశలేహము——కొడిశపట్టగతు, దీనిని నలియగొట్టి, ఒకద్రోణము నీళ్ళలో వేసి నాలవపాలు మిగులునట్లుకాఁచి వడియపోసి, ముక్కాలువీసె బెల్లమునువేసి, చిక్కనగునట్లు పాకముపట్టి, దానిలో-రసాంజనము, బూరుగబంక, సొంటి, పిప్పలి, మిరియాలు, అంతరదామర, చిత్రమూలము, విషబొద్ది, కరక తాడి యుసిరికలు, మారేడుపిందెలు, కొడిశవిత్తులు, వస, అతివస, జీడిగింజలు, వాయువిళంగాలు, కురువేరు ఇవి ప్రత్యేకము ఒక్కొకపలము, వీనిని చూర్ణము చేసి పైపాకములోవేసి, ఆవునెయ్యి ౪ పలములుపోసి లేహపాకమునదించి చల్లారినపిదప, ౪ పలముల తేనెగలిపి కలియబెట్టి మేఁకమజ్జిగె పాలు పెరుగు నేయి నీళ్లు వీనిలో దేనితోనైనను వరగడుపున భక్షించినయెడ, అఖిల మూలవ్యాధులు, అతిసారము, గ్రహణి,పాండురోగము, భగందరాది రోగములు మానును.

మూలవ్యాధి గలవారు, మల మూత్రముల నడ్డగించుట, స్త్రీసంగమము, గుఱ్ఱము మొదలగువానిపైనెక్కుట ఈ మొదలగు పనులను వర్జించవలయు.

## అజీర్ణ రోగలక్షణము.

విశేషజలపాన, అకాలభోజన, మలమూత్రనిరోధ, అకాలనిద్రాదులవలన, అజీర్ణరోగముగలుగును. ఇందు, పులితేనుపులు-చెమట-భ్రమ



దప్పి - మూర్ఛ - కడుపుబ్బరము- శూల-ఓకర-నోటనీళ్లూరుట, ఈలక్షణములు కలుగును.

చికిత్స——కరక్కాయ ౩పల, మోడి౧ప, త్రికటుకములు౩ప, లవంగపట్ట, ఏలకులు,ఆకుపత్రి, ఇవిప్రత్యేకముకర్షమెత్తు, వీనిని చూర్ణముచేసి, ౩సేర్ల బెల్లమునుగలిపి మర్దించి ౪ పలముచొప్పున మాత్రలుకట్టి భక్షించిన అజీర్ణములన్నియు మానును.

——ఓమము, కరక్కాయలు, పిప్పళ్లు, సొంటి, ఇంగువ, వాయువిళంగాలు-ఉప్పు-పాదరలవణము-సైంధవలవణము – యవక్షారము-వీనిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి, భోజనమునందు జేర్చికొని నేయి వేసికొని ఐదుపిడచలు భక్షించిన, సకలాజీర్ణములు – గుదవాతము – కామిల, పాండువు శ్వాసకాసలు ఇవియన్నియు మానును.

అజీర్ణకంటకరసము——పాదరసము-వసనాభి-గంధకము – వీనిని సరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి దీనికి తుల్యముగ మిరియములను కలిపి, వాకుడుకాయలరసముతో మెత్తగనూరి యెండించి, ఈ ప్రకారము ౨౧ సార్లునూరి యెండించి కుంకుడుగింజంత మాత్రలు చేసి పూఁటకు ఒకమాత్రచొప్పున పుచ్చుకొనిన అజీర్ణములు, విషూచి మానును.

క్రవ్యాదరసము——౨ పలముల గంధకమును శుద్ధిచేసి కరఁగించి, అందు శుద్ధపాదరసము ౧ ప, తామ్రభస్మము ౧ ప,లోహభస్మము ౧ప, వీనిని గంధకములోవేసి కలియబెట్టి, ఆముదపాకులలోఁజుట్టి పేఁడగురుగులో అమర్చిన ఆముదపాకులలోఁబెట్టి కాఁచిచల్లారినపిదప దానినిఖల్వములోవేసి బాగుగనూఁది,ఈచూర్ణమును, ఇనుపబాణలిలోచేర్చి పొయ్యిమీఁదనునిచి,నిమ్మపండ్లరసము ౧ సేరుపోసి యిగురువరకుకాఁచి,తిరుగా ఖల్వములోవేసి, పొంగించిన వెలిగారము ౫ పలములువేసి, పంచకోలముల (అనఁగా – పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, సొంటి) కషాయముచేతను, పుల్లదానిమ్మపండ్లరసముచేతను, మర్దనభావనలుచేసి, ౫ పలముల కాచలవణమును మెత్తగానూరికలిపి, అన్నిటికి తుల్యముగ మిరియాలచూర్ణమునుజేర్చి- పిదప సెనగపులునుతో భావనచేసి, గాజు సీసాలోఁబెట్టుకొని ౨ గురిగింజలంత ఔషధమును సైంధవ లవణముతోఁగాని పుల్లనిమజ్జిగతోఁగాని భక్షించిన – ఎట్టిఅజీర్ణమైనను హరించి అగ్నిదీపనము గలుగును; మఱియు – దుష్టవాతము-కడుపుబ్బరము-తాపము-గుల్మము-మూలరోగము-శూల-గ్రహణి-మహోదరము మొదలగు రోగములును మానును.

మహాఫిరంగిలేహ్యము—సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, తాండి, కరక, ఉసిరిక, తుంగముస్తెలు, నాగకేసరాలు, దాచినిచెక్క, ఆకుపత్రి, జాజికాయ, జాపత్రి, ఏలకులు, లవంగాలు, ధనియాలు, సోపు, రాస్న, వట్టివేళ్ళు, మోడి, జటామాంసి, మరాటీలవంగాలు, కటుకరోహిణి, నేపాళాలు, పచ్చకర్పూరము, ఇవి సమభాగములు, వీని కన్నిటికి తుల్యము - ఫిరంగిచెక్క వీనిని చూర్ణముగొట్టి దీనికి సమముగ పంచదార కలిపి తగుమాత్రము తేనె - ఆవునెయ్యికలిపి లేహ్యపాకముగా వండి దించి తాని కాయంత యుంటలుచేసి రెండుపూటలయందును పుచ్చుకొనిన - అజీర్ణములు - శూలలు-మలబద్ధవికారములు - క్రిమిరోగము-అరుచి-కఫపైత్యవికారములు మానును.

---

## విషూచీలక్షణము:

వాతము మిక్కిలిదుష్టంబగుటవలన కడుపునసూదులతోఁబొడుచునటుల అనేకవేదనలతోఁగూడి, కడుపునొప్పి-భ్రమ-వణఁకు- దేహము స్తంభించుట- దప్పి- అతిసారము- వాంతులు- నిద్రానాశము మొదలగు లక్షణములుగలిగియుండిన విషూచి యనంబడును.

చికిత్స—విషూచి రోగమునందు- మడిమలయందు రక్షవేయుటయు-చిల్లపెంకులనుకాల్చి వానినిత్రొక్కించుటయు-గంధకమునుగాని-కుంకుమపువ్వునుగాని నిమ్మపండ్లరసముననూరి త్రాగించుటయు-హితకరంబులు.

—సొంటి-పిప్పలి-మిరియాలు-పసుపు-కానుగువిత్తులు వీనిని చూర్ణముచేసి నిమ్మపండ్లరసముకలిపి ముక్కులోకి ఎక్కించినను-లేక కన్నులకుకాటుకగాపెట్టి తడిగుడ్డచే శరీరమునుతుడుపుచుండినను విషూచులుమానును.

—జీలకఱ్ఱ- సైంధవలవణము - పాదరలవణము- సొంటి- పిప్పలి- మిరియాలు- వెల్లుల్లి- నేతిలోవేయించిన ఇంగువ వీనినిచూర్ణముచేసి నిమ్మపండ్లరసమున మర్దించి రేగుపండంతమాత్రలుచేసి ఒక్కొకమాత్రచొప్పున పుచ్చుకొనిన వాంతి-భ్రాంతి మానును.

అగ్నిముఖరసము—గంధకము-వసనాభి-రసము వీనిని సరిపాళ్ళుగనూర్చి- అల్లపురసమునమర్దించి-రావి-చింత-ఉత్తరేణి వీనిక్షారములను - వెలిగారక్షారము - యవక్షారము-సర్జక్షారము-సొంటి-పిప్పలి - మిరియాలు-కరకతాండి యుసిరికలు - జాజికాయ-లవంగములు- శంఖభస్మము - వీని చూర్ణమును- పుష్కరమూలము - మోదుగుపువ్వులదంటు - యవలు వీనిక్షారములను- సరిపాళ్లుగ గలిపి -రెండేసిపాళ్లు ఇంగువను



జీలకఱ్ఱను కలిపి - నిమ్మపండ్లు-పులిచింత మొదలగు పుల్లనిరసములతోమర్దించి- కందిగింజంతమాత్రలుచేసిపుచ్చుకొనిన-విషూచి-శూల-అజీర్ణము- గుల్మము- ఎక్కిళ్ళు మానును.

విషూచికా రసయోగము—శుద్ధపాదరసము-నాభి - గంధకము - వెలిగారము- హేమమాక్షికము-అతివస-సొంటి-ఇవిసమభాగములు - ఇంగిలీకము ౭ భాగములు- వీనిని నిమ్మపండ్లపులుసుతోమర్దించి - వ్యాధిబలానుగుణముగ మాత్రలుచేసి అనుపానవిశేషములతోఁ బ్రయోగించిన అతిసారములు విషూచులు మానును. అనుకూలపథ్యము నాచరింపవలయు.

---

## క్రిమిరోగలక్షణము.

ఈరోగంబున- జ్వరము- వాంతి- శూల-ముఖము వెలవెలబోవుట భ్రమ- అన్నద్వేషము- అతిసారము ఈలక్షణములుగలుగును.

చికిత్స—ఇంగువ- వేపవిత్తులు- వాయువిడంగాలు- కొడిశవిత్తులు వీనిని చూర్ణముచేసి ఆవుపంచితముచే బుచ్చుకొనవలయు; లేక - వేపచిగురు ఓమము వీనిని చూర్ణముచేసి తేనెతోబుచ్చుకొనవలయు; సకలక్రిమిరోగములును మానును.

—మాడయెత్తు వాయువిడంగములను నీళ్లతోనూరి రసముపిడిచి దానికిసరిగ కాకరాకుపసరును నూనెబొట్టును గలిపి త్రాగిన కడుపుననున్న సూక్ష్మక్రిములుబాడిపడును.

కీటమర్దనరసము—రసము ౧పాలు, గంధకము ౨పా, ఓమము ౩పా, వాయువిడంగములు ౪పా, విషముష్టిచెక్క ౫పా, మోదుగవిత్తులు ౬పా, వీనిని చూర్ణముచేసి తేనెకలిపి పాకముచేసి మాడయెత్తుమాత్రలుచేసి తుంగముస్తెలకషాయముతో బుచ్చుకొనిన జంతురోగము నశించును.

ఆకుకూరలు, తీపి పులుసు పదార్థములు, పాలు నెయ్యి మాంసము మొదలగు వానిని జంతురోగులు వర్జింపవలయు.

---

## పాండురోగలక్షణము

నేత్రములు, కనుబొమ్మలు, పాదములు, నాభి, గుదస్థానము, గుహ్యము ఈప్రదేశములయందు వాపుగలిగి, బలము అగ్నిదీపనము నశించి కృశించుట, కన్నులుతెల్లగనుండుట, అరుచి, దగ్గు, భ్రమకలుగుట, శ్వాస

చేతులు వాచుట ఈలక్షణములుగలది పాండురోగమని తెలిసికొనవలయు. నేత్రములు, దంతములు, గోళ్లు, దేహము ఇవి రక్తములేక తెల్లబారియున్న పాండురోగి జీవింపడు.

చికిత్స — కరక తాడి యుసిరికలు, కటుకరోహిణి, నేలవేము, వేపపట్ట, తిప్పతీగ, అడ్డసరము ఇవి సమభాగములు వీనిని కషాయముపెట్టి తగునట్లు తేనెగలిపి పుచ్చుకొనిన - పాండురోగము, కామిల ఇవి మానును.

తాళీశచూర్ణము — తాళీశపత్రి తు ౧, మిరియాలు తు౨, సొంటి తు ౩, పిప్పళ్లు తు౪, వంశాక్షీరి తు౫, ఏలకులు తు½, దాచినిచెక్క తు½, వీనినిచూర్ణముచేసి, పిప్పళ్లకు ౮ భాగములు పంచదారకలిపిభక్షించిన - కాసశ్వాసములు, ఛర్ది, శూల, పాండు జ్వరములు లోనగునవి మానును.

లవంగాదిచూర్ణము — లవంగాలు ౧పాలు, నాగకేసరాలు ౨పా, ఏలకులు ౨పా, పిప్పళ్లు ౪పా, మిరియాలు ౧౬పా, సొంటి ౧౦పా, పెన్నేరుగడ్డ ౩౨పా, వీనినిచూర్ణముచేసి, ౬౪పా- పంచదారకలిపిభక్షించిన, క్షయరోగము, పాండువు, అసృగ్దరము, ప్రమేహము, సోమరోగము, కామిల. పురాణజ్వరములు మొదలగునవి మానును.

ఏకోత్తరవృద్ధిలక్ష్మీవిలాసరసము — స్వర్ణభస్మము ౧పా, రజతభస్మము ౨పా, తామ్రభస్మము ౩ పా, కాంతభస్మము ౪ పా, ఉక్కుభస్మము ౫పా, మండూరభస్మము ౬పా, అభ్రకభస్మము ౭పా, వంగభస్మము ౮పా, నాగభస్మము ౯పా, మౌక్తికభస్మము ౧౦పా, ప్రవాళభస్మము ౧౧పా, రసభస్మము ౧౨ పా, రససిందూరము ౧౩పా, ఇట్లు వీనినికూర్చి, జాపత్రి ౧పా, త్రికటుకములు ౨పా, త్రిఫలములు ౩పా, చతుర్జాతకములు ౪పా, (అనగా- దాచినిచెక్క, ఆకుపత్రి-ఏలకులు, నాగకేసరాలు) కుంకుమపువ్వు ౫పా, కస్తూరి ౬పా, వీనిని ప్రత్యేకకషాయములచేత ఏడు దినములు మెత్తగమర్దించి, కడపటిమర్దనలో తగుపాటి కస్తూరిని కలిపి మర్దించి మినపగింజంత మాత్రలుచేసి అనుపానవిశేషములతో నియ్యవలయు.

అనుపానములు — క్షయరోగమునకు - తేనె, పిప్పళ్ళు; శ్వాసరోగమునకు-గంటుభారంగి, సొంటి; పాండురోగమునకు-బెల్లము, తేనె, మిరియాలకషాయము; వాతమునకు-బెల్లము, చనుబాలు;—ప్రమేహమునకు, వీర్యవృద్ధికిని - పంచదార, నేలగుమ్మడిదుంపరసము;—గ్రహణికి- తేనె, సొంటి;—ప్రదరరోగమునకు- తేనె, పంచదార; శైత్యరోగమునకు పిప్పళ్ళు, తేనె; మూత్రకృచ్ఛ్రమునకు - తేనె, వావిలివేళ్లరసము,



బెల్లపుపానకము, సొంటి, రేణుకలు;—శూలలకు-జీలకఱ్ఱ, కటుకరోహిణి,—తలనొప్పికి-ఖురాసాని ఓమము;—పార్శ్వశూలలకు - సొంటి, మోడి;—సమస్తశూలలకు-గచ్చపలుకులరసము;—క్షయపాండువులకు - పంచదార ఆవునేయి, తేనె, ఈఅనుపానములతోఁ బుచ్చుకొనవలయు; మఱియు ఈయౌషధమువలన ఉన్మాదములు, మతిభ్రంశములు, ఉదరరోగములు, మేహములు, మూలరోగములు, భగందరములు, వాతశూలలు నేత్రదృష్టిమాంద్యములు, కఫవాతవికారములు, దేహకార్శ్యములును మానును.

సిద్ధమండూరము — సన్నగపొడిచేసిన మండూరము ౮ పలములను, ౬౪ పలముల ఆవుపంచితములో వేసి పచనముచేసి, దానిలో గలిజేరు సొంటి, పిప్పలి, మిరియాలు, తెగడ, వాయువిడంగాలు, పసుపు, మ్రానిపసుపు, చిత్రమూలము, దేవదారు, పుష్కరమూలము, నేలదంతి, కరక తాడి యుసిరికలు, కొడిసెవిత్తులు, చవ్యము, తుంగముస్తెలు, అతివస, మోడి, చేదుబీరవిత్తులు, ఇవి ప్రత్యేకము ౧ కర్షముచొప్పున గూర్చి చూర్ణము చేసి, దానిని మండూరము పక్వమగునప్పుడు ఆమండూరములో వేసి, రేఁగుపండంతమాత్రలుచేసి భక్షించిన, సమస్తపాండువులు, వాపులు, గుల్మములు, ఉదరరోగములు మూలవ్యాధులు, క్రిమిరోగము మొదలగునవిమానును

లఘుఖండార్ద్రకలేహ్యము — సొంటి, పిప్పలి, మిరియాలు, చెంగల్వకోష్టు, లవంగాలు, జాజికాయ, వట్టివేళ్లు, కురువేరు, ఓమము, జాపత్రి, నల్లజీలకఱ్ఱ, తెల్లజీలకఱ్ఱ, చవ్యము, చిత్రమూలము, వెదురుబియ్యము, దనియాలు, ఏలకులు, మంచిగంధము, కచోరములు వీనిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి, ౮ భాగములు అల్లపుముక్కలను కలిపి, ఆవునెయ్యి, తేనె పంచదార వీనినిపోసి లేహ్యపాకముగావండి దించుకొని రేఁగుపండంతచొప్పున సేవించిన- పైత్యములు, గుల్మములు, ప్రమేహములు, పాండువులు, కాసము, అరుచియు మానును.

పూర్ణచంద్రరసము — రసము, గంధకము, రెండేసి కర్షముల యెత్తు, జారణము చేయఁబడిన అభ్రకభస్మము ౧పలము, లోహభస్మము ౧ప, వంగభస్మము ౮ మాడలయెత్తు, వెండిభస్మము ౨తు, బంగారుభస్మము౧తు, రాగిభస్మము ౧తు, కంచుభస్మము ౧తు, లవంగములు, లవంగపుపట్ట, ఏలకులు, జాజికాయ, పచ్చకర్పూరము, ప్రేంకణము, తుంగముస్తెలు

వీనిని ప్రత్యేకము ౧ పలముచొప్పునఁ జేర్చి కలుబందరసమున మర్దించి చల్లపిల్లిగడ్డలు-ఆముదపువేళ్లు వీనిరసములతో వెవ్వేరుగ ఊరబెట్టిముద్దచేసి ఆముదపుఆకులలోబెట్టి, ఒక్కదినమంతయు ధాన్యరాశిలోనునిచి తీసి తిరిగి మర్దించి, రెండుగురిగింజలంత మాత్రలుచేసి ఒక్కొకమాత్రచొప్పున తమలపాకులోబెట్టుకొని భక్షించవలయు. ఇది, సమస్తరోగములను పోగొట్టి బలమును వీర్యమును వృద్ధిచేయును; కాసశ్వాసలు, అరుచి, శూలలు, అగ్నిమాంద్యము, అజీర్ణము, గ్రహణి, భగందరాది వ్రణములు, పాండువు కామిల, ప్రమేహము మొదలగు రోగములను నశింపఁజేయును; మఱియు నిది వాజీకరణమునకుఁగడు శ్రేష్ఠమైనది; మేధ, సంతోషము, పుష్టి, శరీరమునకు మన్మథసదృశకాంతి వీనినికలుగజేయును; ఈయౌషధమును సేవించిన వానియందు స్త్రీలు మిగులప్రేమగలిగియుందురు. దీనిని వంధ్యాస్త్రీలు సేవించినయెడ నిశ్చయముగ సంతానముగలుగును. మఱియు, దుర్బలులకు బలంబును, వృద్ధులకు కామోద్రేకంబును గలిగించును.

రససిందూరభూషణము—రసము-సిందూరము వీనిని ఒక్కొక పలమువంతున గూర్చి అడ్డసరపురసమున నొకజాముమర్దించి, అరచేతియందు గుండ్రగ బిళ్ళచేసి, పండ్రెండంగుళముల పొడవుగలిగిన కాల్పనిమూసయందు నాలుగుపలముల గంధకమును వేసి దానిమీఁద ఆబిళ్ళనుపెట్టి మూతిని రాతిబిళ్ళతోమూసి, చీలమన్ను ఇచ్చి, లఘుపుటమునువేసి, దానిలోనిబిళ్ళనుతీసి ఖల్వమునందు చూర్ణముచేసి, దీనికి పదిభాగములు లోహభస్మమునుగలిపి, దీనికంతటికి పదియవపాలు వెల్లుల్లిరసముగలిపి నూరి సెనగగింజంత మాత్రలుచేసి అనుపానములతో బుచ్చుకొనిన వాతపాండువులు మానును.

## శోఫలక్షణము.

దేహము జడముగనుండుట, మనస్సుస్వస్థముగానుండుట, దేహమునందువాపు, నరములుబ్బియుండుట, శరీరము వర్ణహీనముగనుండుట, ఈ లక్షణములు శోఫరోగమునందుగలుగును, శరీరమునకునడుమనైనను, సమస్తావయవములయందైనను వాపుజనించిన గష్టసాధ్యము, అధోభాగంబున జనించి పొడవుగ వ్యాపించిన వాపు అసాధ్యము; స్త్రీకి ముఖమునందును పురుషునికి పాదములయందును వాపుపుట్టిన కుదురుట దుర్లభము.



చికిత్స—సొంటి, జీలకఱ్ఱ, వాకుడువేళ్ళు, విషబొద్ది, వావిలివిత్తులు, తుంగముస్తెలు, చిత్రమూలము, గజపిప్పళ్ళు, పిప్పళ్ళు, జటామాంసి, పసుపు, వీనిని సరిపాళ్లుగజేర్చి చూర్ణముగొట్టి, ఒక్కొకతులము చొప్పున కొంచెపు వేడినీళ్లతోఁ బుచ్చుకొనిన వాపు నివర్తించును.

—మాదీఫలపుపట్ట, జటామాంసి, దేవదారుపట్ట, తక్కలిపట్ట, సన్నరాష్ట్రము, సొంటి, నల్లయుప్పివేరు వీనిని సరిపాళ్లుగ గూర్చి నీళ్లతో నూరి లేపనముచేసిన వాతశోఫలు మానును.

శోఫారిరసము—ఇంగిలీకము, నేపాళము, మిరియాలు, పిప్పళ్లు, వెలిగారము వీనిని సరిపాళ్ళుగగూర్చి చూర్ణముచేసి ఖల్వములోవేసి మర్దించి రెండు గురిగింజలంత నేతితో బుచ్చుకొనిన, వాపులు మానును.

రసభూపతి—రసము-గంధకము-వసనాభి-ఉక్కుభస్మము - తామ్రభస్మము వీనిని సరిపాళ్ళుగగూర్చి - మూఁడుదినములు హంసపాది ఆకురసముతో మర్దించి - కుప్పెలోబెట్టి చీలమన్నిచ్చి - వాలుకాయంత్రమునందు ౧౪ దినములు మెల్లనిమంటతోవండి చల్లారినపిదపతీసిమినపగింజంతచొప్పున అల్లపురసముతోనిచ్చినసమస్తశోఫలుమానును.

---

## కామిలారోగలక్షణము.

పాండురోగలక్షణములుగలిగి కన్నులు, ముఖము, మలమూత్రములు ఇవి పచ్చనగుట, దాహము, అజీర్ణము, దుర్బలము, అరుచి మొదలగు లక్షణములు గలిగియుండిన కామిలారోగమని యెఱుఁగవలయు.

చికిత్స—తుమ్మిపూలరసమునందు-గోరోచనము, మంచి యింగువ వీనిని కొద్దిగకలిపిగాని, నెల్లివరుగు, కావిరాయి, మ్రానిపసుపు వీనిని గంధముదీసిగాని కన్నులకుకాటుకపెట్టిన కామిలలన్నియు హరించును.

లవంగాదిచూర్ణము—లవంగాలు ౧పాలు, నాగకేసరాలు ౨పా, ఏలకులు ౨పా-పిప్పళ్లు ౮పా, మిరియాలు ౧౬పా, సొంటి ౧౦పా, పెన్నేరుగడ్డ ౩౨పా, వీనినిచూర్ణముగొట్టి, ౬౮ పాళ్లపంచదారలోకలిపి పాలతోపుచ్చుకొనిన.. పాండువు - క్షయము- అసృగ్దరము - ప్రమేహము- సోమరోగము - కామిల మొదలగునవి మానును.

—లోహభస్మము, మానిపసుపు, పసుపు, కరక్కాయ, తానికా

య, నెల్లివరుగు, కటుకరోహిణి వీనిని సరిపాళ్లుగ చూర్ణముచేసి తేనె నెయ్యికలిపి పుచ్చుకొనిన సమస్తకామిలలు మానును.

కషాయము — చింతాకును నలియగొట్టి, దానిలో ఇనుపతునుకలనైనను, చిట్టెపు చూర్ణమునైననువేసి కషాయముపెట్టి వడియబోసి, దానిలో పిప్పలిచూర్ణమును కలిపి పుచ్చుకొనిన, సమస్తపాండువులు, శోఫలు, కామిలలు మానును.

పంచాస్యరసము — రసభస్మము, అభ్రికభస్మము, కాంతభస్మము, లోహభస్మము, తామ్రభస్మము, తాళకము, హేమమాక్షికభస్మము వీనిని సరిపాళ్లుగ గ్రహించి, దేవదారుచెక్కరసముతో నొక్కదినముమర్దించి, కుప్పెలోబెట్టి వాలుకాయంత్రమునందు మూఁడుదినములువండి చల్లారినపిదప ఖల్వములోవేసి, దానిలో - తిప్పతీఁగె, కలువగడ్డలు, తామరగడ్డలు వీని చూర్ణమును కలిపి పాలతోను అతిమధురకషాయముతోను ఒక్కజామమర్దించి, మినపగింజంతమాత్రలుచేసి తేనె పంచదారలతోఁ బుచ్చుకొనిన కామిలలు మానును.

---

## రక్తపిత్తరోగలక్షణము.

ఉష్ణద్రవ్యములను, పులుసు, ఉప్పుపదార్థములను, పైత్యకరపదార్థములను మిక్కిలి సేవించుటవలన వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించి రక్తపిత్తరోగమును గలుగజేయును. అందు వాతమువలన నెత్తురు నలుపుగలిగి, ఎఱ్ఱుపారి సన్నపునురుగుతోఁగూడి రూక్షముగను, పిత్తమువలన నెత్తురు కషాయమువలెను, నల్లగను, గోమూత్రమువలెను, పొగవలెను, కాటుకవలెను అధోముఖమునుండి వెడలును. శ్లేష్మమువలన రక్తము ఇంచుక తెలుపుగను చిక్కఁగను బంకగను అధికముగను నోటనుండి వెడలును.

రక్తపిత్తములకు, సత్వముకొలదిలంఘనముచేయించవలయు. అధోగతమైనపుడు వాంతికిని, ఊర్ధ్వగతమైనపుడు విరేచనమునకునిప్పించవలయు

చికిత్స — ఉత్తరేణియాకు రసమునుగాని, అడ్డసరపాకు రసమునుగాని శర్కరలోగలిపి త్రాగిన, ఊర్ధ్వాధోగత రక్తపైత్యము మానును.

— మేడి, గుమ్మడి, అరఁటి, ఖర్జూరము వీనిపండ్లను ప్రత్యేకముగ తేనెతో సేవించిన రక్తపైత్యములు మానును.

— రక్తము ఆసనమున వెడలినయెడ రక్తాతిసారచికిత్స చేయవలయు; మేఢ్రమందు వెడలిన, పిత్తప్రమేహచికిత్స చేయవలయు; ముక్కున



వెడలిన దానిమపువ్వులనైనను, గరికివేళ్లనైనను, ఉత్తరేణియాకునైనను, చనుబాలతో రసముదీసి నస్యముచేయవలయు; లేక మఱ్ఱిచిగుళ్లరసమును శర్కరతో నస్యముచేయవలయు.

మహాచంద్రకళారసము — రసము, కాంతభస్మము, అభ్రికభస్మము, గంధకము వీనిని సరిపాళ్లుగగూర్చి మెత్తగమర్దించి, భద్రముస్తెలు, విరజాజిపువ్వు, తామరతూండ్లు, పిల్లిపీచరవేళ్ళు, గరికెవేళ్ళు, మొగలిచన్ను, కలుబంద, పర్పాటకము, సహదేవి, అడవిసదాప, వీనిని వెవ్వేరుగ చన్నీళ్ళతో మర్దించి రసముతీసి, ప్రతిదినము ఒక్కొకరసముతో మర్దించి, దానిలో - తిప్పసత్తు, వట్టివేళ్లు, పర్పాటకము, పిప్పళ్ళు, శ్రీగంధము సుగంధిపాల వీనిని సరిపాళ్ళుగ చూర్ణముచేసికలిపి, ద్రాక్షపండు, ఖర్జూరపండు, శర్కర, ఇప్పపువ్వు, తేనె, యష్టిమధుకము, తవాక్షీరి, వీనికషాయమున నేడుదినములూరబెట్టి, నీడ నెండించి రెండుగురిగింజలంతమాత్రలుచేసి ఒక్కొకమాత్రచొప్పున - దీపద్రాక్షపండు తేనె వీనియనుపానముతో సేవించిన - అశేషపైత్యరోగములు, ద్వంద్వరోగములు, అంతర్దాహబహిర్దాహితములు, అగ్నిమాంద్యము, తాపజ్వరము మొదలగునవి మానును. జాజికాయలపొడివేసి కాఁచిన ఆవునేతి అనుపానముతో బుచ్చుకొనిన- స్త్రీల కును మరోగములును, ఖర్జూరపండు - తేనె వీనియనుపానముతో బుచ్చుకొనిన - ఊర్ధ్వాధోగత రక్తపైత్యములు, రక్తవాంతులు, మూర్ఛ, మూత్రకృచ్ఛ్రములు మానును.

---

## అమ్లపిత్తలక్షణము.

అజీర్ణము, బడలికగలుగుట, నోటనీరుస్రవించుట, పులుసుగ కారముగ త్రేఁపులువచ్చుట, నోటఅరుచి, కంఠము-ఱొమ్ము వీనియందుమంట ఈలక్షణములుగలది అమ్లపిత్తమనియెఱుంగవలయు.

చికిత్స — రేలవేళ్లు, కరకక్కాయలు, తెగడ, చంద్రచెక్క ఇవిదినుసుకు కర్షమెత్తుచొప్పునగూర్చి కషాయముపెట్టి పుచ్చుకొనిన, అనేకవికారములతో గూడిన అమ్లపైత్యములు మానును.

— సీమనేలవేము, కరక తాడి యుసిరికలు, వేఁపపట్ట, చేఁదుపొట్ల, గుంటగలగర, అడ్డసరము, పర్పాటకము, తిప్పతీఁగె, వీనినికషాయముపెట్టి తేనెకలిపియిచ్చిన అమ్లపిత్తము మానును.

దుర్గావటకములు — శుద్ధిజేసినగంధకము, రసము, మణిశిల, ఉమ్మెత్తవిత్తులు, అభ్రికము, సుగంధపాలవేళ్లు, కాఁచు, కటుకరోహిణి, కలుబంద

గుజ్జు,పిప్పళ్లు,ఇవిసమభాగములు- వీనిని తులసియాకురసమునమర్దించి, మిన పగింజంత మాత్రలుచేసి పుచ్చుకొనిన అమ్లపైత్యములు మానును.

ఖండకూశ్మాండలేహము—బూడిదెగుమ్మడిరసము, ౫౦పలములు, ఆవుపాలు ౫౦ప, ఉసిరికపరుగుపొడి ౮ప, శర్కర ౮ప వీనినొక్కటిగాజేసి, మెల్లనిమంటచే లేహ్యాపక్వముగ వండిదించుకొని,పూటకు ౪ పలమువంతు న బుచ్చుకొనిన అమ్లపిత్తముమానును.

మహాప్రాణేశ్వరరసము—గంధకము,అభ్రకభస్మము,రసము వీనిని సరిపాళ్ళుగ గూర్చి, నేలతాటిగడ్డలు - హంసపాదిఆకు వీని రసములతో మూడుదినములు బాగుగ మర్దించి, కుప్పెలోబెట్టి, మూతినిమూసి, ౮ జాములు వాలుకాయంత్రమునవండి, చల్లారినపిదపతీసి, దానిలో పిప్పళ్ళు, మోడి, సొంటి, చిత్రమూలము, చవ్యము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, పంచలవణములు, సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, ఓమము, మిరియాలు, మహిసాక్షిగుగ్గిలము, నాభి, కరక తాడి యుసిరికలు, లవంగములు లవంగపట్ట, ఆకుపత్రి,ఏలకులు,అతివస,దుంపరాష్న, పెన్నేరుగడ్డ, వీని ప్రత్యేకచూర్ణమును రసమునకు సరిపాలుగగలిపి - గుంటగలగర, అల్లము, నిమ్మపండ్లు వీని ప్రత్యేకరసములతో నేడుదినములు మర్దించి, కందిగింజంతమాత్రలుచేసి అనుపానములతోడ భక్షించిన, సకలసన్నిపాతములు, ధనుర్వాతము, అగ్నిమాంద్యము, పాండువు, కామిల మూలవ్యాధి, క్షయము, గ్రహణి, అమ్లపైత్యము మొదలగు రోగములు మానును.

## శీతపిత్త లక్షణము.

దేహమున దురద, పొట్లు, తాపము, వాపు,జ్వరము, అగ్నిమాంద్యము, అరుచి, తబ్బిబ్బుమాటలు, మిక్కిలి పైత్యము ఈలక్షణములు కలిగియుండిన శీతపైత్యరోగమని యెరుంగవలయు.

చికిత్స—తిప్పతీఁగె, పసుపు, వేఁపచెక్క, దూలగొండివేళ్లు, వీనిని ప్రత్యేకముగ కషాయములుపెట్టిపుచ్చుకొనిన శీతపైత్యజ్వరములుమానును

—కరక్కాయలచూర్ణమును తేనెతోఁగాని, లేక- తెగడచెక్కను- పిప్పలి,శర్కరలఅనుపానముతోఁగాని, లేక-చంద్రచెక్కకషాయమును- తేనె పిప్పలిఅనుపానముతోగానిపుచ్చుకొనినచిరకాలపుశీతపైత్యములుమానును

శీతారిరసము—రసము ౧పాలు, గంధకము ౨పా, వీనిని చిత్రమూలరసముతోను, తెల్లగలిజేరురసముతోను మర్దించి దానిలో ౮పాళ్లు పండినజిల్లేడాకులరసము



పోసి ప్రొయ్యిమీఁదనునిచి, మెల్లనిమంటచేత పక్వముచేసి, రసమునకు అరపాలు నాభిపొడికలిపి చిత్రమూల కషాయముతో మరలనుడికించితీసి మర్దించి రెండుగురిగింజలంతమాత్రలుచేసి నీడనెండించి పూఁటకు ౧ మాత్రచొప్పున మిరియపు పొడికలిపిన నేతి అనుపానముతో పుచ్చుకొనిన శీతపిత్తములు మానును. ఇచ్ఛాపథ్యము.

---

## అసృగ్దరలక్షణము.

స్త్రీలకు-రక్తపైత్యమువలన రక్తము యోనినుండి వెడలుచుండిన- ప్రదరమనబడును- దీనికి రక్తపిత్తచికిత్సలను చేయవలయు.

చికిత్స—శిలాజిత్తు,మూరేడువేళ్లు,వీనినిచూర్ణముచేసిబియ్యపుకడుగులోను శర్కరలోను కలిపి భక్షించిన ప్రదరరోగములుమానును.

—మంచికావిరాయి-నేరేడుచిగుళ్లు-కలువగడ్డ వీనినినూరిబియ్యపుకడుగులోకలిపి కర్షమెత్తుచొప్పున తేనెగలిపిభక్షించినప్రదరములుమానును.

—కలువగడ్డలను పాలతోనూరి పొత్తికడుపున, ఆరఁగా ఆరఁగా బట్టించవలయు. కారుపెసరరసము నాలుగుకుంచములు, నూనెకుంచెడు, నూనెకు ౮పాళ్లు కారుపెసరవేళ్లకల్కము, ఇట్లు వీనినన్నిటిని కలిపివండిన తైలములో దూదితడిపి, ఆదూదిని యోనిలోపెట్టిన నెత్తురు మానును.

ధాత్రీఘృతము— ఉసిరికకాయలరసము, నేలగుమ్మడిగడ్డలరసము గుమ్మడికాయలరసము, ఇవి దినుసుకు నాలుగేసికుంచములు, నెయ్యికుంచెడు, దాడిమపండు- యష్టిమధుకము-మంచిగంధము ఇవి నేతికి ౮వ పాలు చొప్పున కల్కముచేసి, కాఁచిన నెయ్యిలో శర్కరగలిపిసేవించిన ప్రదరము, పైత్యపాండువు, పైత్యగుల్మము, రక్తపైత్యము, రక్తస్రావముమానును.

ప్రదరనాశనరసము—రసము, గంధకము, వంగభస్మము, వెండి భస్మము,పాలతుత్తము, గవ్వలభస్మము ఇవిప్రత్యేకము పదేసి చిన్నములయెత్తు,లోహభస్మము ౧౹ వరాయెత్తు వీనిని కలుబందరసముతో ౮జాములుమర్దించి మాత్రలుచేసియిచ్చిన ప్రదరరోగములు మానును.

బాలసూర్యోదయము—రసము ౧పాలు, గంధకము ౩పా, నాభి ౩పా, తామ్రభస్మము - ఉక్కుభస్మము ఇవి ప్రత్యేకము రెండుపా, ఇంగువ

౪పా, అభ్రకభస్మము ౫పా, మిరియాలు అన్నిటికిసమము వీనిని ఖల్వము నవేసి మెత్తగచూర్ణముచేసి, ఆవునేతితోగాని - లవంగాలు జీలకఱ్ఱలతోగాని ౫చిన్నములయెత్తుచొప్పున పుచ్చుకొనిన సకలజ్వరములు, పాండువు, శ్వాసకాసలు, ప్రమేహము, క్షయము, మూలవ్యాధి, లింగరోగములు, యోనిదోషములు, ప్రదరరోగములు మానును. ఆవువెన్న పంచదార వీనితో బుచ్చుకొనిన కుసుమరోగములు మానును.

ఫలఘృతము—మంజిష్టి, యష్టిమధుకము, చెంగల్వకోష్టు, కరక తాడి యుసిరెకలు, శర్కర, ముత్తవపులగము, మేద, పిన్నపాల, కాకోళి, పెన్నేరుగడ్డ, ఓమము, మాగ్రినిపసుపు, పసుపు, కటుకరోహిణి, కలువగడ్డలు, తెల్లకలువగడ్డలు, ద్రాక్షపండు, చందనము, రక్తచందనము, వీనిని దినుసుకు ౧కర్షము చొప్పునగూర్చి కల్కముచేసి ౧ ప్రస్థము నేతిలోగలిపి, నేతికి ౮పాళ్లుగల చల్లపిల్లివేళ్ళరసము, అంతమాత్రముపాలు వీనినికూడకలిపి, నీరిగురువరకుకాచి, మిగిలినఘృతమునుదించుకొనిపుచ్చుకొనిన, యోనిరోగము, రక్తస్రావము, గర్భస్రావము మొదలగునవిమానును, సంతానవృద్ధి-దీర్ఘాయుష్యముగలుగును. మృతప్రసవము, కన్యాప్రసవముగల స్త్రీలు పుచ్చుకొనిన-మంచిబుద్ధి, రూపముగలపుత్రులుగలుగుదురు. ఈఫలఘృతమును పురుషుడు పుచ్చుకొనినయెడ, వీర్యవృద్ధిగలిగి, దృఢసంభోగశక్తిగలవాడగును.

---

## క్షయరోగలక్షణము.

విరుద్ధాహార విహారములవలన వాతాదిదోషములు ప్రకోపించి, మూడువిధము లగుక్షయరోగములబుట్టించును. మఱియు, ధాతుక్షయము వలనను, మలమూత్రాదివేగనిరోధమువలనను, నాలవదియగుఆగంతుక్షయముగలుగును. దీనియందు బలము, మాంసముక్షీణించును. పార్శ్వములు తల నొప్పిగలిగియుండును. వాంతి, గొంతురాపు, దగ్గు, శ్వాసము, అరుచి, జ్వరము, ఇవికలిగియుండును. రాజయక్ష్మమునందు కడుపుబ్బరము, ప్రక్కలు నొప్పి నెత్తురుకక్కుట, స్వరభంగము, అతిసారము, దగ్గియుమిసిన చీమువలెనుండుట ఈలక్షణములుగలుగును. ఇట్టిరోగి జీవించుట దుర్లభము.



చికిత్స—క్షయరోగము ప్రబలముగనుండునపుడు, వమన, విరేచన, ఆసనవస్తి, శిరోవస్తి, నస్యకర్మలను చేయించవలయు.

—పెన్నేరుగడ్డకషాయములోగాని, వెన్నలోగాని, శర్కరను తేనెనుకలిపి పుచ్చుకొనిన, క్షయముమాని శరీరమునకు పుష్టికలుగును.

—మేకపాలు, మేకపంచితము, మేకపెంటికలరసము, మేకపెరుగు, మేకనెయ్యి ఇవిదినుసుకు కుంచెడు, పంచలవణములన్నిచేరి కుంచెడు వీనిని కాచి వడియగట్టి పుచ్చుకొనిన క్షయమునశించి పుష్టికలుగును.

—వాకుడువేళ్లు, సొంటి, భారంగి, కసివెందవేళ్లు, నేలయుసిరికవేళ్లు వీనిని కషాయముపెట్టి పిప్పలిపొడి తేనె వీనిని కలిపి సేవించిన అగ్నిదీపనము పుష్టిగలిగి క్షయము మానును.

తాళీశచూర్ణము—తాళీశపత్రి ౧ వరాయెత్తు, మిరియాలు ౨వ, సొంటి ౩వ, పిప్పళ్ళు ౮వ, తవాక్షీరి ౫వ, లవంగపుచెక్క ౪వ, ఏలకులు౧వ, వీనినిచూర్ణముచేసి, పిప్పళ్లకు ౬పాళ్ళు శర్కరకలుపుకొనిసేవించినరుచికలిగి జ్వరము వాంతిగల శ్వాసకాసలు, అరుచి, పాండుగుల్మములు మానును.

ధాత్రీలేహ్యము—నలుతూము ఉసిరికకాయలరసములో ఏబదిపలములశర్కరగలిపి, కుంచెడు ద్రాక్షపండురుబ్బికలిపి, లేహ్యపాకముగాకాచి, అందులో, పిప్పలిపొడికుంచెడు, తేనెకుంచెడు, సొంటి, యష్టిమధుకము, ముస్తలు, తవాక్షీరి వీనిని సరిపాళ్ళుగగూర్చిచేసినపొడి కుంచెడు వీనిని కలిపిభక్షించిన, మూర్ఛ, శోష, శ్వాస, దప్పి, జ్వరము, గుల్మము, బల్ల, నపుంసకత్వము, అరుచి, వివర్ణత, స్వరభేదము మానును.

అగ్నికుమారరసము—గంధకము, రసము, నాభి, తామ్రభస్మము ఇవి సమాంశములు. వీనిని హంసపాదియాకు రసముతో ౭ జాములు మర్దించి మాత్రలుకట్టి యెండలోనెండబెట్టి, వానిని కుప్పెలోనునిచి, కుప్పెమూతిని బలపపురాతితోమూసి, గుడ్డచుట్టి చీలమన్నుపూసి, కుండలో మూడుపాళ్లవఱకు ఇసుకనుపోసి, దానిమీదకుప్పెనునిచి, పైన ఇసుకపోసి ౭జాములు వాలుకాయంత్రమునవండి, చల్లారినతరువాత తీసి, దానికి నాలుగవపాలు వసనాభి, మిరియపుపొడికలిపి పూటకు గురిగింజంతచొప్పున, తమలపాకులోబెట్టుకొని పుచ్చుకొనిన, క్షయములు, పాండువులు, కామిల, శూల, సన్నిపాతములు, శ్వాసకాసలు, జ్వరములు ఇవియన్నియు మానును.

పూర్ణచంద్రోదయము—సూక్ష్మముగ కత్తరించి శుద్ధిచేయబడిన కుందనపు రేకులు ౧పలము, శుద్ధిచేసినపాదరసము౬పలములు, శుద్ధిచేసిన

అమ్లసారశిలగంధకము ౧౽ పలములు వీనిని ఖల్వమందునిచి ఎఱ్ఱప్రత్తిపువ్వులరసముతో నొకదినమునూరి కలబందరసముచే మఱియొకదినమునూరి సెనగలంతమాత్రలుచేసి ఎండినవెనుకగాజుకుప్పెలోవేసి చీలమన్నిచ్చి వాలుకాయంత్రమున మృదు తీక్ష్ణ గాఢాగ్నులచే మూఁడుదినములువండి సాంగశీతలమున దీసి మాత్రలు చిగురుటాకువలె ఎఱ్ఱనై యుండిన పక్వమైనదని తెలిసికొని-పచ్చకర్పూరము-జాజికాయ-పిప్పళ్లు-లవంగము-ఇవి దినుసుకు ౧పలము,కస్తూరి రమినపగింజలంతచేర్చి నూరి ఆమాత్రలలోకలిపినఔషధము సిద్ధమగును. దీనిని మినపగింజంత తమలపాకులో నుంచి పుచ్చుకొనినవాఁడు వీర్యవృద్ధికలవాఁడై రతికాలంబున నూర్గురు స్త్రీలకు గర్వభంగముజేయును. ఈయౌషధము తీసికొనినవారలకు శీఘ్రముగ ముసలితనమురాక యౌవనమేకలిగియుండును. ఈయౌషధమును భుజించువాఁడు వేరిననెయ్యి ఆవుపాలు మీఁగడ మినుములు మధురభక్ష్యములను అనుభవించిన కామముచే గర్వితుఁడై యౌవనముచే మదించియుండు స్త్రీలనెందరనైన సురతంబున నోడించును. ౧ సంవత్సరముసేవించిన దేహమందలి సకలవ్యాధులు తొలంగి కృత్రిమస్థావరాది విషంబులును అంటవు.

రాజమృగాంకరసము—రసభస్మము ౩ పాళ్ళు, స్వర్ణభస్మము ౧ పా, తామ్రభస్మము ౧పా, మణిశిల ౨పా, గంధకము ౨పా, వారితాళకము ౨పా ౼ వీనినిజేర్చి ఖల్వములో ౮ జాములుమర్దించి యీ భస్మమును పెద్దగవ్వలయందుబోసి - వెలిగారమును మేఁకపాలతోనూరి గవ్వలమూతిని పొదిగి - యెండలోబెట్టి-ఒకకుండలో-ఆగవ్వలనువేసి కుండమూతిని మూకుడుచేమూసి చీలమన్నుపూసి గజపుటము వేయవలయు. పిదప - చల్లారనిచ్చి తీసి ఖల్వములోవేసి మెత్తగనూరి - ఇరువదితొమ్మిది మిరియాలను కొంచెము వెచ్చచేసి పొడిగొట్టి - దానిలో - పైయౌషధమును నాలుగు గురిగింజలయెత్తుకలిపి నేతితో పుచ్చుకొనిన - క్షయము - శ్వాసకాసలు- పాండువు-గ్రహణ్యతిసారములు ఇవియన్నియు మానును.

---

## గుల్మరోగలక్షణము.

మిథ్యాహారవిహారములవలన వాత పిత్తశ్లేష్మములు ప్రకోపించి, ఐదు విధములగు గుల్మములను గలుగజేయును. అవి ప్రేగులనడుమ



గ్రంథిరూపముగనుండును. రెండు పార్శ్వములయందును, హృదయము, బొడ్డు, పొత్తికడుపు వీనియందును ఉండును. ఈరోగమునందు మలమూత్రములు శుద్ధముగజారక, అరుచి, కడుపుబ్బరము, ప్రేగు లరచుట, అగ్నిమాంద్యము, ఊర్ధ్వవాతము ఈలక్షణములు గలుగును.

స్త్రీలకు ఋతుకాలమునందుగాని, గర్భస్రావము కలుగునపుడుగాని, దాహశూలలతోడ రక్తగుల్మముపుట్టి గర్భిణివలె గనపరచును.

చికిత్స—రక్తగుల్మమునందు దేహమునకు చమురుపట్టించి సెగనకాచి, భేదనద్రవ్యములతో గాఁచఁబడిన ఘృతమునుగాని, ఆముదమునుగాని లోని కిప్పించవలయు.

—నువ్వులనుకషాయముపెట్టి, అంద ,సొంటి,పిప్పలి, మిరియాలు, భారంగి వీనిని నూరికలిపి నేతినిమిశ్రముచేసి పుచ్చుకొనిన, ముట్టును ప్రతిబంధించెడి రక్తగుల్మములు మానును.

—మోదుగచెక్క, మారేడువేళ్లు, వెల్లుల్లి వీనిని కషాయముపెట్టి ఇంగువకలిపి, వెచ్చనికషాయమునుత్రాగిన రక్తగుల్మము మానును.

—ఉసిరికకాయలరసములో మోదుగచెక్కల బూడిదెనుగాని, సొంటి పిప్పలి మిరియాల పొడినిగాని కలుపుకొని త్రాగిన రక్తముస్రవించి గుల్మము మానును.

—రక్తగుల్మము-లోన పగిలినయెడ, రక్తమధికముగకారును; దీనికి అసృగ్దర చికిత్సనుచేయవలయు.

రక్తగుల్మము తాఁబేలువలె పొడవై, నరాలు పగిలి తెలియుచు, చేతులు, కాళ్లు, బొడ్డు ఇవి వాచియుండిన జీవింపఁడు.

—సర్వగుల్మములకును త్రిఫలకషాయములో తెగడచెక్క పొడిని కలిపి భేదికియ్యవలయు. లేక, కంపిల్లకమును తేనెతో నియ్యవలయు.

—గోమూత్రము ౧౽ పలములు, బెల్లము ౨ప, చింతపండు ౨ప సదాపవిత్తులు ౧ప, సైంధవలవణము ౧తు, మంగపండ్లు ౧ప,వీనినన్నిటిని కలిపి కవ్వముతో మర్దించి, వడియగట్టి వస్తిచేసినయెడ-భేదించి- గుల్మము, ఉదావర్తము, శూల, మూత్రకృచ్ఛ్రము ఇవి మానును.

గోధుమపిండి పదార్థములు పాలు గుల్మరోగమునకుఁ బ్రశస్తంబులు.

నారంగరసాయనము — నారదబ్బపండ్లనుతరిగి, వానిలో కుంచెడు ఉప్పును పెట్టి, వెల్లుల్లిపాయలు ౮ప, ఉసిరికకాయలు ౧ప, సొంటి పిప్పలి మిరియాలు ౧ప, ఇంగువ ౧ప, వీనిని నూరికలిపి ధాన్యపాకమునబెట్టి, నేతి అనుపానముతో ప్రాతఃకాలమునందు సేవించిన గుల్మప్లీహములు మానును.

నారాచరసము — పాదరసము - గంధకము - నేపాళములు - కరక్కాయలు - తానికాయలు - ఉసిరికవరుగు - సొంటి - పిప్పలి - మిరియాలు - వీనిని సరిపాలుగగూర్చి చూర్ణముచేసి - తేనెతో మర్దించి - రేగుగింజంత మాత్రలుచేసి పూటకొకమాత్ర చొప్పున పుచ్చుకొని వేడినీళ్ళను త్రాగవలయు - సకల గుల్మములు మానును.

వజ్రక్షారము — లవణము - సైంధవలవణము - కాచలవణము - సౌవర్చలవణము - వెలిగారము - యవక్షారము - సజ్జక్షారము - వీనిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి - జిల్లేడుపాలతోను బొంతజెముడుపాలతోను ప్రత్యేకముగమర్దించి - దానిని జిల్లేడాకులకు పట్టించి - ఆ ఆకులను ఒకకుండలోబెట్టి - మూకుడుమూసి చీలమన్నిచ్చి యెండించి పిల్లనిమంటచేతవండిదించి లోపలియౌషధంబునుతీసి మెత్తగ మర్దించి - పిదప ఈ యౌషధమునకు అరపాలు - సొంటి, పిప్పలి, మిరియాలు, కరక తాడి యుసిరికలు - జీలకఱ్ఱ - పసుపు - చిత్రమూలము, వీని చూర్ణమునుకలిపి మర్దించి - అనుపానవిశేషములతో రెండువరహాలయెత్తుచొప్పున భక్షించిన - గుల్మములు - ఉదరరోగములు శూలలు - అగ్నిమాంద్యము - అజీర్ణము ఇవి మానును -

శంఖద్రావకము — అన్నభేది - నవాసాగరము - సైంధవలవణము - యవక్షారము - సురాకారము - పటిక వీనిని సరిపాళ్ళుగగూర్చి యొక గడియసేపు మర్దించి పాతనాయంత్రమున వండినయెడ శంఖద్రావకము దిగును. ఈ ద్రావకమును అరతులముచొప్పున ఓమపుపొట్టుతో బుచ్చుకొనిన, కాసములు - శ్వాసములు, క్షయరోగము, గుల్మశూల మొదలగునవి మానును.

— ఉత్తరేణి సమూలమును దెచ్చి భస్మముచేసి - తూమెడుభస్మములో మూడుతూముల నీళ్లుబోసి చిలికి మూడుదినము లూరనిచ్చి వడుచుకొని - అందులో, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, మోడి - నల్లజీలకఱ్ఱ, సన్నానాగకేసరములు, ఓమము, కటుకరోహిణి, చెంగల్వకోష్టు - జటామాంసి - అతిమధురము, పంచలవణములు వీనిని దినుసుకు ౧పలము వంతునగూర్చి చూర్ణముచేసి, ఉత్తరేణి నీళ్లలోగలిపి, పొయ్యిమీదబెట్టి అడుగంటకుండునట్లు కలియబెట్టి, పక్వమునకు వచ్చునపుడు, ఇంగువ ౧ పలం, ప్రాతబెల్లము ౧ ప, వీనిని నూరికలిపి, బెల్లము కరిగి పక్వమునకు రాగానే దించి చల్లారినపిదప నెల్లికాయంతచొప్పున పుచ్చుకొనిన, పంచగుల్మములు, పంచశూలలు, వాయువులుమానును.

---



# ఉదరరోగలక్షణము.

సర్వావయవములుచిక్కి కడుపుపెరిగియుండిన ఉదరమనఁబడును. అది యెనిమిదివిధములు - వాతాదిదోషములుప్రకోపించి బొడ్డుక్రింద బద్ధోదరమును, బొడ్డుకుమీఁద ఛిద్రోదరమును, బొడ్డుకుఎడమదిక్కున ప్లీహోదరమును, బొడ్డుకుసమమున జలోదరమును గలుగఁజేయును. ఇవి నాలుగును, వాతోదరము, పిత్తోదరము, కఫోదరము, దోషయుక్తోదరము ఈనాలుగునుచేరి అష్టోదరములనఁబడును. ఇందు కడుపుబ్బుట, అగ్నిమందగించుట, వాపు, బడలికకలుగుట, శక్తిలేకుండుట, తాపము, తంద్ర ఈలక్షణములు గలుగును. ఏకదోషోద్భవములగునవిసాధ్యములు, మిగిలినవిఅసాధ్యములు.

చికిత్స — అష్టోదరములును, మలాధిక్యమువలన బుట్టునుగనుక, ఈ రోగములయందు తరుచుగ విరేచనమునకియ్యవలయు.

— ప్రాకుడుబూడిదె - పిప్పళ్లు ఇవి సమముగ గ్రహించి పంచకోలకషాయముపోసి నూరి వటకములుచేసి సేవించిన ఉదరములుమానును.

— మిరియాలు ౧ప, సొంటి ౨ప, చిత్రమూలము ౩ప, అడవికంద ౪ప, వీనినిచూర్ణముచేసి, ఈచూర్ణమునకు రెండింతలు బెల్లముకలిపి యుండలుచేసి పుచ్చుకొనిన దీపనముపుట్టును. శూలవ్యాధులు, ఉదరము శూలలు మానును.

— ఆవుపాలలోఆముదమునుగాని, ఆవుపంచితమునుగాని, కలిపి ౧౫ లేక ౩౦ దినములుపుచ్చుకొనిన అష్టోదరములు మానును.

— ఆవుపాలలో అరఁటియాకునువేసి త్రొక్కి ముద్దచేసి పుటము పెట్టిన భస్మమగును. దానినితీసికొని ఉదకములోగలిపి పుచ్చుకొనిన సకలోదరములు మానును.

వంగేశ్వరరసము — రసభస్మము, వంగభస్మము, తామ్రభస్మము, గంధకము, వీనిని ప్రత్యేకముగ నొక్కొకపలమువంతునగూర్చి జిల్లేడుపాలతోనొకదినముమర్దించి బిళ్ళచేసి మూకుడులోఁబెట్టిమూసి, చీలమన్నుపూసి, ఎండబెట్టి, భూధరయంత్రమున పుటమువెట్టి చల్లారినపిదపతీసి రెండు గురిగింజలంతయెత్తు ఔషధమును తెల్లగలిజేరువేళ్ళ చూర్ణముతోను, నేతితోను పుచ్చుకొనిన ఉదరములు గుల్మములు మానును.

త్రైలోక్యాడంబరరసము — రసము, గంధకము, తామ్రభస్మము, లోహభస్మము

అభ్రకభస్మము, సాభి, వెలిగారము, సజ్జక్షారము, ఇంగిలీకము, గవ్వలభస్మము వీనిని సరిపాళ్ళుగ గూర్చి, జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు, వావిలియాకురసము, గుంటగలగరాకురసము, అల్లపురసము ఈరసములలో, ఒక్కొకదినమున నొక్కొకరసముతో మర్దించి యారబెట్టి రెండు గురిగింజలంతమాత్రలుచేసి, నీడ నెండించి, తగిన యనుపానములతో రెండేసిమాత్రలు చొప్పున పుచ్చుకొనిన – గుల్మము, వాపు, క్షయము, పాండువు, శూల, ఉదరములు, విషూచులు మానును.

బ్రహ్మవటికములు—శ్రీగంధము, వస, సొంటి, పిప్పలి, మిరియాలు, దేవదారు, పసుపు, కరక్కాయలు, రేణుకలు, కటుకరోహిణి, తెగడ, ఏలకులు, వాయువిడంగములు, వేపపట్ట, చెంగల్వకోష్టు, శిరుబొద్ది, దాడిమపరుగు వీనిని దినుసుకు రెండేసి వరాలయెత్తు చొప్పునగూర్చి చూర్ణముచేసి నేపాళచూర్ణము ౧ పలము, నేలదంతివేళ్ళచూర్ణము ౧౽ ప, వీనిని బ్రహ్మదండివేళ్ళరసముతో మర్దించి కల్కముగజేసి, ఆచూర్ణములోగలిపి, ౧౽ పలము ౪ ప్రాంత నేయిపోసి, సూక్ష్మాగ్ని చేవండి రేగుపండంత చొప్పున పుచ్చుకొనిన సకలోదరములు, గుల్మము, శూల, విద్రధిలోనగు రోగములడగును.



# విద్రధిరోగలక్షణము.

గుదమునందుగాని, గుదమునకు వెలుపలగాని నొప్పి కలిగి వాచిన యెడ, విద్రధి అనఁబడును. ఈరోగమునందు, వెక్కిళ్లు శ్వాసము కలిగినయెడ జీవించుట దుర్లభము.

చికిత్స—విద్రధి, లోపలగాని, వెలుపలగాని తెలుచుగనుండిన ముందుగ విరేచనమున కియ్యవలయు. బాహ్యవిద్రధికి జలగలనుపట్టించి రక్తమునుదీయవలయు.—అగసికూర, ముల్లంగికూర, తోటకూర వీనినిభోజనమునందు విశేషముగఁజేర్చికొనఁ భక్షింపఁజేయవలయు.

—వెలుపలి విద్రధి పక్వమునకు వచ్చినపుడు, వ్రణమునకువలె చికిత్స సేయవలయు.

స్త్రీకి స్తనముచాచి నొప్పికలిగిన, బాహ్యవిద్రధిచికిత్సను చేయవలయు

—అన్నభేది, సైంధవలవణము, శిలాజిత్తు, ఇంగువ, వీనిని చూర్ణముచేసి ఉలిమిడిచెక్క కషాయములో కలిపి భక్షించిన, అపక్వమగు లోపలి విద్రధి మానును.



—కారుమునగచెక్కనుగాని, మంచి మునగచెక్కను గాని కషాయముపెట్టి, శిలాజిత్తు భస్మమును కలిపి సేవించిన, లోపలివిద్రధి పక్వమునకువచ్చి పగిలి మానును.

విద్రధి నాభికిపైనజనించి పగిలిన, చీమునోటవెడలును క్రిందిభాగమున జనించి పగిలిన గుదమున వెడలును. నాభియందే యుండి పగిలిన, ఊర్ధ్వాధోముఖములయందు వెడలును.

పక్వమునకువచ్చి చీముకారుచుండెడి విద్రధులకును, నాడీవ్రణములకును, భగందరములకును, గండమాలలకును ఫలత్రికగుగ్గులు యోగమును సేవించవలయు, లఘు భోజనముచేయవలయు.

ఫలత్రికగుగ్గులుయోగము—కరక్కాయలు ౧ పలము-తాడికాయలు ౧ ప - ఉసిరికెపప్పు ౧ ప - పిప్పళ్లు ౨ ప- మహిసాక్షి గుగ్గిలము ౫ ప- వీనినినూరియుంటలుచేసి భక్షించిన సకలవ్రణములుమానును.

—యవలు, గోధుమలు, పెసలు, మునగపట్ట, ఆముదపువేళ్లు, నల్లవావిలిఆకు వీనిని సమాంశములుగగూర్చి యుదకముపోసి కొంచెము వెచ్చచేసి లేపనముచేసిన విద్రధులుమానును.

—అతిమధురము-నరిపేలాలు వీనిచూర్ణమును, శర్కర నెయ్యిలో గలిపిగాని, లేక- పెన్నేరుగడ్డ, రక్తచందనము, వట్టివేళ్లు వీనిని పాలతోనూరిగాని లేపనముచేసిన విద్రధులుమానును.

—ఇనుపచిట్టెము, ఇసుక, ఇటికరాయి, ఆవుపేడ, వీని నావుపంచితముతోనూరి లేపనముచేసిన విద్రధులు మానును.

—అతిమధురము, రక్తచందనము, పసుపు, మంజిష్టి, కావిరాయి వీనిని సరిపాళ్లుగగూర్చి లేపనముచేసిన ఆగంతుక విద్రధులుమానును.



# మూత్రకృచ్ఛ్రలక్షణము.

రూక్ష, తీక్ష్ణ, ఉష్ణపదార్థసేవనమువలన, ఎనిమిదివిధములగు మూత్రకృచ్ఛ్రరోగములుఁగలుగును. వాతమువలన నొప్పికలిగి మూత్రము స్రవించును; పిత్తమువలన, నొప్పి మంటగలిగిస్రవించును; శ్లేష్మమువలన

చల్లనై చిక్కగస్రవించును; త్రిదోషజము అసాధ్యము; రక్తమువలన బుట్టినయెడల రక్తముస్రవించును; శుక్లమువలనబుట్టిన శుక్లము స్రవించును; వస్తినబుట్టినయెడల రాళ్లుపడును; శర్కరాశ్మరి అయినయెడ పగిలి నున్నము ఇసుకవలె స్రవించును.

చికిత్స—సర్వమూత్రకృచ్ఛ్రములయందును ఉత్తరవస్తి విరేచనములు చేయించుట మంచిది.

—శర్కరను దువత్రాగముసందుఁజేర్చి భక్షించిన సకల మూత్రకృచ్ఛ్రములు మానును.

—పల్లేరుకాయలను పాలతోనూరి, ఆరసములో బెల్లమునుగలిపి పుచ్చుకొనిన, కృచ్ఛ్రములుమానును. సకలమూత్ర కృచ్ఛ్రములయందును పంచదార మిక్కిలి హితకరము.

—బెంకాయనీళ్లలో, కొత్తిమెర్లను నూరినముద్దను బెల్లమునుకలుపుకొనిత్రాగిన, నొప్పిమంటనెత్తురుగల మూత్రకృచ్ఛ్రములు మానును.

—ఏలకులు, శిలాజిత్తు, కొండపిండివేళ్లు, వీనిని చూర్ణముచేసి కడుగులో వేసి పిసికి బెల్లము గలుపుకొని సేవించిన, మృత్యువశములైన కృచ్ఛ్రములు సైతము మానును.

—చిల్లగింజలు, ప్రొద్దుపొడుపువేళ్లు, చల్లగడ్డలు, పల్లేరువేళ్ళు వీనికషాయములో, మైసాక్షి/పగ్గిలమును కలుపుకొనిత్రాగిన మూత్రకృచ్ఛ్రములు మానును.

—గుమ్ముడుతీగె కషాయములోఁగాని, రసములోఁగాని శర్కరను గలుపుకొని పుచ్చుకొనిన, మూత్రకృచ్ఛ్రములు మానును.

—సుగంధిపాలవేళ్ళు. చల్లగడ్డలు, నమ్మదుంపలు, కురువేరు, నేలగుమ్మడిగడ్డ, పల్లేరువేళ్లు, వీనిని కషాయముపెట్టి దానికినాలవపాలు శర్కరగలిపి సేవించిన మూత్రకృచ్ఛ్రములు మానును-

—కారుమునగవేళ్లనుకషాయముపెట్టి అందులో పిప్పలిపొడినికలిపి సేవించినను, ప్రొద్దుపొడుపువేళ్లను చల్లతో సేవించినను రాళ్లూడిపడును.

—అల్లము, యవక్షారము, కరక్కాయలు, పీతచందనము, వీనిచూర్ణమును పెరుగుతో బుచ్చుకొనిన, ఉష్ణమూత్రకృచ్ఛ్రములు మానును.



—సొంటి, పిప్పలి, మిరియాలు, వస, ఇంగువ, సైంధవలవణము, ఆవాలు, ముల్లంగివిత్తులు వీనిని కలితోనూరి ఉడకబెట్టి వెచ్చగ పొత్తికడుపునబట్టించిన, కృచ్ఛ్రములు మానును.

—పల్లేరువిత్తులు, ఎలికవెంటికలు, దోసవిత్తులు, వీనిని కలితో నూరి పొత్తికడుపునబట్టించిన, మూత్రము జారును.

—ఆవుపాలను బాగుగకాఁచి, చల్లార్చి దానిలో జటామాంసి చూర్ణము, శ్రీగంధపుపొడి, బియ్యపుకడుగు, శర్కర వీనినికలిపి పుచ్చుకొనిన రక్తయుక్తముగస్రవించెడి మూత్రకృచ్ఛ్రములు మానును.

లఘులోకేశ్వరరసము—రసభస్మము ౧ తూలు, గంధకము ౮ పా., వీని నొకదినము కల్వమున బాగుగమర్దించి బోలుగవ్వలయందునించి, రసమునకు నాలవపాలు వెలిగారమును ఆవుపాలచేనూరి ఆగవ్వలముఖములకు పొదిగి ఒకపిడతలోనునిచి, ప్రమిదచే మూసి, చీలమన్నిచ్చి యెండించి, గజపుటమువేసి చల్లారినపిదప గవ్వలనుతీసి ఖల్వములోనున్నగనూరి యాభస్మమును నాలుగుగురిగింజల యెత్తు చొప్పున నేతితోబుచ్చుకొని తరువాత ౧౫ మిరియాలను, ౧పలము జాజివేరును చూర్ణముచేసికలిపి మేఁకపాలలో వేసి కాఁచి శర్కరగలుపుకొని త్రాగిన మూత్రకృచ్ఛ్రములు మానును.

---

## మేహరోగ లక్షణము.

విరుద్ధములగు నాహారవిహారములవలన, మూత్రమును అనేకవిధములుగస్రవింపజేసెడియనేకలక్షణములతో గూడిన వింశతిమేహరోగములు జనించును. వానిలో, ఉదకమేహము, ఇక్షుమేహము, సురామేహము, పిష్టమేహము, సికతామేహము, సాంద్రమేహము, శనైర్మేహము, (ఇదే బహుమూత్రము) శీతలమేహము, శుక్లమేహము, లాలామేహము అనునీ పదియు శ్లేష్మజనితములు (లక్షణములనువానివాని నామములనుపట్టి, అనగా, చెఱకురసమువలెమూత్రముస్రవింపుచుండిన ఇక్షుమేహము, అనియిట్లు సర్వమేహములయందును ఎరుంగవలయు.) హారిద్రామేహము, నీలమేహము, మంజిష్టిమేహము, క్షారమేహము, రక్తమేహము, అంజనమేహము, ఈయాఱును పైత్యజనితములు; సర్పిమేహము, మధుమేహము, హస్తిమేహము, వసామేహము, ఈనాలుగును వాతజనితములు.

అన్నముజీర్ణింపకుండుట, కాంతి, జ్వరము, దగ్గు, అరుచి, పడిసెముపట్టుట ఈలక్షణములు కఫ మేహరోగములయందు గలుగును; పొత్తికడుపు, శిశ్నము వీనియందుపోట్లు, వృషణములయందు పగుళ్లుగలుగుట, తాపము, దప్పి, జ్వరము, పుళిత్తేనుపులు, మలము పలచగ వెడలుట, ఈ లక్షణములు పైత్యమేహరోగములయందు గలుగును; కంఠము, ఱొమ్మపట్టుబడినట్లుండుట, శూల, నిద్రరాకుండుట, దగ్గు, ఉబ్బసము, శోష ఈలక్షణములు వాతమేహమునందుగలుగును. కఫజనితమేహములు సాధ్యములు. పైత్యమేహములుకష్టసాధ్యములు. వాతమేహములు అసాధ్యములు

మూత్రపరీక్ష—వాతమేహరోగి మూత్రమునుపట్టి మెల్లనిసెగచేత కల్కముగ కాచినయెడ అయిదవభాగము మిగిలి కల్కముగట్టిన అసాధ్యము; పైత్యమేహరోగి మూత్రము, ఏడవభాగము మిగిలిన అసాధ్యము; శ్లేష్మమేహరోగిమూత్రము, తొమ్మిదవభాగము మిగిన అసాధ్యము.

చికిత్స—ఉసిరికకాయల రసములో పసుపునూరి కలిపి, తేనె కలిపి సేవించినను, లేక- తిప్పతీఁగెరసములోఁగాని, తిప్పసత్తులోఁగాని తేనె కలిపి పుచ్చుకొనినను మేహములుమానును.

—ఏపిచెక్క, మొక్కపుచెక్క, కంపిల్లము వీనినినూరికర్షమెత్తుఉసిరికకాయలరసములోగలిపి, తేనెగలిపి పుచ్చుకొనిన సకలమేహములుమానును

—తంగేడుపంచాంగములను నీడనెండించి పొడిచేసి, దానికిసగము ఉసిరికపప్పుపొడియు, దానికిసగము మానిపసుపు మంచిపసుపువీనిపొడియు గలిపి, తేనెతోఁగాని చల్లతోఁగాని పుచ్చుకొనిన సకలమేహములుమానును

—కరక్కాయ, తాడికాయలు, ఉసిరికపప్పు, వెదురాకు, ముస్తలు, విషబొద్దివేళ్లు, వీనిని కషాయముపెట్టి తేనెతోబుచ్చుకొనిన, అగస్త్యునిచే సముద్రమింకినట్లు సకలమేహములు మానును.

—చిల్లగింజలు, చంద్రచెక్క, మానిపసుపు, నేలయుసిరికవేళ్లు, మంజిష్టి, నీరుపక్కివేళ్లు, పసుపు, విషబొద్దివేళ్లు, మామిడిపప్పు, కరక్కాయ, ముస్తలు, వీనినికషాయముపెట్టి తేనెతోనేడుదినములు పుచ్చుకొనిన సకలమేహములు మానును.

బడబానలచూర్ణము—౧౦౦పలముల చంద్రచెక్కనుత్రొక్కి నలుతూమునీళ్లలోవేసియెనిమిదవ భాగముమిగులునట్లుకాచి వడియగట్టి, దానిలో- కరక్కాయలు, తాడికాయలు, ఉసిరికపప్పు, పసుపు వీనిని దినుసుకు ౧పలముచొప్పునగూర్చి చూర్ణముచేసి కలిపి భావనచేసి ప్రతిదినముపుచ్చుకొనిన మేహరోగములు మానును.

—మామిడిపప్పు, కరక్కాయ, తాడికాయలు, ఉసిరికపప్పు వీనిని చూర్ణముచేసి దీనికి నాలుగింతలు శిలాజిత్తు కలిపి ప్రతిదినము తులమెత్తు తీసికొని తేనెతో సేవించిన, వింశతిమేహములు మానును.

—ఏలకులు, శిలాజిత్తు, హేమమాక్షికము, యష్టిమధుకము, సొంటి,పిప్పలి,మిరియాలు, వాయువిళంగాలు, కరక్కాయలు, ఉసిరికెపప్పు తాడికాయలు, ఇవిసమభాగములు, వీనికంతటికి సగము తంగేడువిత్తులు, వీనినన్నిటిని చూర్ణముచేసి కర్షమెత్తుచొప్పున తీసికొని తేనెతో బుచ్చుకొనిన సకలమేహములు మానును.

చంద్రకళావతీరసము—ఏలక్కాయలు, శిలాజిత్తు, పచ్చకర్పూరము, నెల్లివరుగు, పల్లేరుకాయలు, జాజికాయ,బూరుగుబంక, వీనిని సరిపాళ్ళుగగూర్చి చూర్ణముచేసి దానిలో, రసభస్మము, వంగభస్మము, లోహభస్మము, వీనిని సరిపాళ్ళుగ గలిపి ఖల్వములోమర్దించి, తిప్పతీఁగె- బూరుగుపట్ట వీని కషాయముతో ప్రత్యేకముగ భావనచేసి, అరవరాయెత్తుచొప్పున మాత్రలుకట్టి నీడనెండించి యొక్కొకమాత్రచొప్పున తేనెతో బుచ్చుకొనిన సకలమేహములు మానును.

—తిప్పతీగెరసమునకుసరిపాలుగ తేనెగలిపి, తగుమాత్రమువంగభస్మమునుగాని సీసభస్మమునుగానికలిపిపుచ్చుకొనిన సమస్తమేహములుమానును.

—వంగభస్మము, పాదరసభస్మము వీనిని సమాంశములుగ గూర్చి తేనెగలిపి ౨గురిగింజలంత పుచ్చుకొనిన చిరకాలపు మేహములుమానును

సిద్ధయోగము—కరక్కాయలు, తాడికాయలు, ఉసిరికపప్పువీనిని సరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి ఒకకుండలోవేసి, ఉదకముపోసి, మూఁడు దినములు, ఎండలోబెట్టి కుండపైన డోలాయంత్రమునుగట్టి, దానియందు కుండలోక్రేవేలునటుల పిడికెడు సెనగలను మూటగట్టి ౮జాములు డోలాయంత్రమునవండి పిదపతీసి ఆసెనగలను ప్రతిదినము భక్షించుచుండిన అసాధ్యమేహరోగములు మానును.

వంగేశ్వరరసము—రసము ౧ పాలు, గంధకము ౧ పా, వంగభస్మము ౨ పా, వీని నొక్కటిచేసి శర్కర తేనె వీనిని గలిపి ఖల్వమున మర్దించి, రెండుగురిగింజలంత పుచ్చుకొనిన సకల మేహములు మానును.

ఆనందభైరవరసము—వసనాభి, సొంటి, మిరియాలు, పిప్పళ్లు, వెలిగారము, ఇంగిలీకము, గంధకము వీనిని సమాంశములుగగూర్చి నిమ్మపండ్లరసముతో నాలుగు జాములు మర్దించి గురిగింజలంతమాత్రలుచేసి యొక్కొకమాత్రచొప్పున పుచ్చుకొనిన, మేహములు అతిసారములు మానును.

మేహబద్ధరసము—రసభస్మము, లోహభస్మము, కాంతభస్మము, కర్పూరశిలాజిత్తు, పాలతుత్తము, హేమమాక్షికము, మణిశిల, సొంటి, పిప్పలి, మిరియాలు, కరక తాడి యుసిరికలు, ఓడుగవిత్తులు, వెలగపండుగుజ్జు, పసుపుపొడి, వీనిని సమభాగములుగగూర్చి గుంటగలగరాకురసముతో నిరువదిసార్లు ఊరబెట్టి, యెండించి, పూటకు వరాయెత్తుచొప్పున తేనెతో బుచ్చుకొని, వెంటనే, ౨ వరాలయెత్తు పెద్దవేపవిత్తులను ౧ పలము బియ్యపుకడుగునీళ్ళతో నూరి దానిలో రెండువరాలయెత్తు నేయిగలిపి పుచ్చుకొనిన చిరకాలపు మేహములు మానును.

బహుమూత్రచికిత్స—జాజికాయ, జాపత్రి, పెద్దములక, నల్లమందు ఇవిప్రత్యేక మొక్కొకపాలు, ఖురాసాని ఓమము ౨పా, గంజాయియాకు ౮ పా, వీనిని టెంకాయనీళ్ళతో మూడు దినములు బాగుగమర్దించి, సెనగగింజలంతమాత్రలుచేసి ఒకమండలమువఱకు రెండుపూటలయందునుపుచ్చుకొని మధురాహారములను పథ్యముగనాచరించిన బహుమూత్రములు మానును

—ఖర్జూరపండు-ఉసిరికెవిత్తులు-పిప్పళ్ళు-పటికారము-ఏలకులు-కొండపిండి-అతిమధురము-శ్రీగంధము-దోసవిత్తులు-కోతిమెరివిత్తులు - వీనిని దినమునకు వరాయెత్తుచొప్పునగూర్చి చూర్ణముచేసి - పెసరకడుగుతోగాని - ఎళనీరుతోగాని పుచ్చుకొనిన-దేహముమంటలు - మూత్రద్వారపుమంటలు - ఆసనముమంట - శుక్లప్రమేహము-శుక్లముపడుట-యోనిశూల - ఇవి యన్నియు మానును. వీర్యవృద్ధికలుగును.

—తిప్పతీఁగె చూర్ణమును తేనెతోబుచ్చుకొనిన పసపు మేహము మానును.

—పల్లేరువేళ్ళను తెచ్చి రోటవేసి పిండిగాకొట్టి ఆపిండిని తగినంత తీసికొని ౫ సోలల నీళ్లువేసి - సోలెడుగాకాఁచిదించి - అందులో పిల్లిపీచరవేళ్ళరసము సోలెడు - ఆవుపాలు సోలెడు - ఆవునెయ్యి ౪ సోలెడు - వీనిని కలిపి - పాలగుమ్మడిగడ్డ ౧ వరాయెత్తు-శ్రీగంధము ౧వ-తవాక్షీరి ౧వ-ద్రాక్షపండు ౧వ-అతిమధురము ౧వ-గొట్టెవేళ్ల౧వ-దోసవిత్తులు ౧వ-ఏలకులు ౧వ-మావెలగచెక్క ౧ వ-కలువగడ్డ౧వ-పద్మవేళ్లు౧వ-పొన్నగంటివేళ్లు ౧వ - తుంగముస్తెలు ౧వ - వీనిని చూర్ణముచేసి పైకషాయములోకలిపి నెయ్యిపోసి ప్రొయ్యిమీదబెట్టి సన్ననిమంటవేసి నేయిమిగులునట్లుకాచి దించి వడియకట్టి నిత్యము గరిటెడునెయ్యిచొప్పున తేనె - చక్కెర కలిపి సేవించిన మూత్రరోగము-ప్రమేహము మంటలు మొదలగునవి మానును.



ఖర్జూరాదిచూర్ణము—ఖర్జూరపుకాయ-నెల్లిపప్పు-పిప్పళ్ళు-కర్పూరము-శిలాజిత్తు-ఏలకులు-ఇప్పపువ్వు-కొండపిండివేళ్ళు-ద్రాక్షపండు-మంచిగంధము- అతిమధురము-పల్లేరు-భూచక్రగడ్డ-దోసవిత్తులు-పెద్దనుమ్మడివిత్తులు-చల్లపిల్లిగడ్డలు- కోతి మెరివిత్తులు-లవంగాలు-వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి- చూర్ణమునకు సమముగ పంచదారనుగలిపి ప్రొద్దుటిపూఁట మూడువేళ్ళకు వచ్చినంత పసికడుగులో పుచ్చుకొనిన - మూత్రకృచ్ఛ్రములు - వాంతి-శర్కరా మేహము-మంటలు- తలమంటలు-కండ్లమంటలు-అరకాళ్లు అరచేతులమంటలు- అరోచకము- నాలుకపొక్కుట ఇవియన్నియుమానును. వీర్యవృద్ధికలుగును. సంతానము లేనివారికి సంతానము కలుగును.

వసంతకుసుమాకరము—సువర్ణభస్మము ౨ భాగములు, రజతభస్మము ౨ భాగములు, వంగభస్మము ౩ భాగములు, సీసభస్మము ౩ భాగములు, కాంతభస్మము ౩ భాగములు, రసభస్మము- అభ్రకభస్మము- పగడభస్మము-ముత్తియపుభస్మము ఇవిప్రత్యేకముగ నాలుగేసిభాగములు, వీనిని ఖల్వమందునిచి ఆవుపాలు, చెఱకురసము, అడ్డసరపురసము, చందనకషాయము, వట్టివేరుకషాయము, కురువేరుకషాయము, పసుపు కషాయము, అరఁటిగడ్డరసము, తామరదుంపలరసము, జాజిమొగ్గలరసము, వీనితో ప్రత్యేకముగ నేడేసిమార్లు భావనజేయవలెను. అనంతరము కస్తూరితోను భావనజేయవలయు. దీనిని ౨ గురిగింజలయెత్తును చక్కెర, తేనె, నేయి వీని యనుపానములతో పుచ్చుకొనిన మేహము, క్షయము మొదలగుసకల రోగములుతొలంగును. ఈయౌషధమునుభక్షించినపురుషుఁడు పరిశుద్ధమైనఇంద్రియముగలిగిసంభోగకాలమునస్త్రీలనునూరుమందినైన నోడించువాఁడు అగును. ఈయౌషధము మిక్కిలి కామోద్రేకమును గలిగించుటచేసంసారసుఖానుభవజ్ఞులకు మిత్రునివలె హితముజేయునదియై యుండుటయేగాక సత్సంతానము గలిగించును.

మేహరోగులు-నువ్వులు-ఆవాలు-ఇంగువ-ఉప్పు-తెల్లగడ్డలు-పగటినిద్ర-స్త్రీసంభోగము-పెరుగు-పాలు-మద్యము-మత్స్యమాంసము-బెల్లము-నేయి-పులుసు- సొంటి-టెంకాయనీళ్ళు-పిండివంటలు-పనసపండు-కంద-వీనిని వర్జింపవలయు.

---

## ఉపదంశరోగలక్షణము.

హస్తనఖాదులచేఁబీడించుట, సురతానంతరము క్షాళనము చేయకుండుట- అతిమైథునము- యోనిదోషము ఈకారణములవలన వాతపిత్తాదులుప్రకోపించి- లింగమునందైదువిధములగు ఉపదంశరోగములగలుగఁజేయును; అందు వాతమువలన లింగముస్తబ్ధమైనొప్పితోఁగూడియుండును. పిత్తమువలనను రక్తమువలనను లింగము ఎఱ్ఱనై మంటలు గలిగియుండును. శ్లేష్మమువలన కఠినమై దురద గలిగియుండును. సన్నిపాతమువలన లింగమునకు నాశముగలుగును. మఱియు, వాతమువలన లింగమునందు నల్లనికురుపులుపుట్టి మిక్కిలివేదన పగుళ్లు గలిగియుండును. పిత్తమువలన పచ్చనికురుపులుగలిగి, మిక్కిలిస్రావము, మంటలుగలిగియుండును. రక్తమువలన మాంససదృశములైన యెఱ్ఱనికురుపులు జనించును. శ్లేష్మమువలన దురదవాపుగల తెల్లనికురుపులుజనించి చీముకారుచుండును. సన్నిపాతమువలన నానావిధ స్రావములు మిక్కిలి వేదనగలిగియుండును. ఇది అసాధ్యము. (ఉపదంశమనఁగా, కొఱుకుజాడ్యము.)

చికిత్స—ఉపదంశము పక్వమునకు వచ్చిన తరువాత లింగమునందలి దుష్టమాంసమునుచివ్వి వ్రణచికిత్సను చేయవలయు.

—చేదుపొట్ల-కరక-తాడి యుసిరికలు, వేపపట్ట, సీమనేలవేము, వీనిని సమాంశములుగగూర్చి కషాయముగాచిత్రాగిన ఉపదంశములుమానును.

—మఱ్ఱిచిగుళ్లు, కరక్కాయలు, పసుపు, మద్ది, నేరేడు, లొద్దుగు వీనిపట్టలు, వీనినిసమాంశములుగ చూర్ణముచేసి బొంతజెముడుపాలుగలిపి మెత్తగనూరి లింగమునకు లేపనముచేసిన ఉపదంశరోగములుమానును.

—చెంగల్వకోష్టు, పోకచెక్క, వస వీనినినీళ్లతోనూరి లింగమునందు లేపనముచేసిన ఉపదంశములుమానును.

—తెల్లజీలకఱ్ఱను కలుబంగరసముతోనూరి లింగముమీఁదలేపనము చేసిన, నొప్పి మంటలతోఁగూడిన ఉపదంశములుమానును.

ఘృతము—ఆవునెయ్యి ౪ వీసె, ఆవుపాలు 3 పళ్లు వీనినికలిపి, నేయి మిగులునటులఁగాఁచి తామరగడ్డలు-దానివిత్తులు- తూండ్లు- పువ్వులు



కేసరములు- వీని నేమపలములనుగూర్చి చూర్ణముచేసి, ఆఘృతములో వేసి దించి పుచ్చుకొనిన సకలోపదంశములు మానును.

వ్యాధిహరణరసము—ఇంగిలీకమునుండి తీసినరసము ౧పా, రసకర్పూరము ౨ పా, గంధకము ౧ పా, వీనిని ఖల్వమున మూఁడు దినములు బాగుగ మర్దించి, కాటుకచేసి, దానిని కోడిగ్రుడ్డులోఁబెట్టి దానిమీద ౫ చీలమన్నులు పూసి, ఒకదినమంతయు వాలుకాయంత్రమున మృదు తీక్ష్ణ గాఢాగ్నులచేవండి, చల్లారినపిదప తీసి, నాలుగుగురిగింజలంతచొప్పున తమలపాకులోఁ బెట్టుకొని భక్షించిన- ఉపదంశములు, నపుంసకత్వము, ముదిమి, ఱొమ్మునొప్పి ఇవి మానును. సంతానము లేనివారికి సంతానంబును దీర్ఘాయుష్యంబును గలుగును.

మేహాంతకరసము—రసభస్మము 3 పా, బంగారుభస్మము ౨పా, రజతము 3 పా, లోహము 3 పా, తామ్రము 3 పా, నాగము 3 పా, వంగము 3 పా, అభ్రకము 3 పా, కర్పూరశిలాజితు భస్మము 3 పా, శుద్ధిగల గంధకము 3 పా, వీనిని కూర్చి త్రిఫలకషాయముతోమర్దించి మాత్రలుచేసి నీడనెండించి యామాత్రలనుమూఁడు పుటములువేసి చల్లారనిచ్చి వట్టివేళ్ళకషాయముతోను చందనపు నీరుతోను నాలుగు జాములు మెత్తగా మర్దించి మాత్రలుచేసి నీడనెండించి తేనెతోఁగాని పంచదారతోగాని పుచ్చుకొనిన సకల మేహములు మూత్రదోషము మొదలగునవి మానును.

హేమసుందరరసము—శుద్ధిచేసిన వంగము ౨తు, పాదరసము ౨ తు. వీనిని కలిపి కరిగి బిళ్ళనుచేసి దానిని నలియగొట్టి మెత్తగ కలియనూరి, నవాసారము, అమరశిలగంధకము వీనిని పైవానితో సమభాగములుగ కలిపి, మెత్తగానూరి బిళ్ళచేసి మట్టిమూకుడులో నునిచి యింకొకమూకుడుమూసి అంచులకు చీలమన్నునిచ్చి యెండనిచ్చి పైమూకుటికి సన్నరంధ్రములుచేసి ప్రొయ్యిమీద నునిచి మృదు తీక్ష్ణ గాఢాగ్నులచే నొకజామువండి, రంధ్రముగుండా పొగ పచ్చగ వెడలిన పక్వమైనదని తెలిసికొని దించవలయు. చల్లారినతరువాత ఆబిళ్లనుతీసి లవంగాలు జీలకఱ్ఱ వీని కలకముతోనూరి నేయి - వెన్న - శర్కర అనుపాని అనుపానములతోఁబుచ్చుకొనిన సకలమేహములు, కుసుమములు ధాతునష్టము మొదలగునవి మానును.

భల్లాతకిలేహము—సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, చవ్యము, చిత్రమూలము, లవంగాలు, లవంగపుచెక్క, ఏలకులు, కురాసాని ఓమము, కురంజి ఓమము, రేవులచిన్ని, జాజికాయ-జాపత్రి ఇవిదినుసుకు ౧తులముచొప్పునగూర్చి చూర్ణముచేసి, జీడిగింజలు ౫ పలములు తెచ్చి నేతినవేయించి, బెల్లము ౫ పలములుకలిపి రోటవేసితొక్కి యిందులో ఆచూర్ణమును కలిపి తొక్కి ముద్దచేసి భక్షించిన మేహములు మానును.

---

## అండవృద్ధి లక్షణము.

విషమాన్నపానాదులవలన, క్రిందిభాగమునసంచరించుచుండెడి వాయువుదుష్టంబై, వృషణములయందు వ్యాపించి శూల, వాపు వీనిని కలుగజేసి గజ్జలసంధులయందలి నాడులజెరచి యచ్చటగంటువలె వాపును గలుగజేసిన అండవృద్ధియనఁబడును. ఈ అండవృద్ధి, వాతజ, పిత్తజ, శ్లేష్మజ, రక్తజ, మేదోజ, మూత్రజ, అంత్రజ (అనగానరములుతొలఁగుట) ములని యేడువిధములుగనుండును.

వృద్ధినాశనరసము — రసము ౧ పాలు, గంధకము ౧ పా, స్వర్ణమాక్షికము ౨పా, వీనిని కరక్కాయలకషాయముతో మూఁడుదినములును, ఆముదమున నొకదినమునుమర్దించిసేవించిన అండవృద్ధినశించును.

పునర్నవాదితైలము — తెల్లగలిజేరువేరు, పెద్దగుమ్ముడుపట్ట, దేవదారుపట్ట, తిప్పతీఁగ, యవక్షారము, సర్జక్షారము, వెలిగారక్షారము, ఉప్పు, బిడాలవణము, నల్లఉప్పు, సైంధవలవణము, కాచలవణము, చెంగల్వకోష్టు, తామరగడ్డలు, తుంగగడ్డలు, కచ్చూరములు, సన్నరాష్ట్రము, వస, పిల్లిపీచరవేళ్లు, ఓమము, పెద్దసోపు, ఇంగువ, వాయువిళంగాలు, అతివస, అతిమధురము, సొంటి, పిప్పలి, మిరియాలు, చవ్యము, చిత్రమూలము, వీనిని సమాంశములుగ గూర్చి చూర్ణముచేసి, దీనికంతటికి సమముగ తానికాయలబెరడుపొడి కలిపి ఉదకముపోసి కల్కముగజేసి, పిదప, నువ్వులనూనె ౧ పడిపోసి వీనికన్నిటికి రెండింతలు ఆవు పంచితము కలిపి వీనినిపోసి మైనమగునట్లు ఆతైలమునుకాఁచి, రెండుపూఁటలయందును ఒక్కొకపలము చొప్పున పుచ్చుకొని దానితోనే వస్తికర్మకూడచేసిన యెడ అండవాయువులు, నడుమునొప్పులు, వీఁపు తొడలు వృషణములు వీనియందలి నొప్పులు మానును.

—కానుగు, జిల్లేడాకు, గజ్జేరాకు వీనినినూరి పట్టించికట్టినను, లేక పాపరతీఁగెనునూరి పట్టించినను సప్తవృద్ధులుమానును.

—చిట్టాముదపువేళ్లు, ములుగోరంటవేళ్లు, వావిలివేళ్లువీనినికషాయ



ముపెట్టి దీనిలో సైంధవలవణమును ఆముదమును కలుపుకొని సేవించిన సప్తవృద్ధులు మానును.

—గచ్చవేళ్లు, ఉలవలు, వెల్లుల్లి వీనిని కషాయముపెట్టి అందులో ఇంగువనునేతిని కలుపుకొని సేవించినను సప్తవృద్ధులుమానును.

—చాగవేళ్లకషాయమున, ఇంగువ, సొంటి, సైంధవలవణము పిప్పళ్లు,వీనిని సరిపాళ్లుగ చూర్ణముచేసి కలిపిసేవించిన సప్తవృద్ధులుమానును.

—సౌవర్చలవణము, సైంధవలవణము, ఇంగువ, జీలకఱ్ఱ, కానుగచెక్క, నెమలిచెక్క, బోడతరము, సొంటి,పిప్పలి,మిరియాలు వీనిని చూర్ణముచేసి కర్షమెత్తుచొప్పున వేడినీళ్లతోనిచ్చిన ఏనుఁగువృషణములవలెనగును

—అంత్రజవృద్ధియందుగలిజేరాకునుడికించి ఆరునెలలు కట్టవలయు, లేకరక్షనైనవేయవలయు. మూత్రవృద్ధియందు దానిసశస్త్రముజేసి కార్చి ఆసనవృషణములకునడుమ రక్షవేసిన, బుడ్డనివర్తించును.

—జిల్లేడుపువ్వులను తెచ్చి దోరగిలవేయించి - జీలకఱ్ఱను కొంచెము వెచ్చచేసి ఆపువ్వులను-జీలకఱ్ఱను-కాచువక్కలను ఒకటిగాకలిపి కషాయముపెట్టియిచ్చిన అండవాయువులు మానును. —తోఁటకూర-కందిపప్పు-పెసలపప్పు-నెయ్యి ఇవి పథ్యము.

—సీసము-అభిని-గచ్చపప్పు-సొంటి వీనిని సమభాగములుగగూర్చి కోడిగుడ్డురసముననూరి పట్టువేసిన - బీజములోని వాయువులు - వాపులు-నొప్పులు మానును.

కట్టెలను నరుకుట, దారినడచుట, వాతకరపదార్థములను భుజించుట, స్త్రీలగూడుట, అశ్వాదులనెక్కి తిరుగుట ఈపనులను అండవృద్ధి గలవారు వర్జింపవలయు.

## వర్ధ్మరోగ లక్షణము.

పులుసు-జిగటగల పదార్థముల విశేషముగ భక్షించుట వలనను, బరువును మోయుట, చన్నీళ్ళనానుట, ఆయుధములద్రిప్పుట, గట్టిగఅరచుట, దూరమునడుచుట,మోహామువలన విషమబంధంబులచే స్త్రీలగూడుట ఇట్టికృత్యములవలన వాతము ప్రకోపించి సప్తనిప్రేగులు, నరములు, వీనియందు ప్రవేశించి నాడులను స్వస్థానములనుండితొలఁగఁదీసి గజ్జలయందు గ్రంథిరూపమగు వాపునుగలుగంజేసిన వర్ధ్మరోగమనబడును. దీనియందు జ్వరము, కృశత్వము, శూల, ఈలక్షణములుగలుగును.

చికిత్స—సైంధవలవణమును ఆవునేతిలోకలిపి ౧ తులమువంతున ఏడుదినములు పుచ్చుకొనుచు ఆగ్రంథులమీద లేపనముగూడచేసిన అవి నివర్తించు. కానుగవేరునుగానిగంటుభారంగినిగాని కుడితితో నూరి లేపనము చేసిన నివర్తించును.

—పెద్దపాపరవేళ్ళను నువ్వులనూనెతో మర్దించి ఆవుపాలలో కలిపి పుచ్చుకొనిన నవి మానును.

—సైంధవలవణము అన్నభేది వీనిని సరిపాళ్లుగగూర్చి చూర్ణము చేసి కొంచెము ఆముదముకలిపి పుచ్చుకొనుచు వృషణములకు వస్త్రములను బంధించుచుండిన నవి నివర్తించును.

---

## రేతోదోష లక్షణము.

కారము- పులుసు- ఉప్పు- ఉష్ణపదార్థములు వీనినివిశేషముగభక్షించుటవలనను- అతిమైథునమువలనను- యోనిదోషములవలనను- ద్వేషయుక్త స్త్రీసంభోగమువలనను - మనస్సంతాపమువలనను - వీర్యమునునిరోధించుటవలనను శుక్రదోషముగలుగును.

చికిత్స—మినపప్పును నేతితో వేయించి, ఆవుపాలలో వేసి శర్కర కలిపి పాయసమొనర్చి పుచ్చుకొనిన దోషములొలంగి వీర్యవృద్ధిగలుగును.

—తెల్లగురిగింజలను చల్లపిల్లిగడ్డలను చూర్ణముచేసి ఆవుపాలలో వేసి పుచ్చుకొనిన వీర్యవృద్ధిగలుగును.

—నేలగుమ్ముడుగడ్డలను కల్కముదీసి నెయ్యిపాలుకలిపి లేహ్యపాకమునవండి అతిషండంతచొప్పున పుచ్చుకొనిన వృద్ధునికి సహితము వీర్యవృద్ధికలుగును.

—మేకపోతు వృషణములను మర్దించి పాలలో వేసి యుడకబెట్టి నువ్వులపిండికలిపిభక్షించుచుండినఎంతమంది స్త్రీలతోనైననురమింపవచ్చును

—పెద్దపల్లేరుకాయలు, చల్లపిల్లిగడ్డలు, దురదగొండివిత్తులు, నీరుగొబ్బివిత్తులు, చిట్టాముట్టివేళ్లు, పేరాముట్టివేళ్లు, వీనినిసమాంశములుగగూర్చి చూర్ణముచేసి ఆవుపాలలోగలిపి రాత్రులయందు బుచ్చుకొనిన, ఎందఱు స్త్రీలతోనైన రమింపవచ్చును.



—ఉసిరికవరుగును చూర్ణముచేసి, ఆయుసిరికరసముచేత నేయారబెట్టి, శర్కర తేనె నెయ్యికలిపిపుచ్చుకొని పాలుత్రాగిన వీర్యవృద్ధియగు.

—నేలగుమ్ముడుగడ్డనుచూర్ణముచేసిదానిరసముచేత నేడూరబెట్టి, ఆవుపాలు, నేయికలిపిత్రాగిన నూరుమంది స్త్రీలతో కూడదగిన శక్తిగలుగును.

—పంపలములచల్లపిల్లిగడ్డలను పొట్టుతీసిదంచి, ఆవునెయ్యి పంపఆవుపాలు రంపం, వీనిని ఒకకుండలోనునిచి - మెల్లనిమంటచేత - పాలిగురువఱకుకాచి వడియగట్టి- శర్కర, పిప్పలిపొడి, తేనె వీనినిసమానముగజేర్చి ప్రతిదినముపుచ్చుకొనిన వీర్యవృద్ధికలుగు

అశ్వగంధతైలము—పెన్నేరుగడ్డ, జటామాంసి, చెంగల్వకోష్టు, పెద్దములకపండ్లు, చల్లపిల్లిగడ్డలు వీనిని సరిపాళ్లుగగూర్చిదంచి యొకకుండలోనునిచి దీనికినాలుగుపాళ్లు ఆవుపాలుపోసి, అన్నిటికిసమముగ నువ్వులనూనెబోసి, మెల్లనిమంటచేవండిదించి, లింగమునకు స్తనములకు లేపనము చేసిన నవి మిక్కిలి కఠినంబులగును.

—పెన్నేరుగడ్డనునల్లయుమ్మెత్తాకురసమున బాగుగమర్దించి, బఱ్ఱెవెన్నకలిపి నల్లయుమ్మెత్తకాయలోబెట్టి, ఆవుపేడపొదిగి కొద్దిపుటము వేసి, చల్లారినతరువాతదీసి, నల్లయుమ్మెత్తకాయలరసముచే ఖల్వమునమర్దించి దానిని లింగమునకు లేపనముచేసిన హయలింగముంబోలి దృఢమై సురతమునందు మిక్కిలి శక్తిగలిగియుండును.

—శుద్ధిగలజీడిగింజలు, దానిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు, వీనిరసములను కల్కముచేసి పుచ్చుకొని ఆవనూనెను లింగమునకులేపనముచేసిన హయలింగమువలె దృఢముగనుండును.

—దుష్టుపువేరు, చాగవేరు వీనిని ౭ దినములు మేకమూత్రమునందు నానబెట్టి నూరి లింగమునకు లేపనముచేసిన వీర్యము స్తంభించును.

—తెల్ల దామరపువ్వులోనికింజల్కములు, నల్లకలువగడ్డలు వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి కొంచెము చక్కెరతేనెకలిపి మర్దించి, లింగమునకుబూసికొని సంగమంబొనర్చినమిక్కిలిసుఖముగలిగి లింగము దృఢముగనుండును.

నారసింహచూర్ణము—చల్లపిల్లిగడ్డలపొడి, పెద్దపల్లేరు కాయల

పొడి ఇవి దినుసుకు ౧ ప్రస్థము, నేలతాటిగడ్డలపొడి, ౪ వీసె, తిప్పసత్తు ౧౨ వీ, శుద్ధిగలజీడిగింజలు ౧౪ వీ, చిత్రమూలచూర్ణము ౧ వీ, తెల్లనువ్వులపిండి ౧ ప్రస్థము, సొంటి, పిప్పలి, మిరియాలు ఇవి ౮ పల, శర్కర ౧౪ వీసె, తేనె ౪౨వీ, ఆవునెయ్యి ౪ వీసె, నేలగుమ్ముడుగడ్డచూర్ణము ౧ ప్రస్థము, వీనినన్నిటినేకముచేసి ఒకకుండలోఁబోసియునిచి, పూఁటకు ౪ పలముచొప్పున నొకమాసము పుచ్చుకొనిన- ముదిమి, మేహములు, పాండువు సన్నిపాతములు మొదలగు రోగములుమానును. శరీరమునకు మంచికాంతి గలుగును. సింహపరాక్రమంబును, అశ్వవేగంబును, గరుడదృష్టియు, నూర్గురు స్త్రీలగూడదగినశక్తియు, మంచిసంతానమును గలుగును.

గోధుమరసాయనము—౨౪పడిగోధుమలను ఒకకుండలోబోసిదానిలో నొకతూము నీళ్లుబోసి కషాయముపెట్టి, నాలవపాలు మిగులునట్లు కాఁచి, దానిలో గోధుమనూక, మినపప్పు, తెల్లగురిగింజలు, ద్రాక్ష, ఖర్జూరము, చిట్టీతపండ్లు, తిప్పసత్తు, అతిమధురము, సొంటి, పిప్పలి, మిరియాలు, పిల్లిపీచర, పెన్నేరుగడ్డ, శుద్ధిగలజీడిగింజలు, దూలగొండివిత్తులు, వీనినిసమాంశములుగనూర్చి చూర్ణముజేసి కలిపి, ఆవునెయ్యి ౧ వీసె, కషాయమునకు నాలుగింతలు ఆవుపాలు వీనిని పోసి చెఱకుదంటుతో కలియబెట్టి మెల్లనిమంటచేవండి, ఏలకులు, లవంగపట్ట, పచ్చకర్పూరము, పిప్పళ్ళు, మిరియాలు, నాగకేసరములు వీనినిసరిపాళ్ళుగనూర్చి చూర్ణముజేసి వస్త్రగలితముచేసి దానిలోవేసికలియబెట్టి లేహపాకమునదించుకొని ప్రతిదినము పలమువంతునబుచ్చుకొనిన, సురతసమయంబున లింగమునకు శైథిల్యము, శుక్రనష్టముగలుగక బలము వీర్యవృద్ధికలుగును. ౨పలములవంతున౧౫దినములుతప్పక పుచ్చుకొనినయెడ నూర్గురు స్త్రీలతో రమింపదగినశక్తి గలుగును. మఱియు వాతములు, మూత్రకృచ్ఛ్రములును మానును.

గుడకూశ్మాండలేహము—నువ్వులనూనె ౧ వీసె, ఆవునెయ్యి ౧ వీసె వీనినిబాగుగ కాఁగఁబెట్టి, వానిలో బెరడుతీసిన బూడిదగుమ్ముడుపండుబద్దలను ౧౦౦ పలములువేసి పక్వముచేసి, లవంగపట్ట, ఆకుపత్రి, సొంటి, పిప్పలి, మిరియాలు, దనియాలు, జీలకఱ్ఱ, పిన్నయేలకులు, పెద్దయేలకులు, మోడి, చవ్యము, చిత్రమూలము, దురదగొండివిత్తులు, పరికెగడ్డలు, తుంగముస్తెలు, నేలతాటిగడ్డలు, చిట్రాముట్టి, వీనినిప్రత్యేకము ౧తులముచొప్పునగూర్చి చూర్ణముజేసివేసి, ౨౪ వీసె ప్రాంతబెల్లమునుకలిపి లేహపాకమునవండి దించి చల్లారినతరువాత ౧ సేరు తేనె కలిపి పుచ్చుకొనిన- సన్నిపాతములు, మందాగ్ని, కాసశ్వాసలు, జ్వరములు, వాంతులు, వెక్కిళ్లు మానును. కృశించినవారికి వీర్యవృద్ధినిచ్చును.



నవాయసాదిచూర్ణము—కరక తాడి యుసిరికలు, సొంటి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, తుంగముస్తెలు, వాయువిళంగాలు, వీనిని సమాంశములుగనూర్చి దీనికి తొమ్మిదవపాలు లోహభస్మమునుజేర్చి, తేనె, నెయ్యి, వీనితోగాని, ఆవుమజ్జిగతోగాని, ఆవుపంచితముతోగాని పుచ్చుకొనిన - పాండురోగములు, దోషములు, భగందరము, మూలవ్యాధులు, ఉదరములు మాని ధాతువృద్ధికలుగును,

మాషాదిమోదకములు—మినపప్పు, పొట్టుదీసినగోధుమలు, పొట్టుదీసినయవలు, బియ్యము, పిప్పళ్ళు, వీనిని ప్రత్యేకము ౧ పలమువంతునగూర్చి చూర్ణముచేసి దీనికంతటికి సగపాలు ఆవునెయ్యిపోసి వేయించి దానికి సరిపాలు పంచదార గలిపి అరపడి నీళ్ళుపోసి మెల్లనిమంటచేవండి బాగుగగలియబెట్టి యుండలుచేసి సాయంకాలమునందు బుచ్చుకొనుచు అర్ధసేరుపాలనుత్రాగి పులునుకారముల వర్జించిన మిక్కిలి వీర్యవృద్ధి గలుగును.

మదనకామదేవరసము—రజతభస్మము ౧ పాలు, వజ్రభస్మము ౨ పా, స్వర్ణభస్మము ౩ పా, తామ్రభస్మము ౪ పా, పాదరసము ౫ పా, గంధకము ౬ పా, లోహభస్మము ౭ పా, వీనిని ఖల్వమున కలుబందరసముతో బాగుగ మర్దించి, గాజుకుప్పెలోబెట్టి, దానిమూతికి చీలమన్నిచ్చి యెండించి, ఒక కుండలో దానిగొంతువఱకు సైంధవలవణమునుపోసి దానిమీఁద కుప్పెనునిచి, కుండపైనమఱియొకకుండను బోర్లించి, చీలమన్నుపూసి ప్రొయ్యిమీఁదబెట్టి మెల్లని మంటచే ౮ జాములు వండి, చల్లారినపిదప, ఔషధమునుతీసి, జిల్లేడుపాలు, పెన్నేరుగడ్డ, దురదగొండివిత్తులు, నేలతాటిగడ్డలు, పెద్దపల్లేరు, చల్లపిల్లిగడ్డలు, తుంగముస్తెలు, తామరదుంపలు, రెల్లు వీని రసముతో ప్రత్యేకముగ ముమ్మారుమర్దించి యారబెట్టి, ఈ యౌషధమున కొనిమిదవపాలు, కస్తూరి, సొంటి, మిరియాలు, పిప్పళ్లు, పచ్చకర్పూరము, ఏలకులు, లవంగములు వీనిని చూర్ణముచేసి కలిపి ఒక్కొక కర్షముచొప్పున ఔషధమును తీసికొని అంతమాత్రము శర్కరనుగలిపి రెండుపలముల ఆవుపాలను కలిపి పుచ్చుకొనిన- కాంతి, బలము కలిగి యనేకస్త్రీలతోరమింపదగిన వీర్యపుష్టికలుగును.—దీనికిపులునుపదార్థముల వర్జించవలయు. మధురాహారంబుల భక్షించవలయు.

శృంగారాభ్రికరసయోగము—శుద్ధిగలపాదరసము ౨పా, అష్టశుద్ధులుగల గంధకము ౧ పా, తామ్రిభస్మము ౩ పా, నాగభస్మము ౧౪పాలు, వంగభస్మము౧౪పా, లోహభస్మము ౪పా, మండూరము ౪పా, స్వర్ణభస్మము ౪పా, హేమమాక్షికము, చెంగల్వకోష్టు, లక్క, జటామాంసి, తాళీశపత్రి, పచ్చకర్పూరము, జాజికాయ, కస్తూరి, ఇంగిలీకము, మంజిష్టి, దేవదారుచెక్క, లవంగాలు, మణిశిల ఇవి ఒక్కొకపాలు, అభ్రికభస్మము ౬-౪ పా, బోరిఓమము ౩। పా, నల్లకలువదుంపలపొడి ౧౪ పా. వీనిని జేర్చి, తమలపాకుల రసముతో నవనీతమగునట్లుమర్దించి, సెనగగింజంతమాత్రలుచేసి నీడనెండించి, పూటకు ౧ మాత్రను లవంగాలతోఁబుచ్చుకొనిన, అగ్నిమాంద్యము-అజీర్ణము శూలలు-మేహములు-ఉదావర్తము-మూత్రకృచ్ఛ్రాదులును మానును. దేహమునకు కాంతి-దీర్ఘాయుష్యము గలుగు. వీర్యవృద్ధియగు. స్త్రీసంభోగము చేసినపిదప ఈయౌషధమునుభక్షించినవారల కెప్పటికిని బలముతగ్గకయుండును.—పాలుఅన్నము-నెయ్యిమినుము - మధురపదార్థములు వీనిని పథ్యముగ జేర్చుకొనవలయు.

మహాభల్లాతకీలేహము—మానెడు నల్లజీడిగింజలను ఇటికపొడిచే రుద్ది ముక్కులనుతీసివేసి నీళ్ళచేఁగడిగి గాలినఆర్చి - ఒక్కొకదానిని రెండుగాకోసి - నాలుగు మానికల నీళ్లలోవేసి నాలుగోవంతు మిగులునట్లు కాఁచిచల్లారనిచ్చి- మానెడునెయ్యి, ౪పడి శర్కర వీనినివేసి కలిపి కాఁచి - కృష్ణాగరు-కరక్కాయ-సొంటి-పిప్పళ్ళు-మిరియాలు-వాయువిళంగాలు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ౧ఆళాకు కలిపి - ౨ ఆళాకులు ఉసిరికపప్పుపొడి, ౨ ఆళాకులు తేనె వీనిని కలిపి కాఁచి-ఏడుదినములు ధాన్యపుటమునగాని - భూమియందుగాని యునిచి - తానికాయంతె చొప్పున బుచ్చుకొనిన స్త్రీసంబంధరోగములన్నియు మాని వీర్యవృద్ధి కలుగును.

## శ్వాస లక్షణము.

శ్వాసరోగము అయిదు భేదములు గలిగి యుండును; అందు మహాశ్వాసమునందు గొప్పమ్రోతగలిగియుండును. ఊర్ధ్వశ్వాసమునందు ఊర్ధ్వదృష్టిగలిగియుండును. భిన్నశ్వాసమునందు శ్వాసమునిలిచినిలిచిపుట్టును తమశ్శ్వాసమునందు కన్నులుగానరాక భ్రమసినట్లుండును. క్షుద్రశ్వాసమునందు అల్పవేదనగలిగియుండును. క్షుద్రశ్వాసము-సాధ్యము-తమశ్శ్వాసము యాప్యము- తక్కినమూఁడును అసాధ్యములు.

చికిత్స—మిరియాలు- మణిశిల- లక్క- పిప్పళ్లు-వీనినిచూర్ణముచేసి



దీనికి సరిగబెల్లమునుకలిపి నూనెతో కర్షమెత్తుచొప్పున పుచ్చుకొనిన తీవ్రశ్వాసముమానును.

—వట్టివేళ్లు - దిరిసెనపుచెక్క - పిప్పళ్లు - బెల్లము వీనిని సమభాగములుగగలిపి-తరికముగుతోనిచ్చిన శ్వాసములుమానును.

—సరళదేవదారు- పసుపు-రాస్న - కరక్కాయలు - ఉసిరికపప్పు - తాడికాయలు - సొంటి - పిప్పలి - మిరియాలు - పద్మపువేళ్లు, వాయువిళంగాలు - వీనినిసమభాగములుగ చూర్ణముచేసి - సరిభాగముపంచదార గలిపి యిచ్చిన శ్వాసకాసములుమానును.

—దూలగొండివేళ్లు - పిప్పళ్లు - దాక్షపండు-కర్కాటకశృంగి-కరక్కాయలు వీనినిసమాంశములుగచూర్ణముచేసికర్షమెత్తుచొప్పున తేనెతో బుచ్చుకొనిన- శ్వాసము- కాసము- ఊర్ధ్వవాతము ఇవిమానును.

—కచ్చూరములు- సైంధవలవణము-సొంటి- పిప్పళ్లు- మిరియాలు వాయువిళంగాలు- చెంగల్వకోష్టు, ఇంగువ వీనిని సమాంశములుగ గూర్చి సరిపాలు శర్కరకలుపుకొని కర్షమెత్తు వేఁడినీళ్లతోఁబుచ్చుకొనిన శ్వాసము- కాసము- వెక్కిళ్లు మానును.

—ఉత్తరేణినడిమికాడలు కాల్చినమసి- తేనె- నెయ్యి వీనిని కలిపి యిచ్చిన శ్వాసకాసములుమానును.

శ్వాసకాశేశ్వరరసము— రసము-గంధకము-సువర్ణమాక్షికము - ఇంగిలీకము-నాభి-వంగభస్మము-లోహభస్మము-తామ్రిభస్మము-అభ్రికభస్మము-జాజికాయ-లవంగపుచెక్క-లవంగాలు- ఏలకులు- నాగకేసరాలు- ఉమ్మెత్తవిత్తులు- నేపాళములు-కచ్చూరములు-పసుపు-ఇవిసరిపాళ్లు, మిరియాలు మూడుపాళ్ళు వీనిని కల్వమున ఇనుపదండముతోమర్దించి - వావిడిసె రసముచే ఇరువదిఒక్కసారులు ఊరబెట్టి రెండుగురిగింజలయెత్తుగాని ఒకగురిగింజయెత్తుగాని అల్లపురసముతో పుచ్చుకొనిన అయిదు విధములైన శ్వాసములు కాసములు మానును.

## కాసరోగలక్షణము.

కాసరోగంబులైదు విధంబులు; వాతకాసంబున పొడిదగ్గు గలుగును. పైత్యకాసమున తాపముగలిగియుండును. శ్లేష్మకాసమున పీనసగల్గి

యుండును. అభిఘాతకాసమువలనఱొమ్మునందలిరక్తముచెడిదగ్గుపుట్టును. క్షయకాసము క్షయరోగముతోఁగూడియుండును. వీనిలోఁ అభిఘాతకాసము యాప్యము. క్షయకాసము అసాధ్యము.

చికిత్స—కసివెంద- తిప్పతీఁగె- వ్రాకుడు- అడ్డసరము-గుంటగలగర- ఈఅయిదును సమభాగములఁగగూర్చి త్రొక్కి-తీసినరసము ౪ భాగములు- నేయి ౧ భా-వీనినికలియబోసి కాఁచినఘృతము పంచకాసములమాన్పును.

—భారంగి- వ్రాకుడు వీనిని కషాయముగాచి తేనె అనుపానముతో బుచ్చుకొనిన పంచ శ్వాస కాసములు మానును.

శ్వాసచికిత్సలు కాసమునకు, కాసచికిత్సలు శ్వాసమునకు అగును.

క్షుద్రాదిలేహ్యము-వ్రాకుడువేళ్లు ౧౦౦ పలములు - కరక్కాయలు ౧౦౦ప- వీనిని నలుతూము నీళ్లలోబోసి తూమెడుగకాఁచి - వడియపోసి ఆకషాయములో పాత బెల్లమును ౧౦౦ పలములుగలిపి - లేహ్యపాకముగకాఁచి- చల్లారినవెనుక అందులో - సొంటి ౧ ప-పిప్పలి ౧ప-మిరియాలు ౧ప-లవంగపట్ట ౧ప-ఆకుపత్రి౧ప- ఏలకులు ౧ప-నాగకేసరాలు ౧ప - వీనిని చూర్ణముచేసి కలిపి తేనెౘప-కలపవలయు. ఈలేహ్యమును సేవించిన-కఫవికారములు - శ్వాసకాసములు-పంచగుల్మములు-వెక్కులు-హృద్రోగము-అరుచి-మంధాగ్నియు మానును.

భార్గ్యాదిలేహ్యము—మారేడువేళ్ళు-గుమ్ముడువేళ్ళు- తక్కిలివేళ్ళు- దుందిలపువేళ్ళు-కోలపొన్నవేళ్ళు-ముయ్యాకుపొన్నవేళ్ళు- ములకవేళ్ళు-వాకుడువేళ్లు-వల్లెరువేళ్లు ఇవియన్నియుచేరి ౧౦౦ పలములు. భారంగి ౧౦౦ప - కరక్కాయలు ౧౦౦ వీనిని ఎనిమిదితూముల నీళ్లలోవేసి నాలుగవభాగము మిగులునటుల కషాయముగాచి- వడియగట్టి-దానిలో ౧౦౦ పలములబెల్లమునుకలిపి - లేహ్యపాకముగాకాచి-దానిలో సొంటి ౧ప - మిరియాలు ౧ప-పిప్పళ్లు-౧ప-ఏలకులు ౧ప-లవంగపుచెక్క ౧ప - ఆకుపత్రి ౧ ప-నాగకేసరాలు ౧ప - వీనిని చూర్ణముచేసి కలిపి చల్లారినపిదప - తేనెను ౨ పలములు కలపవలయు. ఈలేహ్యమును సేవించిన శ్వాసకాసములు - క్షయరోగములు-వెక్కిళ్లు-శ్లేష్మము-ఛర్ది-హృద్రోగము-అరుచి-మేహము ఇవి మానును.

స్వర్ణభూపతి—రసము ౧ పాలు, గంధకము ౧ పాలు, తామ్రభస్మము ౨ పాళ్లు, అభ్రక-లోహ-కాంత-స్వర్ణ-రజతభస్మములు, నాభి, ఇవి ప్రత్యేకముఒక్కొక్క-భాగము వీనినన్నిటిని హంసపాదిఆకురసమున ఒకదినముమర్దించి ముద్దచేసి యెండబెట్టి, గాజుకుప్పెలోబెట్టి చీలమన్ను ఇచ్చి యెండినతరువాత వాలుకాయంత్రములోబెట్టి, మెల్లనిమంటతోవండి చల్లారినతరువాతతీసి నాలుగుగురిగింజలయెత్తు-చొప్పున, పి



ప్పళ్లు అల్లపురసము వీనితో పుచ్చుకొనిన, సన్నిపాతములు, సర్వవాతరోగములు శూలలు, మేహములు, గ్రహణులు, శ్వాసకాసములు, కామిల, పాండురోగము, శిరోరోగము మూత్రకృచ్ఛ్రములు మానును.

తాళిశచూర్ణము—తాళిశపత్రము ౧ తు, మిరియాలు ౨ తు, సొంటి 3 తు, పిప్పళ్ళు ౪ తు, తవాక్షీరి ౫ తు, ఏలకులు 4 తు, దాచినిచెక్క 4 తు, వీనిని చూర్ణముచేసి, 3౨ తులముల శర్కరగలిపి పుచ్చుకొనిన, కాస, శ్వాస, జ్వర, ఛర్ది, శూల, పాండురోగములు మానును.

---

## హిక్కా లక్షణము.

ఎక్కిళ్లు వేగముగలిగి జంటగవచ్చినయెడ యమళహిక్కయనియు గొప్పధ్వనితోఁగూడివచ్చిన మహాహిక్కయనియు, నాభినుండివెడలి గంభీరశబ్దముతోఁగూడినది గంభీరహిక్కయనియు, మందవేగముగలిగి వెంటవెంట వచ్చుచుండిన క్షుద్రహిక్కయనియు, అన్నపానాదులవలనబుట్టినదిఅన్నజహిక్కయనియు హిక్కలు ౫ విధంబులు; వానిలో మొదటిమూడును అసాధ్యంబులు. మిగిలినవి సాధ్యంబులు.

చికిత్స—శ్వాసకాసచికిత్సలు వెక్కిళ్ళకును ఉపయోగించును.

—నేతిలోయవక్షారమునుగలుపుకొనిసేవించిన వెక్కిళ్లుమానును.

—సొంటి బెల్లమునుగాని, పిప్పళ్లు శర్కరనుగాని వేడినీళ్లలో కలుపుకొనిసేవించిన హిక్కలుమానును.

—దశమూలములను కందులనుకలిపి కషాయముబెట్టిగాని, లేక సరళదేవదారు కషాయమునుగాని, ఇచ్చిన వెక్కిళ్లు మానును.

—వెలగపండుగుజ్జు, వరిపేలపిండి, తేనె వీనినిగలిపిసేవించిన వెక్కిళ్లు, ఛర్ది, అరోచకముమానును.

—రేఁగుగింజలపప్పు, రసాంజనము, లాజలు వీనిని చూర్ణముచేసి తేనెతోఁబుచ్చుకొనినను, లేక-పిప్పళ్లు, ఖర్జూరపుగింజలు, ద్రాక్షపండు వీనినినూరి తేనెతోబుచ్చుకొనినను హిక్కలుమానును.

---

## ఛర్దిలక్షణము.

వాతపిత్తశ్లేష్మములవలనను సన్నిపాతమువలనను భీతిజనకపదార్థావలోకనమువలనను అయిదు విధములగు ఛర్దిరోగములు గలుగును. ఇవిగాక, ఇతరములగు అజీర్ణ ఛర్దులయందు లంఘనముచేయించవలయు.

చికిత్స—అడ్డసరపుపువ్వులరసములోగాని, తిప్పతీఁగెరసములోగాని, పిప్పళ్లు, లాజలు, వెలగపండు, రేఁగుగింజలలోనిపప్పు, ఏలకులు, లవంగాలు, అకుపత్రి వీనినిచూర్ణముచేసి, వరామెత్తుచూర్ణమును తేనెలోఁ గలిపి సేవించిన సకలఛర్దులుమానును.

—మారేడువేళ్లు, కొతిమిరివిత్తులు, సొంటి, లాజలు, పెసలువీనిని కషాయముపెట్టి, శర్కరగలిపిసేవించిన సకలమైనవాంతులుమానును.

—నెమిలియీాకలమసి, చెంగల్వకోష్టుమసి, గవ్వలమసి, తేనెవీనిని కలిపినాకించిన, వాంతులు మానును.

—కరక్కాయ-చక్కెర-సొంటి-వెలిగారము- పటిక - పెట్లుప్పు-తేనె వీనిని నిమ్మపండ్లపులుసున మర్దించి నాలుకకురాచిన - వాంతులు నిలుచును.

—దొండాకుపసరు నొసంగిన వాంతులు మానును.

—తీగెబచ్చలి ఆకురసము - జీలకఱ్ఱ వీనిని కలిపియిచ్చిన వాంతులు మానును.

—సొంటి-పిప్పలి-మిరియాలు-ఇవి మూడువరాలయెత్తు-మోడి ౧వ-శ్రీగంధము ౩వ - వీనిని కషాయముపెట్టి - వడియుగట్టి అందులో జీలకఱ్ఱనునూరి కలిపి పుచ్చుకొనిన నెట్టివాంతులైనను మానును.

భుజించినతరువాత వాంతియగుటకును - నెత్తురుబంక పడుటకును చికిత్స—ఉప్పునునూరి వసకొమ్మకు కవచముచేసి బొగ్గు అగునట్లుగా కాల్చినది ౧ వరాయెత్తు అభిని ౧వ - ఈశాంటిని మెత్తగనూరి పెసరగింజంతమాత్రలుచేసియుంచుకొని - సెమలియాకులు - జీలకఱ్ఱ-మిరియాలు-పిప్పళ్లు - సొంటి-పచ్చిబియ్యము- అతిమధురము వీనిని సమభాగములుగమాడ్చి దానిలో నీళ్లుపోసికాచి ఆకషాయములోనొకమాత్రనైనను రెండుమాత్రలనైనను రాచియిచ్చిన-పిల్లలకును-పెద్దలకును-భోజనోత్తరమున వాంతియగుట - నెత్తురుబంకపడుట ఇవిమానును. ఇచ్ఛాపథ్యము.

బిల్వాదిలేహము—౩౦ పలముల మారేడువేళ్ళను తూమెడు నీళ్ళలోవేసి కషాయముపెట్టి, ౮వ భాగము మిగులునట్లుకాఁచి, ౩౦ పలములబెల్లమును చిక్కన పాకముగాకాఁచి, దించి అందులో సొంటి౩ ప, మిరియాలు ౪ప, పిప్పళ్లు ౧ప, చవ్యము ౧ప, తాళీశపత్రి ౧ప, నాగకేసరాలు ౧ప, మోడి ౨ప, చిత్రమూలము ౧ప, ఏలకులు ౧కర్షము, లవంగాలు ౧క, ఆకుపత్రి ౧క, జీలకఱ్ఱ ౨ప, వీనిని చూర్ణము చేసి కలిపి తేనెపోసి అనువుగాకలిపి సేవించిన సకలఛర్దులు మానును హృద్రోగము,కామిల గుల్మము,గ్రహణి,అరుచి,పీనస,వెక్కిళ్ళు,కాసము,శ్వాసము, క్రిములు, కడుపుబ్బరము, గళరోగము,పాండువు,మూలవ్యాధి ఇవియన్నియు మానును.

—మారేడువేరు- కొతిమిరివిత్తులు- సొంటి- వెలగవిత్తులు- పేరాముట్టివేరు-వట్టివేరు-శర్కర- వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి - తేనెలోగలిపి యిచ్చిన ఛర్దులు మానును—పత్తిగింజలపొడి, ఏలకులు,పిప్పళ్లు- బొరుగులపొడి-చక్కెర వీనిని సమభాగములుగ చూర్ణముచేసి యిచ్చిన సర్వఛర్దులు మానును.

## తృష్ణారోగలక్షణము.

నాలుకవెలికివచ్చుట, బిరుసుగనుండుట, కాంతిచెడుట,మాటలుడుగుట, ముఖముువాడుట, జలాభిలాషగలుగుట, పంచేంద్రియములు సత్వము మనస్సుచెడుట;డగ్గుత్తికపడుట-ఈలక్షణములుతృష్ణారోగమునందుగలుగును.

చికిత్స—టెంకాయనీళ్ళలోలాజపొడికలిపిత్రాగిన తృష్ణమానును.

—నాగకేసరములు,నేలగుమ్మడిగడ్డ, పిప్పళ్లు, జీలకఱ్ఱ, దాడిమకాయ, తేనె వీనినికలిపినూరి శర్కరనుజేర్చి సేవించిన తృష్ణమానును.

—మఱ్ఱిచిగుళ్లు, పల్లేరువేళ్లు, లాజలు, తెల్లకలువగడ్డలు,వీనినినూరి తేనెకలిపి యుంటలుచేసి నోటనునిచికొనిన తీవ్రతృష్ణమానును,

—ద్రాక్షపండు, యష్టిమధుకము, తెల్లకలువగడ్డ వీనిని సరిపాళ్లుగ గూర్చినూరి, చెఱకురసము, తేనె వీనిలోగలిపి నోటనునిచికొనినను—ద్రాక్షపండు- చెఱకురసము, వీనిని పాలలోగలుపుకొని పుక్కిటబెట్టుకొనినను, లేక బెల్లపుపానకములో చింతపండు-సైంధవలవణము- తేనె వీనినికలిపి గండూషముచేసినను నోరు, సెలవులు ఎండుటమానును. నోరు-నాలుక- బాగుగనుండును.—పాలువంటకము పథ్యము.

## హృద్రోగలక్షణము.

విరుద్ధాహారవిహారములవలన వాతాదిదోషములుప్రకోపించి ఐదు విధములగు హృద్రోగముల గలుగజేయును. వాతమువలన అొమ్మునొప్పి

గలిగియుండును. పైత్యమున రొమ్మునందు తాపము గలుగు - శ్లేష్మమున రొమ్ము బరువై స్తంభించియుండును. త్రిదోషమున పై లక్షణములన్ని గలుగు. క్రిమిహృద్రోగమున మిక్కిలి పోటుగలుగును. దోషహృద్రోగము అసాధ్యము.

చికిత్స—నిమ్మపండ్లపులుసు సైంధవలవణము నూనె వీనినికలిపి త్రాగిన వాతజహృద్రోగము మానును.

—సొంటి - సౌవర్చలవణము - ఇంగువ - దానిమ్మకాయ - పుల్లప్రబ్బలి వీనిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి కర్షమెత్తుచొప్పున పుచ్చుకొనిన వాతహృద్రోగము మానును.

—చెఱకురసము నాలుగుకుంచములు - నెయ్యికుంచెడు - కోలపొన్నముయ్యాకుపొన్నలకల్కము నేతికి ౪ వ పాలు - ఇట్లు వీనిని జేర్చి కాచి ఆఘృతమును పుచ్చుకొనిన పైత్యహృద్రోగము మానును.

—పిప్పళ్లు - కచూరాలు - అతివస - రాస్న - కరక్కాయలు - పుష్కరమూలము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి కర్షమెత్తుచొప్పున గోమూత్రముతో బుచ్చుకొనిన శ్లేష్మహృద్రోగము మానును.

—చెంగల్వకోష్టు - వాయువిళంగాలు వీనిచూర్ణమును కర్షమెత్తు గోమూత్రముతో సేవించిన క్రిమిహృద్రోగము మానును.

—నీళ్లు నాలుగుకుంచములు - నెయ్యికుంచెడు, నేతికి నాలవపాలు కరక్కాయలు - సౌవర్చలవణము వీనిని కల్కముచేసి పై ఘృతాదులలో బోసి కాచి యాఘృతమును సేవించిన సకలహృద్రోగములు మానును.

—ఇంగువ ౧పాళ్లు, వస ౨పా, చెంగల్వకోష్టు ౩పా, సౌవర్చలవణము ౪పా, వాయువిళంగాలు ౫పా, వీని చూర్ణమును వేడినీళ్ళతో బుచ్చుకొనిన హృద్రోగము గుల్మము శూలలు, వాయువులు మానును.

రసాయనము—రసభస్మము - గంధకభస్మము - అభ్రకభస్మము వీనిని సరిపాళ్ళుగ గూర్చి యెండలోనునిచి - మద్దిచెక్కరసమున నిరువదియొకమారు ఊరబెట్టి - మినపగింజంతచొప్పున తేనెతో బుచ్చుకొనిన, సకల హృద్రోగములు మానును.

---

## శూల లక్షణము.

వాతశూలయందు కడుపునొచ్చును. పైత్యమునందు బొడ్డునొచ్చును. శ్లేష్మమునందు గుండెనొచ్చును. త్రిదోషశూల అన్ని లక్షణములు గలది.



చికిత్స—తమలపాకురసములో ఆముదమునుగలుపుకొని సేవించినను వేడి కలిని త్రాగినను ఇసుకపొట్లమున కాచినను తీవ్రశూలలు మానును.

హింగ్వష్టకచూర్ణము—సొంటి - పిప్పలి - మిరియాలు - ఓమము - జీలకఱ్ఱ - నల్లజీలకఱ్ఱ - సైంధవలవణము - ఇంగువ - వీనిని సమభాగములుగ చూర్ణముచేసి - కర్షమెత్తుచొప్పున వేడినీళ్లతో ఇచ్చిన హృదయశూల - ఉదరశూల - గుల్మము - మూలవ్యాధి - గ్రహణి ఇవి మానును.

—కొతిమెర్లు - పుష్కరమూలము - కరక్కాయలు - పుల్లప్రబ్బలి, బిడాలవణము - వస - ఇంగువ - సైంధవలవణము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి కర్షమెత్తుచొప్పున తరికషాయముతో బుచ్చుకొనిన శూలలు మానును.

అన్నభేదిమాత్రలు—అన్నభేది, జీలకఱ్ఱ, ఓమము, కరక తాడి ఉసిరికలు, పిప్పళ్ళు మిరియాలు, సొంటి, ఇవి సమభాగములు, సైంధవలవణము ౧ పాళ్ళు వీనిని కలిపి నిమ్మపండ్లరసముతో మర్దించి కందిగింజలంతమాత్రలుచేసి రెండుపూటల నొక్కొకమాత్రచొప్పున పుచ్చుకొనిన శూలలు మానును.

శూలకుఠారరసము—రసము, గంధకము, కరక తాడి ఉసిరికలు, సొంటి, పిప్పలి, మిరియాలు, శుద్ధతాళకము, నాభి, తామ్రభస్మము, నేపాళములు, వెలిగారము వీనిని సరిపాలుగగూర్చి గుంటగలగరాకురసముచే జక్కగ మర్దించి, రెండు గురిగింజలంతమాత్రలుచేసి, ఒక్కొకటిచొప్పున మిరియాలపొడితో గాని, అల్లపురసముతో గాని సేవించిన సకల శూలలు మానును.

శూలారిరసము—రసము, గంధకము, తామ్రభస్మము, సొంటి, మిరియాలు, ఇంగువ, వస, చిత్రమూలము, జాజికాయలు, వీనిని గుంటగలగరాకు రసముతో ౨ జాములు చక్కగమర్దించి రేగుపండంతమాత్రచొప్పున ౨ మండలములు పుచ్చుకొనిన సకల శూలలు, ఉదావర్తము, గుల్మములు, అగ్నిమాంద్యము ఇవి మానును.

నృపతివల్లభరసము—పాదరసము, ఆమరశిలగంధకము, అభ్రకభస్మము, వంగభస్మము, తామ్రభస్మము, లవంగాలు, ఏలకపండ్లవిత్తులు, ఇంగువ, ఆకుపత్రి, సొంటి, సైంధవలవణము, ఓమము, దాచినిచెక్క, జీలకఱ్ఱ, శుద్ధిగలహేమమాక్షికము, గజపిప్పళ్లు, మిరియాలు, దుంపపసుపు, ఇవి సమభాగములు వీనిని నల్లమేకపాలతో నవనీతముగ నట్లుమర్దించి, రేగుగింజలంతమాత్రలుచేసి అనుపానవిశేషములతోనిచ్చిన, హృదయశూల, పార్శ్వశూల మొదలగు సకలశూలలు మానును.

---

## ఉదావర్త లక్షణము.

రూక్షద్రవ్యములచేతను - నీచధాన్యభక్షణముచేతను- వాయువుప్రకోపించి - మలమునుబంధించి - మలమూత్రములతోఁజేరుకొని యూర్ధ్వగతంబై హృదయము-వీఁపు-పొత్తికడుపు-తల వీనియందునొప్పినికలుగజేసిన ఉదావర్తరోగమనబడును. ఇందు శ్వాసము-కాసము- జ్వరమును గలుగు.

చికిత్స—ఈరోగమునందు దేహమునకుచమురుపట్టించి కాఁచవలయు. అనేకప్రకారములుగా విరేచనమునకిచ్చి మలమును తీయవలయును.

—ప్రేంగపండు - దంతిచెక్క-ఇంగువ- కంకుష్ఠము- సైంధవలవణము- బిడాలవణము- బెల్లము- కరుధూపము- ఇవిసమానములుగజేర్చి నూరి గోమూత్రమున మర్దించి గుడ్డలోబెట్టినత్తిచేసి ఆసనమునఁనెక్కించిన ఉండగట్టిన మలము వెడలును.

—తెగడచెక్క ౩ పాళ్లు-పిప్పళ్లు ౪ పా-కరక్కాయలు ౫ పా-వీనినికలయబోసినూరి యుంటలుచేసి ఆసనములోబెట్టినబద్ధమలమువిడుచును.

—కరక్కాయలు, తెగడ, ఉలవలు వీనినికషాయముపెట్టి ఆముదముగలుపుకొని సేవించిన ఉదావర్తముమానును.

—గోమూత్రము ౧ పలములు, పెరుగునీళ్లు ౧ ప, కడుగు ౧ ప, ఆముదము, ౧ ప, వీనిజేర్చికలిపి దానిలో రెండుకర్షములయెత్తు ఆవాలునూరికలిపి వస్తినగట్టిన ఆనాహము, మలబద్ధము, ఉదావర్తముమానును.

అగ్నిముఖచూర్ణము—చిత్రమూలము, అతివస,వస,చెంగల్వకోష్టు, సౌవర్చలవణము,ఇంగువ,పిప్పళ్లు,నేలములకవేళ్ళు, గంటుభారంగి,ఓమము,సొంటి, వాయువిళంగాలు, మిరియాలు,మోడి,గజపిప్పళ్ళు, యవక్షారము. వీనినిసరిపాలుగజేర్చి చూర్ణముచేసి దానికి సమభాగము కరక్కాయలపొడికలిపి, ఆచూర్ణమును రెండు మాడలయెత్తుచొప్పున సొంటిరసముతోగాని, ఆవునేతితోగాని పుచ్చుకొనిన, ఆనాహము ఉదావర్తము,పురాణజ్వరములు, వెక్కిళ్లు, శ్వాసకాసములు, హృద్రోగములు మానును.

---

## ఆనాహచికిత్స

విరుద్ధాన్నపానాదులవలన వాయువు ప్రకోపించి, మలమూత్రములనుబంధించి ప్రేగులరచుట,కడుపునొప్పి వీనినికలుగజేసినఆనాహమనబడు.



ఈరోగమునకు ఉదావర్తచికిత్సను చేయవలయు. మఱియు అగ్నిముఖచూర్ణమునుకూడ ఇచ్చిన ఆనాహముమానును.

---

## అశీతివాత రోగములు.

విరుద్ధాహారవిహారములవలన వాతము ప్రకోపించి, పోట్లు, నొప్పి, పగుళ్లుగలుగుట,ముడుచుకొనుట,ఎండుట,వాచుట మొదలగు లక్షణములుగల ఎనుబది వాతములను బుట్టించును.

—మఱియు, కీళ్లు, గణువులు, చేతులు,వీఁపు, శిరస్సు, తొడలు మొదలగునవయవములీడ్చిపట్టుట,ఎముకలసంధులయందును గణువులయందును మెటికలువిరుగుట, దేహముగగుర్పొడుచుట, అవయవములెండుట, స్తంభించుట, శిరస్సు- నేత్రములు- నాసిక ఇవిసంకోచమునుజెందుట, వణకుగలుగుట, దేహమునందు పగుళ్లుగలుగుట, నిదురపట్టకుండుట, ప్రజ్ఞలేకుండుట, ఆయాసముగలుగుట, స్త్రీలకుఋతురక్తము నెడలకుండుట, ఈ లక్షణంబులు వాతరోగంబునగలుగును-మఱియు వాతము మిగులదుష్టంబైనయెడ సర్వాంగవాయువు, పక్షవాయువు, ఊర్ధ్వవాయువు, అధోవాయువు, కుంభకవాయువు, సంధివాయువు, కటివాయువు, శిరోవాయువు, మొదలగు ననేకవాతరోగములను గలుగజేయును.

చికిత్స—వాతరోగములయందు, అభ్యంగము,వస్తికర్మ, నస్యము అంజనము,చెమటదీయుట, తైలమర్దనము, విరేచనమునకిచ్చుట,పుష్టినిచ్చెడిపదార్థముల భక్షింపజేయుట ఈమొదలగుక్రియల నొనర్చవలయు.

—చిత్రమూలము, అగరుసొంటి, కొడిశవిత్తులు, అతివస, కటుకరోహిణి, కరక్కాయలు వీనినిసమాంశములుగగూర్చి చూర్ణముచేసి తేనెతోబుచ్చుకొనిన, మహావాతరోగములు మానును.

—వావిలిఆకు, కానుగాకు, కానుగుచెక్క వీనిలోదేనినైనను వెచ్చచేసికట్టుకట్టిన వాతరోగముమానును.

—దేవదారుపట్ట, ఇంగువ, చెంగల్వకోష్టు, పెద్దసోపు వస, సైంధవలవణము వీనినిసరిపాళ్లుగ గూర్చి చూర్ణముచేసి జిల్లేడుపాలతోనూరి లేపనముచేసిన, అస్థిగతవాయువులు సైతము మానును.

——తిప్పతీగ, రాస్న, సొంటి, దేవదారుపట్ట, ఆముదపువేరువీనిని సరిపాళ్లుగగూర్చికషాయము పెట్టిపుచ్చుకొనిన సమస్తవాతములుమానును.

——ఆముదపువేళ్లు, మారేడువేళ్లు, ములక, వాకుడు, పాదరలవణము, సొంటి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, ఇంగువ, మాదీఫలపు బెరడు వీనిని సమాంశములుగగూర్చి కషాయము పెట్టిపుచ్చుకొనిన ధనుర్వాతము మానును.

అర్కాదితైలము——జిల్లేడుపాలు, వావిలాకురసము, చింతాకురసము, మేకపాలు, నూనె వీనినిసరిపాళ్లుగగలిపి, తైలపాకమునఁగాఁచి, దేహమునందు మర్దించిన, సకలవాతములు మానును.

ప్రసారిణీతైలము——౧౦౦ పలములుగల గొంతెమగొమరుతీఁగెను నలియగొట్టి నాలుగు తూములనీళ్ళలోవేసి తూమెడుగకాచి వడియబోసి, ఆకషాయమునకు సరిపాలు నూనె, పెరుగు, పులికడుగు వీనినివేసి, నూనెకు నాలుగుపాళ్ళ పాలుబోసి, అతిమధురము, సైంధవలవణము, గొంతెమగొమరుతీగె, దేవదారు, సన్నరాస్నము గజపిప్పళ్లు, పెద్దసోపు, జటామాంసి, చిత్రమూలము, మోడి, శుద్ధిగల జీడిగింజలు వీని కల్కమును నూనెకు ౧వపాలువేసి, నీరిగురువరకుకాచి, వడియపోసి, బాధగలచోటమర్దనము చేసిన, వాతకఫవికారములు, కుబ్జ, పంగు, అర్దిత, గృధ్రసీ, ఖంజాడవాతములు, శిరస్సు, చెక్కిళ్ళు వీపు నడుము వీనిని ఈడ్చిపట్టెడివాతములు, ఇతరములగు విషమవాతములును మానును.

మాషాదితైలము——మినుములు, యవలు, తీటకసివెందవిత్తులు, ఆగసెవిత్తులు, చిన్నములక, గోరింట, పల్లేరు, దుందిలపువేరు వీనిని ప్రత్యేకము ఏడేసిపలములవంతునగూర్చి దీనికి నాలుగింతలనీళ్ళుపోసి, నాలవపాలు మిగులునట్లు కాచి, వడియబోసి, ప్రత్తివిత్తులు జనపవిత్తులు, ఉలవలు, రేగుపండ్లు, వీనిని ప్రత్యేకముగ పదునాలుగేసి పలములవంతునగూర్చి, దానికి నాలుగింతలు నీళ్లుపోసి, నాలవపాలు మిగులునట్లుకాచి వడియబోసి, ౧ ప్రస్థముగల మెుగమేకమాంసములో, ౬౪ పలముల నీళ్ళుపోసి నాలవపాలు మిగులునట్లుకాచి వడియబోసి, ౧ ప్రస్థము నువ్వులనూనెపోసి పైకషాయములనన్నిటినికలిపి, సొంటి, పిప్పళ్లు, పెద్దసోపు, ఆముదపువేళ్ళు చిట్టాముదపువేళ్ళు, గొంతెమగొమరుతీగె, జటామాంసి, కటుకరోహిణి, చెంగల్వకోష్టు, తిప్పతీగె, సన్నరాస్నము, గలిజేరు వీనిని ప్రత్యేకముగకల్కము చేసి ౪పలము చొప్పునవేసి మెల్లనిమంటచే నీరిగురువరకుకాఁచి, వడియబోసి, బాధగలచోట మర్దించిన, గ్రీవాస్తంభ, అపబాహుక, అర్ధాంగ, ఆక్షేపక, ఊరుస్తంభ, హస్తపాదకంపన, శిరోగతాది సకలవాతములు మానును.

నారాయణీతైలము——చల్లపిల్లివేళ్ళు, కోలపొన్న, నేలపొన్న, చిట్టాముట్టి, పేరాముట్టి, పెన్నేరుగడ్డ, పల్లేరు, మారేడువేరు, గోరింట, రెల్లు, వీనిని ప్రత్యేకముగ ౧౪ పలములవంతునగూర్చి కల్కము చేసి, దానికి నాలుగింతలు నీళ్ళుపోసి, నాలవపాలు మిగులునటులకాఁచి వడియబోసి, నువ్వులనూనె ౧ ప్రస్థము, ఆవుపాలు ౧ ప్ర, చల్లపిల్లివేళ్ళరసము ౧ ప్ర, నీళ్ళు౧ ప్ర, ఇట్లన్నిటినిజేర్చి, మరల-చల్లపిల్లివేళ్లు, దేవదారుచెక్క, చెంగల్వకోష్టు, చిట్టాముట్టి, పెద్దసోపు, జటామాంసి, శ్రీగంధము, గ్రంథితగరము, ఏలకులు, జాతిపువ్వు, నల్లకలువగడ్డలు, నేలతాటిగడ్డలు, అతిమధురము, ఇప్పపట్ట, పెన్నేరుగడ్డ, గుమ్మడుగడ్డలు వీని కల్కము నొక్కొకకర్షమువంతునవేసి, ఆవుపేడ పిడకలచేత మెల్లనిమంటవేసికాచి, వడియబోసి, దేహమునందు మర్దించిన, కామోద్దీపనము గలిగి నిత్యము స్త్రీలరమించుటయందు మిగులసమర్థులయ్యెదరు. స్త్రీలు దేహమునందు బూసికొనినయెడ, యోనిశూలమాని మంచిసంతానము గలుగును. మఱియు, తలనొప్పులు, ఒడలునొప్పులు, పాండువు, కామిల, విషబాధలు, మేహవాయువులు, స్త్రీల రక్తస్రావరోగములు మొదలగునవి యన్నియు మానును.

భృంగామలకతైలము——గుంటగలగరాకురసము ౬౫ తు, ఉసిరికకాయలరసము ౬౫తు, నువ్వులనూనె ౬౫తు, ఆవుపాలు ౧౬౦ తు. వీనినికలిపి ప్రొయ్యిమీదబెట్టి పొంగువచ్చుచుండగా యష్టిమధుకము ౫ తు, మంచిగంధము- రక్తచందనము-కటుకరోహిణి-దుంపరాస్నము-వట్టివేరు- కురువేరు- తుంగముస్తెలు- ఇవి దినుసుకు ౧౪తు- వీనిని అన్నిటిని పొడిచేసి పైతైలాదులలోవేసి దించి వడియగట్టి శిరమున కభ్యంగము చేసికొనినను. నస్యము చేసినను శిరోవాయువులు నేత్రరోగములు పీనస వాంతులు పైత్యరోగములు తలత్రిప్పుడు తలవణుకు చెవిపోట్లు ఇవి మానును. దేహమునకు కాంతి కలుగును, ముఖము చంద్రబింబమువలె నుండును.

మహావాతరాక్షసము——రసము-గంధకము - అభ్రకము-రజతము - కాంతము-ఇనుము-లోహము-ఇత్తడి-కంచు-తాళకము-తామ్రము-ఉల్లిపాషాణము- వెలిగారము-సువర్ణము-నాగము-వీని భస్మములు - మైలుతుత్తము-రససిందూరము-నాభి-వంగభస్మము-నవాసారము-మణిశిల-ఇంగిలీకము-వైక్రాంతభస్మము - వీనిని సమభాగములుగ గూర్చి - కుంకుమపువ్వు-చిత్రమూలము-సొంటి-పిప్పలి-మిరియాలు-కురువేరు-ఓమము కొండబలరక్కసిదుంప వీని కషాయములతో బ్రత్యేకముగ రెండేసిజాములుమర్దించి-వజ్రమూసలోవేసి రెండుజాములువండి - పిదప అల్లపురసము- పోతుఆగాకరరసము-ఎఱ్ఱఉల్లిగడ్డరసము వీనితో క్రమముగమర్దించి - ఘుటికలుచేసి - పూటకు వడ్లగింజయెత్తుచొప్పున అనుపానవిశేషములతోనిచ్చిన - దేహమువణకుట-ధనుర్వాతము-ఆమవాతము మొదలగు సర్వవాతరోగములు మానును.

మహావాతవిధ్వంసిని——స్వర్ణభస్మము౧తు-రజతము౧తు-గంధకము ౧తు - అభ్రి

కము౧|తు-ప్రవాళము౧|తు-ముత్యభస్మము౧|తు-నాగభస్మము౧తు - వంగభస్మము ౧తు-లోహము ముక్కాలు తు-తామ్రము ముక్కాలుతు-పాదరసము ౧|తు - నాభి౧|తు-మణిశిల ౧॥తు-వెలిగారభస్మము ౧॥తు-కాంతము ముక్కాలుతు- ఇంగిలీకము ౧॥తు-శంఖభస్మము ౧॥తు-బిడారుఓమము ౨తు - వీనినన్నిటిని-నిమ్మపండ్లరసము- జిల్లేడుపాలు-తులసిరసము-అల్లపురసము-త్రిఫలకషాయము-వీనితో ప్రత్యేకముగ మెత్తగమర్దించి-ఘుటికలుచేసి అడ్డగయెత్తుచొప్పున పుచ్చుకొనిన సకలరోగములు- సకలవాతములుమాని దేహమునకు బలము పుష్టియు గలుగును.

వాతగజసింహరసాయనము—శుద్ధిజేసినమైలుతుత్తము-రసకర్పూరము - రససిందూరము-ముదారుసింగు - వీనిని సమభాగములుగ కలిపి చింతాకురసముతో మెత్తగమర్దించి-వంకాయనుతొలిచి - దానిలోని గుజురుతీసి - అందులో ఔషధమునిమిడ్చి వంకాయముక్కను తొడిమచేతమూసి పలుచగా చీలమన్నిచ్చి లఘుపుటముచేత పచనముచేసి - చల్లారినపిదప -. జాజికాయ-కురాసానిఓమము లవంగాలు వీనిని సమభాగములుగాకలిపి - ఆవునేతితో నవనీతముగామర్దించి - ఇందుపగింజంతమాత్రలుచేసి పూటకొకమాత్ర యిచ్చిన వాతరోగములు సకల జ్వరములు మరణశూలలు మానును.

కాలాగ్నిరుద్రరసము—శుద్ధిగలరసము-వసనాభి.గంధకము-ఓమము-కరక తాడి ఉసిరికలు-సజ్జక్షారము-యవక్షారము-సైంధవలవణము-సౌవర్చలవణము-చిత్రమూలము-జీలకఱ్ఱ-వాయువిడంగాలు-వెలిగారము-సొంటి పిప్పలి-మిరియాలు - వీనిని సమాంశములుగగూర్చి చూర్ణముచేసి - విషముష్టివిత్తులను మూడుదినములు కలిలో నానబెట్టితీసి చూర్ణముచేసి యీచూర్ణమును పైదానికి సమముగగలిపి - నిమ్మపండ్లరసముతో నొకదినము మెత్తగమర్దించి - కందిగింజంతమాత్రలుచేసి - నెయ్యి మిరియాలపొడి వీనియనుపానముతో బుచ్చుకొనిన - కుక్షివాతము మొదలగు సకలవాతములు- అగ్నిమాంద్యము - గుల్మములు ఇవియన్నియు మానును.

ద్రాక్షాదిఘుటికలు—శ్రీగంధము-తంగేడువిత్తులు-నేలతాటిగడ్డలు - ఏలకులు-లవంగపుచెక్క-ఆకుపత్రి-నాగకేసరములు-ఖర్జూరపండ్లు-అతిమధురము-దానిమ్మపండ్లు తేనె-మొరలిబంక వీనిని సరిపాలుగగూర్చి వీని కన్నిటికి సమముగ జాజికాయలు అంతటికి రావ పాలు సిందూరమునుజేర్చి మర్దించి పూటకు చిన్నమెత్తుచొప్పున ఆవువెన్నతో బుచ్చుకొనుచుండిన వాతమువలన గలిగెడి నష్టవీర్యదోషముహరించి శుక్రవృద్ధిని-లింగవృద్ధిని కలుగజేసి నూర్గురు స్త్రీలతో రమింపగలశక్తినిగలుగజేయును.— ఆవనూనె-పులుసు-స్త్రీసంగము ఇవి వర్జ్యములు.

వాతాంతకరసము—స్వర్ణము-గజతము-తామ్రము-కాంతము-లోహము-అభ్రకము-వీని భస్మములు . గంధకము-వైక్రాంతభస్మము-పగడభస్మము- తాళకభస్మము వీనిని సమాంశములుగగూర్చి చిత్రమూలరసముతో నాలుగుజాములు మర్దించి బిళ్ళచేసి యెండించి కుక్కుటపుటమునందువేసి - చల్లారినపిదప సన్నగచూర్ణముచేసి, దానికి అరపాలు-రసభస్మము-తాళకభస్మము వీనినికలిపి-అల్లము- చిత్రమూలము - నిమ్మకాయ-అడ్డసరము వీని రసములలో ప్రత్యేకముగ నేడేసిమార్లు మర్దన భావనలుచేసి గురిగింజంతమాత్రలుచేసి తేనెతోగాని, నేతితోగాని పుచ్చుకొనిన-పక్షవాతాది సకలవాతములు మానును. వంధ్యాస్త్రీలు పుచ్చుకొనిన సంతానముగలుగును. పురుషులకు వీర్యవృద్ధి కలుగును.



వాతవిధ్వంసనరసము—శుద్ధిగలరసము-గంధకము-సీసభస్మము- వంగభస్మము-లోహము-తామ్రము-అభ్రకభస్మము-సొంటి-పిప్పలి- మిరియాలు-శుద్ధిగలవెలిగారము ఇవి సరిపాళ్ళు-వసనాభి- ౬|పాలు - వీనిని సొంటి పిప్పలి మిరియాలకషాయముతో మూడుసారులును, నేలతాటిగడ్డలు - చిత్రమూలము- గుంటగలగరాకు వీని రసములతోను చెంగల్వకోష్టుకషాయముతోను మూడుసారులును, వావిలి-అల్లము-నిమ్మపండ్లు అడ్డసరము-గంజాయియాకు వీని రసములతో వెవ్వేరుగ మర్దనభావనలుచేసి గురిగింజంతమాత్రలు చేసి - రెండేసిమాత్రలుచొప్పున అనుపానవిశేషములతోనిచ్చిన, వాతరోగములు-శూలలు-కఫవికారములు-సన్నిపాతములు-అగ్నిమాంద్యము-కుష్టువు ఇవిమానును.

స్పర్శవాతమునకుచికిత్స—పాదరసము ౧ పాలు-హరితాళము రాపా - ఎండినగంజాయియాకు రాపా-బెల్లము ౧౭పా - వీనిని బాగుగమర్దించి రెండు మినుములంతమాత్రలుచేసి పూటకు ౧ మాత్రచొప్పున రెండు పూటలయందును రెండు మాసములు పుచ్చుకొనిన, పొంట్లుపొడుచుచు స్పర్శజ్ఞానములేని స్పర్శవాతము మానును.

—రసము రా పా-విషముష్టిగింజలు ౧౦పా- గంధకము౧౩పా-సొంటి-పిప్పలి మిరియాలు-కరక తాడి యుసిరికలు-జీడిగింజలు-తుంగగడ్డలు-రేణుకలు-మోడి - చెంగల్వకోష్టు-పెన్నేరుగడ్డ-వసనాభి- నాగకేసరములు - ఇవి ప్రత్యేక మొక్కొకపాలు-వీని నన్నిటిని చూర్ణముచేసి ౨రపా - ప్రాతబెల్లముకలిపి మర్దించి రేగుపండంతమాత్రలుచేసి ఒక్కొకమాత్రచొప్పున భక్షించినయెడ స్పర్శవాతము మానును.

# స్వరభేద చికిత్స.

వాకుడువేరు సమూలమునుత్రొక్కి రసముతీసి కాగబెట్టి ఆవు నేయికలిపి పుచ్చుకొనినను, సన్నరాష్ట్ర - చిట్టాముదపువేళ్లు- పల్లేరుకాయలు-సొంటి-పిప్పలి- మిరియాలు - వీనినిసరిపాళ్లుగగూర్చి కషాయముపెట్టి నేయి కలిపి పుచ్చుకొనినను స్వరభేదము-శ్వాసకాసలు మానును.

—సైంధవలవణము-పిప్పళ్లు-తానికాయలు వీనిని సరిపాళ్లుగ గూర్చి చూర్ణముగొట్టివస్త్రగలితముచేసి పుల్లనికలి కలిపిత్రాగినను, ఉసిరిక కాయలపప్పును పొడిచేసి పాలలోగలిపి పుచ్చుకొనినను స్వరభేదము మానును. —శ్వాసకాసచికిత్సలు స్వరభేదమునందును ఉపయోగించును.

---

## అరోచకచికిత్స.

సొంటి- పిప్పలిమిరియాలు- వీనినిసరిపాళ్లుగగూర్చి చూర్ణముచేసి- శర్కర - వెలగపండుగుజ్జు - తేనె-వీనినికలిపి - పక్వముచేసి - నెల్లికాయంత తీసికొని నోటిలోబెట్టుకొని రసమునుమ్రింగుచుండిన - అరుచిమానును.

—మాదీఫలపుకింజల్కములు-సైంధవలవణము- వీనినిచూర్ణముచేసి-తగుమాత్రమునేయికలిపి రెండుపూటలు భక్షించినను పుల్లదాడిమగింజలనుగాని, తియ్యదాడిమగింజలనుగాని నమిలిమ్రింగినను అరుచిమానును.

---

## మేదోరోగలక్షణము.

దివానిద్ర - సంచారములేమి - శీతల మధుర స్నిగ్ధ పదార్థభక్షణము మొదలగువానివలన మేదస్సు వృద్ధియై శరీరమును స్థూలింపజేయును- అందువలన నరుఁడేకార్యముఁజేయుటకును అసమర్థుఁడగును.

చికిత్స—కరక- తాడి - ఉసిరికలు - సొంటి - పిప్పలి - మిరియాలు - సైంధవలవణము- వీనినిచూర్ణముచేసి తగుమాత్రము నువ్వులనూనెబోసి- మర్దించి రేఁగుగింజంత మాత్రలుచేసి - ఆరుమాసములు పుచ్చుకొనిన-మేదోరోగము మానును.

—కరక తాడి యుసిరికలు- చాగవేళ్లు-అతివస-చిత్రమూలము- చెంగల్వకోష్టు - సొంటి - పిప్పళ్లు - ఆవాలు -కొడిశెవిత్తులు - తిప్పతీఁగె- పసుపు- తెల్లతెగడ - ఏడాకులరేఁటి - వస - అడ్డసరము - జేలపట్ట - వేపపట్ట - వీనిని ప్రత్యేకముగ ఒక్కొక్క తులమువంతున గూర్చి చూర్ణముచేసి ఒకవీసె నువ్వులనూనెబోసి-పొయిమీదపెట్టి మెల్లనిమంటచే పక్వముగవండి దించుకొని పూటకు ౪ పలము పుచ్చుకొని - అభ్యంగము చేసికొనినను - నస్యవస్తి కర్మలనొనర్చినను - శరీర స్థౌల్యము బద్ధకము మానును.



---

## విసర్పి విస్ఫోటక లక్షణములు.

వాతాది ప్రకోపముచే-రక్తము, మేదస్సు, మాంసము చర్మము ఇవి చెడి ధాతువులయందు వ్యాపించి-జ్వరము, వాంతి, అతిసారము, తాపము బడలిక, అరుచి, అగ్నిమాంద్యము, మాంసము క్షీణించుట ఈలక్షణములుగల విసర్పిరోగమును గలుగజేయును.—మఱియు.జ్వరము, బొబ్బలు గలిగినయెడ విస్ఫోటక మనఁబడును.

చికిత్స—కరక తాడి యుసిరికలు-అడ్డసరము-నేలవేము-చేదుపొట్ల-కటుకరోహిణి-వేఁపపట్ట-శ్రీగంధము వీనిని సరిపాలుగగూర్చి కషాయముకాఁచియిచ్చిన, విసర్పి విస్ఫోటకములు-తాపము-జ్వరము-దురద-వాపు ఇవియన్నియు మానును.

—నాగమల్లివేరు-జాజిఆకు-రేణుకలు-నల్లఉమ్మెత్తవేరు-చాగవేళ్ళు-చెంగల్వకోష్టు-మణిశిల వీనిని సమాంశములుగగూర్చి చూర్ణముచేసి - ఆ చూర్ణమునకు సరిపాలు తిలతైలముకలిపి కొంచెముపాదరసమువేసి కల్వమునందుబాగుగమర్దించి దేహమునకుబూసికొనిన, దురద-కుష్టువు-కాలునేతులపగుళ్ళు-విసర్పి మొదలగునవి మానును.

---

## మసూరికాలక్షణము.

జ్వరము-దురద- అరుచి-భ్రమ-తీవ్రవేదన ఈలక్షణములతోఁగూడి, చిరుసెనగలవంటి బొబ్బలుజనించిన మసూరికారోగ మనఁబడును.

చికిత్స—శ్రీగంధము నాగకేసములు-పసుపు-మానిపసుపు:- దిరిసెనపువిత్తులు-వట్టివేరు-తుంగముస్తెలు-తామరగడ్డలు-చేదుపొట్ల - లొద్దుగపట్ట - వాయువిళంగాలు- వీనిని సమాంశములుఁగగూర్చి కషాయముగాచి, దానిలో పసుపు చూర్ణమును, ఉసిరికవరుగు చూర్ణమును కొంచెముగవేసి త్రాగించిన, మసూరిక - విసర్పి- విస్ఫోటకము- జ్వరము - వాంతి ఇవి మానును.

---

# ముఖదంతాదిరోగ చికిత్సలు.

పెదిమెలయందలి రోగమునకు — దేవదారుబంక-ఆందుగుబంక వీనితో జేయఁబడిన ధూపద్రవ్యములు - దేవదారుపట్ట, అతిమధురము, గుగ్గిలము వీనిని సమాంశములుగ జలముచేనూరి పెదిమెలయందు బూసిన నందలి పగుళ్లు మానును.

నోటిపుండ్లకు — తిప్పతీఁగ, దీపద్రాక్ష, మానిపసుపు, కరక తాడి యుసిరికలు-దురదగొండివేరు, జాపత్రి వీనిని కషాయముపెట్టి దానిలో తేనెనుగలిపి పుక్కిలించి యుమిసిన నవి మానును.

కంఠరోగమునకు — అతివస-అగరుసొంటి-దేవదారు కటుకరోహిణి - కొడిసెపట్ట-తుంగముస్తెలు వీనిని సమాంశములుగనూర్చి గోమూత్రముచే కషాయముపెట్టి, పుచ్చుకొనిన కంఠరోగములు మానును.

— పసుపు-మానిపసుపు-రసాంజనము-పిప్పళ్లు-అగరుసొంటి-చాగవేళ్లు - యవక్షారము వీనిని సరిపాలుగనూర్చి చూర్ణముచేసి దానిలో తేనెగలిపి రేఁగుపండంతమాత్రలుచేసి నోటనునిచికొని రసమునుమ్రింగుచుండిన కంఠరోగములన్నియు మానును.

ముఖపాకమునకు — సొంటి, నువ్వులు, అతిమధురము, వీనిని సమాంశములుగనూర్చి కషాయముపెట్టి పుక్కిలించి యుమియుచు - పెసరపప్పు పులగమును భక్షించిన ముఖపాకరోగము మానును.

— పోఁకచెక్క, పరిపేలాలు, జాజికాయ వీనినిసరిపాళ్ళుగనూర్చి చూర్ణము చేసి అరపలముచొప్పున చన్నీళ్లలోవేసి పుచ్చుకొనిన ముఖరోగములుమాని నాలుకకు రుచిగలుగును.

నోటిదుర్వాసనకు — చెంగల్వకోష్టును పొడిచేసి దానిని తేనెతోనూరి దంతధావనముచేసిన నోటిదుర్గంధము మానును.

పండ్లనొప్పికి — వేఁపచిగుళ్లు, చేఁదుపొట్ల, మఱ్ఱి, మామిడి, అత్తి, జువ్వి, రావి, జాజిఆకులు, జాజికాయ వీని చిగుళ్లను సరిపాలుగనూర్చి కషాయముపెట్టి పుక్కిలించి యుమిసిన దంతములనొప్పి నోటి అరుచి మానును.

— చెంగల్వకోష్టు-మానిపసుపు-పసుపు-మంజిష్ఠ- తుంగముస్తెలు-అగరుసొంటి-లొద్దుగుపట్ట-కటుకరోహిణి - చాగవేళ్లు-గాజుప్పు వీనిని సరిపాలుగనూర్చి పొడిచేసి దానితో ప్రతిదినము పండ్లుతోముకొనినయెడ - దంతములగుండా స్రవించెడి రక్తము, దంతముల దురద నొప్పి మానును.

— శుద్ధిగల మైలుతుత్తము, సొంటి, పిప్పలి, కరక్కాయలు, ఉప్పు, లొద్దుగపట్ట, వీనిని సమాంశములుగనూర్చి చూర్ణముచేసి, దానితో నిత్యము దంతధావనము చేసిన-కదలెడి దంతములు గట్టిపడి పటుత్వము గలిగియుండును.



చిఱునాలికపడినందుకు — శుద్ధిగల వెలిగారపుపొడిని నాలుకకురాచి - కరక్కాయలు-యవక్షారము-చిత్రమూలము-సొంటి-పిప్పలి- మిరియాలు వీనిని సరిపాలుగనూర్చి చూర్ణముచేసి నాలుకపైనొత్తిన చిఱునాలుక సరిగా నుండును.

మంగుకులేపనము — శ్రీగంధము-లొద్దుగపట్ట-చెంగల్వకోష్టు-మ్రానిపసుపు-పండిన మఱ్ఱిఆకులు - ప్రేంకణపువ్వు వీనిని సమాంశములుగనూర్చి-కల్కముచేసి - దీనికి సరిపాలు తిలతైలముపోసి తైలపాకముగగాచి - ముఖమునకు బూసికొనిన - ముఖమునందలినలుపు - మంగు ఇవిమాని ముఖము చంద్రబింబమువలె నుండును

మొటిమెలకు — మద్దిపట్ట-మంజిష్ఠ- అడ్డసరము వీనిని ఆవుపాలతోను - తేనెతోనునూరి ముఖమునందు బూసికొనిన - యౌవనపు మొటిమలు మంగు ఇవి మానును.

పేనుకొఱుకుటకు — వాకుడు పండ్లరసములో తేనెను కలిపిగాని-జీడిగింజలనూనెలో గురిగింజలనుచాదిగాని లేపనము చేసిన-పేనుకొఱుకుటమాని వెండ్రుకలు మొలచును.

పేలు నశించుటకు — పాదరసమును నల్లయుమ్మెత్తాకు రసముతో మర్దించి దానిని వస్త్రమునకుబూసి యావస్త్రమును శిరస్సుకుకట్టి మూడుజాములునిచిన పేలన్నియు మాడి రాలిపోవును.

వెండ్రుకలు మొలచుటకు — అతిమధురము-చెంగల్వకోష్టు- సారపప్పు - మినప్పప్పు-తెల్లగురిగింజలు-సైంధవలవణము వీనిని సరిపాలుగనూర్చి చూర్ణముచేసి, దానిలో టెంకాయపాలుపోసి కలిపి - తలకు పట్టించిన - బట్టతలయందుగూడ వెండ్రుకలు మొలచును.

— అతిమధురము, లక్క, నాభి, గురిగింజాకు వీనిని పులికడుగుతోనూరి - మంచినూనెను ఎక్కువగాబోసి తైలపాకముగగాఁచి - బట్టతలకు లేపనముచేసిన - నిస్సంశయముగ వెండ్రుకలు మొలచును

వెండ్రుకలు నల్లనగుటకు — కరక తాడి యుసిరికలు, ఇనుముపొడి, నీలిఆకు వీనిని సరిపాలుగనూర్చి, గుంటగలగరాకురసముతోను, గొఱ్ఱెమూత్రముతోను బాగుగ మర్దించి, వెండ్రుకలకుబూసిన అకాలపలితముపోయి వెండ్రుకలు నల్లనగును.

— కరక్కాయలు ౨పల, తానికాయ ౧ప ఉసిరికపరుగు ౨ప, మామిడిపప్పు ౫ప, ఇనుముపొడి ౧తు, వీనిని చూర్ణముచేసి యినుపగిన్నెలోవేసిదానిలో మంచినూనెపోసి మర్దించి యొకదినము నాననిచ్చి తరువాత వెండ్రుకలకు లేపనము చేసిన, అకాలమునందు నెరసిన వెండ్రుకలు నల్లబడును.

నీలికాదితైలము — నీలిఆకు, గుంటగలగరాకు, మొగలిగడ్డలు, పచ్చపూలగోరింట, మద్దిపూలు వేగిసపూలు, తామర సమూలము, గ్రంథితగరము, నల్లనువ్వులు, ఇనుముపొడి, ప్రేంకణపువేరు, దానిమ్మబెరడు, తిప్పతీఁగె, కరక తాడి యుసిరికలు వీనిని ప్రత్యే

కము ౧ కర్షముచొప్పునగూర్చి కల్కముచేసి, ఆకల్కమునకు నాలుగింతలు మంచి నూనె-నూనెకు నాలుగుపాళ్ళు త్రిఫలకషాయము - అంతమాత్రము గుంటగలగరాకు రసము వీనినిపోసి తైలపాకముగగాంచి - వడియగట్టి వెండ్రుకలకుబూసిన-వెండ్రుకల మొదళ్ళు స్థిరమై రాలకబలముగనుండును. అకాలపునెరపుపోయివెండ్రుకలునల్లనగును.

భృంగరాజతైలము—కరక తాడి యుసిరికలు - సుగంధిపాల-ఇనుపచిట్టెము వీనిని సమభాగములుగగూర్చి వీనికన్నిటికి నాలుగింతలుమంచినూనె- నూనెకునాలుగు పాళ్లగుంటగలగరాకురసము వీనినికలిపి తైలపాకముగగాంచిదించుకొని శిరమునమర్దించిన-అందలిపోట్లు, పేనుకొరుకుటమాని అకాలమునందునెరసినవెండ్రుకలు నల్లనగును.

వెండ్రుకలురాలుటకు—నేపాళపువేళ్ళు, చేదుబీరపండ్లు, తెగడ, వాడగన్నేరు వేరు వీనిని నూరికల్కముచేసి, నాలుగింతలమంచినూనె, నూనెకు నాలుగింతలు జలము వీనినిపోసి-దానిలో అరటియాకులమసినివేసి తైలపాకముగగాచి వడియబోసి - వెండ్రుకలుండెడి స్థలంబున బూసిన నవి రాలిపోవును.

రోమనాశనమునకు—ఉసిరికెవిత్తులను, గంగరేణివిత్తులను నీళ్ళచే నూరి పూసినను, హరిదళము సంపంగినూనె - వీనిని నూరి రోమములందు చెమట పట్టినప్పుడు పూసినను, వెండ్రుకలన్నియు రాలి మొలవకయుండును

గజ్జికురుపులకు—పాదరసము-మానిపసుపు పసుపు- మిరియాలు- గంధకము- మణిశిల-గంగసింధూరము-నల్లజీలకఱ్ఱ-పెద్దజీలకఱ్ఱ వీనిని సరిపాలుగగూర్చి నేతినినూరి మూడు దినములు దేహమునకుబూసిన గజ్జి దురద మానును. —రావిపట్టమసి- కొత్తరాతినున్నము-వెన్న-ఈమూటినికలిపి మర్దించి పూసికొనిన రొండిమొదలగు స్థలములయందలి దురద తీటె మానును. —జిల్లేడాకు రసములో పసుపుపొడిని- ఆవతైలమునుకలిపి వెచ్చచేసి పూసికొనిన, దురద గజ్జి మానును.

అగ్నిదగ్ధమునకు—యవలమసిలో టెంకాయనూనెకలిపి బొబ్బలపైన పూసిన కాలినబొబ్బలు మానును.

—లొద్దుగపట్ట-అందుగుబంకతోజేసిన ధూపద్రవ్యము-శ్రీగంధము - మంజిష్టి- చాగవేరు-అతిమధురము వీనిని సరిపాలుగగూర్చి చూర్ణముచేసి- నేయి- తేనె- మైనము వీనినివేసికలిపి బాగుగకాచి చల్లారినపిదప వ్రణములుగలచోట పూసిన నవి మానును.

## కర్ణరోగచికిత్స.

సైంధవలవణము కలిసిన మేకపోతుమూత్రమును కొంచెము వెచ్చజేసి దానిని చెవిలోపోసిన చెవియందలి తీవ్రమైనధ్వని-చీముకారుట-పోట్లు ఇవి మానును.

—చెంగల్వకోష్టు-చల్లపిల్లిగడ్డలు-ఇంగువ-సొంటి-వస- సైంధవలవణము - దేవదారు-అనువానిని సరిపాలుగగూర్చి మేకపోతు మూత్రముతోనూరి కల్కముచేసిదానిలో మంచినూనెకలిపి-మెల్లనిమంటతో తైలము పక్వమగువఱకుకాచిచల్లార్చి చెవిలో బోసిన కర్ణరోగములన్నియు మానును.



—మాదీఫలము-మామిడిచిగురు-అల్లము వెలగకాయ - వీని రసముతీసి కొంచెము వెచ్చచేసి చెవిలోబోసిన చెవియందలి శూలలు మానును.

—మారేడుపండును ఆవుపంచితముతోనూరి కల్కముగావించి దానిలోమంచి నూనెకలిపికాచి - తైలముపక్వమగునపుడు - అందులో సర్జక్షారమును - యవక్షారమును-వెలిగారక్షారమునుపొడిచేసివేసి వడియకట్టి చెవిలోపోసినచెవుడునివర్తించును.

—సైంధవలవణము-పిప్పలి- తుంగముస్తెలు-వస-సొంటి-ఇంగువ - వెల్లుల్లి వీనిని సరిపాలుగగూర్చి చూర్ణముచెసి అందులో పండు జిల్లెడుఆకులు-మోదుగపట్ట- వీనిరసమునుపోసి నూరి దానితోనేకల్కముచేసి ఆకల్కమునకు సమభాగముగ మంచినూనెపోసి-తైలపక్వమగువరకుకాచి చెవిలోపోసిన కర్ణరోగములు. చెవుడు నివర్తించును.

చెవిలో చీముకారుటకు—రసకర్పూరమును కొంచెము మంచినూనెలో వేసి పక్వముగకాచి చెవిలోపోసిన చీముకారుట మానును.

కర్ణశూలలకు—వ్రేలిపొడువుగలసొంటిని నూనెలోముంచి దీపమున వెలిగించి అది మండునపుడు, ఒకపాత్రములో అరపలమునూనె నుంచికొని గరిటెతో మండుచున్న సొంటిమీద కొంచెముకొంచెముగా పలుమారు పోయుచుండిన, బొట్లుగా తైలముదిగును. దానిని చెవిలోపోసిన చెవిపోట్లుమానును. మఱియు మేహవాయువు నొప్పులుగలచోట రాచిన గుణమగును.

---

## నాసారోగచికిత్స.

జాజిపువ్వులు-మల్లెపువ్వులు-ఎఱ్ఱగన్నేరుపువ్వులు - వీని రసముతీసి ఈరసమునకు సమముగ మంచినూనెకలిపి తైలము పక్వమగువఱకు కాచి ముక్కులో పోసిన- ముక్కునుండి కారెడు రక్తము మానును.

—తెల్లజీలకఱ్ఱను పొడిచేసి దానిలో పంచదారనుకలిపి నస్యముచేసిన- చీముకారుట-దుర్వాసన-మొదలగువానితోగూడిన నాసికారోగములు మానును.

—ద్రాక్ష-మారేడుపండు-సొంటి-చెంగల్వకోష్టు-పిప్పళ్ళు- వీనిని సరిపాలుగ గూర్చి కల్కముచేసి - ఆకల్కమునకు సమానముగనేతినికలిపి తైలముపక్వమగువఱకు కాచి ముక్కునందుపోసిన-మిక్కిలితుమ్ములతోగూడిన నాసికారోగములు మానును.

—కుంకుమపువ్వును - నేతితోనూరి కొంచెమువెచ్చచేసి నస్యముచేసిన నాసికారోగములు మానును.

---

# నేత్రరోగచికిత్స

ఈరోగములయందు ముందుగ కరక-తాడి-యుసిరికలు - కావిరాయి - మానిపసుపు-లొద్దుగపట్ట- వీనిని సరిపాలుగగూర్చి కషాయముపెట్టి ఈకషాయముతో నేత్రములనుకడిగి తరువాత్కరసాంజనము - శ్రీగంధము - కావిరాయి - వీనిని గంధముతీసి నేత్రములచుట్టు లేపనముచేసిన - నేత్రరోగములు మానును.

నారికేళాంజనము——మానిపసుపు - కరక తాడి యుసిరికలు యష్టిమధుకము వీనిని ప్రత్యేక మొక్కొకపలమువంతునగూర్చి దంచి ౧౬పడి నారికేళోదకములోవేసి-అష్టభాగావశిష్టముగ గషాయముకాచి - దానిని ఒకకుండలోబోసి మెల్లని మంటచే మరలగాచి ౫పలములుగా దించుకొని చల్లారినతరువాత- పచ్చకర్పూరము. సముద్రపునురుగు-రసాంజనము-కావిరాయి-శుద్ధిగలమైలుతుత్తము- సైంధవలవణము - మిరియాలు వీనిని చూర్ణముచేసి దినునకు పాతిక నిష్కముచొప్పున పైయౌషధమునందు వేసి తేనె ౧౪ తులములువేసి కలిపి నేత్రములకుబెట్టిన సకల నేత్రరోగములు మానును.

——సొంటి-కరక్కాయ-శంఖము-పసుపు- తెల్లగంటెనవేరు-దానివిత్తులు- దానిపూలు వీనిని సరిపాలుగగూర్చి గంటెనవేరు రసముచేత మర్దించి నేత్రములయందు రాచిన, గతించిన నేత్రములుగూడ మరలవచ్చును.

——సొంటి-పిప్పలి-మిరియాలు-శర్కర-రసాంజనము-సముద్రపునురుగు - చిల్లగింజలు-శంఖము-సైంధవలవణము-వాయువిళంగములు-మణిశిల-జాజికాయ- కోడిగుడ్లపెంకు వీనిని సరిపాలుగగూర్చిదంచి తేనెపోసినూరి, దానిని ఒకగుడ్డకుపట్టించి వత్తులుచేసికన్నులకురాచిన,చీకట్లుకమ్ముట, పొరలు,నీరుగారుట,పువులు మొదలగునవిమానును.

——శుద్ధిగలపాలతుత్తము,మైలుతుత్తము,హేమమాక్షీకము, కురువేరు, సైంధవలవణము,సొంటి,పిప్పలి, మిరియాలు,వెలిగారము, వీనిని సరిపాలుగగూర్చి చూర్ణముచేసి తేనెచే బాగుగమర్దించి కణికలుచేసి నీడనెండించి నీళ్ళలోచాది కన్నులకు రాచిన, కంటిపువ్వులు మొదలగు నేత్రరోగములు మానును.

——పిప్పళ్ళను, ఆవుపేడరసముతో గంధముదీసిగాని మిరియాలను పెరుగుతో గంధముదీసిగాని నేత్రములకువేసిన రేచీకటి మానును.

తిలపుష్పాంజనము——మిరియాలు ౨ పాళ్ళు, శుద్ధిగలపాలతుత్తము ౪ పా,నువ్వుపూలు ౧౬ పా, వీనిని నిమ్మపండ్లరసముతోనూరి కణికలుచేసి, నేత్రములకురాచిన తిమిరములు,పొరలు,కంటియొఱుపు,దుర్మాంసము దురద మొదలగునవి మానును.

నయనామృతము——శుద్ధిగల మైలుతుత్తము, సౌవీరాంజనము, రసాంజనము, మానిపసుపు,పచ్చకర్పూరము,కటుకరోహిణి, గవ్వలు, సముద్రపునురుగు,శ్రీగంధము,



యష్టిమధుకము,శంఖము,సైంధవలవణము,సొంటి,పిప్పలి,మిరియాలు,అనువానిని సరిపాలుగగూర్చి మాదీఫలరసముతో మర్దించి కణికలుచేసి తేనెతోచాది నేత్రములకు వేసిన సకల నేత్రరోగములు మానును.

నృపవల్లభతైలము——సొంటి, సైంధవలవణము, యష్టిమధుకము, వాయువిడంగములు, గ్రంథితగరము, సదాప, ఆముదపువేరు, పసుబాల, దుంపరాస్నము, గుంటగలగర, వీనిని సరిపాలుగజేర్చి చూర్ణముచేసి దానిలో నల్లనువ్వులనూనె, శిలాజిత్తు, మేకపాలు, నూనెకు నాలుగింతలు గుంటగలగరాకురసము వీనిని కలిపి చిక్కగనుండునట్లుకాచి-బిందువులను ముక్కులోవిడిచిన నేత్రరోగములుమాని గరుడునిదృష్టివంటి దృష్టిగలుగును. శిరోరోగములు మానును. వెండ్రుకలూడినచోట మరల మొలుచును. నెరసినవెండ్రుకలు నల్లనగును.

---

# శిరోరోగచికిత్స.

కరక తాడి యుసిరికలు, తిప్పతీగ, వేపపట్ట, పసుపు, నేలవేము, వీనిని సరిపాలుగగూర్చికషాయముకాచి, దానిలో నారవపాలు బెల్లముగలిపి సేవించిన, కనుబొమలనొప్పి, నుదుటిశూల, చెవులసంధులయందలిపోట్లు, ఒంటితలనొప్పి, రేచీకటి-నేత్రశూల, దంతశూల ఇవిమానును.

——ఆవాలు,లవంగపట్ట,తాళిశపత్రి,మునగవిత్తులు, కానుగువిత్తులు వీనిని చూర్ణముచేసి నస్యముచేయించిన శిరోరోగములన్నియు మానును.

——కుంకుమపువ్వును నేతితోవేయించి చూర్ణముచేసి దానిలోచక్కెరనుగలిపి నస్యముచేసిన, కనుబొమలు, నుదురు, నేత్రములు, కర్ణములు వీనియందలిశూలలు, ఒంటితలనొప్పి, సూర్యావర్తము ఇవి మానును.

——ఆముదపువేరుపట్ట-చెంగల్వకోష్టుఅనువానిని కలితోనూరి- శూలగలస్థలమున పట్టించినమానును. తెల్లగంటెనపువ్వులనునీళ్ళతోనూరిపట్టించినను శిరశ్శూలమానును.

——మిరియాలు-పరిబిత్స్యము-అనువానిని గుంటగలగరాకురసముతోనూరి పట్టించినను, తెల్లగంటెనవిత్తులు-దానివేరు-అనువానిని నీళ్లతోనూరి నస్యముచేసినను ఒంటితలనొప్పి మానును.

——చెంగల్వకోష్టు - సొంటి- వట్టివేరు- గ్రంథితగరము- దేవదారుపట్ట- వీనిని సరిపాలుగగూర్చి కలితోనూరి దానిలో మంచినూనెకలిపి తైలము పక్వమగువఱకు కాచి శిరస్సుకుపట్టించిన తలనొప్పి మానును.

---

# గర్భిణీరోగచికిత్స.

తిప్పతీఁగ - చిన్నపల్లేరుకాయలు- సన్నరాస్న అనువానిని సరిపాలుగఁగూర్చి కషాయముపెట్టి గర్భిణీస్త్రీలకు త్రాగించిన గర్భశూలలు మానును.

—కరక తాడి యుసిరికలు, తిప్పతీఁగ-నేలదంతివేరు వీనిని సమాంశములుగ గూర్చి-కషాయము గాచి, మినపప్పు-మిరియాలు-పిప్పలి-చల్లపిల్లివేళ్ళు-చెంగల్వకోష్టు సైంధవలవణము వీనిని పైకషాయముచేనూరి, ఒకగుడ్డకుపట్టించి దానిని లావుగ వత్తి చేసి యోనియందునిచిన-గర్భశూలలు - రక్తస్రావరోగములు మానును.

—ఆముదపువేరు-పల్లేరువేరు-దర్భవేళ్ళు-జెల్లువేళ్ళు-వీనిని సరిపాలుగ గూర్చి కషాయముపెట్టి దానిలో ఆవుపాలు శర్కరకలిపి త్రాగించిన గర్భశూలలు మానును.

—వేఁపయీనెలు-చేఁదుపొట్లు- యష్టిమధుకము- మిరియాలు- సొంటి- గంటు భారంగి - వెల్లుల్లి - పిప్పలి అనువానిని సమభాగములుగ కషాయముపెట్టి తేనెతో నిచ్చిన గర్భశూలలు మానును.

గర్భిణీజ్వరాదులకు ప్రతిమాసమునందు నియ్యవలసినకషాయములు.

ప్రథమమాసమునందు——తుంగముస్తెలు-దానిమ్మవేరు-దానిచెక్క- సొంటి వీని కషాయము నియ్యవలయు.—ద్వితీయమాసమున, తుంగముస్తెలు-పర్పాటకము - రెడ్డి నానబ్రాలు-మోడి-సొంటి-అనువానిని సమభాగములుగగూర్చి రెండుమానికెల నీళ్ళు పోసి కషాయముపెట్టి సోలెడుగదించి ముందుగ గరిటెడుపాలను త్రాగించి తరువాత ఆకషాయము నియ్యవలయు. —తృతీయమాసమున, నేలవేము-గ్రంధితగరము - పాల వేళ్లు-చెంగల్వకోష్టు-సొంటి-విరజాజిపువ్వు - సహదేవి అనువానిని సమాంశములుగా గూర్చి కషాయముపెట్టి, ముందుగ అరగంటెడు తేనెత్రాగించి తరువాత కషాయము నియ్యవలయు. —చతుర్థమాసమున, ద్రాక్షపండు-రెడ్డినానబ్రాలు-పాలవేళ్ళు- చెంగల్వకోష్టు-అతివస-వేపవేరుపట్ట వీనిని సమాంశములుగ కషాయముపెట్టి ఇయ్యవలయు —పంచమమాసమునందు, ఈతగుంజు, ద్రాక్షపండు, పల్లేరు,సహదేవి,సొంటి, తామరతూండ్లు, నేలవేమువేళ్ళు అనువానిని సమభాగములుగ కషాయముపెట్టి ఇయ్యవలయు. —షష్ఠమాసమునందు, తుంగముస్తెలు, చెంగల్వకోష్టు, రెడ్డినానబ్రాలు, అవురువేళ్లు,సొంటి, నల్లకలువదుంప, కటుకరోహిణి, మారేడువేళ్లు అనువాని కషాయము ఇయ్యవలయు. —సప్తమమాసమునందు, సొంటి,ద్రాక్షపండు, ఖర్జూరము, తిప్పతీగ అనువానిని సమభాగములుగా గూర్చి కషాయముకాచి ముందుగా గంటెడుపాలను త్రాగించి కషాయము నియ్యవలయు. —అష్టమమాసమునందు, యష్టిమధుకము, ఇప్ప చెక్క,మనుబాలవేళ్లు,దనియాలు,పల్లేరు,తుంగముస్తెలు,పుష్కరమూలము, సొంటి అను



వానిని సమభాగములుగా కషాయముపెట్టి, ముందుగ తేనెను పాలను త్రాగించి తరువాత కషాయమునియ్యవలయు. —నవమమాసమునందు, యష్టిమధుకము,ఇప్పచెక్క-లొద్దుగవేళ్ళు, మనుబాలతీగె,పాలవేళ్లు, సొంటి అనువానిని సమభాగములుగ గూర్చి కషాయముపెట్టి, ముందుగ గంటెడుపాలను త్రాగించి పిదప సోలెడు కషాయముని య్యవలయు. —దశమమాసమునందు, మనుబాలతీగె,పాలవేళ్లు,సుగంధిపాలవేళ్ళు,చల్లపిల్లివేళ్ళు, సొంటి అనువానిని సమాంశములుగాజేర్చి కషాయముపెట్టి ఇయ్యవలయు.

సుఖప్రసవమునకు——అతిమధురము, మాదీఫలపువేరుపట్ట అనువానిని సమభాగములుగ కూర్చి చూర్ణముచేసి దానిలో, తేనె నేయి వీనినికలిపి పుచ్చుకొనిన,గర్భిణీ స్త్రీ సుఖముగ ప్రసవించును.

సూతికాజ్వరమునకు——సొంటి-ఓమము-జీలకఱ్ఱ-పెద్దజీలకఱ్ఱ- మోడి-పిప్పళ్ళు-పసుపు-మానిపసుపు-బిడాలవణము-సౌవర్చలవణము అనువానినిసరిపాలుగ కూర్చి చూర్ణముచేసి ఆచూర్ణములో కలిపోసి పక్వముచేసి తరువాత కల్వములో వేసి మర్దించి మాత్రలుకట్టి నీడనెండించి - శరీరతత్వము ననుసరించి యిచ్చిన - సూతికారోగము, ఆమవాతము, శూల, కఫరోగము, ఇవి మాని అగ్నిదీపనము గలుగును. స్తనముల యందు పాలను కలుగజేయును.

—సొంటి, పిప్పలి, చెంగల్వకోష్టు, వస, అతివస, దేవదారు, పెద్దగుమ్ముడు, తుంగముస్తెలు, దనియాలు, నేలవేము, కటుకరోహిణి, కరక్కాయలు, గజపిప్పళ్లు, దురదగొండివేరు, పల్లేరుకాయలు, వాకుడు, పెద్దములక, తిప్పతీగె, నల్లజీలకఱ్ఱ,మారేడువేరు, అనువానిని సరిపాలుగకూర్చి కషాయముపెట్టి, అష్టభాగావశేషముగ దించుకొని దానిలో సైంధవలవణము, నేయివేసి పొంగించిన యింగువ వీనిని కొంచెముగ కలిపి బాలింతలకు ఇచ్చిన, జ్వరము, వణఁకు,తలనొప్పి,భ్రమమాటలాడుట,తాపము, శూల, సన్నిపాతము మొదలగువానితోగూడిన సూతికారోగము మానును. —సూతికారోగములందు వాతరోగములకు జెప్పిన యౌషధంబుల నియ్యఁదగును.

స్తనరోగములకు——వెత్రిపుచ్చవేరును జలముతోనూరి కొంచెము వెచ్చచేసిగాని,అడవిప్రత్తివేళ్ళు, చేదుసారవేళ్ళు అనువానిని గోధుమకడుగుతోనూరిగాని స్తనములకు పూసిన, స్తనరోగములు మానును.

పాలు వృద్ధిబొందుటకు——సొంటి, సుగంధిపాలవేళ్లు, తిప్పతీగె, అగరుసొంటి, చాగవేళ్ళు,తుంగముస్తెలు,కొడిశవిత్తులు, దేవదారు,నేలవేము,కటుకరోహిణి వీనిని సరిపాలుగ కషాయముపెట్టి బాలింతకుత్రాగించిన స్తనములయందుపాలు వృద్ధిబొందును.

గర్భము నిలుచుటకు——ఋతుస్నానమైననాడు - నాగకేసరాలపొడిని ఆవునేతితో బుచ్చుకొనిన గర్భము నిలుచును. తక్కలిఆకును మూడుదినములు పుచ్చుకొనినను,

సాంబ్రాణి ఆకుపసరు - మిరియపుపొడి - నూనె వీనిని కలిపి పుచ్చుకొనినను - గంటుపురుగు చచ్చి గర్భము నిలుచును.

—తగిరిశవిత్తులు, కరక్కాయలు, వరిబియ్యము అనువానిని సమాంశములుగ గూర్చి చూర్ణముచేసి పసికడుగుతోనిచ్చిన, గొడ్డురాలుకు గర్భము నిలుచును.

గర్భస్రావములకు—మాడయెత్తు జాజికాయను మేకపాలతో మెత్తగనూరి యాపాలతోగూడ త్రాగించిన గర్భస్రావములు మానును.

ఆడుశిశువుజనించుటకు—వేలెడు పసుపుకొమ్మును సన్నగ పొడిచేసి- మూడు వెల్లుల్లిగడ్డలను మెత్తగనూరి - నిడుపు కాకరాకుకొనలనుకూడ తెచ్చి నూరి వీని నన్నిటిని కలిపి - ముట్టు అయిన మూడుదినములు నిచ్చిన, ఆడుశిశువు కలుగును. పెసరగంజి - పాలుఅన్నము పథ్యము.

మొగశిశువుకలుగుటకు—పుత్రజీవివిత్తులను-లోపలిపప్పు నలగకుండునట్లుపగులకొట్టి యాగింజలనుమూటినిఆవుపాలతోనొకదినముపుచ్చుకొనిన మొగశిశువుకలుగును.

గర్భిణీశూలకు—మారేడుఆకును ఉప్పును వేయించి - సమముగ కలిపి వేడినీళ్ళతో నొసంగిన - గర్భశూలలు మానును.

ఆర్తవములేని స్త్రీలకు చికిత్స—ద్రాక్షపండు-నువ్వులు-బెల్లము-గంటుభారంగి-చిత్రమూలము అనువానిని సరిపాలుగగూర్చి నువ్వుల కషాయములో గలుపుకొని పుచ్చుకొనిన, ముట్టులేనివారికి ముట్టు కలుగును.

—తవ్వెడు ఉలవలను పడినీళ్ళలోబోసి కాచి దించి ౧ ఆళౌనులో ౨వరాల యెత్తు చిత్రమూలమును నూరి కలిపి, ఆకషాయమునిచ్చిన, ౧, ౨ దినములలో దూరస్త్రీ యగును. గర్భముకూడ నిలుచును. చద్దిఅన్నము కూడదు.

ముట్టుకట్టుకు—గారపండ్లు-గారవేళ్లు-ఈశ్వరివేరు అనువానిని చూర్ణముచేసి-బెల్లమువేసి త్రొక్కి- గుటికలుచేసి ఋతువైన మూడు దినములు పుచ్చుకొనవలయు. ఇట్లు మూడుసార్లు చేసిన ముట్టుకట్టు మానును-

---

# బాలరోగ చికిత్స.

తుంగముస్తెలు, పిప్పలి, చిత్రమూలము, కరకపువ్వు, అనువానిని సరిపాలుగ జేర్చి చూర్ణముచేసి తగినంత తేనెగలిపి శిశువులకు నాకించిన, అతిసారము, శ్వాసకాసలు, వాంతులు మానును.

—చెంగల్వకోష్టు- వస-వాయువిళంగాలు అనువానిని నీళ్ళలోవేసికాచి యానీటిలో శిశువులకు స్నానముచేయించిన, పుండ్లు దద్దులు మొదలగునవి మానును.



—చెంగల్వకోష్టు-కొడిశవిత్తులు-ఆవాలు-పసుపు-కరుధూపమువీనిని చూర్ణము చేసి దానిలోమజ్జిగకలిపి బాలురదేహమునకుబూసిన,గజ్జి-దురద-పుండ్లుమానును.

—లోహభస్మము-కావిరాయి-రసాంజనము - రక్తచందనము అనువానిని సరిపాలుగగూర్చి తేనెపోసి మర్దించి శిశువుల నాలుకకురాచిన ముఖపాకరోగము-నోటిపుండ్లు మానును.

—మిరియాలు-పిప్పలి-సన్నయేలకులు - సైంధవలవణము వీనిని చూర్ణముచేసి-తేనె పంచదార వీనినికలిపి శిశువులకునాకించిన, మూత్రకృచ్ఛ్రములు మానును.

ధూపము—ఆవాలు- వేపఆకులు- వెల్లుల్లి-చాగవేళ్ళు - పాముకుబుసము-మేకపెంద్రుకలు-మేకకొమ్ము-వస అనువానిని చూర్ణముచేసి దానిలో తేనెకలిపి బాలురకు ధూపమువేసిన - ప్రబలజ్వరములు - గ్రహబాధలు తొలగును.

శిశువుల అతిసారములకు జ్వరములకును—వట్టివేరు-నేరేడుచిగుళ్ళు - మామిడిచిగురు- మద్దికొనలు-వీనిని దినునుకు ౧ వరహాయెత్తుచొప్పునగూర్చి యెండించి యెనిమిది గిద్దలనీళ్ళుపోసి గిద్దెడుగాకాచి వడియగట్టి తేనెతోశిశువులకు లోపలికిచ్చిన-జ్వరములు-అతిసారము-కక్కుట-మూర్ఛ బడలిక ఇవి మానును.

శిశువుల ఉబ్బసమునకు—లవంగము, పిప్పలి, జాజికాయ, జాపత్రి,చక్కెర, పెద్దగుమ్మడికాయరసము-వీని నేకముచేసి ఆవునేతితో నాకించిన ఉబ్బసముమానును.

శిశువులకు గలిగెడి పక్షిదోషమునకు—నూనెగిద్దెడు-ఆవునెయ్యి ౧గి- అప్పుడు పడిచిన ఆముదము ౧ గి - చిర్రివేళ్లరసము ౧ గి- గుమ్మడిపువ్వు ౧ వీనిని ఒకటిగా కలిపి దీపాగ్నిచే మాడకుండావండి దించి దానిలో గిద్దెడు తేనెనుకలిపి బాలురకు ప్రొద్దుటిపూట యిచ్చిన - పక్షిదోషము - ముట్టుదోషము తొలగును.

---

# విషలక్షణములు.

వసనాభి మొదలగువాని విషములు స్థావరములనియు - సర్పాదివిషములు జంగమములనియు జెప్పంబడును. జ్వరము, వెక్కిళ్ళు, వాంతి, అరుచి, శ్వాస, మూర్ఛ, పండ్లు కొరుకుట - నోటనురుగుపడుట ఈలక్షణంబులు స్థావర విషమువలనగలుగును. దాహము-నిద్ర-కునుకుపాట్లు-అజీర్ణము-అతిసారము-గగుర్పాటు-వాపు- ఈలక్షణములు జంగమ విషమువలన గలుగును.

సర్వవిషములకుచికిత్స—సర్పాక్షిసమూలమును తెచ్చి-కషాయముగాచి పుచ్చుకొనిన సకలవిషములు మానును.

—మట్టిఊడలు-పసుపు-చిర్రివేరు-కరుధూపము-చెంగల్వకోష్టు- వీనినిసరిపాలుగకూర్చి నూరి ఒకకర్షముచొప్పున నేతిలోగలిపి పుచ్చుకొనిన విషములుమానును.

——చేతిబీరవేళ్ళు-నేలతాడిగడ్డలు వీనిరసము సకలవిషములు మాన్పును.

——సైంధవలవణము-మిరియాలు-అనువానిని సరిపాలుగ చూర్ణముచేసి-దీనికి సమభాగము వేపవిత్తుల చూర్ణమును కలిపి- కొంచెము తేనెను- అధికముగ నేతినిజేర్చి ఖల్వమునందుమర్దించి పుచ్చుకొనిన సకలవిషములుమానును.

——నీలివేరు చూర్ణమును తగుమాత్రము సైంధవలవణము-నెయ్యి తేనె వీనిలో కలిపి నూరి భక్షించిన-స్థావరవిషములును-దేహము పైనవ్యాపించినవిషములును మానును.

——చెన్నంగడ్డను జలముచేనూరి నస్యముచేసినను-తుంగముస్తెలు-వెలిగారము అనువానినినూరి త్రాగించినను విషములు మానును.

వృశ్చికవిషచికిత్స——ఇంగువనుజలముచేనూరి - లేక జిల్లేడువేరును గంధముదీసి గాని తేలుకుట్టినచోట పట్టువేసిన విషము మానును.

——టెంకాయచిప్పలో జిల్లేడుపాలు పోసి సైంధవలవణము వేసి నాననిచ్చి నూరి కోపులుచేసి - కలిలోచాది కుట్టినచోట రాచిన విషము దిగును.

సర్పవిషచికిత్స——పాదరసము, కొత్తసున్నము, కరుధూపము అనువానిని దినమునకు రెండు ధగణములయెత్తుచొప్పున గూర్చి నల్లయుమ్మెత్తాకురసమున ౭ జాములు మర్దించి దానిలో, నేపాళములపప్పు ౧౦౦, మిరియాలు ౮౦, ఆముదపుపప్పు ౦, అనువానిని నిమ్మపండ్లరసముచేబాగుగమర్దించి, కందిగింజంతమాత్రలుచేసి నీడ నెండించి నీళ్లలోచాది కన్నులకువేసిన, సర్పవిషములు-గ్రహములు-రేచీకటి మానును.

——చేదుసొరవిత్తులు, త్రానుగువిత్తులు, చేతిబీరవిత్తులు, దిరిసెనవిత్తులు అనువానిని సరిపాలుగగూర్చి ఆవుపంచితముతోనూరి, ఆవుపంచితములో గలిపి పుచ్చుకొనిన సకల సర్పవిషములు మానును.

ధూపము——ప్రత్తివిత్తనములు, యవలపొట్టు, ధనియాలపొట్టు, నెమలిజుట్టు ఈకెలు, ఆవుకొమ్ము, నరులవెంట్రుకలు, పావురాయిపిట్టమలము అనువానినిజేర్చి యింటిలోధూపమువేసిన, సర్పములు పాఱిపోవును. మఱియు దీనిని సర్పములు కఱచిన భాగమున ధూపమునుగాని, పట్టునుగానివేసిన సర్పవిషములు మానును.

మూషకాదివిషచికిత్స——ఆగాకరగడ్డను జలముచేనూరి లోపలికి పుచ్చుకొని-కాటుగలచోట గూడ రాచిన-ఎలుక-పిల్లి-పాము-తేలు వీని విషములు మానును.

——చెంగల్వకోష్టు- మంగకాయలు- చేదుబీర- వస వీనిని చూర్ణముచేసి ఆవుపంచితను కలిపి పుచ్చుకొనిన-ఎలుకలుమొదలగు వాని విషంబులు మానును.

——చింతపండు ౧ పల-కరుధూపము ½ ప- వీనిని ప్రాతనెయ్యితోనూరి నిత్యము ౧ తులమువంతున ౭ దినములు పుచ్చుకొనిన-ఎలుక విషము మానును.



——మణిశిల-హరితాళకము-చెంగల్వకోష్టు- అనువానిని సరిపాలుగగూర్చి వావిలి ఆకురసముచే మర్దించి జలమునందు వేసి కొంచెమువెచ్చచేసి పుచ్చుకొనినను కాటుగల స్థలంబున రాచినను మూషకవిషములు శీఘ్రముగ మానును.

——ఆరతికర్పూరము - పాదరసము - గంధకము-దిరిసెనవిత్తులు- కరుధూపము అనువానిని సరిపాలుగ జిల్లేడుపాలతో నూరి కాటుగల స్థలమునందు రాచిన ఎలుక-తేలు మొదలగువాని విషములు మానును.

శ్వానవిషచికిత్స——కఱచినచోట కోడిమలమునురాచిన కుక్కవిషముమానును.

——ఉత్తరేణివేరును జలముచేనూరి ఒక కర్షమంతచొప్పున తేనెలోకలిపి త్రాగుచు-సైంధవలవణము-సన్నకలబందపట్ట అనువానినినూరి కాటుగల స్థలమువందుకట్టుగట్టిన కుక్కకాటు మానును.

వెఱ్ఱికుక్కకాటుకు——నువ్వుపిండి- నువ్వులనూనె- జిల్లేడుపాలు- బెల్లము అనువానిని సరిపాలుగ గలిపి త్రాగిన వెఱ్ఱికుక్కవిషము మానును.

---

శ్వాస, పీనసలకు——బలురక్కసిగడ్డ, అల్లము వీనినిచూర్ణముచేసి రెండుమాడలయెత్తును తేనెలోకలిపిపుచ్చుకొనిన, శ్వాసము, పీనస మొదలగునవి మానును.

రక్తపైత్యాదులకు——చల్లపిల్లిగడ్డలు, సుగంధిపాల, శ్రీగంధము, పట్టివేరు, కురువేరు, చిత్రివేళ్ళు, ద్రాక్షపండు, ముణుగుదామరవేళ్లు, వల్లకలువగడ్డ, అతిమధురము అనువానిని సమభాగములుగా కూర్చి కషాయముపెట్టి, రావ పాలు మిగులునట్లు చిక్కగకాచి, వడిచి, తేనెచక్కెర అనువానిని కలుపుకొని పుచ్చుకొనిన, రక్తపైత్యములు, ఆసనమున నెత్తురు పడుట, రక్తప్రదరములు మానును.

ముక్కున నెత్తురు పడుటకు——దానిమ్మపువ్వురసమును గాని, గరికవేళ్ళను నలియగొట్టిగాని నస్యముచేసిన, నాసారక్తము మానును.

రక్తప్రదరములకు——బుడ్డకాకరఆకును, ఆవుపెరుగుతోనూరి త్రాగిన, ప్రదరరోగములు మానును.

——గోధుములు ౧పల,చక్కెర ౧ప, జాజికాయ మూడుమాడలయెత్తు, జాపత్రి ౧తు,వీనిచూర్ణమును ఆవుపాలతోనూరి పుచ్చుకొనిన, రక్తప్రదరములు మానును.

నీరుకట్టుకు——సర్జక్షారము ౧వరాయెత్తు,ఆవువెన్న,గచ్చపలుకులువీని నేకముగానూరి వేడినీళ్ళలోకలిపియిచ్చిన నీరుధారాళముగావెడలును. రాళ్ళు ఊడిపడును.

నెత్తురుబంకకు——ఆవాలు,జీలకఱ్ఱ అనువానిని కొంచెము వెచ్చచేసి, చూర్ణముచేసి,మంచిబెల్లము,నేయి వీనినివేసి లేహముగజేసియిచ్చిన నెత్తురుబంక మానును.

జలదోషమునకు——గాడిదెగడపఆకు ౨తు,పసుపు ౧తు, లవణము మాడయెత్తు

మిరియాలు ౧తు, అనువానిని చూర్ణముచేసి మూడువేళ్ళ ప్రమాణముతీసికొని తేనెతోబుచ్చుకొని పెఱుగన్నమును భుజించిన జలదోషము నివర్తించును.

కూఁతగలిగినమూర్ఛకు— వెఱ్ఱిచెరుకు కొనదంటును కుమ్ములోబెట్టి యుడికించి రసము పిండుకొని దానిలోదూదినితడిపి నస్యముచేసిన, మూర్ఛ, చెవిపోట్లు మానును.

మేహకారకము పోవుటకు—చింతచెక్కలభస్మము, చింతపండు వీనిని నీళ్లుపోసిపిసికి వడియగట్టి పుచ్చుకొనిన కలకండవలెనుండును. కారకముపోయిచలువగును.

నిద్రరానందుకు—జాజికాయ ౧ వరాయెత్తు, జాపత్రి ౧వ, పిప్పలి ౧వ, వీనిలోసగము పచ్చిదిగను సగమువేచినదిగను చేర్చిచూర్ణముచేసినేయికలిపిభోజనసమయమందు ముందుగ భక్షించి పిదపభుజించవలయు. ఇట్లొనర్చిన చక్కగనిద్రవచ్చును.

ఉన్మాదపైత్యమునకు—భూనాగమును నిమ్మపండు పులుసుననూరియేడుదినములిచ్చిన-ఉన్మాదపైత్యము అనగారాళ్లు రువ్వుట-పిచ్చిమాటలాడుటయు మానును.

కడుపునొప్పికి—సొంటి ౧ వ-అప్పడాలకారము ౧౪ వ- అనువానినిపొడిచేసి-మంచిబెల్లమును పాకముపట్టి అందులో ఆపొడివేసి నెయ్యిపోసి లేహ్యముగాకలిపి రేగుపండంత పుచ్చుకొనిన - కడుపునొప్పి మానును.

దగ్గు ఉబ్బసమునకు—వెఱ్ఱిపుచ్చకాయను తొలిచి లోపలివిత్తులను తీసి పలిమెడు మిరియాలుపోసి పొయ్యిలో జానెడుగుంటత్రవ్వి-దానిలో ఆకాయను పూడిచి ఎనిమిదిదినములుతాళితీసి మూడేసిమిరియాలుచొప్పున వేడినీళ్ళతోగాని - మజ్జిగతోగాని పుచ్చుకొనిన - దగ్గు - ఉబ్బసము మానును.

దగ్గులకు—నేలములకను సమూలముగ రోటవేసి త్రొక్కి రసముపిండిసోలెడు తీసి వడియగట్టి - దానిలో- పదిమిరియాలను చూర్ణముచేసివేసి- వెల్లుల్లిగడ్డలను నూరి కలిపి ప్రొయ్యిమీదబెట్టి-ఒకపొంగురాగానేదించి చక్కెరగలిపి - సోలెడుచొప్పున మూడుమార్లుపుచ్చుకొనిన అన్నిదగ్గులు మానును. మిరియపుచారుఅన్నము పథ్యము.

సర్వపైత్యములకును ద్రాక్షాదిచూర్ణము—ద్రాక్షపండు- వరిపేలాలు- తెల్లకలువగడ్డలు- అతిమధురము- ఖర్జూరపండు-సుగంధిపాలవేరు- తవాక్షీరి-కురువేరు- నెల్లిపప్పు-తుంగముస్తెలు-మంచిగంధకము - గ్రంధితగరము-తక్కోలములు - జాజికాయ, లవంగాలు-లవంగపత్రి-నాగకేసరాలు - ఏలకులు.దనియాలు-పిప్పళ్లు - వీనిని సమభాగములుగ చూర్ణముచేసి-చూర్ణమునకు సమముగ శర్కరగలిపి - ప్రొద్దుటిపూఁట, మూడువ్రేళ్ళకు వచ్చినంత చూర్ణమును చన్నీళ్ళతోగాని, ఆవుపాలతోగాని పుచ్చుకొనిన - పైత్యరోగములన్ని మానును. పాండువు, కామిల, జ్వరము, అరోచకము, క్షయము, ప్రమేహము ఇవియన్నియు మానును.



—ఊడుగచెట్టుదగ్గరకుపోయి దానికి ప్రదక్షిణ నమస్కారములు చేసి మూడు కొనలను తీసికొని, యీప్రకారము పదిదినములు - దినమునకొకటి చొప్పున పెచ్చించి తీసికొని భక్షించుచుండవలయు. అట్లు తినుట కశక్యంబైనయెడ వానినినూరి ముద్దచేసి మ్రింగవలయు. పదిదినములకు-దగ్గు ఉబ్బసముమానును. ఒకమండలముపుచ్చుకొనిన దివ్యదేహమగును. క్షయములు మానును కరచినపాము చచ్చును.

వాంతులకు, భేదులకును—౧వరాయెత్తు మిరియాలను తెల్లగుడ్డలో మూటగట్టి కాల్చి భస్మముచేసి- యాభస్మమును వేడినీళ్లతోఇచ్చిన- వాంతులుభేదులుమానును.

అన్నముసహించక వాంతియగుటకు—పత్తివిత్తులపప్పును వేయించి పొడిచేసి పెట్టుకొని - వడ్లబొరుగులు - పిప్పలి - జీలకర్ర - ఈ మూడుదినుసులను పొడిచేసి రెంటినిచేర్చి చక్కెర తేనె వీనిని కలిపియిచ్చిన అన్నము చక్కగ హితమగును.

మూలవ్యాధికి—గంజాయిపొడి-మోడి-గజపిప్పళ్ళు-జటామాంసి-ద్రాక్షపండు-ఓమము-యవక్షారము-ఇందుప్పు-ముళ్ళివేరు-ములకవేరు వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి వేడినీళ్ళతో ఇచ్చిన-మూలము - ప్రమేహము - నీరుకట్టు- మూత్రద్వారమున రాళ్ళుతగులుకొనుట-అండవాయువు-పాండురోగము-ఇవియన్నియు మానును.

—అరటిగడ్డను తెచ్చి మూడుభాగములుగాకోసి మూడురాత్రులు మంచులో నునిచి ప్రొద్దుటిపూటదంచి రసముతీసి వడియగట్టి-కలుబంద ౫వరాలెత్తు-కొంచెముగ జీలకఱ్ఱ వీనినివేసి మూడురోజులు త్రాగిన-లోమూలము-వెలిమూలము-రక్తమూలము-మొలలు మానును.

చలువతైలము—మిరియాలు । పల- అతిమధురము । ప- తుంగగడ్డలు । ప- ఉసిరికెపప్పు ౧ ప- పెద్దలవంగపట్ట । ప- శ్రీగంధపుచెక్క । ప- వట్టివేరు ౪ ప-కురువేరు-పచ్చాకు ఇవి ౪పల-కస్తూరిపసుపు । ప-కిచ్చిలిగడ్డ । ప-సోపు । ప-వాయువిళంగాలు । ప- మంజిష్టి । ప- కుంకుమపువ్వు ౪ వరాయెత్తు-గోరోచనము । ప- పచ్చకర్పూరము । ప- నూనె ౧పడి వీనినిచేర్చి తైలపక్వముగా కాచి వడియగట్టి తలకు అంటుకొనిస్నానముచేసిన- కారకములునశించి దేహముచల్లబడును.

దాక్షాదిచూర్ణము—ద్రాక్షపండు-ఖర్జూరపుకాయలు- కలువగడ్డలు-అతిమధురము-తక్కోలములు- సుగంధిపాల- వట్టివేరు- కురువేరు- గంధపుచెక్క- లవంగపట్ట- ఏలకులు - లవంగపత్రి - నాగకేసరాలు- తవాక్షీరి - ఉసిరికెపప్పు-తుంగగడ్డలు-నేలయుసిరికె-భూచక్రగడ్డ - జాజికాయ- లవంగాలు-పిప్పళ్ళు- ధనియాలు-వరిపేలాలు-కర్పూరశిలాజిత్తు వీనిని సమభాగములుగాగూర్చి చూర్ణముచేసి దీనికిసమముగచక్కెరనుగలిపి ప్రొద్దుటిపూట ఆవుపాలతోబుచ్చుకొనిన-అరోచకములు- మేహకారకము-

కండ్లు - కాలుసేతులు వీనియందలి మంటలు ఇవియన్నియు మానును. అగ్నిదీపనము కలుగును. —ఆవనూనె - గుమ్మడి ఇవికూడవు.

మేహకారకమునకు తైలము—వల్లారిఆకు పసరు ౧ఆళాకు, తిప్పతీగె రసము, ౧ ఆ, చెంగల్వకోష్టు ౪ ప, అతిమధురము ౪ ప, ఏలకులు ౪ ప, ధనియాలు ౪ ప, మంచినూనె ౧౪ ఆ, ఆముదం ౧౪ ఆ, నెయ్యి ౧౪ ఆ, ఆవుపాలు ౮౪ ఆ, వీని నన్నిటిని ఒకటిగాజేర్చి మృద్వగ్నిచేవండి, తైలపక్వమునదించి వడియగట్టి, తలకుమాత్రము అంటుకొని స్నానముచేయుచువచ్చిన మేహకారకము మానును.

చలువ ఆముదము—ఆముదము ౧ పడి, ఉసిరికకాయలరసము ౧ పడి, ఒలిచిన తెల్లపాయలు౧౦ప, సన్నగతరిగిన ఎఱ్ఱగడ్డలు౧౦పల, వీని నేకముచేసి కాచి మైనపక్వమునదించివడియగట్టి,పూటకు అరపలముచొప్పున యిచ్చిన మూడుసార్లుభేదియగును. ఈయాముదము శరీరమునందిమిడి, కండ్లు కాలు చేతులు దేహము వీనియందలి మంటలు, తెల్లమచ్చలు, మేహకారకము ఇవిమాని దేహమునకు పుష్టి అగ్నిదీపనముకలుగును.

శిరోవాయువులకు తైలము—మేకపాలు-ఆవునెయ్యి-చిట్టాముదము - మంచినూనె-చేదుబీరాకురసము-గుంటగలగరరసము-ఇవి సమభాగములుగజేర్చి ప్రొయ్యిమీఁద బెట్టి తైలపక్వమగునప్పుడు లవంగపట్ట-లవంగపత్రి- నాగకేసరాలు - ఏలకులు- శ్రీగంధము-రక్తచందనము-మంజిష్ఠి - వీనిని దినుసుకు ౧౪వరాయెత్తుచొప్పున గూర్చి చూర్ణముచేసివేసి దించివడియగట్టి - సీసాలోనునిచికొని తలయంటికొనుచుండిన - శిరోవాతమువలనినొప్పులు-పార్శ్వపునొప్పి-కపాలశూల ఇవి మానును.

—చేదుబీరాకురసము, ఉసిరికకాయలరసము, కన్యాకుమారిగడ్డ- అడవిమినుములు, గంజావియాకు, దొండవేళ్ళు, అడ్డసరవేళ్ళు, వావిలివేళ్లు,పొన్నగంటివేళ్ళు కాకరవేళ్ళు - వీనిని సమభాగములుగగూర్చి కషాయముపెట్టి ౭వపాలు మిగులునట్లు కషాయముకాచిదించి మంచినూనె - ఆముదము-ఆవునెయ్యి- ఈమూటిని కషాయమునకు సమభాగముగవేసి, అంతమాత్రము మేకపాలనుపోసి, సొంటి-పిప్పలి- మిరియాలు-కరక-తాడి-ఉసిరికవరుగు-ఏలకులు - లవంగపట్ట-లవంగపత్రి-చెంగల్వకోష్టు - వాయువిళంగాలు-మునగవిత్తులు - అక్కలకర్ర- సైంధవలవణము - వీనిని దినుసుకు ౧ వరాయెత్తుచొప్పునగూర్చి మేకపాలతోనూరి పైకషాయములోగలిపి తైలపక్వమునదించి వడియగట్టి నాలుగుదినములకొకసారి అభ్యంగము చేసికొనుచుండిన, నేత్రశూలలు, తలనొప్పి,శిరోవాయువులు,చెవుడు,చెవిపోట్లు,పీనస,శిరోరోగములు మానును.

నేత్రరోగములకు, చెవుడుకును—గుంటగలగరాకు రసము ౨ అడ్డగలయెత్తు కలబందరసము ౩ అ, ఆవునెయ్యి ౨అ, ఆవుపాలు ౩ అ, వీనినన్నిటిని కలయబోసి-



౧౦ వరాలయెత్తు అతిమధురమును మెత్తగానూరి వానిలోకలిపి ఘృతపక్వముగ దించి వడియగట్టి అభ్యంగము చేయుచువచ్చిన-కండ్లరోగములు చెవుడు మానును.

చెవుడుకు—పచ్చిసుగంధిపాలవేరుపట్ట ౹ పల, అతిమధురము ౹ ప,వీనిని ఆవుపాలతోనూరి నూనెలోవేసి కాచి మైనపక్వమునకు వచ్చినతరువాత దించి వడియగట్టి తలకు అంటుకొని స్నానము చేయుచుండిన చెవుడుమానును.

—౧వీసె కొతిమెర్లను, వార్చినగంజిలో బోసి నాననిచ్చితీసి ఆరవేసి - తిరిగి గంజిలోవేసి నానబెట్టితీసి యీప్రకారము మూడుమార్లుచేసి ఆరనిచ్చి పిదప వానిని కోటదంచి చూర్ణముచేసి వస్త్రగాలితముచేసి, పూటకు తులమెత్తుచొప్పున పుచ్చుకొని మంచినీళ్లనుమ్రింగవలయు. ఇట్లు ఇరువదిదినములు రేపుమాపుపుచ్చుకొనిన, వెంట్రుకలు నల్లనై మొలచును. ఈచూర్ణమునునిమ్మపండ్లపులుసుతో ౨౦దినములుపుచ్చుకొనిన, చిక్కినశరీరములకుపుష్టికలుగును. మఱియు, తలదిరుగుట, బొమ్మలోమంట, అస్థిగతములైనకారకములు,నోటనీళ్లువచ్చుట ఇవియన్నియు మానును.

తలనొప్పికితైలము—సోమిందాకు, జిల్లేడాకు, ఆరుదొండాకు,వావిలాకు, దుష్టపాకు, వెర్రిబీరాకు,మేకమూత్రము, పచ్చిబలరక్కసిగడ్డ, పచ్చిదుంపరాస్నము, పచ్చిపసుపు, ఈదినుసులరసము ౧ తవ్వెడు, చవ్యము, చిత్రమూలము, పలుకుసాంబ్రాణి, మిరియాలు, ఓమము,వస, కస్తూరిపసుపు, మాఘిలింగపట్ట, మునగపట్ట, నల్లతుమ్మపట్ట, వీనిని సగము కషాయమును, సగము చూర్ణమును చేసివేసి, మంచినూనె, టెంకాయనూనె, వేపనూనె వీనిని తగుమాత్రముపోసి, అన్నిటినికలిపి తైలపక్వమున దించి వడియగట్టి తలకు అంటుకొనుచుండిన తలనొప్పులు, తలపోట్లు, తలదిమ్ములు, స్త్రీల సూతికా వాయుసంబంధములైన జలుబు ఒడలునొప్పులు మొదలైనవి మానును.

వాసనతైలము—౧ వీసె గరికవేళ్ళను కషాయముపెట్టి ౭ వ పాలు మిగులునట్లుకాచి వడియగట్టి మంచినూనె ౨ పళ్లు- పైకషాయము ౨ పళ్లు-వీనిని కలియబోసి కాచి-లవంగపట్ట-కురువేరు-వట్టివేరు వీనిని దినుసుకు ౧ పలమువంతున గూర్చి చూర్ణముచేసివేసి తైలపక్వమున దించివడియగట్టి-తలకు అంటుకొనిన కండ్లకుచలువగలుగును

—శ్రీగంధపుచెక్క,కారుబోగవిత్తులు, కిచ్చిలిగడ్డ,సుగంధిపాలవేరు-బిల్వపండుగుజ్జు,పొగడపువ్వులు,లంజసవరము, గాదంగిరేకులు,కురువేరు, వట్టివేరు వీనిని సమభాగములుగగూర్చి మంచినూనెలోవేసి వాసెనగట్టి, ఎండపుటమున ౭ దినములునిచి తరువాత వడియగట్టి, బుడ్డిలోబోసి యుంచుకొని స్త్రీలు తలయంటికొని స్నానము చేసిరేని వెంట్రుకలు మొలచి కోమలముగ వృద్ధిజెంది వాసన గలిగియుండును.

మూరదృష్టికి—పిప్పళ్లు ౩, మిరియాలు ౨౧, కరక్కాయలోనిపప్పు ౧౨, వీనిని

ఉసిరికకాయలరసముచే మర్దించి మాత్రలుచేసి నీడనెండించి, చనుబాలలో రాచి కంటికివేసిన, ఒకమండలములో తూరదృష్టిబాగుగ కలుగును.

నేత్రాంజనము—గుంటగలగర-పొన్నగంటి - తమలపాకు- కర్పూరవల్లి కృష్ణతులసి, రామతులసి- భూతులసి-హంసపాదిఆకు- వల్లారిఆకు- సాంబ్రాణిఆకు-నల్లేరు అగసియాకు, నాగుదోసాకు- పల్లేరాకు- వసఆకు-అల్లపుఆకు- పసుపుఆకు-కాకరాకు, తురకవేపాకు-వెర్రిచెరుకాకు- నందివర్ధనపాకు- మారేడాకు-ఉత్తరేణిఆకు- ఆరెకూరకుప్పెంటాకు-మునగాకువీనిపసరులను సమాంశములుగాదీసికొంచెముగాబోసి- గుడ్డగట్టి నీడనుఆరనిచ్చి-అందులోవెన్నకలిపి కన్నులకువేసిన సమస్తనేత్రరోగములు మానును.

కంఠనాదము కలుగుటకు—జీలకర్ర, లవంగాలు, పిప్పలి, తాళిసపత్రి, చిల్లగింజలు, దేవదారుచెక్క, అతిమధురము, వీనిని సమాంశములుగగూర్చి వేయించి - పొడిచేసి, పూటకు పావెత్తుచొప్పున తేనెతో బుచ్చుకొనిన, కఫము హరించి కంఠమునకు మంచినాదము గలుగును. కాకమీదిదగ్గులు మానును.

—సరస్వతిఆకు- బోడతరము- వస- సొంటి- పిప్పలి- వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి పూటకు కర్షమెత్తుచొప్పున తేనెతో ౪౦ దినములు పుచ్చుకొనిన వాక్కునకు స్ఫుటత్వంబును, కంఠమునకు నాదంబును గలుగును.

నత్తికి, కంఠనాదమునకును—వస ౨ పల, పిప్పళ్ళు ౨ప, సొంటి ౧ప, జీలకర్ర ౪ప, ఏలకులు ౪ప, లవంగాలు ౧ప, జాజికాయ ౨ప, బోడతరము ౧౦ప, వల్లారాకు ౧౦ప, వీనిని నీడను ఆరనిచ్చి చూర్ణముచేసి, చక్కెర ౧౦ ప, తేనె ౧౫ప, వీనిని ఆచూర్ణములోపోసి పిసికి లేహపక్వముగాచేసి, రేపు మాపు పోకకాయంత పుచ్చుకొనుచుండిన, నత్తి-అపస్వరముమాని-మంచిజ్ఞానము- కంఠమునకు కోకిలస్వరము వంటి స్వరము కలుగును.

పండ్లనొప్పికి—పిప్పలి-ఓమము-లవంగాలు-ఉప్పు-కరక్కాయలు-మోడి - వీని సమభాగములుగా గూర్చి జిల్లేడుపాలుపోసి బాగుగతడిపి, చట్టిలోబెట్టి, నిప్పుసెగయందునిచి ఆపొడితో పండ్లుతోమికొనిన పండ్లనొప్పులు మానును.

—బాదముకాయలచిప్పలు ౨౦ తెచ్చి కాల్చి పటికెను పచ్చిదిగానే పొడిచేసి రెంటినికలిపి, దీనితో ప్రతిదినము పండ్లుతోమికొనిన, పండ్లునొప్పి- సందులలో నెత్తురుకారుట-కదలుట ఇవియన్నియు మానును.

చిగురు వాచినందుకు—కందిఆకునైనను, బెల్లపుగడ్డనైనను, జిల్లేడుపాలచే దడిపిన దూదినైనను, ఆదూదినడుమ ఇంగువ నునిచిగాని, పంటిమీద అద్దిన రెండుగడియలకు నొప్పితీయును.



—సెనగలు ౨ ఆళాకులు, గోధుమలు ౧౪ ఆ, వీనిని వెచ్చచేసి- మైలుతుత్తము ౧ప, పోస్తుకాయ ౧ప, వీనినన్నిటినిగూర్చి పొడిచేసి దుత్తలో నునిచికొని, ఆ పొడితో నిత్యము పండ్లుతోముకొనిన, ఎట్టినొప్పులైనను మానును.

పీనసకు—పండుజిల్లేడాకుపసరు, మంచినూనె వీనిని సమభాగములుగగూర్చి కాచి, దించబోవునపుడు కొంచెము గోరోచనము, కుంకుమపువ్వు వీనినివేసి తైలపక్వమునదించివడియగట్టి, తలయంటికొని వేడినీళ్ళతోస్నానముచేసిన ముక్కులుఅడుచుకొనుట,ముక్కులనీళ్లుగారుట,తలబరువుగానుండుట,తుమ్ములు,పీనస ఇవి అన్ని మానును.

—సీమఉల్లిగడ్డలను నలియగొట్టి గుడ్డలోబెట్టి ముక్కున నస్యముచేసిన, పీనస, తలనొప్పి, తలదిమ్ముగనుండుట, వాసన తెలియకయుండుట,దృష్టిమందముగనుండుట, దృష్టి పొగకమ్మినట్టుండుట ఇవియన్నియు మానును.

మేహవాయువులకు లేహ్యము—మైసాక్షి ౧౦పల, తెల్లగడ్డలు ౧౩ప. సొంటి ౧ప, మిరియాలు ౧ప, పిప్పళ్లు కరక తాడి యుసిరికెలుచేరి ౩ ప, ఇంగువ - ఓమము- సజ్జక్షారము- యవక్షారము-వెలిగారము-పంచలవణాలు-అతివస- వస-చలువమిరియాలు మోడి-మానిపసుపు-చవ్యము- చెంగల్వకోష్టువు-వాయువిళంగాలు ఇవిదినుసు కొక్కొకపలము - తాటిబెల్లము ౨౦ ప, ఆముదము ౧౦ప, ఇట్లు వీనినిజేర్చి, మహిసాక్షిని శుద్ధిచేసి (శుద్ధియెట్లనగా, వేపపట్ట-వాకుడు-వీని కషాయముతో మహిసాక్షిని డోలాయంత్రమునవిడిచి - జాముసేపుకాచిదించి నీళ్లతో బాగుగకడిగి యెండబెట్టవలయు) తక్కినద్రవ్యములనన్నిటిని చూర్ణముచేసి, వెల్లుల్లిని పొట్టుతీసివేసి, అన్నిటిని రోటియందువేసి లేహపక్వముగ త్రొక్కితీసి, పూటకు ఉసిరికకాయంతచొప్పున, రేపుమాపు ఇరువదిదినములు పుచ్చుకొనిన మేహవాయువులు- మేహసంబంధములైనపట్లు,బొమ్మనొప్పి-దేహము-కాలుసేతులు వీనియందలిపోట్లు అన్నియు మానును. —లఘుపథ్యము.

పైత్యవాయువులకు—నీడనుఆరనిచ్చి కొట్టి వస్త్రగాలితము చేయబడిన వల్లారాకుచూర్ణము ౪ప-జీలకర్రపొడి ౨ప, సొంటిపొడి ౨ప, వీని నేకముచేసి నాటు చక్కెరను ౮ పలములనుకలిపి పూటకు మూడువేళ్ళకు వచ్చినంతచూర్ణమును రేపు మాపు ౧౧ దినములు పుచ్చుకొనిన, కడుపుబ్బరము, ప్రేగు లరచుట, పైత్యవాయువు, ఉష్ణవాయువు, గొంతులో ఉండబెట్టినట్టుండుట, నోటనీరూరుట, అజీర్ణము- మలము జారకుండుట, కండ్లమంటలు ఇవియన్నియు మానును.

---

# విరేచనౌషధములు.

జిహ్వావిరేచనము—రసము-గంధకము- నేపాళములు-వెలిగారము - చిట్టాముదపువేరు - అడవి ఆముదపువిత్తులు - నెల్లివేరు-కరక్కాయ - తానికాయ - మోదుగ

విత్తులు - తంగేడువేరు వీనిని సమభాగములుగ చూర్ణము చేసి బొంతజెముడు పాలు పోసి మూడుదినములు నూరి పాతటెంకాయచిప్పలో బెట్టి యెండలో బెట్టిన - తైల ముదిగును - ఆతైలమును నువ్వుగింజంత తీసికొని నాలుకమీద చరిమినయెడల పది మార్లు భేదియగును. పిదప స్నానముచేసి మజ్జిగ అన్నమును భుజింపవలయు.

పాదవిరేచనము—పచ్చి నేపాళములను ఆవుపాలతో నూరి ఆవుపాలలో కలిపి తోడుపెట్టి - మరునాడుచిలికి వెన్నతీసికొని - ఆవెన్నను అరకాళ్ళకు చరుముకొని పాదములు భూమినంటకుండునట్లు పావుకోళ్లువేసికొని తిరిగిన, విరేచనము లగును.

నేపాళములను భేదికిచ్చెడివిధము—నేపాళపుగింజలను ఒలిచి పేడలో కలిపి ఉడకబెట్టి-పప్పుతీసి యెండించి, లోపలి నాలికెలు తీసివేసి-ఆవుపేడగలిపి వాసెన గట్టి-ఆగుడ్డమీద-నేపాళపు పప్పునుపోసి నెరపి పైనపెద్దచట్టినిమూసి - జామునేపు మంటవేసిఆరనిచ్చితీసి నీడనారబెట్టి సున్నపునీళ్ళు-చింతాకురసము- గుంటగలగరాకు రసము-కలుబందరసము-గాడినీళ్ళు-ఆవుపెరుగు-టెంకాయనీళ్ళు-ఎఱ్ఱ ఉల్లిగడ్డలరసము-తాటిబెల్లము- వీనితో ప్రత్యేకముగశుద్ధిచేసి-మంచినీళ్ళతో గడిగి-నీడనారనిచ్చి యాపప్పును నేతిలోవేయించి-దానిని నమిలిమ్రింగిన ముంతమామిడిపప్పువలె నుండును. గొంతున ఆసనమున మండదు. తాంబూలము వేసికొని- ఒకపప్పులో కాలుభాగమునువేసి కొని నమిలి రసమునుమ్రింగి తమ్మ నుమియవలయు. ఎనిమిదిసార్లు విరేచనమగును.

రాజయోగ్య విరేచనమునకు—ఆముదము ౧౺ ప - తేనె ౧౺ప - ఈరెంటిని కలిపిత్రాగిన భేదియగును. భేది అధికమైనయెడ పెరుగన్నమును భక్షించవలయు.

—కుప్పింటాకును నేయిపోసివాడ్చి నమిలి మ్రింగిన పదిమార్లు భేదిఅగును.

ఇచ్ఛాభేదికి—రసము ౧పాలు-గంధకము ౨పా-మిరియాలు 3 పా - పొంగించిన వెలిగారము ౪ పా-సొంటి ౫పా-కరక్కాయ ౬ పా - వీని కన్నిటికి సమము నేపాళములు- వీనికి సమానము బెల్లము ఈప్రకారము వీనినన్నిటినిజేర్చి కల్వముననూరి కొమ్ముబరిణెలోనునిచికొని - నాలుగు మిరపగింజలంతచొప్పున- దేహమునకుదగినట్టుగ వేడినీళ్ళలో గలిపియిచ్చిన-పదిమార్లు భేదియగును. దీనివలన-రేచీకటి - గుల్మములు-శోఫలు-శూలలు-మహోదరాలు-పైత్యభ్రమలు-తీట-పాండురోగములు-మేహములు-సర్పవిషములుమానును. రాత్రిభోజనము సాయంకాలమేచేసి - రాత్రిపూట సొంటి మిరియాలను కషాయముపెట్టి పుచ్చుకొనవలయు.

ఉసిరికకాయల భేదిక్రమము—నేపాళములు ౧ పల- సైంధవలవణము ౧౦ప-టెంకాయ ౧-దబ్బతగులని యుసిరికకాయలు ౧ పడి-వీనిని తెచ్చి- సైంధవలవణమును నీళ్ళలోవేసికలిపి అందులో ఉసిరికకాయలనువేసి - నీరిగురునట్లు ఉడకబెట్టి దించి-టెంకాయనుతురిమి పాలుపిండుకొని - ఆపాలలో నేపాళములను నూరికలిపి బాగుగ



కాగనిచ్చి, చమురిగురుసమయమున ఆకాయలను ఇందులోవేసి, దానికి ఆచమురు బాగుగపట్టియిగిరినతరువాత దించి జాడీలోవేసి పెట్టుకొని ప్రొద్దుటిపూట నొకకాయనుభక్షించిన - ఆయాసములేక పదిమార్లు భేదియగును. పిదప స్నానముచేసి చక్కగ భుజింపవచ్చును.

తీవ్రముగ భేదియగుటకు—శుద్ధిచేయబడిన నేపాళములు - సైంధవలవణము అనువానిని సమభాగములుగగూర్చి - నీళ్లతోనూరి తేనెలోకలిపి తైలపక్వమునకాచి వడియగట్టి యాఘృతమును సీసాలోనునిచికొని, వేడినీళ్ళలో నాలుగుబొట్లు విడిచి పుచ్చుకొనిన తీవ్రముగ భేదియగును. కడుపునొప్పి తత్క్షణమున హరించును.

---

# ద్రవ్యశుద్ధులు.

పాదరసశుద్ధి—దీనిని కల్వమునవేసి కలబందరసము-పసుపుపొడి- ఇటికపొడి-వీనిచే ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి కడిగిన శుద్ధమగును.

—ఇంగిలీకములో రసముతీయు విధము—ఇంగిలీకమును వేపవేరుచెక్కరసముతోగాని నిమ్మపండ్లరసముతోగాని జామునేపుమర్దించి డమరుకయంత్రములో నునిచి క్రిందమంటవేసిన రసము పైకుండకు వ్యాపించును. ఆరసమును ఔషధముల యందుపయోగించుకొనవచ్చును.

గంధకశుద్ధి—కుండకుసగమువరకు పాలుపోసి దానికి తగులకుండ వ్రేలునటుల కుండమూతికి నొక వస్త్రమునుగట్టి దానిపైన నెల్లికాయగంధకమునువేసి మూకుడునుమూసి చీలమన్ను ఇచ్చి ఆకుండను గొంతువఱకు పల్లములోపూడ్చి పుటము వేసిన గంధకము శుద్ధమగును.

ఇంగిలీకశుద్ధి—ఇంగిలీకమును నిమ్మపండ్లరసముతో-ఒకదినము మర్దించవలయు.

తాళకశుద్ధి—దీనిని సన్ననిరేకులుగ కత్తిరించి రెండుమూడు మడతలుగల గుడ్డలోమూటగట్టి ఒకకుండలో ఆవుపంచితము- కలి- వీనినిపోసి, వీనిచేతను, బూడిదెగుమ్మడు రసముచేతను, నువ్వులనూనెచేతను, త్రిఫలకషాయముచేతను, ప్రత్యేకముగ నొక్కొకజాము డోలాయంత్రమునవండిన శుద్ధియగును.

మణిశిలశుద్ధి—దీనినిరెండుమడతలుగలసన్ననిబట్టలోమూటగట్టి మేకపంచితముతోగాని,గుంటగలగరాకురసముతోగాని డోలాయంత్రముననొకదినమువండవలయును.

గౌరీపాషాణశుద్ధి—దీనిని నిమ్మపండురసమున మర్దించి దానిని మడతగుడ్డలో మూటగట్టి సున్నపునీళ్ళలో డోలాయంత్రముచే అరదినమువండిన శుద్ధియగును.

ఉల్లిపాషాణశుద్ధి—దీనినిపొడిచేసి పైదానివలెనే ఒకదినమువండినశుద్ధియగును.

దొడ్డిపాషాణశుద్ధి—దీనిని పొడిచేసి పైదానివలెనేచేసి, ఆవుపంచితముతో డోలాయంత్రమున మూడు దినములువండిన శుద్ధమగును.

హేమమాక్షికశుద్ధి—దీనిని ఎఱ్ఱగకాల్చి నిమ్మపండురసములో నెఱ్ఱ నగువఱకు ముంచుచుండిన శుద్ధమగును.

వెలిగారము మొదలగువానిశుద్ధి—వెలిగారము, శంఖము,గవ్వలు,కావిరాయి, అన్నభేది,భూనాగము,సౌవీరాంజనము,పుష్పాంజనము,నీలాంజనము,స్రోతోంజనము, రసాంజనము వీనినినిమ్మపండ్లపులుసున నానినిచ్చియొకదినము ఎండలోనుంచవలయు.

శిలాజిత్తుశుద్ధి—దీనినిఆవుపాలు,కరక తాడి యుసిరికలకషాయము,గుంటగలగరాకురసము వీనిచే ప్రత్యేకముగనొక్కొకదినము మర్దించి యెండలో నెండించవలయు.

కంపిల్లశుద్ధి—కంపిల్లమునుపొడిచేసి గుడ్డనుమూటగట్టి, కరక్కాయలరసముతోనైనను, కలితోనైనను, డోలాయంత్రమున నుడికించిన శుద్ధియగును.

బోళశుద్ధి—దీనిని కలితోమర్దించి జామునేపు ఎండలోనునిచిన శుద్ధియగును.

మైలుతుత్తశుద్ధి—దీనికిసమముగా వెలిగారమునుజేర్చి నీళ్ళుగాని, లేక, తేనెనుగానిపోసి మర్దించి, బిళ్లచేసి ప్రమిదెలో బెట్టి యింకొకప్రమిదెను పైనమూసి, చీలమన్ను పూసి యెండించి లఘుపుటమునువేసిన పరిశుద్ధమగును.

కఫర (పాలతుత్త) శుద్ధి—దీనినినూరి-పొడిచేసి మడతబట్టలోమూటగట్టి, ఆవుపంచితముతో ౨ జాములును, నరమూత్రముతో ౭ జాములును డోలాయంత్రమునందుడికించినను, లేక, ఆవునేతిలోగలిపి యుడికించినను శుద్ధియగును.

సర్జక్షారశుద్ధి—దీనిని ఆవు పంచితముతోగాని, కలితోగాని రెండు గడియలనేపు మర్దించిన శుద్ధియగును.

యవక్షారశుద్ధి—దీనిని పసికడుగుతో మర్దించి యెండలో బెట్టినశుద్ధియగును.

పంచలవణములశుద్ధులు—సైంధవలవణమును కలితోను, సౌవర్చలవణమును నిమ్మపండ్లరసముతోను, బిడాలవణమును పులిచల్లతోను, కాచలవణమును చింతాకురసముతోను, ఊరబెట్టియెండలో నెండించిన పరిశుద్ధములగును. సముద్రవలవణమును మూకుట్లోపోసి మూడుజాములు వేయించిన శుద్ధియగును.

సొంటి పిప్పలి మిరియాలశుద్ధి—సొంటిని బెరడువొలిచి(క్రొత్త)నున్నముపట్టించి జామునేపు ఎండ నెండించవలయు-పిప్పళ్ళను చిత్రమూలరసమున నూరబెట్టియెండ నెండించవలయు-మిరియాలను పులిచల్లతో నూరబెట్టి మూకుటబోసి వేయించవలయు.

గజపిప్పళ్ళశుద్ధి—వీనినికలితో జామునేపుఊరబెట్టియెండలో బెట్టినశుద్ధియగును.

నల్లమందుశుద్ధి—దీనిని బలరక్కసి ఆకులోబెట్టి మూటగట్టి ఆవుపాలలో డోలాయంత్రమున నొకజాము ఉడికించిన శుద్ధియగును.



ఇంగువశుద్ధి—తామరాకురసముతో ఎండలోనొకజాము ఊరబెట్టవలయు.

జీలకఱ్ఱశుద్ధి—నల్లజీలకఱ్ఱను- జీలకఱ్ఱనుకలితో ఎండలో రెండుజాముల నేపు ఉనిచి పిదప కొంచెమువెచ్చచేసిన శుద్ధములగును.

ఆముదపువిత్తులు-నేలదంతివిత్తులు వీనిశుద్ధి—ఈవిత్తుల పైపొట్టును ఒలిచి జామునేపు టెంకాయనీళ్ళతో నుడికించిన శుద్ధములగును.

నేపాళములశుద్ధి—వీనిపైపొట్టును, లోపలియగరులను తీసి పారవైచి, ఆవుపాలతోను, బెల్లపునీళ్ళతోను, కలుబందరసముతోను ప్రత్యేకముగ డోలాయంత్రమున నుడికించిన శుద్ధియగును.

విషముష్టివిత్తులశుద్ధి—వీనినితునకలుగకత్తిరించి-చిత్రివేళ్లరసముతో వండవలయు.

నాభిశుద్ధి—నాభిని తునకలుగజేసి గుడ్డనమూటగట్టి-ఒకకుండలో వేసి యందు ఆమూటమునుగునటుల ఆవుపంచితముపోసిమూడుదినము లెండలోనునిచినాలవదినమున దీసి యెండించిన శుద్ధియగును. గోమూత్రమును ప్రతిదినముక్రొత్తది గాపోయవలయు.

కంకుష్ఠ (ముదారుసింగు) శుద్ధి—దీనిని సొంటిరసముతో ౩ సాళ్లు ఊరబెట్టిన శుద్ధియగును.

---

# భస్మాదులు చేసెడుక్రమము.

స్వర్ణశుద్ధి—బంగారుమీద ఎఱ్ఱమన్ను పూసి కొలిమిలో బెట్టియూదినశుద్ధమగు.

స్వర్ణమారణము—బంగారమును సన్ననితునకలుచేసి శుద్ధిచేసి దానికి సరిపాలు సీసభస్మమును నిమ్మపులుసుచేమర్దించి బంగారుకుపూసి, దానిని ప్రమిదెలో నునిచి చీలమన్ను ఇచ్చి యెండించి మూడుగజపుటములువేసిన, బాగుగ భస్మంబగును.

స్వర్ణసిందూరము—స్వర్ణభస్మమును జిల్లేడుపాలు-రావిచెక్కలరసము వీనితో మర్దించి- ఆభస్మమునకు సరిపాలు- శుద్ధియొనర్చిన ఇంగిలీకమునుకూడజేర్చి దురదగొండి - హంసపాదిఆకు వీనిరసముచే నొకదినముమర్దించి అయిదుగజపుటములు వేసిన - సిందూరించును.

స్వర్ణభస్మగుణము — కటుకరోహిణిచూర్ణము-నేయి వీనిలో రెండు గురిగింజలయెత్తు భస్మమునుకలిపి పుచ్చుకొనిన- క్షయము-అగ్నిమాంద్యము-కాసము-పాండువు అరుచి మొదలగురోగములును విషదోషములును మానును. బలము, కాంతి, ధాతుపుష్టియు గలుగును.

రజతశుద్ధి—వెండిని తునకలుగ కత్తిరించి గొడ్డుకాకరగడ్డరసముతో నేడుమార్లుకడిగిన శుద్ధియగును.

రజతభస్మము — హేమమాక్షికము-ఇంగిలీకము వీనిని నిమ్మపండురసముచే మర్దించి-దీనిని వెండితునకలపైనపూసి యెండించి ౨-౩ గజపుటములు వేయవలయును.

రజతసిందూరము — పూర్వోక్తరజతభస్మమునకు సమాంశముగ ఇంగిలీకమును జేర్చి, మఱ్ఱిపాలు, జిల్లేడుపాలు, దురదగొండివేళ్ళరసము, హంసపాదియాకురసము, తుమ్మపట్టకషాయము వీనిచే ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దనచేసి ౭ గజపుటములువేసిన సిందూరించును.

రజతభస్మగుణము — దీనిలో తామ్రమును అభ్రికమునుకలిపి అన్నిటికి సమానముగ-సొంటి పిప్పలి మిరియాలపొడిని - నేతిని - కలిపి పుచ్చుకొనిన, శ్వాసకాసములు-పాండువు-క్షయము-మూలవ్యాధి-నేత్రరోగము-పైత్యరోగము ఇవిమానును.

తామ్రశుద్ధి — రాగి నాణ్యములనుగాని - రాగిరేకు చెంబులనుగాని - సన్నగ కత్తిరించి - ఆవుపంచితములోవేసి, తీక్ష్ణాగ్నిచే జాము సేపుకాచిన శుద్ధమగును. లేక, రాగిరేకులను ఏడుసార్లుకాచి, కలుబందరసముతోను, పొన్నగంటిరసముతోను ఏడేసి మార్లుకడిగిన శుద్ధియగును.

తామ్రభస్మము — శుద్ధిచేసిన తామ్రమునకు సమానముగ - రసమును గంధకమునుజేర్చి జిల్లేడుపాలతో మర్దించి రాగిరేకులకుపూసి యొక గజపుటమువేసిన నది భస్మంబగును. దానిని పంచామృతముతో మర్దించి మూఁడు పుటములువేసిన నందలి దోషములు మానును.

తామ్రసిందూరము — మేకపాలు-జిల్లేడుపాలు - మఱ్ఱిపాలు- హంసపాదిఆకు-దూలగొండివేళ్లు-వీనిరసములు-రావిచెక్క- జువ్విపట్ట వీనికషాయము వీనిలో ప్రత్యేకముగ నొక్కొకదానిచేమర్దించి యేడేసిగజపుటములు వేసిన నెఱ్ఱగ సిందూరించును.

గుణము — తామ్రమును అనుపానవిశేషములతోఁ బుచ్చుకొనిన-వాంతి భ్రాంతులు-జ్వరము- కుష్టువు- పాండువు- శూల-అగ్నిమాంద్యము- మేహరోగము మానును.

కాంస్యశుద్ధి — దీనినికాచి-చింతాకురసములోను- ఉలవకట్టులోను- మూఁడేసి మార్లుకడిగిన శుద్ధమగును — (కాంస్యమనగా-కంచు)

కాంస్యభస్మము — కంచును సన్నగకత్తిరించి దీనికితుల్యముగ గంధకమును తెల్ల జిల్లేడుపాలతోనూరి రేకులకుపట్టించి యెండించి మూసలోనునిచి పిడకలతో భూపుటమువేయవలయు. ఇట్లేడుమార్లు పుటమువేసిన భస్మమగును.

కాంస్యసిందూరము — కంచుభస్మమునకు అరపాలు ఇంగిలీకము - దానికిఅరపాలు గంధకము- దానికిసగము పాదరసము ఇట్లు వీనినిజేర్చి - నిమ్మపండ్లరసము హంసపాదియాకురసము- మఱ్ఱిపాలు-రావిచెక్క-తుమ్మపట్ట వీనికషాయము- మోదుగ చెక్క-రసము- దూలగొండివేళ్ళరసము వీనిలోనొక్కొకదానిచే ప్రత్యేకముగ మర్దించి-ప్రతి



రసముతో నొకగజపుటమువంతున నేడుపుటములువేసినను-లేక-రసములతో మర్దనచేసి కొలిమిలోబెట్టియూదినను నెఱ్ఱగ సిందూరించును.

కంచుభస్మగుణము — ఇది వగరుగను - ఉష్ణముగను - లఘువుగనునుండును కఫపైత్యవ్యాధులను హరించును. ఆయుర్బలముల నొసంగును.

ఇత్తడిభస్మము — ఇత్తడిని కంచుకువలెనే చేసి పుటమువేసిన భస్మమగును — ఇది- కారముగను తీక్ష్ణముగనునుండును- విరేచనమునుచేయించును- గుల్మము - మేహము- పాండువు- క్రిములు- వాతములు వీనిని పోగొట్టును.

కాంతశుద్ధి — కాంతమును నిమ్మపండుపులును-కలి-పులిమజ్జిగ వీనిలో ప్రత్యేకముగ నొక్కొకసారివేసి యేడేసిగడియలు ఎండలోబెట్టిన శుద్ధమగును. (కాంతమనగా సూదంటురాయి)

కాంతభస్మములో-శుద్ధిచేయబడిన కాంతమునకు జతుర్థాంశము గంధకమును జిల్లేడుపాలు-మోదుగచెక్క-రసము-కొండపిండివేళ్ళరసము ఈమూడింటిచేతను ప్రత్యేకముగమర్దించి యాకాంతమునకుబట్టించి ౩ గజపుటములువేసిన భస్మమగును.

కాంతసిందూరము — కాంతభస్మము - దానికిఅరపాలు ఇంగిలీకము వీనినిజేర్చి దురదగొండివేళ్ళరసమున మూఁడుదినములు మర్దించి, యెఱ్ఱమన్నుతో జేసిన వజ్రమూసలోబెట్టి ౩ చీలమన్నులుమెత్తి ౩ గజపుటములువేసిన కాంతము సిందూరించును.

కాంతభస్మగుణము — ఇది-దీర్ఘాయుష్యమును-దేహమునకు కాంతిని ఇచ్చును. కుష్టువు-ప్రమేహము-శూల-మూలము-గుల్మము- క్షయము - పాండువు-ఉదరరోగము మొదలగువానిని హరింపజేయును.

లోహశుద్ధి — ఉక్కుపొడిని నూనెలోవేసి యుడికించి తరువాత నూనెవిడుచునట్లుకడిగి పిదప తుమ్మచెక్కలరసముతోవండి యొకజాముసేపు ఎండలోబెట్టవలయు.

లోహభస్మము — లోహపుపొడిని చక్కగనూరి నేరేడుచెక్క రసముతో అరదినము ఉడికించి తిరిగిమర్దించి తరువాత చింతాకురసము- ఉసిరికరసము - మునగపట్టరసము-ఆవుపంచితము వీనిచే ప్రత్యేకముగ నుడికించి మర్దించి మూసలోబెట్టి-చీలమన్నుపూసి గజపుటమువేసిన భస్మంబగును.

లోహసిందూరము — లోహభస్మమును కరక తాడి యుసిరికలరసము - జిల్లేడుపాలు-మఱ్ఱిపాలు వీనిచే నేడుదినములు మర్దించి గజపుటమువేయవలయు. ఈ ప్రకారము మర్దించుచు, ఏడు గజపుటములువేసిన సిందూరించును.

గుణము — లోహభస్మము ఆయుష్యమును-బలమును - వీర్యమును ఇచ్చును. పాండువు-మేహము-కుష్టువు-ఆమవాతము మొదలగువానిని బోగొట్టును.

కిట్టశుద్ధి — చిట్టెమును తానికట్టెల నిప్పులోవేసి తిత్తిచే ఊది యెఱ్ఱగకాలిన

తరువాత-తాటితొట్టిలో ఆవుపంచితముమపోసి అందు ఆచిట్టెము నేడుమార్లు చల్లార్చిన నది చిట్లిపోయి శుద్ధంబగును.

కిట్టమండూరము — చిట్టెమును ఆవుపంచితమునందును కరక తాడి యుసిరికల కషాయమునందును వేసి, నీరిగురువరకు మెల్లగవండి, పిదప దానిని గోమూత్రముతోను కరక తాడి యుసిరికల కషాయముతోను ౫౦ సార్లు రుబ్బి యేబదిసార్లు పుటమువేసిన మండూరమగును.

మండూరగుణము — మండూరము-ఉష్ణముగను-కారముగనునుండును. క్రిములు-క్షయము-పాండువు-వాపు-పురాణజ్వరము మొదలగు రోగములను మాన్పును.

ఇనుపభస్మగుణము — ఇనుముభస్మము-నేత్రములకు హితమును చేయును. కుష్టు-ప్రమేహము-కామిల-గుల్మము-పాండువు మొదలగురోగముల మాన్పును.

పరీక్ష — భస్మములనుగాని, సిందూరమునుగాని, అగ్నిమీదవేసినప్పుడు పొగలేవకుండుట-వన్నె మారకుండుట-వాసన-ధ్వని లేకుండుట - నీళ్ళలోవేసిన తేలుట ఇట్టి లక్షణములు గలిగియుండిన నిర్దుష్టంబులని యెఱుంగునది.

సీసశుద్ధి — వావిలివేళ్ళచూర్ణమును జిల్లేడుపాలతోనూరి సీసపు రేకులకుపట్టించి యెండించి తరువాత ఆసీసమును కరగించి, వావిలిఆకురసములో వేయవలయు. ఇట్లేడుమార్లొనర్చిన సీసము శుద్ధమగును.

సీసభస్మము — సీసమును మూకుటిలోబోసి అందులో అడ్డసరపాకురసము - ఓమపురసము వీనినిపోసి అడ్డసరపుపుల్లతో వేయించుచుండిన సీసము భస్మమగును.

రససింధూరము — అడ్డసరము - బోడతరపాకు-ఓమము - వీనిరసములతో సీసభస్మమును అనేకపర్యాయములు మర్దించి ప్రమిదలోబెట్టి చీలమన్ను పూసి, పదిగజపుటములను వేయవలయు. తరువాత తమలపాకులరసముతో పదిమార్లుమర్దించి పదిగజపుటములువేసిన సీసము సిందూరించును.

సీసభస్మగుణము — ఇది దేహమునకు మంచిబలమును ఆయుర్వృద్ధిని- కాంతిని వీర్యవృద్ధిని కలుగజేయును, సమస్తరోగముల వారింపజేయును.

వంగశుద్ధి — జిల్లేడు-కానుగ-ఉమ్మెత్త-ప్రత్తిఆకు-బొంతజెముడు-చిత్రమూలము నల్లేరు-పెన్నేరు-వీనిప్రేళ్లను-ఆకులను కాయలనుదెచ్చి మజ్జిగపోసిత్రొక్కి రసముతీసి మజ్జిగకలిపి వడియగట్టి అందులోతగరమును కరగించి పోయవలయు. ఇట్లయిదుదినములు కరగించుచు పోయుచుండిన శుద్ధమగును.

వంగభస్మము — శుద్ధతగరమును మూకుటిలోవేసికరగించి దానిమీద ఉత్తరేణిచూర్ణమునువేసి కలియబెట్టుచుండిన తగరము భస్మమగును-లేక - తగరముపైన కఫరిని నూరి పట్టించి నిప్పులో కాచినను భస్మమగును.



వంగసిందూరము — పైభస్మమును నిమ్మపండు పులుసుతోమర్దించి 3 గజపుటములువేసిన సిందూరమగును.

వంగభస్మగుణము — ఇది చేదుగను-ఉప్పగనునుండును-క్రిమిరోగము-పాండువు వాతములు-మేహవ్రణములు మొదలగువానినిమాన్పును. కొంచెముపిత్తమును జేయును.

అభ్రకపరీక్ష — అభ్రకమును నిప్పులోవేసియూదిన రూపముమారకుండిన నది కృష్ణాభ్రకమగు - ఇట్టిదానినే ఔషధములయందు జేర్చవలయు.

అభ్రకశుద్ధి — కృష్ణాభ్రకమును మూకుటిలోవేసి కొలిమిలో నునిచి యెఱ్ఱగ నగువఱకు ఊది పాలనుచల్లి చల్లార్చి రేకులుగ ఒలిచి- చింతాకు-చిత్రిఆకు-తిప్పతీగఆకు వీని రసములలో నొకదినమంతయు నూరబెట్టిన శుద్ధమగును.

ధాన్యాభ్రకవిధి — శుద్ధిచేసిన కృష్ణాభ్రకమును తుంగముస్తెలరసముతోను-కలితోనుమర్దించి ముద్దచేసి కుండకు వాసెనగట్టి దానిమీద ఆముద్దనునిచి - దానిమీద రెండుపాళ్ళు వడ్లను కలినిపోసి బాగుగరుద్దిన - అభ్రకము చూర్ణమై కుండకడుగున జేరును. పిదప ఆచూర్ణమును దీసి యెండించవలయు. దీనిపేరు ధాన్యాభ్రకము.

అభ్రకభస్మము — ధాన్యాభ్రకమును జిల్లేడుపాలచేనైనను, జిల్లేడువేళ్ళరసముచేనైనను నూరి బిళ్ళచేసి ఒకగజపుటము వేయవలయు. ఇట్లు ౭ పుటములువేసిన నిర్దుష్టంబైన భస్మంబగును.

మఱియొకవిధము — పొన్నగంటి-కలుబంద-గలిజేరు-వాకుడు-తులసి- గొలిమిడి వేళ్ళు-తెల్లచాగ-వీనిరసములచే వెవ్వేరుగమర్దించి ధాన్యాభ్రకమును వడియములు చేసి ఎండనెండించి మూకుడులోబెట్టిమూసి చీలమన్నుపూసి, పైజెప్పిన రసములలో ఒక్కొక్కరసమున కొక్కొక్క పుటమువంతున ఏడుగజపుటములు వేసితీసి తరువాత దానినిపంచామృతముతోమర్దించి ఏడుగజపుటములువేసిన తళుకులులేక భస్మంబగును.

అభ్రకసిందూరము — ధాన్యాభ్రకమును తుంగముస్తెలకషాయముతో మర్దించి ౨౧ పుటములును-ఆవుపంచితము-కరక తాడి యుసిరికల కషాయము వీనిచే మర్దించి ౨౧ పుటములును-కసివెందాకురసముతోమర్దించి ౨౧ పుటములును-పాలతోమర్దన చేసి మూడుపుటములునువేసి తరువాత మరలమర్దించి వడియములుచేసి యెండనెండించి జిల్లేడాకులలోబెట్టికట్టి మూకుటిలోనునిచి కెంపువలెనగువఱకు గజపుటమును వేసిన - నిశ్చంద్రికముగ సిందూరించును.

అభ్రకభస్మగుణము — ఇది ముదిమిని మృత్యువును సకల రోగములను బోగొట్టును. శరీరమునకు దృఢశక్తిని, వీర్యమును, కాంతిని ఇచ్చును.

రసభస్మము — ఉత్తరేణివిత్తులను తెచ్చి నూరి, రెండుమూసలుగజేసి, ఒకదానిలో తుమ్మిపూలు-వాయువిళంగములు-నల్లతుమ్మపట్ట వీనిని చూర్ణముచేసి శుద్ధి చేయ

బడినరసమును జిల్లేడుపాలచే మర్దనచేసి దానిని ఆమూసలోని చూర్ణముపైనవేసి-దానిమీద తుమ్మిపూలు మొదలయినవానిచూర్ణమునువేసి రెండవమూసనుమూసి, సందులకు-చీలమన్నుపట్టించి,ఇంకొకమట్టిమూసలోనునిచి - దానిమీద మరియొకమట్టిమూస మూసి సందులకు-చీలమన్నుపట్టించి ఎండినతరువాత గజపుటమువేసిన రసముభస్మమగు.

రససిందూరము—శుద్ధిచేసినరసము - గంధకము వీనిని సరిపాలుగగూర్చి కల్వమున జాముసేపుమర్దించి - మఱ్ఱియూడలరసముతో మూడుసార్లూరబెట్టి తరువాత గాజుకుప్పెలోవేసి - ఆకుప్పెకు చీలమన్నును ఏడుమార్లుపట్టించిఎండించి - తరువాత ఒకకుండలో మూడంగులములఎత్తుగ ఇసుకనుపోసి దానిమీద ఆకుప్పెనునిచి కుప్పెగొంతువరకు మరల ఇసుకనుపోసి, నాలుగుజాములు క్రమముగ మెల్లనిమంటచేత వండి మరునాడు చల్లారనిచ్చితీసి - కుప్పెనుపగులగొట్టి అందు ఉదయకాలపుసూర్యునివంటి కాంతిగల రససిందూరమును గ్రహించవలయు.

రసభస్మగుణము—జాజికాయ౧తు-జాపత్రి౧తు-లవంగములు౧తు-పిప్పలి౧తు-వాయువిళంగాలు ౧తు-ఓమము ౧తు-బెల్లము౮తు-వీనినిమర్దించిచూర్ణముచేసి-వస్త్రగాలితముచేసి ఆచూర్ణములో ౪ తులము రసభస్మమునుగలిపి ఆవునేతితో బుచ్చుకొని చప్పిడిపథ్యముగనుండి ఆవుమజ్జిగనుపుచ్చుకొనుచుండిన సకలరోగములుమానును.

రససిందూరగుణము—దీనిని తేనెతోగాని- పిప్పలిపొడితోగాని పుచ్చుకొనిన సర్వరోగములుమానును. మరియు, అగ్నిమాంద్యము-క్షయము-పాండువు - గుల్మము-ప్రమేహము-మూలవ్యాధి-జ్వరము-వాంతి మొదలగునవి మానును. ఈరససిందూరమును క్రమముగ ననుభవించిన పురుషునికి - సంభోగశక్తి బాగుగ గలుగును.

---

# నవరత్నాదులశుద్ధులు - తద్భస్మములు.

కెంపులశుద్ధి—వీనిని గుగ్గిలపుమాత్రమున ౩ దినములు ముంచి యెండలో బెట్టి-వేడినీళ్ళతోగడిగిన శుద్ధములగును. భస్మము—కెంపులను జిల్లేడుపాలతో ౩ దినములూరబెట్టి మూకుడులోనునిచి చుట్టు-చీలమన్నుపట్టించి ౩ పుటములువేసినభస్మమగును. ఇది శీతలముగ మధురముగనుండును. అగ్నిదీపనమునుజేయును. ఆయుష్యమును, కాంతి నిచ్చును. వీర్యమును వృద్ధిపరచును, గ్రహపీడలను బోగొట్టును.

ముత్యములశుద్ధి—వీనిని తెల్ల ఉప్పిపండ్లరసముతోనైనను, చింతపండుపులుసుతోనైనను, మూడుదినములు నానవేసినశుద్ధియగును. భస్మము—శుద్ధిచేయబడినముత్యములను తెల్లములకపండ్లరసమునందు నానవేసి మూకుళ్ళయందునునిచి చీలమన్నుపట్టించి



భూపుటమునువేసిన-భస్మమగును. ఇది శీతలముగనుండును- అగ్నిదీపనమునుజేయును - స్వరభంగమును వస్తిశూలలను మాన్పును.

వజ్రశుద్ధి—వజ్రములను నిమ్మపండులోనునిచి - వావిలిఆకు- ఎలుకచెవియాకు-ప్రబ్బలి - జమ్మి - తెగడ - చిత్రి- ప్రమంగ - కర్కాటకశృంగి - ఉలవలు - ఆస్లి వీని కషాయములుపోసి ౩ దినములు డోలాయంత్రమునవండిన వజ్రము శుద్ధియగును. భస్మము—ఈవజ్రములను నల్లేరురసముతో నొకదినము నాననిచ్చి పిదప వజ్రమూసలోనునిచి చీలమన్నుపట్టించి యేరుపిడకలతో గజపుటమువేసిన భస్మమగును. ఇది సకలరోగములనుమాన్పును. ఆయువు-బలము-కాంతి వీనినిచ్చును.

వైక్రాంతశుద్ధి-వైక్రాంతపురాళ్ళను వజ్రములవలె శుద్ధిచేయవలయు. లేక- ఈరాళ్లను ఇరువదియొకసార్లు - ఎఱ్ఱగకాచి-గుర్రపుమూత్రమున ౨౧ సార్లువేసి చల్లార్చిన శుద్ధమగును. భస్మము—దుష్టపుచెట్టును సమూలముగ దెచ్చినూరి ముద్దచేసి దానిలో ఆవైక్రాంతపురాళ్ళనునిచి-మూసలోబెట్టి మరియొకమూసమూసి చీలమన్ను పట్టించి గజపుటము వేయవలయు. ఇట్లేడుమార్లు గజపుటములువేసిన వైక్రాంతములు భస్మమగును. ఇది ఆయుర్వీర్యవృద్ధిని - అగ్నిదీపనమును జేయును. త్రిదోష- విషదోషములను - సకలరోగములను మాన్పును.

వైడూర్యశుద్ధి—వైడూర్యమును అశ్వమూత్రమునం దొకదినంబును, గుమ్మడిపండురసమున నొకదినంబును నానబెట్టిన శు- యగును. భస్మము—శు - చేయబడిన వైడూర్యమును కొండపిండివేళ్ల రసమున నానబెట్టి- తరువాత కొలిమిలోనునిచియూది వజ్రమూసలోనునిచి చీలమన్నుపట్టించి గజపుటమువేసిన - వైడూర్యముభస్మమగును. ఇది వజ్రముయొక్క గుణము గలిగియుండును.

నీలశు, —నీలమును గాడిదెమూత్రమునందువేసి, మంచియెండలో నొకదినము నానబెట్టిన శు-యగును. భస్మము—ఆనీలములను అక్షిపంజాకుగసమున ౭ జాములు నాననిచ్చి తరువాత మూసలోనునిచి - కొలిమిననూదిన భస్మమగును. ఇది శీతలముగను మధురముగను నుండును. పైత్యమును బోగొట్టును.

గోమేధికశు, —దీనిని అశ్వమూత్రమున మూడుదినములు నాననిచ్చి యటు పిమ్మట నేలగుమ్మడుగడ్డరసమునందు నానబెట్టిన శు - యగు. భస్మము—దీనిని నల్లయుమ్మెత్తాకు రసమున మూడు దినములు నానబెట్టితీసి మూసలోనునిచి కొలిమిననూదిన భస్మమగును. గోమేధికభస్మము అగ్నిదీపనమును చేయును. కఫమును హరించును. బలము నిచ్చును.

ప్రవాళశు, —పగడములను నిమ్మపండుపులుసున జాముసేపు నాననిచ్చి వేడినీళ్ళగడిగిన శు - యగు. భస్మము—ఆపగడములను జిల్లేడుపాలయందు ౩ దినములు

నానినిచ్చి పిదపమూకుడులోబోసి మూసి చీలమన్ను పూసిగజపుటము వేసిన, భస్మమగును ఇది రక్తపిత్తము- నెత్తురుభేదులు - కుసుమరోగము- రక్తశూల- పైత్యము వీనిమాన్పును.

పుష్యరాగము, — దీనిని మేకమూత్రమున జాము నేపునిచిన శు, యగును. భస్మము — ఆపుష్యరాగములను కొండపిండివేళ్ళరసమున నానబెట్టి - మూకుడులో నునిచి చీలమన్నుపూసి కొలిమిన నూదిన భస్మమగును. ఇది పుష్టినిచ్చును కఫమును శైత్యమును జేయును.

మరకతశు, — నేలగుమ్మడుగడ్డను తొలిచి అందులో పచ్చరాళ్ళనునిచి- ఆగడ్డ మూతికి చీలమన్నుపూసి జానెడుచదరము - జానెడులోతుగలవల్లమునందు పుటము వేసిన శు - యగు భస్మము — ఆపచ్చలను - వాకుడురసమున నానబెట్టి కొండపిండివేళ్ళరసముతో మర్దనచేసి బిళ్ళచేసి యెండబెట్టి మూకుడులోనునిచి మూసి చీలమన్నుపట్టించి గజపుటమువేసిన భస్మమగును. ఈభస్మము త్రిదోషముల హరించును. మనోహరముగను లఘువుగను నుండును.

## రసాయన-వాజీకరణౌషధము.

ప్రథమమున శరీరకోష్ఠమును శోధించి, తరువాత, రసాయన-వాజీకరణ (శరీరమునకు ముదిమిని రానీయక- పుష్టినిచ్చు) ఔషధముల భుజింపవలయు.

కోష్ఠశోధ నౌషధము — కరక్కాయ- ఉసిరిక - సైంధవలవణము- సొంటి- వసమానిపసుపు- పిప్పళ్లు- వాయువిళంగాలు బెల్లము వీనిని సరిపాలుగ చూర్ణముచేసి వేడినీళ్లతోపుచ్చుకొనిన విరేచనమగును.

మన్మథరసము. — శుద్ధిచేసినరసము ౪ పలము గంధకము, ౪ ప, తళుకులులేనిఅభ్రకము౪ప, పచ్చకర్పూరము ౧ శాణము, వంగభస్మము ౧ కోలము, తామ్రభస్మము ౪కోలము, లోహభస్మము౧కర్షము, బొద్దివిత్తులు, ౧కర్షము, నేలగుమ్ముడుగడ్డ- చల్లపిల్లిగడ్డలు- గొలిమిడివిత్తులు- చిన్నముత్తవపులగము, పెద్దముత్తవపులగము, జాజిమొగ్గలు, జాజికాయ- లవంగాలు- కరకవిత్తులు- తెల్లమద్దిఓమము వీనిని వెవ్వేరుగాచూర్ణముచేసి దినమునకుశాణమెత్తువేసికలిపి పూటకు ౨ గురిగింజలంత పుచ్చుకొని వెంటనె కాగినపాలను త్రాగవలయు. ఈఔషధమును భక్షించినవారు దృఢసంభోగశక్తిగలవారై స్త్రీలకు మిక్కిలి యిష్టులగుదురు. శుక్రక్షయముకలుగదు. బలముతగ్గదు. మన్మథునివంటి రూపముగలవారగుదురు. ముదుసలులు వయోవంతులవలె నగుదురు. ఇది శ్రేష్ఠమైనరసాయనముగను వాజీకరణౌషధంబుగను మహేశ్వరునిచేజెప్పబడినది. మఱియుదీనివలన జీర్ణశక్తికలుగును వాత- పిత్త- కఫ- సన్నిపాత- అతిసార- గ్రహణి- కాస- రాజయక్ష్మ- క్షయాది సమస్తరోగంబులును పోవును.

*ఇతి శ్రీ మానవధర్మచంద్రికాయాం - ఆయుర్వేదచికిత్సాసంగ్రహోనామ ద్వాదశోఽధ్యాయః.* మంగళంభూయాత్.



